# ఒక కథ చెపుతా విను!

## (శ్రీరామకృష్ణ పరమహంస చెప్పిన గూఢార్థ కథలు)


అనువాదము, సంకలనము
కీర్తిశేషులు శ్రీ బి.యస్.ఆర్. ఆంజనేయులు
సహాయకులు
డా. పన్నాల శ్యామసుందరమూర్తి
అమిరపు నటరాజన్



ప్రకాశకులు
శ్రీరామకృష్ణ సేవా సమితి
విజయలక్ష్మీపురం
బాపట్ల - 522 101

ప్రకాశకులు
శ్రీరామకృష్ణ సేవాసమితి
విజయలక్ష్మీపురం
బాపట్ల - 522 101



**ప్రథమ ప్రచురణ -** డిసెంబరు2000- 3000 కాపీలు
**ద్వితీయ ప్రచురణ -** మే 2008 - 3000 కాపీలు

ప్రతులకు
**శ్రీరామకృష్ణ సేవా సమితి**
**విజయలక్ష్మీపురం**
**బాపట్ల - 522 101**
e-mail : rksamithibapatla@gmail.com
visit us at : www.unworldliness.org

# నివేదన

శ్రీ బొడ్డుపల్లి సీతారామాంజనేయులుగారు బాపట్లలో శ్రీరామకృష్ణ సేవా సమితిని 1970లో స్థాపించారు. ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి. రామకృష్ణ మిషన్‌తో సన్నిహిత సంబంధాలను కలిగివున్న గృహస్థభక్తులలో ఒకరు. సంఘసేవా కార్యక్రమాలలోనే కాక రామకృష్ణ, వివేకానంద సాహిత్యాన్ని తెలుగువారికి అందుబాటులోకి తేవడానికి విశేషమైన కృషి చేశారు. వారి రచనలు, అనువాదాలు అనేకం రామకృష్ణ మఠం, చెన్నై ప్రచురణలుగాను, శ్రీరామకృష్ణ ప్రభలోను, మా సమితి ద్వారాను ముద్రించ బడ్డాయి. సమితి ప్రచురణలలో ముఖ్యమైనవి: (1) మహావ్యక్తి కథ (2) పుష్పాంజలి (3) శ్రీరామకృష్ణ దివ్యసన్నిధి (మందార మంజరి) (4) లేవండోయ్! లేవండి! శ్రీరామకృష్ణ మఠం ప్రచురణలలో ముఖ్యమైనవి: (1) శ్రీరామకృష్ణ సంక్షిప్త జీవితచరిత్ర (2) దివ్యజనని శ్రీశారదాదేవి (జీవితము-ఉపదేశములు) (3) భారతజాతికి నా హితవు. శ్రీఆంజనేయులు గారిచే తెలుగులోకి అనువదించబడిన 'గాస్పెల్ ఆఫ్ శ్రీరామకృష్ణ' లోని పాటలన్నీ శ్రీరామకృష్ణ కథామృతంలో ప్రచురించబడ్డాయి.

శ్రీరామకృష్ణ కథామృతంలోని కథలను శ్రీ బి.యస్.ఆర్ ఆంజనేయులు గారు విశేషంగా ప్రచారం చేశారు. ప్రస్తుత ప్రచురణలోని కథలను ఆయన ప్రతిరోజూ శ్రీరామకృష్ణ సేవా సమితి, బాపట్లలో పిల్లలకు బోధించేవారు. ఆయన బోధనాశైలి అద్భుతమైనది. ప్రస్తుత ప్రచురణ అదే శైలిలో ఆయనచే వ్రాయబడినది. ప్రస్తుత ప్రచురణ యొక్క వ్రాతప్రతి చాలా సంవత్సరాలుగా మావద్ద ఉంది. ఇప్పుడు దాన్ని ప్రచురించగలగడాన్ని మా భాగ్యంగా భావిస్తున్నాము. పండిత, పామర జనరంజకమైన ఈ పుస్తకంలోని కథలు ప్రతి ఒక్కరి ఆధ్యాత్మిక, సాంఘిక, దైనందిన జీవితాలలో ప్రయోజనకారులవుతాయనడంలో సందేహం లేదు.

ఈ పుస్తకములోని దాదాపు 95 కథలను శ్రీ బి.యస్.ఆర్ ఆంజనేయులు గారు అనువదించారు. శ్రీరామకృష్ణులు బోధించిన మిగిలిన కథలను కూడా కలిపితే ఈ ప్రచురణ మరింత సమగ్రంగా ఉంటుందన్న భావంతో 85 కథలను జోడించి ఈ పుస్తకాన్ని మీ ముందుకు తెస్తున్నాము. ఆ కథలను అనువదించడంలోనూ, వ్రాతప్రతిని సరిచూడడంలోనూ తమ అమూల్యమైన సహాయసహకారాలను అందించిన డా. పన్నాల శ్యామసుందరమూర్తిగారికి, అమిరపు నటరాజన్ గారికి మా కృతజ్ఞతలు.

ప్రకాశకులు

# కృతజ్ఞతలు

అత్యంతకృపతో మేము ప్రార్థించిన వెంటనే ఈ ప్రచురణకు తమ అమూల్యమైన సందేశాన్ని, దీవెనలను అందించిన పరమపూజ్య **శ్రీమత్ స్వామి రంగనాథానందజీ మహరాజ్** వారికి మా హృదయపూర్వక నమస్సుమాంజలులు.

'గాస్పెల్ ఆఫ్ శ్రీరామకృష్ణ' మరియు 'టేల్స్ అండ్ ప్యారబుల్స్ ఆఫ్ శ్రీరామకృష్ణ' అనే రెండు గ్రంథాల నుండి గ్రహించబడిన కథలు ఈ పుస్తకములో ప్రచురింపబడ్డాయి. పై రెండు గ్రంథాలు శ్రీరామకృష్ణ మఠం, చెన్నై వారి ప్రచురణలు. మేము కోరిన వెంటనే ఈ పుస్తకాన్ని ప్రచురించడానికి అనుమతి ఇచ్చిన **శ్రీమత్ స్వామి గౌతమానందజీ మహరాజ్** వారికి (అధ్యక్షులు, శ్రీరామకృష్ణ మఠం, చెన్నై), **శ్రీమత్ స్వామి జ్ఞానదానందజీ మహరాజ్** వారికి (మేనేజర్, శ్రీరామకృష్ణ మఠం, చెన్నై) మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ పుస్తక ప్రథమ ముద్రణకు విరాళము ఇచ్చిన ఆప్తులు, పూజ్యశ్రీ కోటంరాజు సత్యనారాయణ శర్మ గారికి, వారి ధర్మపత్ని శ్రీమతి అలివేలు మంగతాయారు గారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ప్రకాశకులు

# ద్వితీయ ప్రచురణకు ప్రకాశకుల మనవి

డిసెంబరు 2000 నుండి ఫిబ్రవరి 2007 వరకూ వేలాది ప్రతులు అమ్ముడుపోయిన ఈ గ్రంథం సమితి ప్రచురణలకే తలమానికంగా నిలిచింది.

ఈ పుస్తకంలో ఇంతకు ముందు చోటుచేసుకోని మరికొన్ని చిన్నచిన్న కథలు, కథనాలు శ్రీరామకృష్ణ కథామృతంలో నుంచి చేర్చబడ్డాయి. కథల వర్గీకరణలో శీర్షికలు "1. భగవంతుడి స్వభావం, 2. బ్రహ్మజ్ఞానం, 3. భక్తివిశ్వాసములు, 4. భగవద్దర్శనానికి మార్గాలు, 5. భగవద్దర్శనానికి అంతరాయాలు, 6. జీవితంలో, సమాజంలో ఎలా మెలగాలి? 7. పూర్వజన్మ సంస్కారాలు, 8. అనుభవము" అని మార్చబడ్డాయి.

అంతేకాక దీనిలో 32 చిత్రాలు కూడా చేర్చబడ్డాయి. వాటి చిత్రకారులు శ్రీ జి. వెంకటేశ్వర్లు (జీవి), బాపట్ల గారికి మా కృతజ్ఞతలు.

ప్రకాశకులు

మే, 2008





# ఆకాంక్ష

భగవత్సాక్షాత్కారమే జీవితపరమావధి. ఇది ఎప్పుడూ మాయావృతమైన పెంజీకటిలో మరుగునపడుచూ ఉండును. మాటిమాటికి నూతన విధానంలో ఈ ఆదర్శాన్ని ఎత్తి చూపుటయే భగవంతుని అవతారం యొక్క ప్రయోజనము.

అవతారవరిష్ఠుడు శ్రీరామకృష్ణుడు. అనంతమైన సమస్యలతో సతమతమగుచు, నేడు మరుగునపడిన ఈ జీవితలక్ష్యమును ఆచరణ పూర్వకముగా చూపుటకే ఈ అవతారము ఆవిర్భవించినది. ఆయన ప్రతి మాట, ప్రతి చూపు, ప్రతి తలంపు ఈ ప్రయోజనము కొరకే.

శ్రీరామకృష్ణ కథామృతము ఒక అపూర్వరచన. దానికదే సాటి. అంతకు ముందు అటువంటి గ్రంథము వెలువడలేదు. భిన్నభిన్న సంస్కారాలుగల వ్యక్తుల కును, శ్రీరామకృష్ణులకును మధ్య జరిగిన సంభాషణలే అందలి విషయాలు. అందులో ఉన్నవెన్ని ఉపదేశాలో! ఎన్ని కథలో! ఎన్ని పాటలో! అంతేకాక ఆ గ్రంథం శ్రీరామకృష్ణుని వ్యక్తిత్వాన్ని వివిధ దృక్కోణాల నుండి అభివ్యక్తం చేస్తుంది.

ఆబాలగోపాలాన్ని ఆకర్షించేవి కథలు. శ్రీరామకృష్ణుల కథలలోని ఇతివృత్తాలు, కథావస్తువులు నిత్యము అందరికి అందుబాటులో ఉన్నవే; అందులోనివి మామూలు సన్నివేశాలే, అయినా అతినిగూఢాలు; సూటిగా కన్పించినా బహుళార్థ ప్రయోజకాలు. విన్నవారిపై ఈ కథల ప్రభావం అమోఘం. నేటి మానవులందరు ఆ కథలలోని ఏదో ఒక పాత్రకు ప్రతిరూపాలే. అందుకే అవి అత్యంత సమగ్రాలు; సర్వసమస్యా పరిష్కారాలు; వ్యక్తిత్వ నిరూపకాలు; ఆదర్శ ప్రబోధకాలు.

స్వీయప్రయోజనాన్ని ఉద్దేశించిందే ఈ సంకలనము. కాని ఒరులకు కూడా సహాయభూతమైతే కృషి ధన్యతమము. సౌలభ్యమునకై ఈ కథలు, (1) భగవంతుడు, (2) భగవంతుడు – సాకారుడా, నిరాకారుడా? (3) బ్రహ్మము, (4) భక్తివిశ్వాసములు, (5) భగవద్దర్శనానికి మార్గాలు, (6) భగవద్దర్శనానికి అంతరాయాలు, (7) గృహస్థులకు, సన్న్యాసులకు హితవు, (8) పూర్వజన్మ సంస్కారాలు, (9) అనుభవము అను శీర్షికల క్రింద వర్గీకరింపబడినవి.

తన్నో హంసః ప్రచోదయాత్...

బి. యస్. ఆర్. ఆంజనేయులు.

– బి. యస్. ఆర్. ఆంజనేయులు



RAMAKRISHNA MATH
P.O. BELUR MATH,
DIST. HOWRAH
West Bengal : 711 202.




# FOREWORD

There are many teachings of Sri Ramakrishna which are of utmost importance to us today.

One, he said, ‘Ekhane, ekhane jnan; shekhane, shekhane ajnan’, ‘"Here! Here!" is knowledge; "There! There!" is ignorance’. This is his unique way of putting the great Upanishadic teaching that the infinite atman is our nature. This we must manifest in this life itself. But, thinking of going to some far away heaven, by performing some ritual, is ignorance.

Second, ‘If you want to see God, seek him in the human being; in him or her He is more manifest than in anything else. Among human beings again, God is more manifest in a devotee. A devotee’s heart is the Lord’s drawing room, where you can get an interview with God’.

Third, addressing some householder devotees he said, ‘Live in Samsara, there is no harm. But don’t allow Samsara to get into you, for then you will become stagnant. Just as a boat should be in water, but water should not be in the boat, for that would make it stagnant’.

These few spiritual ideas, when understood by our people, will transform our society.

Accept my love and blessings. Let this book bring blessings to thousands of people in Andhra Pradesh.

Yours affectionately,
Ranganathananda
(Swami Ranganathananda)
President
Ramakrishna Math and Ramakrishna Mission

# ముందుమాట

శ్రీరామకృష్ణులు బోధనలలో ఈనాటికీ మనకు అత్యంత ముఖ్యమైనవి, ఉపయుక్తమైనవి ఎన్నో ఉన్నాయి.

ఒకటి. గురుదేవులు, 'ఇక్కడ, ఇక్కడ అనేదే జ్ఞానము, అక్కడ, అక్కడ అనేదే అజ్ఞానము' అని బోధించారు. ఈ విధంగా గురుదేవులు తనదైన ప్రత్యేకమైన శైలిలో, అనంతమైన ఆత్మయే మన స్వభావము అన్న ఉపనిషత్తులలోని మహత్తరమైన బోధనను తెలియచెప్పారు. ఈ సత్యాన్ని మనం ఈ జన్మలోనే వ్యక్తీకరించాలి. కానీ, ఎక్కడో దూరంగా ఉన్న స్వర్గానికి, ఏదో కర్మకాండ చేయడం ద్వారా చేరాలనుకోవడం అజ్ఞానం.

రెండు. 'మీరు దేవుణ్ణి పొందదలుచుకుంటే అతణ్ణి సాటి మానవుని లో చూడండి. అతనిలో లేదా ఆమెలో భగవంతుడు అన్నిటికన్నా ఎక్కువగా వ్యక్తీకరించబడి ఉన్నాడు. మనుష్యులందరిలోకీ, భగవంతుడు మరింత ఎక్కువగా భక్తులలో వ్యక్తీకరించబడి ఉన్నాడు. భక్తుని హృదయమే భగవంతుని నివాసము. అక్కడ మీరు దేవునితో ముఖాముఖీ సంభాషించవచ్చు'.

మూడు. గురుదేవులు కొందరు గృహస్థభక్తులను ఉద్దేశించి ఈ విధంగా చెప్పారు: "సంసారంలో జీవించండి. దానివలన ఏ హానీ లేదు. కానీ సంసారాన్ని మీలోనికి చేరనివ్వవద్దు. అది మీలో చేరితే మీరు అపవిత్రమై పోతారు. ఏ విధంగా అంటే, పడవ నీటిలో ఉండవచ్చు కానీ నీరు పడవలో ఉండకూడదు. అలా జరిగితే పడవ మునిగిపోతుంది."

ఈ కొన్ని ఆధ్యాత్మిక సత్యాలను ప్రజలు అర్థం చేసుకుంటే మన సమాజమే మారిపోతుంది.

నా ప్రేమను, దీవెనలను అందుకోండి! ఈ పుస్తకము ఆంధ్రప్రదేశ్‌లోని వేలాదిమందికి శుభాశీస్సులను అందజేయు గాక!

ప్రేమతో,

Ranganathananda

(స్వామి రంగనాథానంద)

అధ్యక్షులు,

రామకృష్ణ మఠం మరియు రామకృష్ణ మిషన్

# విషయసూచిక

## శీర్షికలు

1. భగవంతుడి స్వభావము 21
2. బ్రహ్మజ్ఞానం 45
3. భక్తి విశ్వాసములు 59
4. భగవద్దర్శనానికి మార్గాలు 82
5. భగవద్దర్శనానికి అంతరాయాలు 121
6. జీవితంలో, సమాజంలో ఎలా మెలగాలి? 156
7. పూర్వజన్మ సంస్కారాలు 187
8. అనుభవము 192

## భగవంతుడి స్వభావము

1. భగవంతుడు కల్పవృక్షము వంటివాడు 21
(బాటసారి - కల్పవృక్షము)
2. దేవుడు ఒక్కడే! పేర్లు అనేకం! 23
(చెరువు - నాలుగు ఘట్టాలు)
3. భగవంతుడే పోషకుడు 24
(బాలసన్యాసి - భిక్షాటన)
4. దేవుడు నీలోనే ఉన్నాడు 25
(చుట్టకాల్చేవాడు - చేతిలో లాంతరు)
5. స్వప్రయత్నము - దైవకృప 26
(నారదుడు - నరకము)
6. ప్రపంచాన్ని విడిచిపెట్టనక్కరలేదు! 28
(వశిష్ఠుడు - శ్రీరాముడు)
7. దైవకృపకు కారణాలు 28
(పసిబిడ్డ - గోళీలు)
8. భగవంతుడు కనిపిస్తాడు 29
(వ్యాకులత ఎలా ఉండాలో చూపిన గురువు)
9. దేవుడు మానవుని రూపంలో లేడా? 30
(విభీషణుడు - వ్యాపారి)

10. దేవునికి అన్నీ సాధ్యమే 31
(ఒకే మొక్కకు రెండు రంగుల పూలు; ఐంద్రజాలికుడు - ముడులు)
11. భగవంతుడికి ఐశ్వర్యం మీద మోజు లేదు 31
(రాధాకాంతాలయంలో చోరీ)
12. మతదురభిమానం పనికిరాదు 32
('శివుడు గొప్పా? బ్రహ్మ గొప్పా?')
13. భగవంతుడు మన అల్పబుద్ధికి అందదు 33
(కాక భుషండి కథ)
14. అవతార పురుషులను అందరూ గుర్తించలేరు 34
(వంకాయల వ్యాపారి - రత్నం)
15. దేవుడు అనేక రూపాల్లో దర్శనమిస్తాడు 36
(రంజితరాయి కథ)
16. భక్తులు ఏది ఇచ్చినా భగవంతుడు సంతోషిస్తాడు 37
(యజమాని - సేవకుడు)
17. భగవంతుడికి అసాధ్యమైనదేమీ లేదు 38
(నారదుడు - ఇద్దరు యోగులు)
18. భగవంతుడు సాకారుడు, నిరాకారుడు 39
(సన్న్యాసి - విగ్రహము; అద్దకాలు వేసేవాడు;
రంగులు మార్చే ఊసరవెల్లి)
19. భగవంతుడు అన్ని జీవరాశులలోనూ ఉన్నాడు 42
(మావటివాడూ నారాయణుడే)

## బ్రహ్మజ్ఞానం

20. బ్రహ్మమును గురించి మాటలతో చెప్పలేము 45
(తండ్రి - ఇద్దరు కొడుకులు; చీమ - పంచదార కొండ; ఉప్పుబొమ్మ)
21. 'నిత్య-లీల' రెండూ ఒకటే! 46
(సాలె స్త్రీ - స్నేహితురాలు)
22. బ్రహ్మము వర్ణనకు అతీతము 48
(నలుగురు స్నేహితులు - మహద్దర్శనం)
23. అనుభవం మాత్రమే బ్రహ్మము గురించి తెలియజెప్పగలదు 49
(నూతన వధువు - భర్త)
24. తత్త్వమసి 50
(మేక-పులి)

25. బ్రహ్మసాక్షాత్కారం తరువాత కర్మలు, సాధనలతో పని లేదు 52
(బ్రాహ్మణుల సమారాధన; అత్తగారు - గర్భిణి అయిన కోడలు)
26. బ్రహ్మసాక్షాత్కారం - నేతి, నేతి 52
(ఏడు ద్వారాల వెనుకవున్న మహారాజు)
27. జ్ఞానదృష్టి 53
(కృష్ణుడు-అర్జునుడు; రాజు-ఇంద్రజాలికుడు; దొంగలు-దిష్టిబొమ్మ)
28. బ్రహ్మము, ఆద్యాశక్తి రెండూ ఒకటే! 55
(రాజు - యోగి - మాంత్రికుడు)
29. నామరూపాలకు ఆవల ఉన్నదే ఆత్మ 56
(గురువు - శిష్యుడు - శ్యామ)
30. అద్వైతానుభవం 56
(బ్రహ్మ జ్ఞాని - పాము కాటు)
31. బ్రహ్మజ్ఞాని ఎలా జీవిస్తాడు? 57
(సన్న్యాసిని - జనక మహారాజు)
32. సమదర్శిత్వం 58
(శంకరాచార్యులు - కసాయివాడు)
33. భేదబుద్ధి తొలగిపోతే! 58
(శుకుడు - జనకుడు)
34. నేను! 58
(ఆది శంకరులు - శిష్యుడు)

## భక్తి విశ్వాసములు

35. భగవన్నామస్మరణతో భవసాగరాన్ని దాటవచ్చు 59
(భక్తురాలైన గొల్లపడుచు - బ్రాహ్మణుడు)
36. భగవద్విశ్వాసము 60
(పిల్లవాడు - దేవుడికి ఉత్తరం)
37. విశ్వాసం, పరితాపం కావాలి 61
(జటిలుడు; అర్చకుని కొడుకు - నైవేద్యము)
38. గురుభక్తి 63
(వితంతువు - పాలకుండ)
39. శరణాగతి 64
(అంతా రాముని ఇష్టమే అని నమ్మిన సాలెవాని కథ)

40. భక్తి ఉంటే దేనినైనా సాధించవచ్చు 66
(గణపతి - కుమారస్వామి - రత్నాలహారము)
41. భగవదున్మాదము 67
(కాకి - రామనామ జపము)
42. రక్షించవలసినవాడే శిక్షిస్తుంటే! 68
(శ్రీరాముడు - కప్ప)
43. భగవంతునికి అర్పించిన మనస్సు భౌతిక విషయాలపైకి మరలదు 68
(బిల్వమంగళుని కథ)
44. ఉండడంగాని, పోవడంగాని భగవదిచ్ఛానుసారమే! 70
(కొండమీద గుడిసె - గాలివాన)
45. జ్ఞాన భక్తి - ప్రేమ భక్తి 72
(ముగ్గురు స్నేహితులు - పెద్దపులి)
46. అంతులేని విశ్వాసం 73
(కృష్ణుడు - అర్జునుడు)
47. విశ్వాసానికి గల అద్భుతమైన శక్తి 73
(శ్రీరాముడు - హనుమంతుడు; హనుమాన్‌సింగ్ కథ)
48. దేవుని పేరుకు గల శక్తి 74
(గుహుని కథ)
49. నమ్మకం లేనివాడు నాశనమవుతాడు 74
(సముద్రం మీద నడిచిన ప్రయాణీకుడు)
50. అసలైన ప్రేమ - భక్తి 75
(అర్జున గర్వభంగము)
51. ప్రేమలో మూడు రకాలు ఉన్నాయి 77
(గోపికలై జన్మించిన ఋషులు)
52. ఏకాంకిత భక్తి 77
(విభీషణుడు, హనుమంతుడు, యశోద, గోపికలు)
53. భగవద్భక్తి - ఇంద్రియసుఖాలు 78
(రామభక్తుడైన రావణుడు)
54. జనులకు బోధించడానికే మహర్షుల సగుణభక్తి 79
(నారదుడు - శుకమహర్షి)
55. భక్తి అన్ని ద్వారాలనూ తెరుస్తుంది 79
(యశోద - రాధ)

56. అందరూ కోరేవాటిని భక్తుడు కోరడు 80
(విభీషణుడు - లంకా రాజ్యం)
57. స్వచ్ఛమైన ప్రేమ 80
(గీతా ప్రసంగం - చదువురాని భక్తుడు)
58. భక్తునికి కావలసినది 81
(హనుమంతుడు - మండోదరి)

## భగవద్దర్శనానికి మార్గాలు

59. మొదట హృదయాన్ని పవిత్రం చేసుకోండి! 82
(పద్దయ్య దేవతార్చన)
60. అనుభవమే ప్రధానం 84
(మామిడి పండ్లు తిను!)
61. మార్గాల వివరాలు తెలిపేవే శాస్త్రాలు 85
(ఉత్తరములోని వస్తువుల జాబితా)
62. ఆర్తివుంటే అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి 85
(పిల్లవాని జబ్బు - పుర్రెలో విషము)
63. జీవితగమ్యం ఏమిటో తెలుసుకోవాలి 87
(వీధి భాగవత ప్రదర్శన - నిద్రపోయిన ప్రేక్షకుడు)
64. చిత్తశుద్ధి ఉంటే మార్గం ఏర్పడుతుంది 88
(ప్రయాణీకుడు-సాధువు; పూరీ తీర్థయాత్ర; సేవలు చేసే కోడలు)
65. కర్తృత్వము - శరణాగతి 89
(భక్తుణ్ణి చాకలివాళ్ళు కొట్టబోవుట)
66. జీవితానికి ఒక లక్ష్యం ఉండాలి 90
(గుమ్మడికాయ పగలగొట్టే పెద్దన్నయ్య)
67. ఏకాగ్రమైన మనస్సు ఎలా ఉంటుంది? 91
(గాలం వేసి చేపలు పట్టడం; అర్జునుడి గురి)
68. చరైవేతి (ముందుకు సాగిపో!) 93
(కట్టెలు కొట్టువాడు - సాధువు)
69. మనస్సే అన్నిటికీ కారణం 95
(ఇద్దరు మిత్రుల అంతరంగాలు)
70. యాచిస్తే దేవుణ్ణే యాచించండి! 95
(అక్బరు పాదుషా - సాధువు)

71. తీవ్రవైరాగ్యం - మందవైరాగ్యం 97
(ఇద్దరు వ్యవసాయదారులు)
72. నటనే నిజమైతే? 99
(సాధువుగా మారిన దొంగజాలరి)
73. ఆత్మ వేరు, శరీరం వేరు 100
(వ్యాసమహర్షి - గొల్లపడుచులు)
74. ఇతరులకు బోధించడానికి అధికారపత్రం కావాలి 101
(హల్దార్పుకూరు చెరువు)
75. ధ్యానంలో మనస్సు ఎలా ఉండాలి? 102
(పెళ్ళి ఊరేగింపు-వేటగాడు; కొంగ-వేటగాడు)
76. అక్కరకు వచ్చేదే అసలైన పాండిత్యం 103
(పండితుడు - పడవ ప్రయాణము)
77. జ్ఞానాన్ని, అజ్ఞానాన్ని - రెంటినీ దాటిపోవాలి 105
(వశిష్ఠుడి పుత్రశోకం)
78. భగవత్సాక్షాత్కారం తరువాత ప్రపంచం ఆనందమయం 105
(ఇద్దరు సాధువులు - నగర సందర్శనం)
79. మాయయే అనేక ఉపాధులుగా రూపుదాల్చుతుంది 106
(కప్ప - రూపాయి; నడిమంత్రపు సిరి)
80. తెలిసీ తెలియనివాడు సరిగ్గా బోధించలేడు 107
(గొడ్లపాకలో గుర్రాలు!; గురువులలో రకాలు)
81. అతి సులువైన ఉపాయం 109
(సాధువు - గొర్రెల కాపరి)
82. ఎంతో కొంత నమ్మకం ఉండాలి! 110
(లంకె బిందెలు)
83. ఎటువంటి వ్యాకులత కావాలి? 110
(అమ్మకోసం ఏడుపు; గాలిపటం కోసం మారాము)
84. వ్యాకులత ఉంటే భగవద్దర్శనం కలుగుతుంది 111
(బాలవితంతువు - గోవిందుడు)
85. స్వప్రయత్నము - శరణాగతి 112
(ఇద్దరు పిల్లలు-గాలిపటము;మార్జాలకిశోర, మర్కటకిశోర న్యాయాలు)
86. తీవ్ర వైరాగ్యం వరదలా వస్తుంది! 114
(పదహారుమంది భార్యలు - అంచెలంచెల వైరాగ్యం)

87. మంచి విషయాల అనుకరణతో మంచి ఫలితాలు 116
(రాజకుమారి - దొంగసాధువు)
88. సత్సాంగత్యం 117
(ఉమాదేవి - హిమవంతుడు)
89. ప్రాపంచికులైన వారిని చైతన్యుడు ఆకర్షించిన విధానము 117
(చేపల పులుసు)
90. నీ మతాన్నే అంటిపెట్టుకో! 117
(బావులు త్రవ్వడం)
91. కామాన్ని అదుపు చేసేదెలా? 118
(పెంపుడు కుక్క)
92. జ్ఞాన, భక్తి, రాజయోగాల సమన్వయం 119
(నారదుడు - హనుమంతుడు - శ్రీరామావతారం)
93. బలము, తేజస్సు కలవారికే భగవల్లాభం కలుగుతుంది 120
(ఎద్దుల్ని పరీక్షించడం)

## భగవద్దర్శనానికి అంతరాయాలు

94. త్రిగుణములు 121
(ముగ్గురు దొంగలు)
95. గాలిలో మేడలు 122
(హృదయుడు - కోడెదూడ)
96. సాంగత్యాన్ని బట్టి గుణాలు కలుగుతాయి 123
(చిత్రపటాల ప్రభావం)
97. ప్రాపంచిక జీవితపు ప్రభావం 124
(గురుదేవుల చిన్ననాటి స్నేహితుడు; రావణుడి ఎముకలలో తూట్లు)
98. అష్టసిద్ధులు అనర్థదాయకాలు 125
(అష్టసిద్ధుల్ని కోరమన్న హృదయుడు)
99. సిద్ధులు భగవంతుణ్ణి దర్శించడానికి ఆటంకాలు 126
(సాధువు - తుఫాను; ఏనుగు - చావడం, బ్రతకడం)
100. కామినీ వ్యామోహం 127
(గోలపి - నిరుద్యోగి)
101. కాంచన వ్యామోహం 128
(టిక్కెట్టు లేకుండా నాటకం చూడడం)

102. మనుష్యులను బంధించేవి 129
(గోవిందస్వామి దేవాలయ అర్చకులు)
103. సాధకులకు స్త్రీల సాంగత్యం పనికిరాదు 130
(పన్నెండు వందల బ్రహ్మచారుల పతనం)
104. అలవాట్ల (వాసనల) ప్రభావము 131
(చేపల బుట్ట)
105. ప్రాపంచిక వాసనలే అనర్థాలకు మూలం 133
(గ్రద్ద - చేప)
106. వితండవాదం పనికిరాదు 134
(ఇల్లు కూలడం - వార్తాపత్రిక)
107. సంసారబంధం భ్రాంతి మాత్రమే 135
(హఠయోగి - గురువు)
108. భగవంతుడొక్కడే నిజంగా నీవాడు! 136
(సంసారి - గురువు)
109. అహంకారం వల్లనే కష్టాలన్నీ! 138
(ఆవుదూడ - దాని కష్టాలు)
110. అహంకారమే సర్వనాశనానికి కారణం 139
(నీట మునిగిన గురువు)
111. గర్వం కళ్ళు నెత్తికెక్కేలా చేస్తుంది 139
(పనిమనిషి గర్వం)
112. అహంకారం పోయినప్పుడే భగవద్దర్శనం అవుతుంది 140
(దయ్యము - వంకర వెంట్రుక)
113. పైపై ఆచారాలు ముఖ్యం కావు 141
(తోలుతిత్తి)
114. ఎంతటివాడైనా మాయలో చిక్కుకుంటాడు 142
(విష్ణుమూర్తి - వరాహావతారము)
115. అవసరం చిన్నదైనా అనేక బంధాలను కొనితెస్తుంది 143
(సన్న్యాసి - గోచీ)
116. వివేక వైరాగ్యాలతో కూడిన పాండిత్యం కావాలి 145
(నాలుగు అరకల భాగవత పండితుడు; రాజు - భాగవత పండితుడు)
117. స్వమత దురభిమానము 146
(గుడ్డివాళ్ళు - ఏనుగు)

118. భక్తులలో మోసగాళ్ళు 148
(కేశవా! గోపాలా!)
119. హృదయంలో పవిత్రత ఉండాలి 149
(సన్న్యాసి - వేశ్య)
120. యోగి ఎలా దిగజారతాడు? 151
(ముంగిస - ఇటుకముక్క)
121. మాయాప్రభావం 151
(నారదుడు - మాయ)
122. గ్రుడ్డి అనుకరణ పనికిరాదు 152
(ఆది శంకరుడు - తెలివితక్కువ శిష్యుడు)
123. సంసార బంధాలు లెక్కలేనన్ని! 153
(బాగ్‌బజార్ వంతెన)
124. మాయ తొలగినప్పుడే భగవద్దర్శనమౌతుంది 153
(రాముడు, సీత, లక్ష్మణుడు; నీటి మీద నాచు)
125. సంసారంలో బంధించి ఉంచడమే మహామాయ కోర్కె 153
(ఎలుకలు - బెల్లం మరమరాలు)
126. గర్వమే భక్తిని కృశింపజేసే వ్రణం 154
(నారద గర్వభంగం)
127. మోహంలో ముంచివేసే అవరోధాలు 155
(న్యాయాధికారి - నాటకప్రదర్శన)

## జీవితంలో, సమాజంలో ఎలా మెలగాలి?

128. మనస్సుని ఎల్లప్పుడూ భగవంతుడిపై ఉంచు! 156
(పనిమనిషి)
129. సంసారంలో ఎలా మెలగాలి? 156
(అటుకులు అమ్మే స్త్రీ)
130. గృహస్థులు ప్రపంచంలో ఎలా మెలగాలి? 158
(పాము - సాధువు)
131. వార్ధక్యంలో ఎలా మెలగాలి? 160
(పళ్ళు ఊడిన తరువాత దుర్గపూజ)
132. తాను ఆచరించిన దానినే మరొకరికి చెప్పాలి 161
(మందు - పథ్యము)

133. బోధకుల జీవనసరళి కత్తిమీద సాము! 162
(మహేంద్ర కవిరాజు; లక్ష్మీనారాయణ మార్వాడీ)
134. వేషానికి తగినట్టుగా ప్రవర్తన ఉండాలి 164
(పగటివేషగాడు - శివుని వేషం)
135. దురాశ దుఃఖమునకు చేటు 165
(మంగలి - ఏడు బిందెల బంగారం)
136. ధనాన్ని సక్రమంగా వినియోగించాలి 167
(వరిపొలం గట్లు - వరదనీరు)
137. తల్లి కృప త్వరగా లభిస్తుంది 167
(లోభివర్తకుడు - గురువు)
138. మన పనులకు మనమే బాధ్యులము 168
(మిట్టవేదాంతి అయిన బ్రాహ్మణుడు)
139. ధనవంతుని ముఖస్తుతి 170
(నక్క - ఎద్దు)
140. ప్రతిదానికీ ఒక అవసరం ఉంది! 170
(గోలక్ చౌదరి కథ; సీతాదేవి - తాపీ పనివాళ్ళు)
141. మనుష్యులలో రకరకాలు ఉంటారు 171
(వలలో పడ్డ చేపలు)
142. ప్రాపంచిక సంపదలను చూసి విర్రవీగకు! 172
(సేవకుడి ప్రగల్భాలు)
143. పరమత సహనం 173
(నూతిలో కప్ప)
144. వ్యర్థవిషయాలు 174
(కంసాలి - జడసమాధి; హఠయోగి - బాంకునోటు)
145. వైరాగ్యం ముసుగులో ఆత్మవంచన పనికిరాదు 175
(ఆధునిక జనక మహారాజులు!)
146. సన్న్యాసి దిగజారితే.. 176
(భాగితేలి కథ)
147. కామాన్ని జయించే మార్గం 176
(కార్తికేయుడు - పిల్లి)
148. గురువుగా వ్యవహరించడం చాలా కష్టం 177
(ఆమె ఎంత ఎదిగిపోయిందో!)

149. నటనే నిజమౌతుంది! 178
(పిచ్చివానిలా నటన)
150. చేసేవాడు దేవుడే! 178
(నందీశ్వరుని పళ్ళు)
151. దైవమే జ్ఞానానికి తరగని పెన్నిధి 179
(ధాన్యం వ్యాపారులు; రాధ – నీటి కుండ)
152. నిజమైన వినయము ఎలా ఉంటుంది? 179
(సాధకుడు – మలము)
153. పరమత ద్వేషం పనికి రాదు 180
(ఘంటాకర్ణుడు)
154. దేవుడు నవ్వుతాడు! 181
(వైద్యుడి అభయం; ఇద్దరు అన్నదమ్ములు)
155. కూడబెట్టేది ఒకడు – కొల్లగొట్టేది మరొకడు 182
(తేనెటీగ – బాటసారి)
156. అద్వైతాన్ని అపార్థం చేసుకోకూడదు 182
(మూర్ఖుడైన రాజు – గురువు)
157. భవిష్యత్తుని దృష్టిలో ఉంచుకో! 183
(మేకపిల్ల – తంగేడు పూలు)
158. ప్రాపంచికులకు దూరంగా ఉండాలి 184
(దివ్యావేశం పొందిన జాలరులు)
159. దానంలో విచక్షణ అవసరం 184
(కసాయివాడు – ధర్మసత్రం)
160. ఒక యజమానికే సేవచెయ్యి! 185
(శీలవంతుడైన ముసల్మాను)
161. బద్ధజీవుల తీరుతెన్నులు 185
(మరణశయ్య మీది పిసినారి – నూనె దీపం)
162. ఎదుటివారికి అర్థమయ్యే భాషనే మాట్లాడాలి 186
(మంగలి – పెద్ద మనిషి)

## పూర్వజన్మ సంస్కారాలు

163. పూర్వజన్మ సంస్కారాల ప్రభావం 187
(రాజకుమారుడు; మట్టికుండలు – కాలినవి, కాలనివి)

164. సంస్కారాలను బట్టే పునర్జన్మలు కలుగుతాయి 188
(విప్రవినోది - జడసమాధి)
165. తప్పించుకోలేనివి 189
(కాలువీర్; ఖుల్లానా; దేవకీ దేవి)
166. పూర్వజన్మల సాధనాఫలితం 190
(పూర్వజన్మ సంస్కారాలు - శవసాధన)

## అనుభవము

167. అత్యంత సాధనాఫలితం 192
(ఉపాసకుడు - ఇస్లాం మతము)
168. కర్మను అనుసరించి మాత్రమే ఫలితాలు కలుగుతాయి 192
(నాలుగుచుక్కలకే తూలిపడ్డ తాగుబోతు)
169. ఆనందం మనలోనే ఉంది 193
(తెరచాప కొయ్యమీది పక్షి)
170. ఆత్మవిమర్శతో గర్వం అణుగుతుంది 194
(మిణుగురు పురుగులు - సూర్యుడు)
171. ఎవడు కొట్టాడో వాడే పాలు పోస్తున్నాడు! 195
(సాధువు - జమీందారు)
172. మెలకువ (జాగ్రదావస్థ) కూడా స్వప్నం వంటిదే 196
(కట్టెలుకొట్టువాడు - కల)
173. నిజమైన జ్ఞాని ఎలా ఉంటాడు? 197
(జ్ఞానియైన రైతు)
174. జనన మరణాల ప్రయోజనం 199
(పన్నీరు మొక్క పెంపకంలో మెలకువలు)
175. మాయ స్వభావం ఎలా ఉంటుంది? 200
(సాధువు - నల్లటి మబ్బు)
176. మాయను ఎలా వదిలించుకోవాలి 200
(పులితోలు)
177. నిత్యముక్తులు ప్రపంచాన్ని తాకరు 201
(హోమపక్షి కథ)
178. సమదృష్టి వైరాగ్యానికి చివరిమెట్టు 201
(విరాగులయిన భార్య, భర్త)

179. అందరూ సన్న్యసించలేరు 202
(యోగి - రాజు)
180. నిజమైన విరాగులు దొరకడం కష్టం 202
(స్నేహితుణ్ణి కోరుకున్న దయ్యం)
181. దివ్యలీలలకు ఉండే ఆకర్షణ 203
(నికాషా కథ)
182. ఆపుకోలేని కోరిక! 204
(నెమలి - నల్లమందు)
183. దేవుణ్ణి వర్ణించలేము 205
(కా! కా! కా!)
184. దేవుని పద్ధతులు మనకు అర్థం కావు 205
(అంపశయ్య మీద ఉన్న భీష్ముడు)
185. సరైన కారణాలు ఎవరు చెప్పగలరు? 205
(లక్ష్మణుడు - కుశలవులు)
186. దివ్యమధువు 206
(తండ్రీ కొడుకుల త్రాగుడు అలవాటు)
187. అశాశ్వతమైన శరీరం 206
(వితంతువు - బంగారు మురుగులు)
188. స్థాయిని బట్టే అంచనా ఉంటుంది 207
(సాధువు - గాఢ సమాధి)
189. అవతారపురుషుల్ని మామూలు మనుష్యులతో పోల్చకూడదు 207
(చైతన్యుడి నాలుకపై చక్కెర)
190. నిజమైన పండితుడు గొప్పలు చెప్పడు 208
(భాగవత పండితుడు - జ్ఞాని అయిన రాజు)
191. మిగిలినదంతా మిథ్య 209
(శివుడు - రావణుడు)
192. దైవసాక్షాత్కారం పొందినవాడు చిన్నపిల్లవాడి స్వభావాన్ని పొందుతాడు 210
(ఆటబొమ్మ - చొక్కా)
193. సర్వం విష్ణుమయం జగత్ 210
(కుక్కలతో సహభోజనం)

❀ ❀ ❀ ❀ ❀



# భగవంతుడి స్వభావము

## 1. భగవంతుడు కల్పవృక్షము వంటివాడు

### (బాటసారి - కల్పవృక్షము)

ఒకసారి దక్షిణేశ్వరాలయ నటమందిరంలో 'విద్యాసుందర్' అనే నాటకం వేశారు. శ్రీరామకృష్ణులు దాన్ని చూశారు. మరునాడు ఆ నాటకంలో వేషం వేసినవాడు ఒకడు శ్రీరామకృష్ణులను దర్శించడానికి వచ్చాడు. యవ్వనంలో ఉన్న ఆ యువకుడు ఆ నాటకంలో 'విద్య' అనే వేషము వేశాడు. గురుదేవులు అతడి నటనను చాలా మెచ్చుకున్నారు. అప్పటికి ఆ యువకుడికి పెళ్ళి అవడమే కాక ఒక బిడ్డ పుట్టి చనిపోయింది కూడా. ఆ తరువాత ఇంకొక బిడ్డ కలిగింది. ఈ విషయం తెలిసిన తరువాత గురుదేవులు విషయభోగాలు అనిత్యమని వివరిస్తూ అతడితో చాలాసేపు సంభాషించారు. "భోగం ఉన్నంతవరకు యోగం ఉండదు. డబ్బు అనేది అన్నదమ్ములలో కూడా పోట్లాటలకు దారి తీస్తుంది. అప్పటివరకు ఎంతో ప్రేమతో మెలగుతున్న కుక్కలు చూడు! ఒక ఎంగిలి విస్తరి పడగానే కాట్లాడుకుంటాయి. ఎప్పుడైతే భోగం వదలిపోతుందో అప్పుడే శాంతి వస్తుంది. ఒక కథ చెపుతా విను!" అంటూ అతడికి ఈ క్రింది కథను చెప్పారు.

"ఒక బాటసారి ఎండలో నడచిపోతున్నాడు. ఎంతో దూరం నడిచాడు. కాని చేరవలసిన ఊరు ఇంకా రాలేదు. ఇంతలో దూరాన ఒక చెట్టు కనిపించింది. ఆ బాటసారి అక్కడికి పరుగెత్తి ఆయాసపడుతూ దాని నీడలో నిలబడ్డాడు. అప్పటికే బాగా అలసి ఉండటం వల్ల, ఎండవల్ల అతడికి దాహం వేసింది. 'నీళ్ళు ఎక్కడైనా దొరికితే బాగుండునే!' అనే ఆలోచన కలిగింది. అలా అనుకున్నాడో లేదో, తక్షణమే అతడి ఎదుట చల్లని నీళ్ళపాత్ర ఒకటి ప్రత్యక్షమైంది. ఆ నీళ్ళు త్రాగగానే వాడికి ఆకలి వేసింది. అన్నం తినాలనే కోర్కె మనస్సులో కలిగింది. తలచిందే తడవుగా రకరకాల పిండివంటలతో రుచికరమైన భోజనం ఎదుట కనపడింది. కడుపు నిండా తినేసరికి, భుక్తాయాసం కలిగి పడుకుందామనుకున్నాడు. వెంటనే మెత్తని, చక్కని పాన్పు కళ్ళ ఎదుట తారసిల్లింది. వాడు దాని మీద అటుయిటు దొర్లుతూ ఆ రోజు జరిగిన విచిత్రమైన సంగతుల్ని నెమరువేస్తున్నాడు. 'నేను ఏది కోరుకుంటే అది కళ్ళముందు ప్రత్యక్షమవుతున్నదే! చూస్తే ఇదేదో వింతగా ఉంది. ఇలాగే ఏదైనా పులి వచ్చి నన్ను మ్రింగదు గదా!' అనుకున్నాడు. ఇంకేముంది! గాంర్రుమంటూ ఒక పెద్దపులి వచ్చి అతడి గొంతు కొరికి చంపేసింది. "చూచావా! ఆ చెట్టు మరేమిటో కాదు. అదే కల్పవృక్షము! కల్పవృక్షం ఏది కోరితే దాన్ని ఇస్తుంది. అలాగే భగవంతుడు కూడా కల్పవృక్షంవంటి వాడు. ఆ కల్పవృక్షం నీడలో నిలబడి ఏది కోరితే అది తప్పకుండా సిద్ధిస్తుంది."

ఈ కథ వింటున్న ఆ నటుడు, "మహాప్రభూ! భోగాన్ని గురించి మీరు చెప్పిందంతా పరమసత్యం. భగవంతుణ్ణి భోగాలు కావాలని ప్రార్థిస్తే చివరకు మిగిలేది అనర్థమే. మనస్సులోకి అనేక ఆలోచనలు, కోరికలు వస్తుంటాయి. అవన్నీ మంచివి కావు గదా! భగవంతుడు కల్పవృక్షం వంటివాడు! మీరు చెప్పిన కథలోలాగా, 'పెద్దపులి వస్తుందేమో' అనుకుంటే నిజంగానే పులి వచ్చి అతణ్ణి మ్రింగివేసింది" అన్నాడు. వెంటనే గురుదేవులు, "నిజమే! భోగభాగ్యాలు కావాలని కోరితే వాటి వెనుకనే పెద్దపులి కూడా వస్తుందన్న విషయము ఎప్పుడూ జ్ఞాపకం పెట్టుకో! నేను నీకు అంతకంటే ఏమి చెప్పేది? భగవంతుణ్ణి హృదయపూర్వకంగా ప్రార్థిస్తే ఆయన నీకు సాక్షాత్కరిస్తాడు" అని బోధించారు.

ఈ విషయాన్నే గురుదేవులు శశిధరపండితుడికి, నందబోసు అనే ఒక సంపన్న గృహస్థుడికి కూడా చెప్పారు. "జ్ఞానులు ముక్తి కావాలని, భక్తులు భక్తి కావాలని, ఏ మాత్రమైన ఫలాపేక్ష లేనటువంటి ప్రేమ కావాలని కోరుకుంటారు గాని అర్థకామాలు (కామినీ కాంచనాలు) కావాలని ఎప్పుడూ కోరరు" అని కూడా వారితో చెప్పారు.

# 2. దేవుడు ఒక్కడే! పేర్లు అనేకం!
## (చెరువు - నాలుగు ఘట్టాలు)

ఒకసారి రామచంద్రదత్త, బ్రహ్మ సమాజంలో ఉండే లోపాలను గురించి మాట్లాడటం మొదలు పెట్టాడు. అప్పుడు గురుదేవులు ఇలా చెప్పారు:

"ఒక చెరువు ఉంది. దానికి అనేక ఘట్టాలున్నాయి. ఒక ఘట్టంలో నుంచి హిందువులు బిందెలతో నీళ్ళు తీసుకుపోతున్నారు. 'ఆ బిందెల్లో ఏముంది?' అంటే 'జలం!' అని బదులు చెప్పారు. ఇంకో ఘట్టంలో నుంచి మహమ్మదీయులు తోలుతిత్తుల్లో నీళ్ళు తీసుకుపోతున్నారు. 'ఆ తిత్తుల్లో ఏముంది?' అంటే 'పానీ!' అని వాళ్ళు సమాధానం చెప్పారు. ఇంకో ఘట్టంలో నుంచి క్రైస్తవులు బక్కెట్లతో నీళ్ళు తీసుకుపోతున్నారు. 'ఆ బక్కెట్లలో ఉన్నది ఏమిటి?' అని అడిగితే 'వాటర్!' అని వాళ్ళు చెప్పారు."

"చూడండి! ఆ నీళ్ళు తెస్తున్న వాళ్ళలో ఎవరైనా అది 'జలం' కాదు 'పానీ' అని అన్నా, 'పానీ' కాదు 'వాటర్' అన్నా, అది హాస్యాస్పదంగా ఉండదా? వివిధ సంప్రదాయాల మధ్య ఘర్షణలకు, అపార్థాలకు, తగాదాలకు ఇదే కారణం. దీనివల్లనే మానవులు మతాల పేర్లతో ఒకరినొకరు పొడుచుకొని చంపుకుంటున్నారు. రక్తపాతం చేస్తున్నారు. ఇది ఎంతమాత్రం సమంజసమైన పని కాదు. నిజానికి ప్రతివారు దేవుని వైపే పురోగమిస్తున్నారు. హృదయంలో వ్యాకులత, నిజాయితీ ఉన్నట్లయితే వాళ్ళు దేవుణ్ణి దర్శిస్తారు," అని చెప్పి ఇంకా ఇలా అన్నారు:



"మతాలను గురించి బోధించేవాళ్ళు ఒకరితో ఒకరు కొట్లాడుకోవడం నేను కళ్ళారా చూశాను. హిందువులు, క్రైస్తవులు, ముసల్మానులు, బ్రహ్మసమాజంవారు, శాక్తేయులు, వైష్ణవులు, శైవులు - ఒకరేమిటి - అందరూ ఒకరితో ఒకరు పోట్లాడుకుంటున్నారు. ఎవడు కృష్ణుడో–వాడే శివుడు! అతడే 'ఆద్యాశక్తి' అనీ, 'జీసస్' అనీ, 'అల్లా' అనీ పిలువబడుతున్నాడనే జ్ఞానం వారికి లేదు. 'ఏక్ రామ్ – హజార్ నామ్!' దేవుడు ఒక్కడే. కానీ ఆయన అనేక పేర్లతో పిలువబడుతున్నాడు."

"సత్యం ఒక్కటే! అదే అనేకపేర్లతో వ్యవహరించబడుతున్నది. అందరూ అన్వేషించేది ఆ సత్యాన్నే! వాతావరణం, స్వభావాలు, పేర్లు మొదలైనవే భిన్నంగా కనపడడానికి కారణం. అందువల్ల తమ మతమే సరైనదని, ఇతరుల మతాలు సరైనవి కావని అనుకోవడం ఎంతమాత్రం పనికిరాదు. ఉన్న భగవంతుడు ఒక్కడే. రెండు ఎన్నటికీ కాదు. ఏకమేవాద్వితీయం బ్రహ్మ"

## 3. భగవంతుడే పోషకుడు

## (బాలసన్న్యాసి - భిక్షాటన)

సురేంద్రనాథ్ మిత్ర గురుదేవుల గృహస్థభక్తులలో ముఖ్యుడు. ఒకసారి అతడు గురుదేవులను గురించి వ్యంగ్యంగాను, పరుషంగాను మాట్లాడాడు. ఆ విషయం గురుదేవులకు తెలిసింది. గురుదేవులు ఆ విషయాన్ని ఆధారసేను మొదలయిన భక్తుల సమక్షంలో ప్రస్తావించి ఇలా అన్నారు: "ఎవరు ఆ సురేంద్రుడు? ఒక జంపకాణ, కొన్ని దిండ్లు, నాలుగు రూపాయలు నాకు ఇచ్చినంత మాత్రాన ఇంత నిర్లక్ష్యంగా మాట్లాడతాడా? అలా మాట్లాడడానికి అతడికి ఎన్ని గుండెలు?" అని అంటూ ఆధారుని ఉద్దేశించి, "ఒక కథ చెపుతా విను!" అన్నారు.

"ఒక బాలసన్న్యాసి ఒకరోజు భిక్షాటనకు వెళ్ళాడు. ఒక గృహస్థుని ఇంటి ముందు నిలబడ్డాడు. ఆ ఇంట్లో నుండి యౌవనంలో ఉన్న ఒక యువతి వచ్చి ఈ సన్న్యాసికి భిక్ష వేసింది. ఆ సన్న్యాసి ఆ అమ్మాయి తల్లితో, 'అమ్మా! ఈ అమ్మాయి గుండెల మీద కురుపులు లేచినవా ఏమిటి?' అని ప్రశ్నించాడు. ఆమె ఆ బాలసన్న్యాసి అమాయకత్వాన్ని గ్రహించి, 'లేదు నాయనా! ఈ అమ్మాయికి పిల్లలు కలిగినపుడు ఆ పిల్లలకు పాలిచ్చి పెంచి పెద్దవారిని చెయ్యటానికి భగవంతుడు ఆమెకు పాలిండ్లు ప్రసాదించాడు' అని బదులు చెప్పింది. ఆ మాట విన్న ఆ బాలసన్న్యాసి విస్మయంతోను, సంతోషంతోనూ, తృప్తితోనూ, 'అలా అయితే ఈ భిక్ష కోసం నేనెందుకు బాధపడాలి? భిక్షాటనానికి ఇతరుల దగ్గరికి ఎందుకు వెళ్ళాలి? నన్ను ఏ భగవంతుడు సృష్టించాడో ఆ భగవంతుడే నాకు పట్టెడు అన్నం పెట్టి రక్షించడా?' అనుకుంటూ వెళ్ళిపోయాడు."

“కాబట్టి భగవంతుణ్ణే నమ్ముకున్న భక్తులకు కావలసినవన్నీ భగవంతుడే సమకూరుస్తాడు. వాళ్ళకు ఏ కొరతా ఉండదు. ఎవరు తమ హృదయంలో భగవంతుణ్ణి ప్రతిష్ఠించుకున్నారో, ఆ మహాత్ములకు సేవ చేయడానికి ఎంతోమంది ముందుకు వస్తారు. కాశీలో ఉన్న కొందరు సాధువులను చూచాను. ఎంతోమంది సంపన్నులు చేతులు కట్టుకుని వాళ్ళముందు నిలబడి వారి ఆజ్ఞల కోసం వేచి ఉంటారు. వారికి సాధువులంటే అంత భక్తి ఉంది. కాని నిజమైన సాధువు దేనినీ కోరడు. అతడికి ఏ లోటూ ఉండదు. భగవత్సాక్షాత్కారానికి కావలసినదంతా ఆ భగవంతుడే అతడికి సమకూరుస్తాడు.”

## 4. దేవుడు నీలోనే ఉన్నాడు (చుట్టకాల్చేవాడు - చేతిలో లాంతరు)

“మానవుడు దేనినైతే వెతుకుతున్నాడో అది అతడికి అతి సమీపంలోనే ఉంది. ఐనా అతడు దానిని అక్కడాయిక్కడా వెతుకుతుంటాడు.”

“ఒకడు చుట్ట కాల్చుకోవాలని అనుకున్నాడు. నిప్పు కోసం పొరుగింటికి వెళ్ళాడు. అది అర్ధరాత్రి అవడంవల్ల అందరూ గాఢనిద్రలో మునిగి ఉన్నారు. వాడు మొదట పిలిచాడు. తలుపు తట్టాడు. ఎవరూ పలుకలేదు. తరువాత తలుపుని బాదడం మొదలు పెట్టాడు.

ఆ శబ్దానికి లేచి లోపలి నుంచి ఎవరో వచ్చి తలుపుతీసి చూచారు. ఎదురుగా ఈ మనిషి కనపడ్డాడు. అతణ్ణి చూడటంతోనే, 'ఏమిటండీ! సంగతేమిటి? ఇంత రాత్రివేళ ఇలా వచ్చారు?' అని ప్రశ్నించారు. ఆ ధూమపానప్రియుడు వెంటనే, 'ఆ మాత్రం ఊహించలేవటయ్యా! చుట్ట కాల్చటమంటే నాకెంత ప్రాణమో నీకు తెలియదా? అందుకే చుట్ట వెలిగించుకోవడానికి నిప్పు అడుగుదామని వచ్చాను' అని బదులు చెప్పాడు. అప్పుడు ఆ పొరుగువాడు బిగ్గరగా నవ్వుతూ, 'మీరు భలేవారండీ! దీని కోసమేనా ప్రయాసపడి ఈ అర్ధరాత్రి ఇంతదూరం వచ్చి తలుపు బాదుతూ ఉన్నారు? వెలుగుతున్న లాంతరు మీ చేతిలోనే ఉంది కదా!' అన్నాడు."

ఈ కథను శ్రీరామకృష్ణులు పెద్దగోపాలుడు మొదలైన శిష్యులకు చెప్పారు. పెద్దగోపాలుడు తరువాత గురుదేవుల వద్ద సన్న్యాసం తీసుకొని, అద్వైతానంద స్వామి అనే పేరుతో ప్రసిద్ధి కెక్కారు. శ్రీరామకృష్ణులు ఇంకా ఇలా చెప్పి ముగించారు: "దేవుడు 'అక్కడ, అక్కడ' (అంటే ఎక్కడో ఎంతో దూరంలో) ఉన్నాడని తలుస్తున్నంతవరకూ మానవుడు అజ్ఞానంలో ఉంటాడు. భగవంతుడు 'ఇక్కడ, ఇక్కడ' (అంటే తనలోనే) ఉన్నాడని తెలుసుకుంటే జ్ఞానాన్ని పొందినవాడౌతున్నాడు."

దీనితోపాటు మన హృదయంలోనే దేవుడు ఉన్నాడన్న భావనను వివరించే ఈ కథను కూడా ఆయన చెప్పారు.

"ఒక ముసల్మాను, తన ప్రార్థనలను చేస్తూ, 'ఓ అల్లా! ఓ అల్లా!' అని బిగ్గరగా అరవసాగాడు. దగ్గరలోనే నిలబడివున్న మరొక ముసల్మాను, 'నీవు అల్లాను సంబోధిస్తున్నావు. చాలా బాగుంది. కానీ అలా అరుస్తావెందుకు? ఆయన చీమ కాలి అందెల సవ్వడి కూడా వినగలడని నీకు తెలియదా?' అని ప్రశ్నించాడు."

"భగవంతుడిలో మన మనస్సు ఐక్యం చెందినప్పుడు, ఆయనను అతి సమీపంలో, మన హృదయంలోనే దర్శిస్తాము."

## 5. స్వప్రయత్నము - దైవకృప
## (నారదుడు - నరకము)

ఒకరోజు శ్రీరామకృష్ణుల భక్తులలో ఇద్దరికి స్వప్రయత్నము-దైవకృప అనే రెండు భావాలకూ సమన్వయం కుదరక గురుదేవుల వద్దకు వెళ్ళి ఆయనను ప్రశ్నించారు. గురుదేవులు వారితో మాట్లాడుతూ ఈ విధంగా చెప్పారు: "స్వప్రయత్నం గురించి ఎందుకు మాట్లాడతారు? ప్రతీదీ భగవంతుని సంకల్పం మీదే ఆధారపడి ఉంటుంది. ఒక ఆవును పలుపుతాడుతో గుంజకు కట్టినట్లుగా మన సంకల్పం కూడా భగవంతుని సంకల్పానికి ముడివేయబడి ఉన్నది. మనిషికి

కొంత స్వతంత్రం తప్పక ఉంది. అంతవరకూ తాను స్వప్రయత్నంతో కృషి చేయగలడు. కానీ, ఆ పలుపుతాడు ఎంత పొడవు ఉందో అంతవరకు మాత్రమే ఆ ఆవు తిరగగలిగినట్టుగా, మనిషి స్వతంత్రం కూడా కొంతవరకే ఉంటుంది. అంతమాత్రంతోనే తాను సర్వస్వతంత్రుణ్ణి అని మనిషి అనుకుంటాడు. కానీ నిజానికి అతని సంకల్పం, ఆలోచనా పరిధి అంతా కూడా దైవసంకల్పం పైనే ఆధారపడి ఉంటుంది" అని చెప్పారు.

"అలా అయితే జపతపధ్యానాదుల అవసరమేమీ లేదా? మనిషి హాయిగా కూర్చుని, అన్నీ ఆయన ఇష్టప్రకారం జరుగుతున్నాయని అనుకోవచ్చు కదా?" అని వారు ప్రశ్నించారు.

దానికి గురుదేవులు, "ఇన్ని మాటలు మాట్లాడి ఏమిటి ప్రయోజనం? ముళ్ళ మీద చెయ్యి పెడితే ముళ్ళు గుచ్చుకుంటాయి. ముళ్ళకంప మీద చెయ్యిపెట్టి, 'ముళ్ళులేవు–ముళ్ళులేవు' అని ఎంత బింకంగా పలికినా అవి గుచ్చుకోకా మానవు! నొప్పి కలుగకా మానదు! మనిషి తన సొంతశక్తితోనే అంతా సాధించగలిగితే అందరూ దైవసాక్షాత్కారాన్ని సాధించి ఉండేవారు కదా! కానీ అలా జరగడం లేదు. ఎందుకో ఆలోచించండి!"

"భగవంతుడు తనకు ఇచ్చిన శక్తిని మనిషి సరిగా ఉపయోగించుకోకపోతే, ఆయన అంతకు మించి మనకు శక్తిని ఇవ్వడు. ఇది మాత్రం నిజం! అందువలననే స్వయంకృషి అనేది అవసరం. స్వయంకృషితో దైవానుగ్రహానికి అర్హతను పొందాలి. స్వయంకృషి, దైవకృప కలిసినప్పుడు అనేక జన్మల బాధలన్నీ ఒక జన్మలోనే అనుభవించవచ్చు. కాబట్టి ఎంతోకొంత స్వప్రయత్నం తప్పనిసరి. ఈ విషయానికి సంబంధించి, ఒక కథ చెపుతా వినండి!"

"ఒకసారి విష్ణువుకు ఎందుకో కోపం వచ్చి, నారదుణ్ణి నరకంలో పడమని శపించాడు. నారదుడు చాలా కలతపడి, నరకం ఎక్కడ ఉందో చూపించమని, అక్కడకు ఎలా వెళ్ళాలో తెలియచేయమని విష్ణుమూర్తినే మరీమరీ ప్రార్థించాడు. విష్ణుమూర్తి ఒక సుద్దముక్కతో నేలపైన విశ్వం యొక్క చిత్రపటాన్ని గీసి దానిలో స్వర్గం, నరకం ఎక్కడ ఉంటాయో స్పష్టంగా గుర్తుపెట్టి చూపించాడు. నారదుడు ఆ పటంలో నరకం ఉన్న ప్రదేశాన్ని చూపించి, 'ఇదే కదా నరకం? మీరు చెపుతున్నారు కనుక ఇది కచ్చితంగా నరకమే!' అని, ఆ ప్రదేశంలో నేలమీద పడి, అటూ ఇటూ పొర్లి, తాను నరకబాధలన్నీ అనుభవించేసినట్టేనని చెప్పాడు. విష్ణుమూర్తి చిరునవ్వుతో, 'అదెలా కుదురుతుంది?' అని అడిగాడు. నారదుడు, 'ప్రభూ! స్వర్గము, నరకము మీ సృష్టే కదా! మీరే ఈ బొమ్మ గీసి దానిలో నరకాన్ని చూపించారు కదా! కాబట్టి అది నిజంగా నరకమే అవుతుంది. నిజానికి ఆ

ప్రదేశంలో నేను పొర్లుతున్నప్పుడు నాకు విపరీతమైన బాధ కలిగింది. అందుచేత నరకంలోని శిక్షలన్నీ అనుభవించినట్లే!" అన్నాడు. ఈ మాటలను నారదుడు ఎంతో నిజాయితీతో చెప్పాడు. అది విని విష్ణుమూర్తి సంతృప్తి చెందాడు."

నారదుడు ఆ చిత్రపటం ఉన్న ప్రదేశంలో పొర్లడాన్నీ, విపరీతమైన బాధలను అనుభవించడాన్నీ స్వప్రయత్నంతోనూ; విష్ణువు సంతృప్తి చెందడాన్ని దైవకృపతోనూ పోల్చవచ్చు.

## 6. ప్రపంచాన్ని విడిచిపెట్టనక్కరలేదు!
## (వశిష్ఠుడు - శ్రీరాముడు)

ఒకసారి శ్రీరాముడు తీవ్రమైన వైరాగ్యభావంలో మునిగిపోయాడు. దశరథుడు ఇది చూసి ఆందోళన చెందాడు. వశిష్ఠుడి దగ్గరకు వెళ్ళి రాముడికి సన్న్యసించకుండా నచ్చజెప్పమని అడిగాడు. ఆ మహర్షి రాముడి దగ్గరకు వెళ్ళి, రాముడు ముభావంగా ఉండడం చూశాడు. ఆ యువరాజు మనస్సులో వైరాగ్యభావం జ్వలించిపోతోంది.

వశిష్ఠుడు రాముడితో, "ఓ రామా! ఈ ప్రపంచాన్ని ఎందుకు విడిచిపెట్టాలి? ఈ ప్రపంచంలో భగవంతుని కంటే వేరైనది ఏదైనా ఉందా? నాకు చెప్పు?" అన్నాడు. పరబ్రహ్మం నుండే ఈ ప్రపంచమంతా ఏర్పడిందని శ్రీరామునికి అప్పుడు బోధపడింది. రాజ్యాన్ని విడిచి, సన్న్యసించాలనే ఆలోచనను మార్చుకున్నాడు.

## 7. దైవకృపకు కారణాలు
## (పసిబిడ్డ - గోళీలు)

దేవుని స్వభావాన్ని తెలుసుకోవడం కష్టం. దైవకృప ఎప్పుడు, ఎవరిమీద, ఎందుకు వర్షిస్తుందో అర్థం చేసుకోగలిగే శక్తి ఎవరికీ లేదు. వారివారి అర్హతనుబట్టి, జన్మజన్మలలో చేసిన కర్మఫలాన్ని అనుసరించి దైవకృప ఉంటుంది. కానీ అది ఇదమిత్థంగా ఇలా ఉంటుందని ఎవ్వరూ చెప్పలేరు. గురుదేవులు ఈ విషయాన్ని వివరించడానికి ఈ కథను చెప్పారు.

"ఒక చిన్న పిల్లవాడు తన చొక్కాజేబులో గాజు గోళీలు పోసుకుని ఆడుకుంటూ ఉంటాడు. ఆ త్రోవలో వెళ్ళేవాళ్ళు చాలామంది ఆ ముద్దులొలికే పసివాణ్ణి చూసి ముచ్చటపడి, వాడితో మాటలు కలుపుదామని ప్రయత్నిస్తూ, ఆ గోళీలను తమకు ఇమ్మని వాణ్ణి అడుగుతూ ఉంటారు. కానీ వాడు తన చేతులతో వాటిని దాచివేసి, మొహం ప్రక్కకు త్రిప్పుకుని, 'నేను ఎవరికీ ఇవ్వను!' అంటూ ఉంటాడు. ఇంతలో మరొక మనిషి అటు వస్తాడు. అతడు గోళీలను ఇమ్మని పిల్లవాణ్ణి అడగడు. అయినా ఆ పిల్లవాడు అతని వెంట పరుగెత్తి గోళీలు తీసుకోమని మరీ మరీ

అడుగుతాడు. దేవుని స్వభావం కూడా ఈ చిన్న పిల్లవాడి మనస్తత్త్వంలాగానే ఉంటుంది. అది మన అవగాహనకు అందదు. దైవకృప ఎప్పుడు, ఎవరి మీద, ఎందుకు కలుగుతుందో చెప్పడం ఎవరికీ సాధ్యం కాదు."

## 8. భగవంతుడు కనిపిస్తాడు

## (వ్యాకులత ఎలా ఉండాలో చూపిన గురువు)

ఒకసారి బంకించంద్ర ఛటర్జీ గురుదేవుల వద్దకు వచ్చి చాలాసేపు మాట్లాడారు. మాటల మధ్యలో గురుదేవులను ఇలా ప్రశ్నించారు: "అయ్యా, భగవంతుని దర్శనం ఎలా కలుగుతుంది?" అప్పుడు గురుదేవులు ఇలా సమాధానం చెప్పారు: "తల్లి కోసం పసిబిడ్డ ఎలా అల్లాడుతుందో ఆ రకమైన పరితాపం కలిగితే భగవద్దర్శనమవుతుంది. ఒక కథ చెపుతా విను!"

"ఒకసారి ఒక శిష్యుడు తన గురువును, 'స్వామీ! భగవంతుణ్ణి నేను ఎలా చూడగలనో చెప్పండి?' అని ప్రశ్నించాడు. 'నాయనా! నాతో రా, చెపుతాను!' అని ఆ శిష్యుణ్ణి ఆయన ఒక చెరువు దగ్గరికి తీసుకు వెళ్ళాడు. చెరువులో వాళ్ళిద్దరూ స్నానానికి దిగారు. శిష్యుడు నీళ్ళలో మునగగానే గురువు అకస్మాత్తుగా శిష్యుడి తలను నీళ్ళలో అదిమిపెట్టి కొన్ని క్షణాలయిన తరువాత వదలిపెట్టాడు.



పాపం! శిష్యుడు ఊపిరాడక గిలగిలలాడుతూ తల పైకెత్తి నిలబడ్డాడు. గురువు అతణ్ణి చూచి, 'అబ్బాయీ! నీళ్ళలో ఉన్నప్పుడు నీకెలావుంది?' అని అడిగాడు. శిష్యుడు 'స్వామీ! అప్పుడు నేను చచ్చిపోతున్నాననిపించింది. ఉక్కిరిబిక్కిరి అయి ఊపిరాడక తన్నుకున్నాను!' అని బదులు చెప్పాడు. గురువు అతడితో, 'నాయనా! ఎప్పుడైతే భగవంతుని కోసం అటువంటి వ్యాకులత నీకు కలుగుతుందో ఆ తర్వాత నీవు ఎక్కువకాలం వేచి చూడనవసరం లేదు. త్వరలోనే భగవంతుని దర్శనమౌతుంది అని నీవు తెలుసుకోవచ్చు' అన్నాడు."

ఈ కథ చెప్పి బంకించంద్రుని ఉద్దేశిస్తూ గురుదేవులు ఇంకా ఇలా అన్నారు: "నీకో విషయం చెపుతాను. నీటిమీద తేలుతున్నన్నాళ్ళూ నీవు ఏమి సాధించగలవు? నీళ్ళలో కొంచెమైనా మునుగు. జాతిరత్నం బరువుగా ఉంటుంది కదా! అది నీళ్ళలో అట్టడుగున ఉంటుంది గాని నీళ్ళమీద తేలుతుందా? జాతిరత్నం కావాలంటే నీవు అడుగంట మునగాలి." కేవలం పాండిత్యం వల్ల ప్రయోజనం లేదనీ, భగవద్దర్శనం కోసం త్రికరణశుద్ధిగా, తీవ్రమైన సాధన చెయ్యాలనీ గురుదేవుల అభిప్రాయం.

(బంకించంద్ర ఛటర్జీ 19వ శతాబ్దపు చివరిభాగపు విద్యాధికులలో ఒకరు. భారత ఇంగ్లండు దేశాల సంస్కృతీసంపర్కాల పంట అయిన ఆ మేధావి సాంఘిక, ధార్మిక విషయాల మీద అనేక రచనలు గావించాడు. హిందూ ధర్మశాస్త్రాలకు నూతన వ్యాఖ్యానాలిచ్చి, తీవ్రమైన సంఘసంస్కరణలను ప్రతిపాదించాడు.)

## 9. దేవుడు మానవుని రూపంలో లేడా?
## (విభీషణుడు - వ్యాపారి)

"ఒకసారి సముద్రం మధ్యలో ఒక వ్యాపారి ఓడ మునిగిపోయింది. అతడు లంకానగర తీరానికి చేరాడు. అప్పుడు రాక్షసరాజు విభీషణుడు అక్కడ రాజ్యం ఏలుతున్నాడు. ఆ వ్యాపారిని తీసుకురమ్మని విభీషణుడు తన సేవకులను పంపాడు. వారు అతన్ని తీసుకు వచ్చారు. అతణ్ణి చూడగానే పట్టరాని ఆనందంతో విభీషణుడు, 'ఆహా! ఇతడు అచ్చు నా రాముని లాగానే ఉన్నాడు, అదే మానవరూపం!' అన్నాడు. ఆ వ్యాపారిని మంచి బట్టలతోను, నగలతోను అలంకరించి పూజించాడు." శ్రీరామకృష్ణులు ఈ కథను చెప్పి ఇంకా ఇలా ప్రశ్నించారు: "మొదటిసారి ఈ కథను విన్నప్పుడు నేను చెప్పలేని ఆనందాన్ని పొందాను. భగవంతుడే మానవరూపంలో అవతరించి, క్రీడిస్తాడు. మట్టి ప్రతిమ ద్వారా భగవంతుణ్ణి పూజిస్తున్నప్పుడు మానవరూపంలో ఎందుకు పూజించకూడదు?"

## 10. దేవునికి అన్నీ సాధ్యమే (ఒకే మొక్కకు రెండు రంగుల పూలు; ఇంద్రజాలికుడు - ముడులు)

“మాటల మధ్యలో ఒకరోజు మధురబాబు, ‘భగవంతుడు కూడా తాను ఏర్పరచిన నియమాలకు కట్టుబడి ఉండాల్సిందే! వాటిని అతిక్రమించే శక్తి ఆయనకు కూడా లేదు!’ అని అన్నాడు. వెంటనే నేను (శ్రీరామకృష్ణులు), ‘ఎంత తెలివితక్కువ ఆలోచన! నియమాన్ని ఏర్పరచినవాడు తన ఇష్టం వచ్చినప్పుడు దాన్ని మార్చివేయగలడు,’ అని చెప్పాను. ‘అదెలాగండీ!’ అంటూ మధురబాబు, ‘ఎర్రనిపూలు పూసే మొక్క తెల్లని పూలు పూయదు. అది ప్రకృతి నియమం. అటువంటి మొక్కనుంచి దేవుడు తెల్లని పూలు పూయిస్తే నాకు చూడాలని ఉంది!’ అన్నాడు. ‘ఆయన అది కూడా చేయగలడు. ఎందుకంటే, అంతా ఆయన సంకల్పం మీదే ఆధారపడి ఉన్నది కనుక’ అన్నాను. మధురుడికి ఈ విషయం నచ్చలేదు. మరుసటిరోజు తోటలో పచార్లు చేస్తున్నప్పుడు ఒక మందార మొక్కను చూశాను. ఆ మొక్కకున్న ఒక కొమ్మకు ఎరుపు, తెలుపు పూలు ప్రక్కప్రక్కనే పూసి ఉన్నాయి. ఆ కొమ్మను తెంపి మధురబాబుకు చూపించాను. అతడు విభ్రాంతుడై, ‘తండ్రీ! ఇకపై ఏ విషయం గురించీ మీతో వాదించను!’ అన్నాడు. ‘మరి భగవంతుడికి అసాధ్యమైనది ఏదీ లేదు కదా!”

ఇదే విషయాన్ని వివరిస్తూ మరొకసారి గురుదేవులు ఇలా అన్నారు: “దైవకృప కలిగితే జీవుడి అష్టపాశాలన్నీ రెప్పపాటులో మాయమవుతాయి. అదెలాగంటే, ఒక గది వెయ్యి సంవత్సరాల నుంచీ కటిక చీకటితో నిండివున్నా, దీపం వెలిగించిన మరుక్షణమే ఆ గది వెలుతురుతో నిండిపోతుంది. ఇంద్రజాలికుడి గారడీ చూడలేదా? అనేక ముడులు వేసివున్న దారం యొక్క ఒకవైపు కొనను కట్టి ఉంచుతాడు. దాని రెండవ కొనను చేత్తో పట్టుకుని ఒకటిరెండుసార్లు లాగి, గిరాగిరా తిప్పుతాడు. ముడులన్నీ విడిపోతాయి. మనం ఎంత ప్రయత్నించినా ఆ ముడులను విప్పలేము సుమా! అలాగే దేవుడు జాలి తలిస్తే మనంతట మనం తెంచుకోలేని బంధాలన్నీ రెప్పపాటులో తెగిపోతాయి.”

## 11. భగవంతుడికి ఐశ్వర్యం మీద మోజు లేదు (రాధాకాంతాలయంలో చోరీ)

గురుదేవులు శివనాథుడితో ఇలా అన్నారు. “ఈశ్వరుడి ఐశ్వర్యం గురించి అంత ఎక్కువగా చెపుతారెందుకు?”

"నేను కేశవచంద్రసేన్‌ని కూడా ఇదే మాట అడిగాను. ఒకరోజు వారందరూ దక్షిణేశ్వరం వచ్చారు. 'నీవు ఎలా ఉపన్యాసం చెపుతావో వినాలని ఉంది!' అని కేశవుడితో అన్నాను. వెంటనే గంగ ఒడ్డున ఒక సభ ఏర్పాటు చేశారు. కేశవుడు చక్కగా ఉపన్యసించాడు."

"అయితే నేను అతడితో, 'మీరు భగవంతుణ్ణి పొగుడుతూ "నువ్వు అందమైన పువ్వులను సృష్టించావు, ఆకాశాన్ని సృష్టించావు, తారాగణాన్ని సృష్టించావు, సముద్రాన్ని సృష్టించావు!" అని వర్ణిస్తారెందుకు? ఎవరికైతే ఐశ్వర్యం మీద మోజు ఉంటుందో వారే భగవంతుడి ఐశ్వర్యాన్నీ, వైభవాన్నీ వర్ణిస్తారు!' అన్నాను."

"దక్షిణేశ్వరంలోని రాధాకాంతాలయంలో దొంగలు పడ్డారు. నగలన్నీ దోచుకుపోయారు. రాసమణి అల్లుడు మధురబాబు వచ్చి చూసి, విగ్రహానికి నమస్కరిస్తూ, 'నీ నగలు నీవే రక్షించుకోలేకపోయావా?' అన్నాడు. అలా అన్నందుకు నేను అతడికి గట్టిగా చీవాట్లు పెట్టాను. 'నీ తెలివి తెల్లవారినట్లే ఉంది! శ్రీమహాలక్ష్మి ఎవరికి పాదాలు ఒత్తుతూ ఉంటుందో అతడి ఐశ్వర్యానికి లోటు ఉంటుందా? ఈ నగలూ, గిగలూ నీకు విలువగలవేమో కానీ, భగవంతుడికి ఇవి మట్టిగడ్డలతో సమానం. ఆయనకు ఐశ్వర్యం మీద ఎటువంటి మోజు లేదు. ఇటువంటి తెలివితక్కువ మాటలు ఇంకెప్పుడూ మాట్లాడకు! సర్వైశ్వర్య సంపన్నుడైన దేవదేవుడికి నువ్వు నగలు చేయించగలవాడివయ్యావా?' "

## 12. మతదురభిమానం పనికిరాదు
## ('శివుడు గొప్పా? బ్రహ్మ గొప్పా?')

'శివుడు గొప్పా? బ్రహ్మ గొప్పా?' అనే సమస్యను తేల్చడానికి ఒక పండితసభ ఏర్పాటయింది. ఉద్దండ పండితులు చాలామంది వచ్చారు. రెండుపక్షాల వారు రకరకాల వాదోపవాదాలు చేశారు. కానీ ఒక నిర్ణయానికి రాలేకపోయారు. చివరకు వాళ్ళు ఈ సమస్యను మహాపండితుడైన పద్మలోచన తర్కాలంకారు దగ్గరకు తీసుకుపోయి పరిష్కారం చెయ్యమని ప్రార్థించారు. ఇరువురి వాదాలూ విన్న తరువాత ఎటువంటి అరమరికలు లేకుండా పద్మలోచనుడు వారికి ఇలా సమాధానం చెప్పాడు:

"నేనుగానీ, నా వంశంలో ఇటు ఏడూ, అటు ఏడూ కలిపి పద్నాలుగు తరాలవాళ్ళుగానీ, శివుణ్ణీ చూడలేదు, బ్రహ్మనూ చూడలేదు. ఇక నేనో – శివుడితోనూ మాట్లాడలేదు, బ్రహ్మతోనూ మాట్లాడలేదు," అని చెప్పి వాళ్ళ నోళ్ళు మూయించాడు. మణిమల్లిక్, మహేంద్రుడు మొదలైన వారికి గురుదేవులు ఈ సంఘటనను చెప్పి ఇంకా ఇలా అన్నారు: "శాక్తేయులు, వైష్ణవులు, వేదాంతులు

ఒకరితో ఒకరు తగవులాడుతూనే ఉంటారు. అది వివేకవంతులు చేసే పని కాదు. భగవంతుని కోసం ఆర్తిపడేవాళ్ళు, వ్యాకులత చెందేవాళ్ళు, అన్నిమార్గాలు భగవంతుణ్ణి చేర్చగలిగినవేనని తెలుసుకుంటారు. కావలసినదేమిటంటే 'అనన్యమైన ఏకాంకిత నిష్ఠ.' (వేరే ఆలోచనలు లేకుండా దేవుడికే అర్పించబడిన మనస్సు). ఎవరికైనా తమ మతమంటే ఆదరాభిమానాలు ఉండవచ్చు గాని, ఇతరమతాలపై ద్వేషం ఉండకూడదు. అన్నింటియందు సౌహార్ద్రభావముండాలి."

(పద్మలోచన తర్కాలంకారు బర్ద్వాను మహారాజావారి ఆస్థాన విద్వాంసుడు. గొప్ప పండితుడు. ఎల్లప్పుడూ దుర్గానామాన్ని ఉచ్చరిస్తూ ఉండేవాడు. ఆయనకు గురుదేవుల యందు అమితమైన భక్తి ఉండేది.)

## 13. భగవంతుడు మన అల్పబుద్ధికి అందడు (కాక భుషండి కథ)

"రామాయణంలో కాకభుషండి అనే కాకి కథ ఒకటి ఉంది. కాక భుషండి ఒకసారి ఏదో కారణంవల్ల శ్రీరాముడి కోపానికి గురి అయింది. ఆ క్రోధాగ్ని నుంచి తప్పించుకోవాలని భూలోకం, పాతాళలోకం, స్వర్గలోకం మొదలైన లోకాలన్నీ చుట్టి వచ్చింది. చివరకు కైలాస పర్వతానికి కూడా వెళ్ళింది. కానీ దానికి ఎక్కడా రక్షణ దొరకలేదు. చివరకు అది రాముని దగ్గరకే వచ్చి, ఆయననే శరణువేడింది. రాముడు ఆ కాకిని చేత్తో తీసుకుని మ్రింగివేశాడు."

"ఏమి ఆశ్చర్యం! కాకభుషండి దిగ్భ్రాంతి చెందింది. తాను ఇదివరకు ఏ చెట్టుకొమ్మ మీద, ఏ గూటిలో ఉందో, సరిగ్గా అదే చెట్టుకొమ్మ మీద వాలి ఉన్నట్లుగా కనుగొన్నది. దాని అజ్ఞానం నశించింది. జ్ఞానోదయమైంది. మనం చూస్తున్నట్లు రాముడు సామాన్య మానవుడు కాదనీ, ఆయన కుక్షిలో సర్వచరాచర జగత్తు, దానితోపాటు ఆకాశము, సూర్యచంద్రాదులు, నక్షత్రాలు, సప్తసాగరాలు, నదులు, మనుష్యులు, తిర్యగ్జంతువులు, లతాగుల్మాదులు, అది ఇది ఏమిటి, సమస్తమూ ఇమిడి ఉన్నాయనీ తెలుసుకుంది."

ఈ కథను గురుదేవుల సూచన మేరకు ఈశానచక్రవర్తి, డాక్టరు మహేంద్రలాలు సర్కారుకు చెప్పాడు. డాక్టరు సర్కారుకు భగవంతుని అవతారాల మీద విశ్వాసం లేదు. అందుచేత ఈ కథ పూర్తి అయిన తరువాత డాక్టరు సర్కారుతో గురుదేవులు, "అపరిపూర్ణంగా ఉన్న మానవరూపంలో ఏ భగవంతుడు కనిపిస్తున్నాడో, ఆ భగవంతుడే అఖండ సచ్చిదానంద పరబ్రహ్మ. ఈ విషయం తెలుసుకోవడం చాలా కష్టం. 'నిత్య', 'లీల' అనే రెండు లక్షణాలూ ఆ భగవంతుని లక్షణాలే! మనకున్న జ్ఞానంతో భగవంతుడు వివిధరూపాల్లో అవతారమెత్తడని గట్టిగా చెప్పగలమా? మనకున్న మిడిమిడి జ్ఞానంతో ఇలాంటి విషయాలను

ఎప్పటికైనా అవగాహన చేసుకోగలమా? చూడండి! ఒక శేరు పాలే పట్టే కుండలో నాలుగు శేర్ల పాలు పడతాయా? భగవంతుని విషయం కూడా అంతే," అని చెప్పారు.

(డాక్టరు మహేంద్రలాలు సర్కారు సుప్రసిద్ధ హోమియో వైద్యుడు. గురుదేవుని క్యాన్సరు వ్యాధికి చికిత్స చేసేవాడు. వృత్తిరీత్యా క్షణం తీరిక లేకపోయినా డాక్టరు తరచూ కొన్ని గంటలు గురుదేవుని సాంగత్యంలో గడుపుతూ ఉండేవాడు. హేతువాదం నరనరాలలో జీర్ణించుకు పోయిన ఈ డాక్టరు గురుదేవుల సాంగత్యంలో క్రమక్రమంగా చాలావరకు మారిపోయాడు.)

## 14. అవతార పురుషులను అందరూ గుర్తించలేరు (వంకాయల వ్యాపారి - రత్నం)

"భగవంతుని అవతారాన్ని అందరూ గుర్తించలేరు. ఎక్కువమంది ఆయనను సామాన్య మానవుడనే అనుకుంటారు. కాని కొద్దిమంది మాత్రమే ఆయనను అవతార పురుషునిగా గుర్తిస్తారు. ఎవరికెంత శక్తి ఉంటుందో దానినిబట్టి వాళ్ళు ఒక వస్తువుకు విలువ కడతారు. ఒక కథ చెపుతా విను!"

"ఒక ఊరిలో ఒక ధనవంతుడున్నాడు. ఆయన తన సేవకుణ్ణి పిలిచి, 'ఈ రత్నాన్ని బజారుకు తీసుకువెళ్ళి వేరువేరు వర్తకులు దానికి ఎంత విలువ కడతారో కనుక్కొని వచ్చి నాకు చెప్పు! ముందు దాన్ని ఒక వంకాయల వ్యాపారి దగ్గరకు తీసుకొని పోయి అతడెన్ని వంకాయలు ఇస్తానంటాడో కనుక్కొని రా!' అని పంపాడు. ఆ సేవకుడు దానిని



తీసుకుపోయి ఒక వంకాయలవాడికి చూపించాడు. వాడు ఆ రత్నాన్ని చేతిలోకి తీసుకుని, అటూయిటూ త్రిప్పి చూస్తూ, 'ఏమయ్యా! దీనికి తొమ్మిది వీసెల వంకాయలు ఇస్తాను' అన్నాడు. ఆ సేవకుడు వాడితో, 'అబ్బాయీ! ఇంకొకమాట చెప్పు. పది వీసెల వంకాయలు ఇస్తావా?' అని అడిగాడు. వంకాయల వాడు, 'లాభం లేదయ్యా! నేను ఇప్పటికే బజారు ధరకన్నా ఎక్కువ ధర పెట్టాను. నీకు గిట్టుబాటయితే ఇవ్వు. లేకపోతే తీసుకొని పో!' అన్నాడు. ఆ సేవకుడు తనలో తాను నవ్వుకొని యజమాని దగ్గరకు వెళ్ళి జరిగినదంతా వివరించి చెప్పాడు.

ఆ యజమాని చిరునవ్వు నవ్వి, 'ఈసారి ఈ రత్నాన్ని బట్టల వ్యాపారి దగ్గరకు తీసుకు పో! ఇందాకటివాడు వంకాయలవాడు కదా! రత్నం విలువ పాపం వాడికేం తెలుస్తుంది? బట్టల వ్యాపారి దగ్గర పెట్టుబడి ఎక్కువ ఉంటుంది. అందువల్ల వాడెంత ధర పెడతాడో చూద్దాం' అని మళ్ళీ పంపాడు. సేవకుడు బట్టల వ్యాపారి దగ్గరకు వెళ్ళి, 'ఏమండీ! దీన్ని మీరు కొంటారా? ఎంతకు కొంటారు?' అని అడిగాడు. ఆ బట్టల వ్యాపారి దాన్ని చూచి, 'ఆ! తీసుకుంటాను. ఇది విలువగల రాయిలాగానే ఉంది. దీనితో ఒక నగ చేయించుకోవచ్చు. నీకు తొమ్మిదివందల రూపాయలు ఇస్తాను' అని చెప్పాడు. ఆ సేవకుడు బట్టల వ్యాపారితో, 'అయ్యా! ఇంకొక మాట చెప్పండి. నీకే దీన్ని అమ్మి వేస్తాను. ఆఖరు మాటగా వెయ్యిరూపాయలిచ్చి దీన్ని తీసుకోండి!' అన్నాడు. వెంటనే ఆ బట్టల వ్యాపారి, 'నన్ను ఇబ్బంది పెట్టకు. నేను చెప్పినదానికన్నా ఒక్క రూపాయి కూడా ఎక్కువ ఇవ్వను. ఆపై నీ ఇష్టం' అన్నాడు. అప్పుడు ఆ సేవకుడు తిరిగివెళ్ళి తన యజమానితో, 'అయ్యా! బట్టల వ్యాపారి తొమ్మిది వందల కన్నా ఎక్కువ ఇవ్వనన్నాడు' అని జరిగింది జరిగినట్లుగా విన్నవించాడు.

అప్పుడా యజమాని నవ్వుతూ, 'ఇక దీన్ని రత్నాల వర్తకుడి దగ్గరకు తీసుకుపో! అతనెంత ధర ఇస్తాడో చూద్దాం!' అన్నాడు. సేవకుడు దాన్ని రత్నాల వర్తకుడి దగ్గరకు తీసుకువెళ్ళాడు. ఆ రత్నాలవ్యాపారి దాన్ని చూడడంతోనే, 'లక్షరూపాయలిస్తాను!' అని సంతోషంగా చెప్పాడు."

గురుదేవులు ఈ కథను గిరీశచంద్ర ఘోషుకు చెప్పారు. గిరీశ్ గొప్ప బెంగాలీ నాటక రచయిత. తాను వ్రాసిన నాటకాలను తాను నడుపుతున్న 'స్టార్' థియేటరులో ప్రదర్శించేవాడు. అతడు గురుదేవులను అవతారపురుషునిగా పరిగణించేవాడు. అనేకసార్లు రామకృష్ణుల అవతారతత్త్వాన్ని గురించి ఆయన బ్రహ్మసమాజానికి చెందిన సుప్రసిద్ధ గాయకుడైన త్రైలోక్యసన్యాలుతో వాదించాడు. ఆ సమయంలోనే గురుదేవులు ఈ కథ చెప్పి, "వీళ్ళతో నువ్వు ఈ విషయం గురించి ఎందుకు వాదిస్తావు. వాళ్ళకు సంసారమూ కావాలి, దేవుడూ కావాలి.

అందరూ సచ్చిదానంద పరబ్రహ్మాన్ని ఊహించగలరా? శ్రీరామచంద్రుణ్ణి అవతారపురుషునిగా ఎంతమంది గుర్తించారు? కేవలం పన్నెండుమంది ఋషులే గదా" అన్నారు. శ్రీరామకృష్ణులు ఈ కథ ద్వారా తాను అవతారపురుషుణ్ణని మనలాంటి మందబుద్ధులకు సూచన చేశారు!

**అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।**
**పరంభావమజానంతో మమభూత మహేశ్వరమ్ ॥** **(భగవద్గీత 9.11)**

(మందబుద్ధులైన జనులు నా పరతత్త్వాన్ని తెలుసుకొనజాలక సర్వభూతములకు అధిపతినైన నన్ను మానవ శరీరము నందుండుటచే సామాన్యమానవునిగా భావించి అవమానింతురు.)

## 15. దేవుడు అనేక రూపాల్లో దర్శనమిస్తాడు (రంజితరాయి కథ)

"మనుష్యుని తపస్సుకు ఫలితంగా భగవంతుడు అతడికి సంతానంగా కూడా జన్మిస్తాడు. కామార్పుకూరు వెళ్ళేదారిలో 'రంజితరాయి చెరువు' అనే చెరువొకటి ఉంది. దాని కథ చెపుతా విను!"

"రంజితరాయి ఆ ప్రాంతంలో జమీందారు. ఆయన చేసిన తపస్సు ఫలించి దివ్యజనని ఆయనకు కుమార్తెగా జన్మించింది. ఆ అమ్మాయి అంటే ఆయనకు వల్లమాలిన ప్రేమ. ఆమె కూడా ఎప్పుడూ తండ్రిని వదిలేది కాదు. ఒకరోజు రంజితరాయి తన జమీందారీ వ్యవహారాలలో తలమునకలై ఉన్నాడు. ఆ అమ్మాయి, పసిపిల్లలకు ఉండే చిలిపి స్వభావంతో తండ్రి దగ్గర కూర్చుని, ఆయన చూస్తున్న కాగితాలతో ఆడుతూ, 'ఇదేమిటి నాన్నా? అదేమిటి నాన్నా?' అని విసిగించడం మొదలుపెట్టింది. పాపం! రంజితరాయి మొదట్లో ఆ అమ్మాయిని బుజ్జగిస్తూనే 'అమ్మా! అల్లరి చేయకు! పని ఎక్కువగా ఉంది. నాకు చికాకు కల్గించవద్దమ్మా!' అని బ్రతిమాలాడు. కాని ఆ అమ్మాయి అక్కడనుండి కదలలేదు. ఆయనను విసిగిస్తూనే ఉంది. చివరకు ఆయన పరధ్యానంగా, కొంచెం కోపంతో, 'ఫో! ఇక్కడ నుంచి వెళ్ళిపో!' అని గద్దించాడు.

ఇదే సాకుగా తీసుకొని ఆ అమ్మాయి ఇంట్లో నుండి బయటకు వచ్చింది. వాకిట్లో శంఖుగాజులు అమ్మేవాడొకడు కనపడ్డాడు. ఆ అమ్మాయి వాణ్ణి పిలిచి ఒక జత శంఖుగాజులు చేతికి వేయించుకుంది. గాజులవాడు డబ్బు అడిగితే ఇంట్లో మేడమీద తన పెట్టెలో డబ్బులు ఉన్నాయనీ, ఇంట్లో అడిగి తీసుకోమనీ చెప్పి వెళ్ళిపోయింది. చేసేదేమీ లేక ఆ గాజులవాడు ఇంటిలోని వాళ్ళను పిలవడం మొదలుపెట్టాడు. ఇంతలో, కూతురు తన దగ్గర లేదని రంజితరాయి

గమనించాడు. ఇంట్లో ఉందేమోనని పిలిచాడు. కాని ఎక్కడా కనిపించలేదు. ఇంట్లో వాళ్ళు అన్నిచోట్లా వెతికారు. కాని అమ్మాయి జాడలేదు. వాళ్ళకు అనుమానం కలిగింది. మేడమీద పెట్టెలో చూస్తే ఆ అమ్మాయి చెప్పినన్ని డబ్బులు కనపడ్డాయి. రంజితరాయి బిగ్గరగా ఏడవడం మొదలుపెట్టాడు. ఊరంతా వెతుకుతూ వాళ్ళందరూ చెరువు దగ్గరికి పరుగెత్తారు. చెరువులో చూస్తే నీటిపైన వారికి ఒక చెయ్యి మాత్రం కనిపించింది. దానికి రెండు శంఖుగాజులు ఉన్నాయి. వాళ్ళు చూస్తుండగానే ఆ చెయ్యి నెమ్మదినెమ్మదిగా నీళ్ళలో మునిగి కనిపించడం మానివేసింది. ఆమె నీళ్ళలో లీనమైపోయింది. ఇప్పటికి కూడా ప్రజలు ప్రతి ఏటా అక్కడ ఉత్సవం చేస్తుంటారు. ఆ అమ్మాయిని అమ్మవారుగా (దివ్యజననిగా) భావించి అర్చిస్తారు.”

శ్రీరామకృష్ణులు ఈ కథను శ్రీరామకృష్ణ కథామృత రచయిత అయిన మహేంద్రనాథ గుప్తకు చెప్పి, “ఇదంతా యథార్థం. భగవంతుడు అనేకరూపాల్లో దర్శనమిస్తాడు. ఒకొక్కసారి మనుష్య రూపంలోనూ, మరొకసారి చైతన్యవంతమైన ఇతర రూపాలలోనూ గోచరిస్తాడు. కాబట్టి దేవుడికి అనేక రూపాలన్నాయని మనం విశ్వసించాలి. దీనికి నీవేమంటావు?” అని ప్రశ్నిస్తూ ముగించారు.

## 16. భక్తులు ఏది ఇచ్చినా భగవంతుడు సంతోషిస్తాడు (యజమాని - సేవకుడు)

హాజ్రా అనే కపటభక్తుడు దక్షిణేశ్వరంలో శ్రీరామకృష్ణులతో నివసించేవాడు. హాజ్రా యొక్క ప్రవర్తనను గురించి గురుదేవులు కెప్టెనుకు చెపుతూ ఈ కథ చెప్పారు.

“ఒక జమీందారున్నాడు. ఒకరోజు ఆయన తన స్నేహితులతో మాట్లాడుతూ కచేరి చావడిలో కూర్చున్నాడు. ఆ ఇంటి కావలివాడు ఆ ప్రక్కగదిలో నిలబడ్డాడు. అతడి చేతిలో ఏదో ఒక వస్తువు ఉంది. వాడు దాన్ని శ్రద్ధగా గుడ్డతో కప్పి జాగ్రత్తగా పట్టుకొని నిలబడి, ‘లోపలున్న యజమాని దగ్గరికి ఎలా వెళ్ళాలా?’ అని తటపటాయిస్తున్నాడు. ఆ స్థితిలోవున్న అతణ్ణి జమీందారు గమనించాడు. అతడివైపు తిరిగి, ‘ఏమోయీ! ఏదో పనిమీద వచ్చినట్లు కనిపిస్తున్నావే! చేతిలో ఏదో ఉన్నట్లున్నదే! ఏమిటదీ?’ అని ప్రశ్నించాడు. కావలివాడు భయభక్తులతో నెమ్మదిగా దగ్గరకు వెళ్ళి పైన కప్పిన గుడ్డను జాగ్రత్తగా తొలగించి ఒక చక్కని సీతాఫలాన్ని యజమాని ముందు పెట్టాడు. ‘ఏలినవారు దీన్ని తినాలని కోరుకుంటున్నాను,’ అని విన్నవించాడు. అతడి వినయవిధేయతలకు జమీందారు సంతోషపడి, ఆ పండును చేతిలోకి తీసుకున్నాడు. దాన్ని అటుయిటూ తిప్పి

చూచాడు. సంతోషంతో, 'ఎంత చక్కని పండు తెచ్చావోయ్! ఎక్కడ నుంచి తెచ్చావు? ఎంతో శ్రద్ధతో తెచ్చావే. దీనిని తీసుకురావడానికి ఎంత శ్రమపడ్డావో!' అని మెచ్చుకున్నాడు."

ఆ కథ చెప్పిన తర్వాత గురుదేవులు ఇలా చెప్పారు: "చూడు! హాజ్రా నరేంద్రుడితో, 'భగవంతుడు అనంతమైనవాడు కదా! అటువంటి భగవంతుడు మీరు పెట్టిన ఈ నైవేద్యాలు ఆరగిస్తాడా?' అని అన్నాడట. అలా అన్నందుకు నేను హాజ్రాను తీవ్రంగా చీవాట్లు పెట్టాను. 'దుర్మార్గుడా! భక్తిని వదిలితే మానవుడు ఎలా జీవిస్తాడు? భగవంతుడు అనంత వైభవోపేతుడు అనే మాట నిజమే కానీ, అంతటి ఆ భగవంతుడే తన భక్తులు భక్తిశ్రద్ధలతో ఏది ఇచ్చినా సంతోషంగా స్వీకరిస్తాడు' అని మందలించాను."

## 17. భగవంతుడికి అసాధ్యమైనదేమీ లేదు (నారదుడు - ఇద్దరు యోగులు)

నానక్ సంప్రదాయానికి చెందిన సాధువులు దక్షిణేశ్వరానికి వచ్చి గురుదేవుని గదిలో ప్రవేశించి, గౌరవసూచకంగా 'నమో నారాయణ' అని సంబోధించారు. గురుదేవులు వారిని కూర్చోమని చెప్పి, ఈ కథను చెప్పారు.

ఒక ప్రదేశంలో ఇద్దరు యోగులు తపస్సు చేసుకుంటున్నారు. ఒకరోజు



నారదమహర్షి ఆ వైపుగా వెళ్ళడం సంభవించింది. ఆ యోగులు ఆయనను గుర్తించారు. వారిలో ఒక యోగి ఆ మహర్షిని ఇలా ప్రశ్నించాడు: "స్వామీ! మీరు ఇప్పుడు భగవంతుని దగ్గర నుండే వస్తున్నారు కదా! ఆయన ఏం చేస్తున్నారండీ?"

నారదమహర్షి: "భగవంతుడు ఒక సూదిని పట్టుకుని, దాని బెజ్జం ద్వారా ఇటునుంచి అటు, అటునుంచి ఇటు ఏనుగులను, ఒంటెలను దూరుస్తున్నాడు!"

మొదటి యోగి: "అయ్యా, ఇందులో ఆశ్చర్యపడవలసింది ఏముంది? భగవంతుడికి అన్నీ సాధ్యమే!"

కాని రెండవ యోగికి నారదుని మాటలమీద నమ్మకం కలగలేదు. ఆయన నారద మహర్షితో, "ఏమిటీ! భగవంతుడు సూదిబెజ్జంలో నుంచి ఏనుగులనూ, ఒంటెలనూ దూరుస్తున్నాడా? ఇది సాధ్యమయ్యే పనేనా? మీరు వైకుంఠానికి వెళ్ళనూ లేదు. భగవంతుడు చేస్తున్న పనిని చూడనూ లేదు," అని తన అనుమానాన్ని వ్యక్తం చేశాడు.

గురుదేవులు పై కథను చెప్పి, "భగవంతుడికి అసాధ్యమైనదేమీ లేదు. ఆయనకు సర్వమూ సాధ్యమే!" అని ముగించారు.

## 18. భగవంతుడు సాకారుడు, నిరాకారుడు (సన్న్యాసి - విగ్రహము; అద్దకాలు వేసేవాడు; రంగులు మార్చే ఊసరవెల్లి)

డాక్టరు మహేంద్రలాల్ సర్కారు ఒక సుప్రసిద్ధహోమియో వైద్యుడు. గురుదేవులకు గొంతులో ఏర్పడిన కాన్సరు వ్యాధికి ఆయన చికిత్స చేస్తున్నాడు. వైద్యవృత్తిలో బొత్తిగా తీరిక లేకపోయినా ఆయన గురుదేవులను పరీక్షించడానికి వచ్చిన ప్రతిసారీ చాలాసేపు అక్కడే మాట్లాడుతూ గడిపేవాడు. గురుదేవుని సమక్షంలో ఒకొక్కసారి ఆరు, ఏడు గంటల కాలం నిముషాలలాగా గడిచిపోయేది. గురుదేవుని శిష్యులను ఆయన దగ్గర బంధువులలాగా చూచేవాడు.

ఒకరోజు ఆయన గురుదేవులతో చాలాసేపు మాట్లాడాడు. ఆ సమయంలో అతి ముఖ్యమైన కొన్ని కథలను గురుదేవులు చెప్పారు.

డాక్టరు, 'భగవంతుడు సాకారుడా? నిరాకారుడా?' అని ప్రశ్న వేశాడు.

గురుదేవులు: "ఒక కథ చెపుతా విను! ఒకానొకప్పుడు ఒక సన్న్యాసి తీర్థయాత్రలు చేస్తూ జగన్నాథధామానికి వచ్చాడు. ఆలయంలో ప్రవేశించి స్వామి విగ్రహాన్ని చూచేసరికి అతడిలో ఒక సందేహం కలిగింది. 'భగవంతుడికి ఆకారమున్నదా, లేదా?' అని మనస్సులో తర్కించుకున్నాడు. అప్పుడు ఆ సన్న్యాసి చేతిలో ఒక దండం (కర్ర) ఉంది. విగ్రహం దగ్గరకు వచ్చి దండంతో విగ్రహాన్ని

తట్టి చూడబోయాడు. భగవంతుడికి ఆకారం ఉంటే ఆ కర్ర విగ్రహానికి తగిలి, అవతలి వైపుకు పోదని అతడి భావన. కాని, దానికి విరుద్ధంగా అసలు అక్కడ విగ్రహమే లేనట్టు, ఆ కర్ర సునాయాసంగా విగ్రహానికి ఎడమనుండి కుడివైపుకు దూసుకు వచ్చింది. అప్పుడు ఆ సన్న్యాసి, దేవుడికి ఆకారం లేదని, ఆయన నిరాకారుడని, నిశ్చయించుకున్నాడు. ఆ వెంటనే అటువైపు ఉన్న కర్రను తీయాలని విగ్రహానికి తగిలేలా కుడి నుండి ఎడమవైపుకు తిప్పాడు. ఆశ్చర్యం! ఆ దండం విగ్రహానికి తగిలి ఇవతలకి రాలేదు. అప్పుడా సన్న్యాసికి భగవంతుడికి ఆకారం కూడా ఉన్నదని తెలిసింది. ఈ రెండు రకాల అనుభవాల వల్ల భగవంతుడు సాకారుడని, నిరాకారుడని కూడా గ్రహించాడు."

ఈ కథ ముగించి గురుదేవులు ఇంకా ఇలా అన్నారు: "కాని దీన్ని అర్థం చేసుకోవటం చాలా కష్టం. 'భగవంతుడికి ఆకారమే ఉన్నట్లయితే, అతడు నిరాకారుడెలా అవుతాడు?' అని సహజంగా మనస్సుకు సందేహం వస్తుంది. ఒకవేళ ఆకారమే ఉందనుకోండి. అప్పుడు 'ఆయనకు ఇన్ని ఆకారాలెందుకు ఉంటాయి?' అని కూడా అనిపిస్తుంది. ఈ సందేహాలన్నీ భగవత్సాక్షాత్కారమైతే గాని తీరిపోవు. భక్తుల కోసమే భగవంతుడు వారివారి కోరికలను అనుసరించి అనేక రూపాలు ధరిస్తాడు. ఎలాగంటావా? ఇంకొక కథ చెపుతా విను!"

"ఒక ఊళ్ళో గుడ్డలకు అద్దకాలు వేసే వాడొకడుండేవాడు. వాడి దగ్గర ఒకే ఒక తొట్టి, ఆ తొట్టిలో ఒక ద్రావణం ఉండేవి. గుడ్డలకు రంగులు వేయించుకోవడానికి రోజూ చాలామంది అతడి దగ్గరికి వచ్చేవారు. ఎవరైనా గుడ్డతీసుకొని వస్తే, 'నీ గుడ్డకు ఏ రంగు వెయ్యమంటావు?' అని వాడు అడిగేవాడు. ఆ గుడ్డ తెచ్చినవాడికి ఎరుపురంగు కావలసివుంటే ఆ గుడ్డను ఆ తొట్టిలో ముంచి, 'ఇదిగో ఎర్రరంగు వేశాను తీసుకో' అని ఇచ్చేవాడు. ఇదే రకంగా మరొకరు పసుపుపచ్చ రంగు వెయ్యమంటే, ఆ గుడ్డను కూడా అదే తొట్టిలోని ద్రావణంలో ముంచి పైకితీసి, 'ఇదిగో, నీ గుడ్డకు పసుపుపచ్చ రంగు వేశాను', అని ఇచ్చేవాడు. ఇంకొకరికి, 'నీలిరంగు వేశాను', అని అదే తొట్టిలో ముంచి తీసి ఇచ్చేవాడు. ఇదే రకంగా వాడు గుడ్డలన్నీ ఒకే తొట్టిలో ముంచినా వేరే వేరే రంగులతో పైకి తీసి ఇచ్చేవాడు."

"దీనినంతా ఒకడు ప్రక్కన నిలబడి ఆశ్చర్యంతో చూస్తున్నాడు. రంగులు వేసేవాడు అతడి వైపు తిరిగి, 'అయ్యా, మీ గుడ్డకు ఏ రంగు వెయ్యమంటారు?' అని అడిగాడు. అప్పుడు వాడు, 'సోదరా! నీ తొట్టిలో ఏ రంగు ఉందో ఆ రంగునే వెయ్యి!' అని కోరాడు."

అలా అడిగినవాడు భగవంతుడి నిజస్వభావం ఏమిటో తెలుసుకోవాలని అనుకునేవాడని చెప్పుకోవచ్చు. రకరకాల రంగులు బయటకు వస్తున్న ఆ తొట్టిలో నిజంగా ఏ రంగు ఉందని అడగడం, రకరకాల అవతారాలను చూపుతున్న భగవంతుడి నిజ స్వభావం ఏమిటి అని అడగడంతో సమానమే కదా!

"కాబట్టి మహాశయా! భక్తుల కొరకు భగవంతుడు అనేక రూపాలు ధరిస్తాడు (అనేక అవతారాలెత్తుతాడు.) మరొక కథ చెపుతా విను!"

"ఒకసారి ఒక బాటసారి అడవిలో నడచిపోతున్నాడు. వాడికి ఒక చెట్టుమీద ఒక అందమైన ప్రాణి కనిపించింది. తరువాత వాడు తన స్నేహితుడికి ఈ సంగతి చెపుతూ, 'సోదరా! నేను అడవిలో ఫలానా చెట్టు మీద ఎర్రగా ఉన్న ఒక చిన్న జంతువును చూశాను!' అని చెప్పాడు. అది విని ఆ స్నేహితుడు, 'నేను కూడా దాన్ని చూశాను! అది ఎర్రగా ఉంది అంటావేం? అది ఆకుపచ్చగా ఉంది!' అన్నాడు. ఇంతలో మూడవవాడు అక్కడికి వచ్చి, 'అబ్బే! అది ఆకుపచ్చగా లేదు. పసుపుపచ్చగా ఉంది' అన్నాడు. తరువాత ఇంకా కొంతమంది ఆ ప్రాణి ఊదారంగులో ఉందని, నీలంగా ఉందని వర్ణించారు. వారు ప్రత్యక్షంగా చూశారు కనుక వారికి ఆ విషయం గురించి దృఢమైన అభిప్రాయం ఏర్పడింది కూడా.

ఇలా ఆ ప్రాణికున్న రంగులను గురించి వారివారికున్న దృఢమైన భిన్నాభిప్రాయాలతో వాళ్ళలో వాళ్ళు తగవులాడుకోవడం మొదలుపెట్టారు. సమస్య ఇలా పరిష్కారం కాదని, తమతమ వాదాలను నెగ్గించుకోవడానికి, చివరకు వాళ్ళంతా ఆ చెట్టు దగ్గరికి చేరారు. ఆ చెట్టు క్రిందనే కూర్చుని ఉన్నవాడొకడు వీళ్ళ మాటలన్నీ విని, ఇలా సమాధానం చెప్పాడు: 'నేను ఎప్పుడూ ఈ చెట్టు క్రిందనే ఉంటాను. నాకీ ప్రాణి సంగతి బాగా తెలుసు. దానికున్న రంగును గురించి మీరందరు చెప్పిందీ నిజమే. ఒకసారి అది ఎర్రగా ఉంటుంది. కొన్నిసార్లు ఆకుపచ్చగా ఉంటుంది. కొన్నిసార్లు పసుపుపచ్చగా ఉంటుంది. మరికొన్నిసార్లు నీలంగాను, వివిధ రంగులలోను ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ఏ రంగూ లేకుండా కూడా ఉంటుంది.' చెట్టు క్రింద నివసించేవాడికే ఆ జంతువు ఊసరవెల్లి అని, అది అనేక వర్ణాలు ధరిస్తుందని, ఒకొక్కప్పుడు ఏ రంగూ లేకుండా ఉంటుందని కూడా తెలుసు."

"అదే విధంగా ఎల్లప్పుడూ భగవంతుణ్ణి తలచేవాడికే ఆయన స్వభావం తెలుస్తుంది. భగవంతుడు అనేక రూపాలు ధరిస్తాడని, ఆయనకు అనేక గుణాలున్నాయని, ఏ గుణమూలేని నిర్గుణుడని కూడా అతడు తెలుసుకుంటాడు. కాని ఈ సత్యాన్ని తెలియని ఇతరులు మాత్రం తమలో తాము తగవులాడుకుంటూ, బాధపడుతూ ఉంటారు. ఈ మిడిమిడిజ్ఞానమే మతవర్గ

విభేదాలకు, అంతఃకలహాలకు దారి తీస్తున్నది." ఈ కథలన్నింటి ద్వారా గురుదేవులు ఒక మహాసత్యాన్ని బోధించారు: "మనిషికి ఆర్తి ఉన్నట్లయితే భగవంతుణ్ణి కనుక్కోగలడు. భగవంతుడు సాకారుడా, నిరాకారుడా, సగుణుడా, నిర్గుణుడా, అనే సందేహాలన్నీ కూడా తొలగిపోతాయి."

## 19. భగవంతుడు అన్ని జీవరాశులలోనూ ఉన్నాడు (మావటివాడూ నారాయణుడే)

భగవంతుడు అన్ని జీవరాశులలోనూ ఉన్నా, ఆయన తేజస్సు వేరువేరు జీవులలో వేరువేరుగా వ్యక్తమవుతుంది. దీనిని వివరిస్తూ శ్రీరామకృష్ణులు ఇలా చెప్పారు.

"ఒక కథ చెపుతా విను! ఒక అడవిలో ఒక సాధువు ఉన్నాడు. అతడికి చాలామంది శిష్యులున్నారు. ఒకరోజు ఆయన, 'భగవంతుడు అన్ని జీవరాశులలోనూ ఉన్నాడు. అందువల్ల ఆ జీవరాశులలో ఉన్న భగవంతుడికి నమస్కరించాలి' అని వారికి బోధించాడు."

"ఆ శిష్యులలో ఒకడు అగ్నిహోత్రానికి సమిధలు తేవడానికి అడవికి వెళ్ళాడు. అకస్మాత్తుగా అతడికి, 'అడ్డం తొలుగు! ప్రక్కకు తప్పుకో! మదపుటేనుగు వస్తున్నది!' అనే కేక వినపడింది. ఆ కేక విని అందరూ పారిపోతున్నారు. కాని ఆ శిష్యుడు, 'ఈ ఏనుగు కూడా భగవంతుడి యొక్క వేరొక రూపమే కదా! నేను ఇక్కడ నుండి ఎందుకు పారిపోవాలి?' అనుకున్నాడు. అతడు అక్కడే నిలబడి, తలవంచి ఆ ఏనుగుకు నమస్కరించి, దాని గుణగణాలను కీర్తించటం మొదలుపెట్టాడు. మావటివాడు, 'ఏయ్, పారిపో! పారిపో!' అని బిగ్గరగా అరిచాడు. అయినా ఈ శిష్యుడు కదలడే! ఆ ఏనుగు అతణ్ణి తొండంతో పట్టుకుని ఒక ప్రక్కకు విసిరివేసింది. అతడికి దెబ్బలు తగిలి, స్పృహతప్పి పడిపోయాడు. గురువుగారికి ఈ సంగతి తెలిసి కొందరు శిష్యులతో అక్కడికి వచ్చి అతణ్ణి ఆశ్రమానికి చేరవేశారు. చికిత్స చేసిన కొంతసేపటికి ఆ శిష్యుడికి తెలివి వచ్చింది. శిష్యులలో ఒకడు, 'ఏమయ్యా! ఏనుగు వస్తోందని తెలిసి కూడా నీవు అక్కడ నుండి ఎందుకు తొలగలేదు?' అని ప్రశ్నించాడు. దానికి అతడు, 'మన గురువుగారు భగవంతుడే మానవులుగాను, జంతువులుగాను ఎన్నో రూపాలు ధరించాడని చెప్పారు కదా! అందుకే ఏనుగు రూపంలో దేవుడు వస్తున్నాడని నేను ప్రక్కకు తొలగలేదు' అని బదులు చెప్పాడు. వెంటనే గురువుగారు అందుకొని, 'నిజమే నాయనా! 'ఏనుగు-దేవుడు' రావటం యథార్థమే. కాని 'మావటి-దేవుడు' పారిపొమ్మన్నాడు కదా! అన్ని జీవులు దేవుని రూపాలే అయినప్పుడు ఆ

మావటి–దేవుని మాటలు ఎందుకు చెవినిపెట్టలేదు? నీవు ఆ మావటి–దేవుని మాట విని ఉండాల్సింది' అన్నాడు."

"శాస్త్రాలలో నీరు నారాయణ స్వరూపమని చెప్పబడింది (ఆపో నారాయణః). కొన్ని నీళ్ళు శుభ్రంగా ఉండి, పూజకు పనికి వస్తాయి. కొన్ని నీళ్ళు స్నానానికి, మరికొన్ని నీళ్ళు అంట్లు తోమడానికి, గుడ్డలు ఉతకడానికి మాత్రమే పనికివస్తాయి. త్రాగడానికి కానీ, పూజకు కానీ పనికిరావు. అదే విధంగా భగవంతుడు పాపాత్ముల రూపంలోను, పుణ్యాత్ముల రూపంలోనూ, మంచివాడిగాను, చెడ్డవాడిగాను, ఇంకా అనేక రూపాలుగాను, ఉండటంలో సందేహం లేదు. కాని చెడ్డవారితోను, పాపాత్ములతోను, దుష్టులతోను సంబంధం పెట్టుకోకూడదు. వారితో సన్నిహితంగా ఉండకూడదు. కొందరితో 'ఓహో' అంటే 'ఓహో' అనాలి. మరికొందరితో అలా ఉండటం కూడా పనికిరాదు. అటువంటి వారికి దూరంగానే ఉండాలి."

"అంతేకాకుండా భగవంతుడు అన్ని జీవరాశుల్లోనూ ఉన్నాడు. అయినా సత్పురుషులతో సన్నిహితంగా ఉండి, దుష్టులకు దూరంగా ఉండాలి. పులిలో దేవుడున్నాడని పులిని కౌగలించుకోవు కదా! 'పులిని చూచి ఎందుకు పారిపోవాలి. దానిలో కూడా దేవుడు లేడా?' అనవచ్చు. కాని, 'పారిపో!' అని చెప్పేది కూడా భగవంతుని విభూతియే (రూపమే) కదా! వారి మాటలు ఎందుకు వినకూడదు?"

శ్రీరామకృష్ణులు యువకుడైన నరేంద్రునికి (వివేకానంద స్వామికి) కూడా, 'ప్రాపంచికులతో ఎలా మెలగాలి?' అనే విషయాన్ని వివరిస్తూ ఈ కథను చెప్పారు. (పులిలో కన్నా మనిషిలో బ్రహ్మం యొక్క తేజస్సు (అంశ) ఎక్కువగా వ్యక్తీకరింపబడుతోంది. అదే విధంగా దుర్మార్గులలో కన్నా సన్మార్గులలో బ్రహ్మతేజోంశ ఎక్కువగా ఉంటుంది. కాబట్టి మనం సన్మార్గులతో ఎక్కువగా సాంగత్యం చేసి, వారి మాటకు ఎక్కువ విలువ ఇవ్వాలి.)



# బ్రహ్మాజ్ఞానం

## 20. బ్రహ్మమును గురించి మాటలతో చెప్పలేము (తండ్రి - ఇద్దరు కొడుకులు; చీమ - పంచదార కొండ; ఉప్పుబొమ్మ)

శ్రీ గురుదేవులు ఈశ్వరచంద్ర విద్యాసాగరు ప్రతిభను గురించి విని ఆయనను కలవడానికి వారి ఇంటికి వెళ్ళారు. వారి సంభాషణలో బ్రహ్మాన్ని గురించిన ప్రస్తావన వచ్చింది. ఆ విషయాన్ని గురుదేవులు విద్యాసాగరుకు ఈ క్రింది కథల సహాయంతో వర్ణించారు.

“ఒకడికి ఇద్దరు కొడుకులున్నారు. బ్రహ్మాజ్ఞానాన్ని గురించి తెలుసుకోవడానికి ఆ కొడుకులిద్దరినీ ఒక గురువు దగ్గరకు పంపాడు. కొన్ని సంవత్సరాలైన తరువాత వాళ్ళిద్దరూ గురువుగారి ఇంటినుండి తిరిగివచ్చి తండ్రికి ప్రణమిల్లారు. తండ్రి వారికి బ్రహ్మం అంటే ఎంతవరకూ అవగతమైందో తెలుసుకోవాలనుకున్నాడు. పెద్దకొడుకును పిలిచి, ‘అబ్బాయీ! శాస్త్రాలన్నీ అధ్యయనం చేశావు గదా! బ్రహ్మము యొక్క లక్షణాలేమిటో కొంచెం చెప్పు నాయనా!’ అని అడిగాడు. ఆ పిల్లవాడు వేదాలనుండి, శాస్త్రాలనుండి ప్రమాణాలు చూపిస్తూ వివరించటం మొదలు పెట్టాడు. ఇది విని తండ్రి ఏమీ మాట్లాడలేదు. శాంతంగా విని ఊరుకున్నాడు. తరువాత రెండవ కుమారుణ్ణి పిలిచి, అతణ్ణి కూడా అదే ప్రశ్న అడిగాడు. కాని ఆ పిల్లవాడు మౌనం వహించి, ఏమీ మాట్లాడకుండా తలవంచుకొని ఉండిపోయాడు. అతడి నోట ఒక్కమాట కూడా వెలువడలేదు. నిరుత్తరమైన అతడి సమాధానానికి తండ్రి ఆనందించాడు. సంతోషంతో కొడుకును చూచి, ‘నాయనా! నీవు బ్రహ్మమును గురించి కొద్దిగా తెలుసుకున్నావు, బ్రహ్మమును మాటలతో చెప్పలేము. వాక్కునకు అది అతీతం’ అన్నాడు.”

“మరొక కథ చెపుతా విను! ఒకసారి ఒక చీమ పంచదారకొండ దగ్గరికి వెళ్ళింది. ఒక్క రేణువును తినగానే దాని కడుపు నిండిపోయింది. ఇంకో రేణువును నోట కరుచుకొని ఇంటిదారి పట్టింది. దారిలో, ‘ఈ మారు వచ్చినప్పుడు ఈ పంచదార కొండనంతా ఇంటికి చేరుస్తాను’ అనుకుంది. అల్పబుద్ధులైన వాళ్ళు ఇలాగే ఆలోచిస్తారు. ఎంత గొప్పవాడైనా బ్రహ్మాన్ని గురించి ఎంతవరకు ప్రసంగించగలడు? శుకదేవుడు మొదలైన మహర్షులు గండుచీమలవంటి వాళ్ళు.

కాని వాళ్ళు కూడా మహా తీసుకుపోతే ఎనిమిదో, పదో రేణువులను తీసుకుపోగలరేమో!"

"బ్రహ్మాన్ని గురించి చెప్పటమెలా? ఒకసారి ఒక ఉప్పుబొమ్మ సముద్రం లోతు కొలుద్దామని బయలుదేరింది. సముద్రం లోతు ఎంతవుందో అందరికీ చెప్పాలని కూడా అనుకుంది. అది సాధ్యమేనా? సముద్రంలో అడుగు పెట్టడంతోనే అది నీళ్ళలో కరిగిపోయింది. ఇక సముద్రంలోతు ఎంత ఉందో చెప్పడానికి అక్కడ ఎవరు మిగిలారు?"

ఈ కథలు చెప్పి గురుదేవులు ఇంకా ఇలా అన్నారు: "బ్రహ్మం వర్ణనకు అతీతం. వేదాలు, పురాణాలు, తంత్రాలు, షడ్దర్శనాలు అన్నీ కూడా (నోటికి తగిలిన ఆహారంలాగా) ఎంగిలి అయిపోయాయి. నాలుకచేత ఉచ్చరించబడి ఉచ్ఛిష్టమై పోయాయి. ఈ విధంగా ఎంగిలి కానిది ఒక్క బ్రహ్మమే. ఇంతవరకు బ్రహ్మం ఇటువంటిదని ఎవ్వరూ చెప్పలేకపోయారు."

అప్పుడు విద్యాసాగరు ఆశ్చర్యంతో, "ఆహా! ఇది ఒక అపూర్వమైన ప్రతిపాదన! ఒక నూతన విషయాన్ని ఈ రోజు నేను తెలుసుకున్నాను" అన్నాడు.

## 21. 'నిత్య-లీల' రెండూ ఒకటే!
## (సాలె స్త్రీ - స్నేహితురాలు)

"జ్ఞాని ఒకే విధానాన్ని అనుసరిస్తాడు. మిగిలిన విధానాలను అంగీకరించడు. 'నేతి-నేతి; ఇది కాదు-ఇది కాదు; ఈ లోకం స్వప్నం వంటిది' అని వివేచన చేస్తాడు. కాని నేను మాత్రం, 'రెండు చేతులూ పైకెత్తుతాను!' అన్ని విధానాలనూ అంగీకరిస్తాను. ఒక కథ చెపుతా విను!"

"ఒకసారి ఒక స్త్రీ తన స్నేహితురాలైన సాలెపడుచును చూడటానికి వెళ్ళింది. ఆ సాలెపడుచు అనేకరకాల నూలు వడుకుతున్నది. చాలా రోజుల తరువాత వచ్చిన స్నేహితురాలిని చూచి ఆనందపడింది. 'నిన్ను చూస్తే నాకెంతో సంతోషంగా ఉన్నదే! ఎన్నాళ్ళకు వచ్చావు. ఉండు కొంచెం ఫలహారం తెస్తాను' అని లోపలికి వెళ్ళింది. ఇంతలో ఆ స్నేహితురాలు అక్కడున్న రంగురంగుల దారపు కండెలు చూచి, ఆశపడి ఒక కండెను తీసుకొని చంకలో పెట్టుకుంది. సాలెస్త్రీ గదిలోకి వచ్చి స్నేహితురాలికి ఫలహారం పెట్టింది. అటూయిటూ చూచి, తన స్నేహితురాలు ఒక దారపుకండెను తీసుకున్నట్లు గ్రహించింది. దానిని రాబట్టుకోవడానికి ఒక ఎత్తు వేసింది. స్నేహితురాలితో, 'నిన్ను చూచి ఎంతకాలమైంది! ఇది ఎంత మంచి రోజు! నాతో కలిసి నృత్యం చెయ్యవా? మనిద్దరం కలిసి నృత్యం చేసి ఎన్నాళ్ళయిందో గదా!' అన్నది."

“ఆ స్నేహితురాలు కూడా, ‘చెలీ! నాకు కూడా సంతోషంగా ఉన్నదే!’ అన్నది. స్నేహితురాళ్ళు ఇద్దరూ లేచి చెయ్యి చెయ్యి కలిపి ఆడటం మొదలుపెట్టారు. తన స్నేహితురాలు రెండవ చెయ్యి ఎత్తకుండా ఆడటం చూచి ఆ సాలెస్త్రీ, ‘అదేమిటే, రెండో చెయ్యి ఎత్తవు? రెండు చేతులు ఎత్తి ఆడుదామే! ఈ రోజు ఎంతో ఆనందంగా ఉందిగదా!’ అన్నది. కాని ఆమె స్నేహితురాలు ఒక చెయ్యి చంకకు అదిమిపెట్టి రెండవ చేతితో మాత్రమే ఆడసాగింది. అప్పుడు ఆ సాలె స్త్రీ, ‘అదేమిటే చెలీ, ఒక చెయ్యి మాత్రమే ఎత్తి ఆడుతున్నావు? రెండు చేతులూ ఎత్తవే! నన్ను చూడు! నేనెలా రెండు చేతులూ ఎత్తి ఆడుతున్నానో!’ అన్నది. కాని ఆ స్నేహితురాలు ఇంకా ఒక చేతిని చంకకు అదుముకుంటూ నవ్వుతూ, ‘అదేమిటోనే! నాకు తెలిసింది ఇంతే!’ అన్నది.”

ఈ కథను శ్రీరామకృష్ణులు శశిధర తర్కచూడామణికి చెప్పి, 'నేను నా చేతిని ప్రక్కకు అదిమి పెట్టను. నా రెండు చేతులూ ఖాళీగానే ఉన్నాయి. రెండు చేతులూ పైకెత్తుతాను. నేను నిత్యను, లీలను, రెంటినీ అంగీకరిస్తాను" అన్నారు.

పండిత శశిధర తర్కచూడామణి గొప్ప సంస్కృత పండితుడు. ఆయన వాగ్ధాటి, శాస్త్ర వైదుష్యము, నిజాయితీ ఆనాటి వంగదేశ యువకులందరి దృష్టిని సనాతన హిందూమతం వైపు మళ్ళించాయి. అయితే ఆ పండితుడు శుష్కవేదాంత చర్చలలో నిమగ్నుడై ఉండి, ఒక్క జ్ఞానాన్ని మాత్రమే పట్టుకొని ఉండటం వల్ల గురుదేవులు అతడితో, "నీవు ముందు ఆధ్యాత్మిక సాధన చేసి, తరువాత ఇతరులకు బోధించు. భగవంతుని నుండి అధికారపత్రం పొందకపోతే నీ ఉపన్యాసాల వల్ల ప్రయోజనమేమీ ఉండదు" అని చెప్పారు.

గురుదేవులు జ్ఞానానికి, విజ్ఞానానికి గల తేడాను అనేక ఉదాహరణలతో ఆ పండితుడికి విశదీకరించి చెప్పి, 'నిత్య-లీల' (బ్రహ్మము-శక్తి; నిరాకారము-సాకారము) అనే వాటిని గురించి ఇలా వివరించారు. "పాల నుండి మజ్జిగకు వస్తుపరంగా భేదం లేదు. చెట్టుకు బెరడు ఉంటుంది. చెట్టులోనున్న 'నిత్యను' అంగీకరిస్తే' 'లీలను' కూడా అంగీకరించి తీరాలి. ఒక మార్గము 'ఇతి, ఇతి' (ఇది, ఇది) అని సూచిస్తుంది. రెండవమార్గం 'నేతి, నేతి' (ఇదికాదు, ఇదికాదు) అంటుంది. కాని ఈ రెండుమార్గాలూ ఒక్కటే. 'నిత్య' యొక్క బాహ్యప్రకటనమే 'లీల' (నిరాకారమే సాకారంగా రూపుదాల్చుతుంది). అంటే సాకారాన్ని, నిరాకారాన్ని, రెంటినీ అనుభూతి పొందిన వాడికి మాత్రమే ఈ స్థితి లభ్యమౌతుంది" అని గురుదేవులు ఆ పండితుడికి జ్ఞానబోధ చేశారు.

"ఒకే విధానాన్ని అనుసరించటమంటే 'ఒక చెయ్యి అదిమిపట్టి నృత్యం చెయ్యటం వంటిది.' కానీ నేను అలా కాదు. నేను ఆ రెంటినీ అంగీకరిస్తాను" అని ఆ పండితుడికి బోధించారు.

## 22. బ్రహ్మము వర్ణనకు అతీతము
## (నలుగురు స్నేహితులు - మహద్దర్శనం)

"జడభరతుడు, దత్తాత్రేయుడు మొదలైన బ్రహ్మవేత్తలే బ్రహ్మాన్ని వర్ణించలేకపోయారు. బ్రహ్మజ్ఞానం కలిగి, సమాధిస్థితి పొందిన వారి 'అహంకారం' పూర్తిగా నశించిపోతుంది. ఆ స్థితిలో వారు బ్రహ్మాన్ని వర్ణించలేరు" అని ఈ కథను శ్రీరామకృష్ణ కథామృత రచయిత అయిన మహేంద్రనాథ గుప్తకు గురుదేవులు చెప్పారు.

"ఒకసారి నలుగురు స్నేహితులు వాహ్యాళికి వెళ్ళి నాలుగు గోడల మధ్యవున్న ఒక ప్రదేశాన్ని చూచారు. చుట్టూవున్న ప్రహరీగోడ చాలా ఎత్తుగా ఉంది. లోపల ఏముందో తెలుసుకోవాలనే కుతూహలం వారందరికీ కలిగింది. వాళ్ళలో ఒకడు గోడ ఎక్కాడు. లోపల ఏమి చూశాడో కాని, 'ఆహా! ఆహా!' అంటూ లోనికి దూకాడు. వాడేమి చూశాడో మిగిలిన వారికి చెప్పలేకపోయాడు. మిగిలిన వాళ్ళంతా కూడా అదే విధంగా గోడ ఎక్కి, 'ఆహా! ఆహా!' అంటూ లోపలికి దూకారు. లోపల ఏముందో ఎవరు చెపుతారు?" "నల్లని సముద్రజలాలలోనికి వెళ్ళిన పడవ తిరిగిరాదు' అని ఒక సామెత ఉంది తెలుసా! అదే విధంగా బ్రహ్మమేమిటో ఎవ్వరూ చెప్పలేరు. బ్రహ్మవేత్తలు కూడా దాన్ని వర్ణించలేరు."

## 23. అనుభవం మాత్రమే బ్రహ్మము గురించి తెలియజెప్పగలదు
## (నూతన వధువు – భర్త)

పరబ్రహ్మస్వరూపాన్ని గురించి మహేంద్రనాథ గుప్త ఎప్పుడూ ఆలోచిస్తూ ఉండేవాడు. ఒకసారి గురుదేవులు అతడితో ఇలా అన్నారు. "ఆకాశంలాగానే బ్రహ్మానికి కూడా వికారాలుండవు. శక్తివల్ల బ్రహ్మం అనేకంగా గోచరిస్తుంది. బ్రహ్మం అగ్నివంటిది. అగ్నికి ఏ వర్ణం ఉండదు కదా! తెల్లని పదార్థాన్ని అందులో పడవేస్తే దాని జ్వాల తెల్లగా ఉంటుంది. ఎర్రటిదాన్నో, నల్లటిదాన్నో వేస్తే ఎర్రగాను, నల్లగాను ఉంటుంది. సత్త్వము, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు శక్తికి చెందినవే. బ్రహ్మం ఈ మూడు గుణాలకు అతీతమైనది. బ్రహ్మమనే దాన్ని మాటలతో వర్ణించలేము. అది వాక్కునకు అతీతము. వేదాంతపరంగా, 'నేతి, నేతి' అని అన్నింటినీ నిషేధిస్తే చివరకు మిగిలేది ఆనందస్వభావంగల బ్రహ్మము మాత్రమే."

"ఒక కథ చెపుతా విను! కొత్తగా పెళ్ళయిన యువకుడు అత్తవారింటికి వచ్చాడు. తనకు సమానవయస్సులో ఉన్న యువకులతో చావడిలో కూర్చుని మాట్లాడుతున్నాడు. యౌవనంలో ఉన్న అతడి భార్య, ఆమె స్నేహితురాళ్ళు వాళ్ళను కిటికీలో నుండి చూస్తున్నారు. వాళ్ళలో ఆ అమ్మాయి భర్త ఎవరో ఆమె స్నేహితురాళ్ళకు తెలియదు. అందువల్ల వాళ్ళు ఒక అబ్బాయిని చూపిస్తూ, 'అతడేనా నీ భర్త?' అని అడిగారు. చిరునవ్వు నవ్వుతూ ఆమె, 'కాదు' అని చెప్పింది. వాళ్ళు ఇంకొకణ్ణి చూపిస్తూ, 'అతడేనా?' అని అడిగారు. కాదనే మళ్ళీ ఆమె సమాధానం చెప్పింది. ఇదే విధంగా మరొకణ్ణి చూపుతూ అడిగారు. ఆ అమ్మాయి అదే సమాధానమిచ్చింది. చివరకు వాళ్ళు ఆమె భర్తనే చూపిస్తూ,

'అతడేనా?' అని అడిగారు. ఆమె 'ఔను' అనలేదు, 'కాదు' అనలేదు. ముసిముసి నవ్వులతో తలవంచుకున్నది. దానితో ఆమె స్నేహితురాళ్ళు అతడే ఆమె భర్త అని గుర్తించారు."

ఈ కథను ముగిస్తూ గురుదేవులు మహేంద్రనాథునితో, "బ్రహ్మసాక్షాత్కారమైన తరువాత మానవుడు మౌనం వహిస్తాడు! ఎందుకంటే దానిని మాటలతో వర్ణించడం సాధ్యం కాదు కదా!" అని చెప్పారు.

## 24. తత్త్వమసి
## (మేక-పులి)

" 'నేను బద్ధజీవుణ్ణి! నాకు ఎప్పటికీ భక్తి, జ్ఞానము కలుగవు!' అని కొంతమంది అంటూ ఉంటారు. కాని గురువు అనుగ్రహం పొందినవాడికి ఆ భయం లేదు. నంగ్తా (శ్రీరామకృష్ణుల గురువైన తోతాపురి) నాకో కథ చెప్పారు" అని శ్రీరామకృష్ణులు ఈ క్రింది కథను చెప్పారు.

"ఒకసారి ఒక ఆడపులి ఒక మేకల మంద మీద పడింది. అదే సమయంలో దూరం నుండి ఒక బోయవాడు బాణం వేసి దానిని చంపివేశాడు. ఆ పులి నిండు చూలాలు. బాణం దెబ్బకు అది చనిపోతూ, ఒక పిల్లను కని కన్ను మూసింది. ఈ పులికూన మేకలమందలో కలిసి పెరుగుతూ వచ్చింది. ఆ మేకలే దానికి పాలిచ్చి పెంచాయి. క్రమక్రమంగా రోజులు గడిచేకొద్దీ ఆ పులిపిల్ల మేకలతో కలిసి తిరగడం, వాటిలాగా గడ్డిమేయడం, అవి అరుస్తున్నట్లే, 'మే, మే' అని అరవడం మొదలు పెట్టింది. క్రమంగా అది పెరిగి ఒక పెద్దపులిలాగా తయారైంది. అయినా కూడా అది గడ్డితినడం, మేకలలాగా అరవడం చేస్తూనే ఉంది. ఏదైనా క్రూరమృగం వచ్చి తరిమితే ఈ 'మేక-పులి' కూడా మేకలాగా మేకలగుంపుతో కలిసి పారిపోతూ ఉండేది."

"ఇలా ఉండగా ఒకసారి మరొక భయంకరమైన పులి ఆ మేకలమంద మీద పడింది. ఆ మందలో గడ్డి తింటూ, మేకలతో పరుగెత్తిపోతున్న ఈ 'మేక-పులి'ని చూచి ఆశ్చర్యపడింది. ఇతర మేకలను వదలి ఆ పులి ఈ గడ్డితినే 'మేక-పులి'ని వెంటాడి పట్టుకుంది. అది భయంతో వణుకుతూ మేకలాగా అరుస్తూ, తప్పించుకోవడానికి ప్రయత్నించింది. కాని ఈ భయంకరమైన పులి దానిని నీటి దగ్గరకు ఈడ్చుకుపోయి, 'నువ్వు నాలాగా పెద్దపులివై ఉండికూడా మేకలతో తిరుగుతూ గడ్డి తింటున్నావెందుకు? నీళ్ళలో నీ ముఖం చూసుకో! నాకున్నట్లుగానే గుండ్రమైన ముఖం నీకు కూడా ఉంది' అని దాని నోటిలో ఒక మాంసం ముక్కను కుక్కింది. గడ్డి తినడానికి అలవాటుపడిన ఆ 'మేక-పులి' మొదట మాంసం తినడానికి ఇష్టపడలేదు. కాని మాంసం నాలుకకు తగిలేసరికి,

రుచిమరిగి తినడం ప్రారంభించింది. చివరకు ఆ భయంకరమైన పులి దానితో, 'ఎంత సిగ్గుచేటు! ఈ మేకలతో కలిసి తిరుగుతూ గడ్డి తింటున్నావు. చూడు! నాకు, నీకు తేడా ఏమైనా ఉన్నదా? ఏమీ లేదు. నాతో కలసి అడవిలోకి రా!' అన్నది. ఈ మాటలు విని ఆ 'మేక–పులి' తన ప్రవర్తనకు సిగ్గుపడి, తన నిజస్వరూపాన్ని తెలుసుకొని, ఆ పులితోపాటు అడవిలోకి వెళ్ళిపోయింది."

ఈ కథను గురుదేవులు 'శ్రీరామకృష్ణ కథామృత' రచయిత అయిన మహేంద్రనాథ గుప్తకు చెప్పి, 'గురువు అనుగ్రహం పొందినవాడికి భయం లేదు. అసలు నీవెవరివో, నీ నిజతత్త్వమేమిటో, గురువు నీకు తెలియజేస్తాడు. ఈ కథలో గడ్డి తినడమంటే, 'కామినీ–కాంచన' సుఖాలలో మునిగితేలడం. 'మే, మే' అని అరుస్తూ పారిపోవడమంటే, సామాన్య మానవునిలాగా సంసారంలో మెలగడం. 'కొత్త పులిని అనుసరించిపోవడ'మంటే మన ఆధ్యాత్మిక చైతన్యాన్ని మేల్కొల్పిన గురువు శరణుపొంది, ఆయనయే మన ఆప్తబంధువని గుర్తించడం. నీటిలో తన ముఖం యొక్క ప్రతిబింబాన్ని సరిగ్గా చూసుకోవడమంటే 'తన ఆత్మతత్త్వాన్ని'



అనుభూతి పొందడం అని వివరించారు. 'తత్త్వమసి' ('అదే నీవు!' అంటే నీవు ఈ అశాశ్వతమైన శరీరానివి కావు. ఆ పరమాత్మవే!) అనే మహావాక్య వివరణే ఈ కథలోని అంతరార్థం" అని వివరించారు.

## 25. బ్రహ్మసాక్షాత్కారం అయిన తరువాత కర్మలు, సాధనలతో పని లేదు (బ్రాహ్మణుల సమారాధన; అత్తగారు – గర్భిణి అయిన కోడలు)

"భజన జరుగుతున్నప్పుడు భావావేశంతో కొంతమంది పూర్తిగా 'హరేరామ' అని పలుకలేక 'హరే, హరే' అంటూ ఉంటారు. భావావేశం అధికమయ్యేకొద్దీ 'హ, హ' అని మాత్రం అంటూ ఉంటారు. ఆ తర్వాత ఆ మాత్రం కూడా పలుకలేరు. భక్తి ఆవేశంతో నిలబడిపోయి ఉంటారు."

"అదే విధంగా బ్రాహ్మణుల సమారాధనలో విస్తళ్ళు వేసే సమయానికి అందరూ మాట్లాడుతూ ఉంటే ఎంత గలభాగా ఉంటుందో మీకు తెలుసు! వరుసల్లో కూర్చున్న తర్వాత ప్రక్కవారితో మాట్లాడడం మొదలుపెడతారు. దానితో శబ్దం కొంతవరకూ తగ్గిపోతుంది. వడ్డనలు మొదలై, ఆపోశన పట్టిన తర్వాత చాలావరకూ శబ్దం తగ్గిపోతుంది. అందరూ భోజనం చేస్తూ ఉంటారు. ఆపైన పెరుగన్నం జుర్రుతున్న శబ్దం మాత్రమే వినపడుతుంది! భోజనం పూర్తి అయిన తర్వాత అందరూ నిద్రపోతారు. అప్పుడు పూర్తిగా నిశ్శబ్దం నెలకొంటుంది."

"కోడలు గర్భిణి అయినప్పుడు ఆమె చెయ్యాల్సిన పనుల్ని అత్తగారు క్రమక్రమంగా తగ్గించి వేస్తుంది. బిడ్డ పుట్టిన తర్వాత ఆమెకు వేరే పని ఏమీ ఉండదు. ఆ బిడ్డను సంరక్షించడమే ఆమె పని!"

"కర్మలు చేయడం కోలాహలంగా ఉంటుంది. అయితే మనం భగవంతుడి సమీపానికి వెళ్ళేకొద్దీ కోలాహలం తగ్గుతూ తగ్గుతూ, చివరికి పూర్తిగా తగ్గిపోతుంది. అంటే చెయ్యవలసిన కర్మలు తగ్గిపోతాయి."

## 26. బ్రహ్మసాక్షాత్కారం – నేతి, నేతి (ఏడు ద్వారాల వెనుకవున్న మహారాజు)

పండిత శ్యామపాద సాధుస్వభావం కలవాడు. పూజా సమయంలో ఆయనకు అపూర్వమైన, ఆశ్చర్యకరమైన దృశ్యాలు కనిపించేవి. ఒక సాయంకాలం ఆయన దక్షిణేశ్వరం వచ్చి గంగానదిలో సంధ్య వార్చి గురుదేవులవద్దకు వచ్చి కూర్చున్నాడు. ఆయనను ఉద్దేశిస్తూ శ్రీరామకృష్ణులు, "నేతి, నేతి' (ఇది కాదు, ఇది కాదు) అనే భావనను అభ్యాసం చేయడంవలన మనస్సు ఎక్కడ ప్రశాంతతను పొందుతుందో అక్కడ బ్రహ్మము ఉంటుంది" అని వివరిస్తూ, ఈ క్రింది కథను చెప్పారు.

"ఒక కథ చెపుతా విను! ఒకసారి ఒకడు రాజుగారిని దర్శించాలనుకున్నాడు. తన స్నేహితుణ్ణి వెంటతీసుకొని రాజప్రాసాదం దగ్గరికి వెళ్ళాడు. దానికి ఏడు ద్వారాలున్నాయి. ఆ ఏడుద్వారాల వెనుకవున్న సౌధంలో రాజుగారుంటారు. ఆ సందర్శకుడు మొదటిద్వారం చేరేసరికి అక్కడ ఒక దర్పంగల వ్యక్తి, అతడి చుట్టూ పరివారము, అన్నివైపుల వైభవం, శోభ కనిపించాయి. 'ఇతడేనా రాజుగారు?' అని అతడు స్నేహితుణ్ణి అడిగాడు. ఆ స్నేహితుడు చిరునవ్వుతో కాదని చెప్పాడు. రెండవ ద్వారం దగ్గర కూడా ఇంకా ఎక్కువ వైభవం, శోభ కనిపించాయి. వాడు అక్కడ కూడా అలాగే అడిగాడు. స్నేహితుడి నుండి మళ్ళీ అదే జవాబు పొందాడు. ఇలా ఒక్కొక్క ద్వారం దాటేకొద్దీ అంతకంతకూ వైభవం, శోభ ఎక్కువ కావడం చూశాడు. చివరకు ఏడవ ద్వారం దగ్గరకు చేరేసరికి, 'వీరేనా, రాజుగారు?' అని అడగాల్సిన అవసరమే కలుగలేదు. దిగ్భ్రాంతి కొలిపే ఆ అనంతమైన శోభను చూచి నిశ్చేష్టితుడై, గుడ్లప్పగించి చూస్తూ నిలబడ్డాడు. తాను రాజుగారి ఎదుట ఉన్నానని గ్రహించాడు." ఈ కథ విని ఆ పండితుడు, "మాయను దాటిన తరువాత భగవంతుడు దర్శనమిస్తాడు" అని అన్నాడు.

అప్పుడు గురుదేవులు, "భగవత్సాక్షాత్కారమైన తరువాత, ఆయనే మాయ, ఆయనే విశ్వం, ఆయనే అన్ని జీవరాసులు, అని సాధకుడు తెలుసుకుంటాడు. 'నేతి, నేతి' అని వివేచన చెయ్యడంవల్ల ఈ జగత్తు భ్రాంతిజన్యమైన ఒక కలలాగా తోస్తుంది. కాని దైవసాక్షాత్కారమైన తరువాత ఈ జగత్తే ఒక ఆనందసౌధంగా మారిపోతుంది. గ్రంథపాండిత్యం వల్ల నీవు సాధించగలిగేదేమిటి? పండితులు వాదోపవాదాలలోనే మునిగిపోతారు గాని నిజాన్ని తెలుసుకోరు" అని ప్రబోధించారు.

## 27. జ్ఞానదృష్టి
## (కృష్ణుడు - అర్జునుడు; రాజు - ఇంద్రజాలికుడు; దొంగలు - దిష్టిబొమ్మ)

డాక్టరు మహేంద్రలాలు సర్కారు శ్రీరామకృష్ణులకు చికిత్స చేస్తున్నాడు. ఆయనకు దేవుని అవతారాలంటే నమ్మకం లేదు. ఆ విషయాన్ని గురించి గిరీశచంద్ర ఘోషుకు, డాక్టరు సర్కారుకు కొంత చర్చ జరిగింది. జ్ఞానాన్ని గురించి గురుదేవులు డాక్టరుకు కొన్ని విషయాలు చెప్పారు. అప్పుడు డాక్టరు, "సంశయాలన్నీ తొలగిపోవడమనేది అసలు సాధ్యమా?" అని ప్రశ్నించాడు. దానిపై గురుదేవులు ఇలా చెప్పారు.

"నీకు వాదనలు, తర్కం అంటే ఇష్టం. కొంచెం తర్కిస్తాను విను! జ్ఞాని అయినవాడి దృష్టిలో అవతారమనేది లేదు. ఒకసారి కృష్ణుడు అర్జునుడితో, 'అర్జునా! నన్ను నీవు అవతార పురుషుడని అంటున్నావు. నీకో విషయం చూపిస్తాను. నాతో రా!' అన్నాడు. అర్జునుడు కృష్ణుణ్ణి అనుసరించాడు. అతణ్ణి ఒక చెట్టు దగ్గరకు తీసుకొని వెళ్ళి, 'ఇదేమిటి?' అన్నాడు. 'నేరేడు చెట్టు' అని అర్జునుడు సమాధానమిచ్చాడు. 'ఆ చెట్టుమీద నీకేం కనిపిస్తున్నాయి?' అని కృష్ణుడు మళ్ళీ ప్రశ్నించాడు. 'నేరేడుపళ్ళ గుత్తులు' అని అర్జునుడు చెప్పాడు. 'అవి నేరేడుపళ్ళ గుత్తులు కావు. దగ్గరికి వెళ్ళి చూడు!' అని కృష్ణుడు అనగానే అర్జునుడు దగ్గరగా వెళ్ళి చూచేసరికి, చాలామంది కృష్ణులు గుత్తులు, గుత్తులుగా ఆ చెట్టుకు వ్రేలాడుతున్నారు. 'అర్జునా! చూచావా! నాలాంటి కృష్ణులు అక్కడ ఎంతమంది ఉన్నారో!' అన్నాడు కృష్ణుడు."

ఈ విధంగా చెప్పి గురుదేవులు, "నీవు భగవంతుణ్ణి సమీపించే కొద్దీ ఆయన ఉపాధులు, ఆరోపితమైన గుణాలు తగ్గిపోతున్నట్లు తెలుసుకుంటావు. భక్తుడు మొదట దేవికి పది చేతులున్నట్లు, తరువాత ఎనిమిది చేతులున్నట్లు, ఇంకా దగ్గరకు సమీపిస్తే ఆరు చేతులున్నట్లుగాను చూస్తాడు. ఇంకా దగ్గరకు వెడితే రెండు భుజాలున్న గోపాలునిగా చూస్తాడు. చివరకు దివ్యత్వ సాన్నిధ్యంలో నిర్గుణమైన చైతన్యజ్యోతిగా భగవంతుణ్ణి దర్శిస్తాడు" అన్నారు.

"మరికొంత వేదాంత వివరణ ఇస్తాను విను! ఒక ఇంద్రజాలికుడు రాజుగారి ఆస్థానంలో ఇంద్రజాలం ప్రదర్శించడానికి వచ్చాడు. అతడు రాజుగారి ఎదుట నిలబడి నెమ్మదిగా ప్రక్కకు జరిగాడు. వెంటనే అక్కడ ఒక పంచకళ్యాణి గుర్రం, దానిపైన ధగధగ మెరుస్తున్న దుస్తులు ధరించిన ఒక రౌతు కనిపించారు. అతడి చేతులలో డాలు, ఇంకా అనేక ఆయుధాలు ఉన్నాయి. రాజు, అతడి ఆస్థానంలో ఆసీనులైన సభాసదులు ఆశ్చర్యంతో చూస్తున్నారు. 'ఇందులో ఏది సత్యం?' అని వాళ్ళు తర్కించడం మొదలు పెట్టారు. గుర్రం కాదు, దుస్తులు కాదు, ఆయుధాలు కాదు. అన్నింటికి కారణమైన ఆ గుర్రపురౌతే (ఇంద్రజాలికుడే) అసలు సత్యమని నిర్ధారించారు."

"కాబట్టి డాక్టరుగారూ! దీని భావమేమిటంటే, 'బ్రహ్మ మొక్కటే సత్యం! మిగిలిన జగజ్జాలమంతా అనిత్యం. విశ్లేషించి, విమర్శించి చూస్తే మిగిలేది ఏదీలేదని గ్రహిస్తాం. కానీ ఈ భ్రాంతి తొలగడం అంత సులభం కాదు. జ్ఞానం కలిగిన తరువాత కూడా ఈ భ్రాంతిలో మానవుడు కొట్టుమిట్టాడుతూనే ఉంటాడు."

"ఇంకొక కథ చెపుతా విను! ఒక రాత్రి కొందరు దొంగలు, ఒక చేనులోకి దొంగతనం చెయ్యడానికి ప్రవేశించారు. చీకటిలో వారికి దూరంలో ఒక మనిషి నిలబడి చూస్తున్నట్లుగా కనపడింది. అది గడ్డిబొమ్మ మాత్రమే. అయితే దానిని చూచి భయపడి ఎవ్వరూ లోపలికి ప్రవేశించడానికి సాహసించలేకపోయారు. వారిలో ఒకడు ధైర్యం చేసి దగ్గరకు వెళ్ళి అది గడ్డిబొమ్మ అని తెలుసుకున్నాడు. వాడు తిరిగివచ్చి, 'భయం లేదు. రండిరా! అది గడ్డిబొమ్మ మాత్రమే!' అని చెప్పాడు. అయితే వాడు ఎంత చెప్పినా వాళ్ళు లోపలికి వెళ్ళడానికి ఇష్టపడలేదు. తమకు గుండెదడగా ఉన్నదని చెప్పారు. అప్పుడు సాహసవంతుడైన ఆ దొంగ లోపలికి వెళ్ళి, ఆ గడ్డిబొమ్మను లాగి క్రిందపడవేస్తూ, 'ఇందులో ఏమీ లేదు, చూడండి!' అని ఋజువు చేశాడు. 'నేతి, నేతి' అనే జ్ఞానమార్గం ఇలా ఉంటుంది" అని గురుదేవులు బోధించేసరికి డాక్టరు సర్కారు, 'ఆహా! ఇవి ఎంత చక్కని మాటలు!' అని ప్రశంసించాడు.

(నేతి-నేతి అంటే 'ఇది కాదు, ఇది కాదు' అని అర్థం. అంటే 'ఇది సత్యం కాదు, ఇది సత్యం కాదు. ఇది నిత్యమైన బ్రహ్మ పదార్థం కాదు' అని ఒక్కొక్కదాన్నే అనిత్యమని, అశాశ్వతమని గ్రహిస్తూ, దానిని వదలి ముందుకుపోతూ, ఆధ్యాత్మిక పురోగతి సాధిస్తూ, చివరికి భగవత్సాక్షాత్కారాన్ని పొందుతాడు.

## 28. బ్రహ్మము, ఆద్యాశక్తి రెండూ ఒకటే!
## (రాజు - యోగి - మాంత్రికుడు)

ఒకసారి ఒక యోగి ఒక రాజు దగ్గరకు వచ్చాడు. తనకు జ్ఞానాన్ని ఒక్క మాటలో బోధించమని రాజు ఆ యోగిని అడిగాడు. ఆ యోగి, "సరే! మీకు ఒక్కమాటలోనే జ్ఞానం కలుగుతుంది" అని చెప్పి వెళ్ళిపోయాడు. కొంతసేపైన తరువాత ఒక మాంత్రికుడు రాజు దగ్గరికి వచ్చాడు. ఆ మాంత్రికుడు తన చేతివ్రేళ్ళలో రెంటిని వేగంగా కదుపుతూ, "చూడు, రాజా! చూడు!" అంటున్నాడు. క్షణంలో ఆ రెండు వ్రేళ్ళూ కలిసిపోయి ఒకటిగా కనిపించాయి. రాజు ఆశ్చర్యపోయాడు. యోగి చెప్పినట్టు 'ఒక్కమాటలో జ్ఞానం (ఏకమేవాద్వితీయం బ్రహ్మ)' అంటే ఇదేనని ఆ రాజుకు అవగతమయింది.

ఈ కథకు అర్థం ఏమిటంటే మొదట బ్రహ్మము, ఆద్యాశక్తి వేరువేరుగా (రెండుగా) కనిపిస్తాయి. అయితే బ్రహ్మజ్ఞానాన్ని పొందిన తరువాత అవి రెండుగా కనిపించవు. వాటిలో భేదం అనేదే లేదు. ఉన్నది ఒక్కటే! రెండవది లేదు. అదే అద్వైతం!

## 29. నామరూపాలకు ఆవల ఉన్నదే ఆత్మ

## (గురువు – శిష్యుడు – శ్యామ)

ఒక సాధువు తన శిష్యుడికి ఆత్మజ్ఞానాన్ని బోధించాలని అనుకున్నాడు. ఒక అందమైన వనంలో అతన్ని ఉండమని తాను వెళ్ళిపోయాడు. కొన్ని రోజుల తరువాత తిరిగి వచ్చి శిష్యుణ్ణి, "నాయనా! నీకు ఏమైనా కోరికలు ఉన్నాయా?" అని అడిగాడు. శిష్యుడు ఔనని చెప్పాడు. అప్పుడు ఆ సాధువు 'శ్యామ' అనే పేరున్న అందమైన యువతిని అతనితో ఉండమని, "మాంసం, చేపలు నీ ఇష్టం వచ్చినంత తిను!" అని శిష్యుడితో చెప్పి, వెళ్ళిపోయాడు. చాలాకాలం తరువాత గురువు మళ్ళీ తిరిగి వచ్చి ఇంతకు ముందు అడిగిన ప్రశ్న మళ్ళీ అడిగాడు. ఈసారి శిష్యుడు, "నాకేమీ కోరికలు లేవండీ!" అని చెప్పాడు. అప్పుడు ఆ సాధువు శిష్యుణ్ణి, శ్యామను పిలిచి, తనతో కూర్చోబెట్టుకుని, శ్యామ చేతులను శిష్యుడికి చూపించి, "ఇవి ఏమిటి?" అని అడిగాడు. శిష్యుడు, "ఇవి శ్యామ చేతులు" అని సమాధానం చెప్పాడు. సాధువు శ్యామ కళ్ళను, ముక్కును మిగిలిన శరీరభాగాలను చూపిస్తూ అదే ప్రశ్న మళ్ళీమళ్ళీ అడగసాగాడు. శిష్యుడు వాటికి అదే విధంగా అవి శ్యామకు చెందినవని సమాధానాలు చెపుతున్నాడు. అప్పుడు శిష్యుడికి ఒక ఆలోచన కలిగింది. "నేను ప్రతిదానికీ, 'ఇది శ్యామ ముక్కు', 'ఇవి శ్యామ కళ్ళు' అంటూ సమాధానం చెపుతున్నాను కదా! అయితే ఈ ముక్కు, కళ్ళు కలిగివున్న ఆ శ్యామ అసలు ఎవరు?" అనుకుని, అదే ప్రశ్న తన గురువును అడిగాడు. అప్పుడు ఆ సాధువు, "ఈ శ్యామ ఎవరో నువ్వు తెలుసుకోవాలి అనుకుంటే నాతో రా! చెపుతాను" అని శిష్యుడికి ఆత్మజ్ఞానాన్ని బోధించాడు.

మనం ఈ ప్రపంచంలో జీవిస్తూ దీనిలో మన పేరుప్రఖ్యాతులూ, ఆస్తిపాస్తులూ, బంధుమిత్రులే నిజమని అనుకుంటూ, 'నేను-నాది' అనే ఆలోచనతో జీవిస్తూ ఉంటాము. కానీ ఎప్పుడైతే వీటన్నింటికీ వెనుక ఆధారభూతంగా ఇంకేదో ఉందని తెలుసుకున్నప్పుడు ఇవన్నీ అశాశ్వతమని తెలుస్తుంది. ఈ నామరూపాల వెనుక ఆధారభూతంగా ఉన్నదే ఆత్మ అని అర్థమవుతుంది.

## 30. అద్వైతానుభవం

## (బ్రహ్మ జ్ఞాని – పాము కాటు)

ఒకసారి దక్షిణేశ్వరానికి సాధువులైన తండ్రీ కొడుకులు వచ్చారు. కొడుకు బ్రహ్మజ్ఞాని. తండ్రికి ఇంకా బ్రహ్మజ్ఞానం కలుగలేదు. ఇద్దరూ శ్రీరామకృష్ణుల గదిలో కూర్చొని ఆయనతో మాట్లాడుతున్నారు. ఇంతలో ప్రక్కనున్న ఒక ఎలుక కన్నంలో నుంచి ఒక పాముపిల్ల బయటకు వచ్చి కొడుకును కాటువేసింది. అది

చూసి తండ్రి విపరీతంగా భయపడిపోయాడు. చుట్టుప్రక్కల ఉన్న వారినందరినీ కేకలు వేస్తూ పిలిచాడు. కానీ కొడుకు మాత్రం నిశ్చలంగా కూర్చొని ఉన్నాడు. అది చూసి తండ్రి మరింత కంగారుపడ్డాడు. ఎందుకిలా నిశ్చలంగా కూర్చున్నావని అడిగితే కొడుకు నవ్వి, "ఏది పాము? కాటు వేసింది ఎవరిని?" అన్నాడు. అతడు అద్వైతసిద్ధిని పొందాడు. పాముకీ, మనుష్యులకీ మధ్య అతనికి వ్యత్యాసం కనిపించలేదు. అటువంటప్పుడు ఇక బాధ ఏముంటుంది?

## 31. బ్రహ్మజ్ఞాని ఎలా జీవిస్తాడు?
## (సన్న్యాసిని - జనక మహారాజు)

ఈ ప్రపంచం భయంకరమైనది. బ్రహ్మజ్ఞానాన్ని సంపాదించినా దీనిలో జాగ్రత్తగా మెలగవలసిందే. విరాగి అయిన గృహస్థు కూడా మెలకువతో జీవించాలి. బ్రహ్మజ్ఞాని లోకానికి ఆదర్శంగా ఉండడం కోసం సామాన్య మానవులకు ఉద్దేశించిన నియమాలను తానుగా పాటించి చూపించాలి.

బ్రహ్మజ్ఞానాన్ని పొందిన తర్వాత జనకుడు రాజ్యపాలనను కొనసాగించాడు. ఒకసారి జనకమహారాజు దర్బారుకు ఒక సన్న్యాసిని వచ్చింది. జనకుడు ఆమె ముఖం చూడకుండా పాదాలకు నమస్కరించాడు. అది చూసి ఆ సన్న్యాసిని, "ఎంత వింతగా ఉంది! ఓ జనకమహారాజా! నీకు ఇంకా జ్ఞానం కలిగినట్టు లేదు. నీకు స్త్రీలంటే ఇంకా ఇంత భయం ఉందా!" అంది. కానీ జనక మహారాజు అందరికీ ఆదర్శంగా ఉండడం కోసమే అలా ప్రవర్తించాడు.

ఈ ప్రపంచం బాగా మసిబారిన వంటగదిలాంటిది. దీనిలో ఎంత జాగ్రత్తగా మసలుకున్నా బట్టలకు ఏదోవొక చోట మసి అంటక మానదు. అందుచేతనే మహర్షులు తాము బ్రహ్మజ్ఞానాన్ని పొందిన తర్వాత కూడా ఒక ఆదర్శవంతమైన జీవితం ఎలా ఉండాలో తాముగా జీవించి చూపుతారు.

**కర్మణైవ హి సంసిద్ధిం ఆస్థితా జనకాదయః ।**
**లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి ॥ (భగవద్గీత 3.20)**

జనక మహారాజు వంటి బ్రహ్మజ్ఞానులు కర్మాచరణ ద్వారానే పరిపూర్ణతను సాధించారు. అయితే ఆ తర్వాత కూడా అటువంటి మహాత్ములు లోకానికి ఆదర్శంగా ఉండడం కోసం సామాన్య మానవుడు పాటించవలసిన ధర్మాన్ని తాముగా ఆచరించి చూపుతారు.

## 32. సమదర్శిత్వం
## (శంకరాచార్యులు - కసాయివాడు)

ఆది శంకరాచార్యులు నిస్సందేహంగా ఒక బ్రహ్మజ్ఞాని. కానీ సాధన ప్రారంభదశలో ఆయనకు కూడా భిన్నత్వం కనిపించేది. అప్పుడు ఆయనకు ప్రపంచంలో ఉన్న ప్రతీదీ బ్రహ్మమే అన్న దృఢవిశ్వాసం ఉండేది కాదు. ఒకరోజు ఆయన గంగానదిలో స్నానం చేసి బయటకు వస్తున్నారు. ఒక కసాయివాడు నెత్తిన మాంసం తట్టతో ఎదురుగా వచ్చాడు. అనుకోకుండా ఆ కసాయివాడు శంకరాచార్యుల శరీరాన్ని తాకాడు. శంకరాచార్యులు కోపంగా, 'ఓరీ! నన్ను తాకడానికి నీకెంత ధైర్యం?' అన్నారు. ఆ కసాయివాడు, 'అయ్యా! నేను మిమ్మల్ని తాకలేదు; పరిశుద్ధమైన ఆత్మ అనేది ఈ శరీరం కానీ, పంచభూతాలు కానీ, ఇరవైనాలుగు తత్త్వాలుగానీ కాజాలదు కదా!' అని సమాధానమిచ్చాడు. దీనితో శంకరాచార్యులకు కనువిప్పు కలిగింది."

పై కథను శ్రీరామకృష్ణులు ఆధార్, మహేంద్రనాథ్ గుప్త మొదలైన భక్తులతో బ్రహ్మజ్ఞానాన్ని వివరిస్తూ చెప్పారు.

## 33. భేదబుద్ధి తొలగిపోతే!
## (శుకుడు - జనకుడు)

బ్రహ్మజ్ఞానాన్ని పొందాలని శుకుడు జనకమహారాజు దగ్గరికి వెళ్ళాడు. జనకుడు ఈ విధంగా అన్నాడు: "నువ్వు గురుదక్షిణ ముందుగానే చెల్లించాలి. నీకు బ్రహ్మజ్ఞానం కలిగాక గురుదక్షిణ చెల్లించలేవు. ఎందుకంటే బ్రహ్మజ్ఞానికి గురువు, శిష్యుడు అనే భేదం కనిపించదు కదా!"

## 34. నేను!
## (ఆది శంకరులు - శిష్యుడు)

ఆది శంకరాచార్యులకు ఒక శిష్యుడు ఉండేవాడు. అతడు చాలా రోజులు ఆయనకు సేవచేసినా ఎప్పుడూ ఆయన దగ్గర ఎటువంటి ఉపదేశం పొందలేదు. ఒకరోజు తన వెనుకనే వస్తున్న అతడి అడుగుల చప్పుడు విని ఆదిశంకరులు, "ఎవరది?" అన్నారు. శిష్యుడు, "నేను!" అని సమాధానమిచ్చాడు. అప్పుడు ఆయన శిష్యుడితో, "ఆ 'నేను' అన్నది నీకు అంత ఇష్టం అయితే దాన్ని అనంతంగా పెంచివెయ్యి! లేకపోతే దానిని పూర్తిగా వదలిపెట్టు!" అని చెప్పారు.



# భక్తి విశ్వాసములు

## 35. భగవన్నామస్మరణతో భవసాగరాన్ని దాటవచ్చు
## (భక్తురాలైన గొల్లపడుచు - బ్రాహ్మణుడు)

ఒక గొల్లపడుచు ఏటికి అవతలి ఒడ్డున ఉన్న బ్రాహ్మణుడికి వాడుకగా పాలు అమ్ముతూ ఉండేది. నావ రాకపోకలు సరిగా లేకపోవడంవల్ల ఆమె ప్రతిరోజూ సకాలంలో పాలు అందించలేకపోయేది. ఒకరోజు ఆ బ్రాహ్మణుడు చీవాట్లు పెట్టేసరికి, పాపం, ఆ దీనురాలు, "బాబూ! నేనేం చెయ్యను? ఇంటి దగ్గర నుండి ఉదయమే బయలుదేరుతాను. కాని ఏటి ఒడ్డున పడవవాడి కోసం ఒకసారి, ఏరు దాటేవాళ్ళందరూ వచ్చి చేరడానికి ఒకసారి, ఇలా వేచి ఉండవలసి వస్తోంది" అని చెప్పింది.

అప్పుడు ఆ బ్రాహ్మణుడు, "వెర్రిదానా! భగవన్నామ స్మరణచేసి సంసారసాగరాన్నే దాటవచ్చు గదా, నీవు ఈ చిన్న ఏటిని దాటి రాలేవా?" అన్నాడు.

అమాయకురాలైన ఆ గొల్లపడుచు ఏరు దాటడానికి ఇంత సులభమైన ఉపాయం ఉందని విని చాలా ఆనందించింది. ఆ మరునాటి నుంచి క్రమం తప్పకుండా తెల్లవారుతూనే బ్రాహ్మణుడికి పాలు అందించడం మొదలు పెట్టింది. ఒకరోజు ఆయన, "నువ్వు ఈ మధ్య చాలా పొద్దున్నే వస్తున్నావు. ఎలా రాగలుగుతున్నావు?" అని అడిగాడు. ఆమె, "బాబూ! మీరు చెప్పినట్లుగా దేవుని పేరు తలచుకుంటూ ఏరు దాటి వస్తున్నాను. నాకు నావతో అవసరం తీరిపోయింది!" అని సమాధానమిచ్చింది. బ్రాహ్మణుడు ఆ మాటలు నమ్మలేక, "నువ్వు ఏరు ఎలా దాటుతున్నావో నాకు చూపిస్తావా?" అని అడిగాడు. ఆమె, "ఓ! చూపిస్తా, నాతో రండి!" అని బ్రాహ్మణుణ్ణి తనతో ఏటికి తీసుకొనిపోయి భగవన్నామాన్ని స్మరిస్తూ, నేలమీద నడచినంత తేలికగా నీటిమీద నడచి పోసాగింది. కొంతసేపటికి వెనక్కు తిరిగి చూచింది. ఆ బ్రాహ్మణుడు కూడా నీటిమీద నడుద్దామని ప్రయత్నిస్తూ, ఒక ప్రక్క దేవుని పేరు స్మరిస్తూనే మరొక ప్రక్క తడిసిపోతుందేమోనన్న అనుమానంతో తన పంచెను పైకెత్తి పట్టుకుంటున్నాడు. ఆ బ్రాహ్మణుడి దురవస్థను గమనించి, ఆ గొల్లపడుచు, "అదేమిటి బాబూ! నోటితో దేవుని పేరు పలుకుతున్నారు, చేతితో బట్ట పైకెత్తి పట్టుకుంటున్నారు? మీరు పూర్తిగా దేవుణ్ణి నమ్మినట్లు కనపడడం లేదే?" అన్నది.

సంపూర్ణమైన ఆత్మార్పణ, భగవంతుని యందు స్థిరమైన నమ్మకం - ఇవే అద్భుతమైన కార్యాలన్నింటికీ మూలం.

## 36. భగవద్విశ్వాసము
## (పిల్లవాడు - దేవుడికి ఉత్తరం)

ఈశాన చక్రవర్తి కర్మిష్ఠి. ఎకౌంటెంటు జనరల్ ఆఫీసులో సూపరింటెండెంటు ఉద్యోగం చేశాడు. అతడి కుమారులు కూడా ప్రభుత్వంలో పెద్దహోదాగల ఉద్యోగాలు చేశారు. వాళ్ళలో ఒకడు నరేంద్రుని సహాధ్యాయి కూడా. ఈశానుడు ఆర్తులకు, బీదసాదలకు ఎల్లప్పుడూ డబ్బు ఇచ్చి సహాయపడేవాడు. ఉద్యోగ విరమణ తరువాత ఆధ్యాత్మిక సాధనలతోను, దానధర్మాలతోను కాలం గడిపాడు. ఆయన తరచుగా గురుదేవులను దర్శించేవాడు. ఒకసారి గురుదేవులు అతణ్ణి, "ఈశానూ! పిల్లవాడు దేవుడికి ఉత్తరం వ్రాశాడే! ఆ కథ చెప్పు!" అని అడిగారు. ఈశానుడు నవ్వుతూ ఇలా చెప్పాడు: "ఒక చిన్నపిల్లవాడు ఉండేవాడు. ఎవరో, 'దేవుడు మనల్ని సృష్టించాడు' అని చెపుతుంటే వాడు విన్నాడు. ఒకరోజు తన ప్రార్థనలన్నీ ఒక కాగితం మీద వ్రాశాడు. కవరులో పెట్టి పోస్టుడబ్బాలో వేశాడు. దాని మీద వ్రాసిన చిరునామా ఏమంటే 'స్వర్గం' అని."

అప్పుడు గురుదేవులు అక్కడచేరిన భక్తులతో, "ఈ కథ విన్నారు గదా! ఆ పిల్లవాడికి ఉన్నటువంటి శ్రద్ధాభక్తులున్నవాడు ఆధ్యాత్మిక సాధనలో పురోగతి సాధిస్తాడు" అని భగవంతునిపై ఉండవలసిన భక్తిశ్రద్ధలను గురించి ఉద్ఘాటించారు.

## 37. విశ్వాసం, పరితాపం కావాలి (జటిలుడు; అర్చకుని కొడుకు – నైవేద్యము)

ఒకసారి చౌటన్ సంస్థ ఉపాధ్యాయుడు కొంతమంది విద్యార్థులను వెంటపెట్టుకొని గురుదేవులను దర్శించడానికి వచ్చాడు. సంభాషణ విగ్రహారాధన వైపు మళ్ళింది. అప్పుడు గురుదేవులు ఆ ఉపాధ్యాయుడితో ఇలా చెప్పారు: "విగ్రహారాధనలో తప్పేమీ లేదు. సత్యంగాని (సత్), తెలివిగాని (చిత్), ప్రేమగాని (ఆనందం) ఎక్కడ వుంటాయో అక్కడ బ్రహ్మం ఉంటుంది. ఈ జగత్తులో బ్రహ్మం కానిది వేరేదీ లేదు. పసిబిడ్డ తన తల్లి కొరకు ఎలా తహతహలాడుతుందో అలా పరితాపపడితే భగవంతుడు కనిపిస్తాడు. మీకు జటిలుని కథ చెపుతా వినండి!"

"జటిలుడు చిన్నపిల్లవాడు. వాడు బడికి వెళ్ళాలంటే దారిలో ఒక అడవిని దాటివెళ్ళాలి. అడవిలో నుండి వెళ్ళేటప్పుడు వాడికి భయం వేసేది. ఒకరోజు వాడు తల్లితో, 'అమ్మా, బడికి వెళ్ళాలంటే నాకు భయం వేస్తున్నదమ్మా!' అని చెప్పాడు. అప్పుడు తల్లి వాడితో, 'నాయనా! నీకు భయమెందుకురా! మధుసూదనుణ్ణి పిలు! నీకు తోడుగా వస్తాడు!' అన్నది. 'మధుసూదనుడు ఎవరమ్మా?' అని ఆశ్చర్యంతో వాడు ప్రశ్నించాడు. 'మధుసూదనుడా? వాడు మీ అన్నయ్యరా! వాడు అడవిలో ఉంటాడు. నీవు పిలిస్తే వస్తాడు' అని ఆమె బదులు చెప్పింది. మర్నాడు జటిలుడు మామూలుగా బడికి వెడుతున్నాడు. అతడికి భయం వేసింది. భయంతో, 'అన్నా! మధుసూదనా!' అని పిలిచాడు. కాని ఎవ్వరూ రాలేదు. పిల్లవాడు మరింత భయంతోను, దిగులుతోను ఏడుస్తూ బిగ్గరగా, 'అన్నా! మధుసూదనా! ఎక్కడున్నావురా? నా దగ్గరికి రారా! నాకు భయం వేస్తున్నది' అని అరిచాడు. ఆర్తితో పిలిచిన ఈ పిలుపు విని భగవంతుడు రాకుండా ఉండలేకపోయాడు. జటిలుడి ఎదుట కనిపించి, 'జటిలా! ఇక్కడే ఉన్నానురా! భయమెందుకు తమ్ముడూ! నేనున్నానుగా!' అంటూ జటిలుణ్ణి అడవి దాటించి బడికి దారి చూపించాడు. వెళ్ళిపోతూ, 'తమ్ముడూ! నీవు ఎప్పుడు పిలిస్తే అప్పుడు వస్తానురా, భయపడకు!' అని చెప్పి అదృశ్యమయ్యాడు."

"ఇంకొక కథ చెపుతా వినండి! ఒక బ్రాహ్మణుడున్నాడు. అతడు రోజూ దేవతార్చన చేసి దేవుడికి నైవేద్యం పెడుతుండేవాడు. ఇలా ఉండగా ఒకరోజు ఆ బ్రాహ్మణుడు ఏదో పనిమీద మరొక ఊరికి వెళ్ళవలసి వచ్చింది. ఇంట్లో నుండి

బయలుదేరుతూ చిన్నపిల్లవాడైన తన కొడుకును పిలిచి, 'అబ్బాయీ! నేను ఈ రోజు పనిమీద ఊరికి వెడుతున్నానురా! నీవు దేవుడికి సరిగా నైవేద్యం పెట్టి, ఆయన దానిని ఆరగించేలా చూడు' అని చెప్పి వెళ్ళిపోయాడు. ఆ ప్రకారమే పిల్లవాడు పూజామందిరంలో పూజచేసి నైవేద్యాన్ని దేవుని ముందు ఉంచి కూర్చున్నాడు. కాని విగ్రహం కదల్లేదు, మెదల్లేదు. పీఠం దిగి రాలేదు. దేవుడు క్రిందకి దిగివచ్చి తాను పెట్టిన నైవేద్యాన్ని తింటాడని ఆ పిల్లవాడు అనుకుంటున్నాడు. వాడు మళ్ళీమళ్ళీ ప్రార్థించాడు. కాని దేవుడు ఉలకలేదు, పలకలేదు, క్రిందకు దిగి రాలేదు. 'దేవా! నైవేద్యం తిను, ఆలస్యమౌతున్నది. ఇక నేను కూర్చోలేను' అని మళ్ళీ ప్రార్థించాడు. అయినా విగ్రహం కదల్లేదు,

మారుపలుకలేదు. పిల్లవాడికి ఏడుపు వచ్చింది. వాడు వెక్కివెక్కి ఏడుస్తూ, 'దేవా! మా నాన్న నీకు నైవేద్యం సరిగా పెట్టమన్నాడు. నేను పెడితే ఎందుకు తినవు? మా నాన్న కోప్పడతాడు. దిగిరావా?' అన్నాడు. హృదయవేదనతో పిల్లవాడు ఈ విధంగా ఏడుస్తుంటే దేవుడు చూస్తూ ఊరుకోలేక పోయాడు. పీఠం దిగివచ్చి నవ్వుతూ నైవేద్యం ముందు కూర్చొని, అంతా తినివేశాడు. పిల్లవాడు సంతోషంతో దేవుని గదిలోనుంచి బయటకు వచ్చాడు. అప్పుడు ఇంట్లోవాళ్ళు ఆసక్తితో, 'అబ్బాయీ! పూజ అయింది గదా! ప్రసాదం తీసుకురా!' అన్నారు. అప్పుడు వాడు, 'అయిందమ్మా, దేవుడు అంతా తినేశాడు!' అని సంతోషంగా చెప్పాడు. వాళ్ళు ఆశ్చర్యంతో, 'దేవుడు తినడమేమిటిరా!' అని లోనికి వెళ్ళి చూచి నిశ్చేష్టితులయ్యారు. నిజంగా దేవుడు ఒక్క మెతుకు కూడా మిగల్చకుండా నైవేద్యాన్ని తినివేయడం చూచి అందరూ ఆశ్చర్యపోయారు. కాబట్టి పసిబిడ్డకు ఉన్నటువంటి విశ్వాసం, ఆర్తి అవసరం. అవి ఉంటే భగవంతుడు మన ప్రార్థనలకు తప్పక ప్రతిస్పందిస్తాడు."

## 38. గురుభక్తి
## (వితంతువు - పాలకుండ)

రాజేంద్రమిత్ర ఒక బ్రహ్మసమాజ భక్తుడు. ఒకరోజు గురుదేవులు అతడి ఇంటికి వెళ్ళారు. ఆ రోజు అక్కడికి కేశవచంద్రసేను కూడా వస్తాడని వాళ్ళు ఎదురుచూస్తున్నారు. ఇంతలో ఒక భక్తుడు గురుదేవులను, 'స్వామీ! గృహస్థులకు మార్గమేమిటి?' అని ప్రశ్నించాడు. అప్పుడు గురుదేవులు, "నమ్మకముంటే దేనినైనా సాధించవచ్చు. గురువు కేవలం మానవమాత్రుడు కాదు. సచ్చిదానంద పరబ్రహ్మమే గురువు. గురువు అనుగ్రహంవల్ల భగవంతుడు కనిపిస్తాడు. అప్పుడు, గురువు ఆ ఇష్టదేవతా రూపంలో దర్శనమిచ్చి భగవంతునిలో లీనమౌతాడు. ఒక కథ చెపుతా విను!"

"ఒకసారి ఒక గురువుగారింట్లో అన్నప్రాశన జరుగుతున్నది. దాని ఖర్చును శిష్యులు వారి శక్తికి తగినట్లుగా భరిస్తామన్నారు. ఆ శిష్యులలో ఒక వితంతువు కూడా ఉన్నది. ఆమె కడు బీదరాలు. ఆమెకు ఒక ఆవు ఉన్నది. అందువల్ల ఆ ఉత్సవానికి అవసరమైన పాలు, పెరుగు ఆమె తెస్తుందని గురువుగారు ఆశించారు. కాని ఆరోజు ఆమె ఒక చిన్న కుండ నిండా పాలు తీసుకొని వచ్చింది. ఆ పాలను చూచి అవి దేనికీ సరిపోవని గురువుగారు ఉగ్రుడై ఆ కుండను అవతల పారవేసి, 'ఛీ, ఇలాంటి పనిచేసే బదులు ఆ నదిలో దూకి చావరాదా!' అన్నారు. ఆమె ఆ మాటనే గురువుగారి ఆజ్ఞగా భావించి, దానిని శిరసావహించి నదికి వెళ్ళి నీళ్ళలో

దూకడానికి సిద్ధపడింది. కాని ఆమె అమాయకత్వానికి, విశ్వాసానికి భగవంతుడు సంతోషించి ఆమెకు దర్శనమిచ్చాడు. ఆమె చేతిలో ఒక పెరుగుకుండ ఉంచి, 'అమ్మా! ఎంత వడ్డించినా ఈ పెరుగు కుండ ఖాళీ కాదు. నిండుగానే ఉంటుంది. దీనిని చూచి మీ గురువు సంతోషపడతారు' అని చెప్పి అంతర్ధానమైపోయాడు."

"ఆ వితంతువు ఆ కుండను తీసుకొనిపోయి గురువుగారికి సమర్పించింది. ఎంత తీసినా తరగకుండా నిండిపోతున్న ఆ కుండను చూచి గురువుగారు నిరుత్తరుడైపోయాడు. అది ఆమెకు ఎలా వచ్చిందో తెలుసుకొని దిగ్భ్రాంతుడైపోయాడు. కాని ఆమె చెప్పిన మాటల్లో ఆయనకు నమ్మకం కలుగలేదు. తక్షణమే ఆమెతో నది దగ్గరకు వెళ్ళాడు. 'అమ్మా! నీకు దేవుడు ఆ పెరుగుకుండను ఇచ్చాడన్నావు కదా! అదే నిజమైతే, ఆ దేవుణ్ణి నీవు నాకు చూపకపోతే, నేను ఈ నదిలో దూకి చచ్చిపోతాను' అన్నాడు."

"ఈ క్లిష్టపరిస్థితిని చూచి భగవంతుడు ఆమె ముందు ప్రత్యక్షమైనాడు. కాని గురువుకు కనిపించలేదు. అప్పుడు ఆ వితంతువు భగవంతునితో, 'ఓ ప్రభూ! నీవు నా గురువుగారికి కనిపించలేదని ఆయన ప్రాణత్యాగం చేసినట్లయితే ఆయనతో పాటు నేను కూడా చనిపోతాను' అని ప్రార్థించింది. ఆమె దీనావస్థను, ఆర్తిని గమనించి భగవంతుడు ఆమె గురువుగారికి కూడా దర్శనమిచ్చాడు."

ఈ కథ చెప్పి, గురుదేవులు ఆ భక్తునితో, "చూశావా! కేవలం గురుభక్తివల్లనే తాను భగవంతుణ్ణి దర్శించడమే కాక ఆమె తన గురువుగారికి కూడా దేవుని దర్శనమిప్పించింది" అన్నారు.

## 39. శరణాగతి
## (అంతా రాముని ఇష్టమే అని నమ్మిన సాలెవాని కథ)

"అనగనగా ఒక ఊరు. ఆ ఊరిలో ఒక సాలెవాడు ఉన్నాడు. అతడికి దైవభక్తి, శ్రద్ధ ఎక్కువ. అందువల్ల అందరూ అతణ్ణి నమ్మేవారు, ప్రేమించేవారు. ఇంటిదగ్గర తాను నేసిన గుడ్డను బజారుకు తీసుకువెళ్ళి అమ్మేవాడు. ఎవరైనా ఆ గుడ్డ ఖరీదు ఎంత అని అడిగితే, 'రామేచ్ఛవల్ల దీనికి పట్టిన నూలు ఖరీదు ఒక రూపాయి, రామేచ్ఛవల్ల కూలి నాలుగు అణాలు, రామేచ్ఛవల్ల లాభం రెండణాలు. రామేచ్ఛవల్ల ఈ గుడ్డ మొత్తం ఖరీదు రూపాయి ఆరణాలు,' అని సమాధానం చెప్పేవాడు. ప్రజలు అతడి నిజాయితీని చూచి ఎంత ధర చెప్పితే అంత ఇచ్చి గుడ్డ కొనేవాళ్ళు. ఈ సాలెవాడు నిజమైన భక్తుడు. రోజూ రాత్రి భోజనం చేసిన తరువాత కూర్చొని పాటలు పాడుతూ, భజన చేసుకుంటూ ఉండేవాడు."

"ఒకరోజు ఆ సాలెవాడు రాత్రి భోజనమైన తరువాత చాలాసేపు నిద్రపోకుండా హుక్కా తాగుతూ, భజన చేస్తున్నాడు. అప్పుడు ఆ వైపుగా కొందరు దొంగలు

వచ్చారు. వాళ్ళకు, తాము దొంగిలించిన ధనాన్ని మోయడానికి ఒక మనిషి కావలసివచ్చాడు. 'మాతో, రా!' అంటూ వాళ్ళు ఈ సాలెవాణ్ణి రెక్క పట్టుకొని లాగి తమతో తీసుకుపోయారు. ఒక ఇంటికి కన్నం వేసి దొంగతనం చేశారు. దొంగసొమ్ము మూటలు కట్టి, అతడి నెత్తిమీద కూడా ఒక సొమ్ములమూట పెట్టి మోయిస్తూ తమతోపాటు తీసుకుపోసాగారు. ఇంతలో పోలీసులు అక్కడికి రావడంతో ఆ దొంగలు పారిపోవడం, సొమ్ములమూటతో ఆ సాలెవాడు పోలీసులకు దొరికిపోవడం జరిగాయి. పోలీసులు ఆ సాలెవాణ్ణి ఆ రాత్రి నిర్బంధంలో ఉంచి, మరునాటి ఉదయం విచారణకై న్యాయాధిపతి ముందు హాజరు పరిచారు."

"ఈ విషయం ఊరంతా తెలిసింది. సాలెవాని నిజాయితీ తెలిసిన గ్రామస్థులంతా న్యాయస్థానానికి వచ్చి న్యాయాధిపతితో, 'అయ్యా! ఇతడు దొంగతనం చేసేవాడు కాదండీ. చాలా నిజాయితీపరుడు!' అని చెప్పారు. అప్పుడు న్యాయాధిపతి ఆ సాలెవాణ్ణి వాఙ్మూలమిమ్మని కోరాడు. అప్పుడు ఆ సాలెవాడు, 'మహాప్రభూ! రామేచ్ఛవల్ల నిన్న చీకటి పడింది. రామేచ్ఛవల్ల నేను

రాత్రి భోజనం చేశాను. రామేచ్ఛవల్ల భగవన్నామ భజన చేస్తున్నాను. రామేచ్ఛవల్ల అప్పుడు కొందరు దొంగలు అటు వచ్చారు. రామేచ్ఛవల్ల వాళ్ళు తమతోపాటు నన్ను కూడా లాగుకొనిపోయారు. రామేచ్ఛవల్ల వాళ్ళు ఒక ఇంటిలో దొంగతనం చేశారు. రామేచ్ఛవల్ల నా తలమీద దొంగ సొమ్ములున్న మూటను ఉంచారు. రామేచ్ఛవల్ల ఇంతలో పోలీసులు అక్కడికి వచ్చారు. రామేచ్ఛవల్ల దొంగలు పారిపోయారు. రామేచ్ఛవల్ల నేను పట్టుపడ్డాను. రామేచ్ఛవల్ల నన్ను రాత్రి బందిఖానాలో ఉంచారు. రామేచ్ఛవల్ల నన్ను ఈ ఉదయం ఏలినవారిముందు హాజరు పరిచారు' అని చెప్పాడు. ఈ వాఙ్మూలం విని, న్యాయాధిపతి ఆ సాలెవాడు నిర్దోషి మాత్రమేకాక నిజమైన భక్తుడని కూడా తెలుసుకుని అతణ్ణి విడుదల చెయ్యమని ఉత్తరువు ఇచ్చాడు. అప్పుడు ఆ సాలెవాడు ఇంటికి వెడుతూ తన స్నేహితులతో, 'రామేచ్ఛవల్ల నేను విడుదల చేయబడ్డాను' అని చెప్పాడు."

ఒక భక్తుడు 'అంతా రామేచ్ఛ' అనే కథ చెప్పమని శ్రీరామకృష్ణులను ప్రార్థించాడు. అప్పుడు గురుదేవులు అతడికి ఈ కథ చెప్పి ఇంకా ఇలా అన్నారు: "మానవుడు గృహస్థుగా ఉండడం గాని, సన్న్యాసిగా మారడం గాని సర్వం రామేచ్ఛ మీదనే ఆధారపడి ఉంటుంది. అన్నింటినీ భగవంతునకు అర్పించి నీవు చేయవలసిన విధులను నిర్వర్తిస్తూ ఉండు. అంతకంటే నీవు చేయగలిగింది ఏముంది? గృహస్థుడు జీవన్ముక్తుడైన తరువాత అతడు సంసారంలో ఉన్నా ఎటువంటి ప్రమాదం లేదు. జ్ఞానం కలిగిన వాడికి 'ఈ చోటు', 'ఆ చోటు' అన్న తేడా ఉండదు. అతడికి అన్ని చోట్లు ఒకటే."

## 40. భక్తి ఉంటే దేనినైనా సాధించవచ్చు (గణపతి - కుమారస్వామి - రత్నాలహారము)

"భగవంతుడి మీద ప్రేమ ఉంటే దేనినైనా సాధించవచ్చు. భగవంతుడి మీద ప్రేమ కలిగిన వారికి కొదవ అనేదే ఉండదు."

"వినాయకుని విషయం చెపుతాను విను! ఒకసారి పార్వతీదేవికి ఇరుప్రక్కల వినాయకుడు, కుమారస్వామి కూర్చొనివున్నారు. పార్వతీదేవి మెడలో అప్పుడు ధగధగ మెరుస్తున్న ఒక రత్నాలహారం ఉన్నది. కుమారులిద్దరి చూపు దానిమీద పడింది. అప్పుడు భగవతి, 'అబ్బాయిలూ! మీలో ఎవరు ముందుగా ఈ ప్రపంచాన్ని చుట్టివస్తారో వాళ్ళకు ఈ హారాన్ని ఇస్తాను' అని చెప్పింది. తల్లి నోటినుండి ఈ మాట వెలువడిందో లేదో, కుమారస్వామి తన నెమలిని ఎక్కి విశ్వాన్ని చుట్టి రావడానికి బయలుదేరాడు. తన నెమలి అతివేగంగా ఎగరగలదని, తాను ముందుగా తిరిగి రాగలనని అతడి నమ్మకం."

"ఇక గణపతి శాంతంగా కూర్చున్నాడు. తన తల్లియైన జగన్మాత గర్భంలో

బ్రహ్మాండాలన్నీ ఇమిడి ఉన్నాయని అతడికి తెలుసు. అందువల్ల నెమ్మదిగా లేచి భక్తిశ్రద్ధలతో తల్లికి ప్రదక్షిణం చేసి పాదాలకు సాష్టాంగ నమస్కారం చేసి కూర్చున్నాడు. దేవి సంప్రీతురాలై తన రత్నాలహారం తీసి వినాయకునికి ఇచ్చింది. నెమలివాహనం మీద బయలుదేరిన కుమారస్వామి స్వయంగా ప్రయాణం చెయ్యాలి కనుక, విశ్వమంతా చుట్టి, ఎంతోసేపటికి తిరిగివచ్చి, తానే ముందు వచ్చాననుకుంటూ తల్లి దగ్గరకు వచ్చాడు. వచ్చి చూచేసరికి వినాయకుడు తన మెడలో రత్నాలహారం ధరించి ఉండటం కనిపించింది. విషయం అప్పుడు గ్రహించాడు. కాబట్టి భక్తివల్ల దేనినైనా సాధించవచ్చు. కావాలంటే భక్తివల్ల బ్రహ్మజ్ఞానం కూడా లభిస్తుంది.”

ఈ కథను శ్రీగురుదేవులు ‘శ్రీరామకృష్ణ కథామృత’ రచయిత అయిన మహేంద్రనాథ గుప్తకు చెప్పారు. తాను దివ్యజననిని ప్రార్థించిన విధానాన్ని కూడా మహేంద్రునికి తెలుపుతూ, “అమ్మా! వేదవేదాంతాలలో ప్రతిపాదింపబడినదంతా నాకు తెలియజెయ్యి! తంత్రాలలోను, పురాణాలలోను చెప్పబడినదంతా కూడా నాకు అనుగ్రహించమ్మా!” అని అమ్మను ప్రార్థించానని చెప్పారు.

## 41. భగవదున్మాదము
## (కాకి – రామనామ జపము)

“శ్రీరాముడు, లక్ష్మణుడు ఒకసారి పంపానదిని సందర్శిస్తున్నారు. అప్పుడు లక్ష్మణుని దృష్టి ఒక కాకి మీద పడింది. ఆ కాకి నీళ్ళ కోసం తహతహలాడుతున్నది. మాటిమాటికీ ఆ కాకి నది అంచు వరకు వెళ్ళినా కూడా నీరు త్రాగకుండా తిరిగి రావడం లక్ష్మణుడు గమనించాడు. దీని రహస్యమేమిటో ఆయనకు అర్థం కాలేదు. ‘అన్నయ్యా! అదేమిటి! ఆ కాకి అలా చేస్తున్నది?’ అని శ్రీరాముణ్ణి అడిగాడు. శ్రీరాముడు, ‘లక్ష్మణా! ఆ కాకి ఒక గొప్పభక్తుడు. రాత్రింబగళ్ళు అది రామనామాన్ని జపిస్తుంది. అందువల్ల దాని గొంతు ఎండిపోయింది. కాని, నీళ్ళు త్రాగితే, ఆ నీళ్ళు మ్రింగే లోపల, రామనామజపం ఆగిపోతుందేమోనని దాని భయం’ అని వివరించాడు.”

శ్రీరామకృష్ణులు ఈ కథను విజయకృష్ణ గోస్వామికి చెప్పారు. ఆయనలో ఉన్న భక్తివైరాగ్యాలను పెంపొందించాలని, ఇంకా ఇలా చెప్పారు: “చూడు! చాతకపక్షి స్వాతివాన నీటినే ఆశిస్తుంది. దాహంవేసి చచ్చిపోతున్నా సరే, తన ముఖాన్ని పైకి ఎత్తి స్వాతి వానచినుకుల కోసమే ఎదురు చూస్తుంది. గంగ, యమున మొదలైన మహానదులు, సరస్సులు నిర్మలమైన నీటితో నిండివున్నా, ఈ భూమిపై ప్రవహిస్తున్న ఒక్క నీటి చుక్కనైనా అది ముట్టదు. భగవదున్మత్తుడైన వాడికి మరే విషయాలు రుచించవు, నచ్చవు, తెలియవు.”

## 42. రక్షించవలసినవాడే శిక్షిస్తుంటే!
## (శ్రీరాముడు - కప్ప)

"శరీరమెంతవరకు ఉంటుందో అంతవరకు సుఖదుఃఖాలు తప్పవు. భగవంతుణ్ణి సాక్షాత్కరించుకున్నవారు, తమ మనస్సును, బుద్ధిని, ప్రాణాన్ని, శరీరాన్ని, సమస్తాన్ని ఆయనకు సమర్పించుకుంటారు."

"ఒకసారి రామలక్ష్మణులు పంపానదికి స్నానానికి వచ్చారు. వారి ధనుస్సులను నది ఒడ్డున ఇసుకలో గుచ్చి, నీటిలో దిగి స్నానం చేశారు. స్నానం ముగించుకొని వెళ్ళేముందు లక్ష్మణుడు ధనుస్సులను పైకి తీశాడు. అప్పుడు శ్రీరాముడి ధనస్సు కొనకు రక్తపు మరక కనిపించింది. శ్రీరాముడు లక్ష్మణునితో, 'లక్ష్మణా! మనమేదో ప్రాణికి అపకారం చేసినట్లున్నాం. ధనుస్సు కొనకు రక్తం అంటింది చూడు' అన్నాడు. వెంటనే లక్ష్మణుడు అక్కడి ఇసుకను చేతితో తీసి చూచేసరికి ఒక కప్ప రక్తసిక్తమై ప్రాణాపాయస్థితిలో కనిపించింది. శ్రీరాముడి ధనుస్సు దాని శరీరంలో గుచ్చుకుంది. శ్రీరాముడు విచారంతో ఆ కప్పను చూస్తూ, గద్గదస్వరంతో, 'ఇదేమిటి! నువ్వు పాము కోరల్లో చిక్కుకున్నప్పుడు బెకబెకలాడుతూ శబ్దం చేస్తావు కదా! ఇప్పుడు అసలు శబ్దం చెయ్యలేదే! అరిస్తే నిన్ను రక్షించి ఉండేవాడిని గదా!' అన్నాడు. అప్పుడు ఆ కప్ప, 'ప్రభూ! రామచంద్రా! నేను పాముబారిన పడినప్పుడు, "ఓ రామా! నన్ను రక్షించు! నన్ను కాపాడు!" అని మొరపెట్టుకుంటాను. కాని ఇప్పుడో, నన్ను రక్షించే రాముడే నన్ను చంపుతున్నాడు. అందువల్ల నేను మెదలకుండా పడివున్నాను' అని సమాధానం చెప్పింది."

భగవద్దర్శనమైనవాని మనస్సు, ప్రాణము, ఆత్మ, సర్వస్వం భగవంతుని పాదపద్మాలయందు సమర్పితమై ఉంటాయి. ఈ కథ ద్వారా శ్రీరామకృష్ణులు, పరిపూర్ణమైన శరణాగతి ఏవిధంగా ఉంటుందో విజయకృష్ణ గోస్వామి, మహిమచరణ చక్రవర్తి మొదలైన భక్తులకు వివరించారు.

## 43. భగవంతునికి అర్పించిన మనస్సు భౌతిక విషయాలపైకి మరలదు
## (బిల్వమంగళుని కథ)

డాక్టరు మహేంద్రలాలు సర్కారు ఒకసారి గురుదేవుల్ని ఇలా ప్రశ్నించాడు, "మీ కంఠ వ్రణాన్ని (కాన్సర్) తగ్గించమని మీరు దేవుణ్ణి ఎందుకు ప్రార్థించరు?" గురుదేవులు ఇలా సమాధానమిచ్చారు: "మనస్సు దేవుని యందు లగ్నమైతే, భగవంతుడు అత్యంత సమీపంలోనే, అంటే హృదయంలోనే కనిపిస్తాడు. కానీ

ఇక్కడ ఒక్క విషయం జ్ఞాపకముంచుకోవాలి. భగవంతునితో సంబంధం పెరిగేకొద్దీ మనస్సు ప్రాపంచికవిషయాలకు దూరమైపోతుంది." (తాను తన మనస్సుని భగవంతునికై అర్పించాననీ, అది ఇక తనది కాదనీ, అలా ఒకసారి అర్పించిన తర్వాత దానిని భౌతికవిషయాల గురించి ప్రార్థించడానికి ఉపయోగించలేననీ గురుదేవుల భావం.)

"భక్తమాల' అనే గ్రంథంలో బిల్వమంగళుడు అనే భక్తుని కథ ఒకటి ఉంది. ఆ కథ చెపుతా విను! బిల్వమంగళుడు ఒక వేశ్యాలోలుడు. ఆమె తోటిదే లోకమనుకుంటూ కాలం గడుపుతుండేవాడు. ఒకసారి అతడి తల్లిదండ్రుల తద్దినాలు వచ్చాయి. అందువల్ల ఆ రోజు సాయంత్రందాకా ఇంటిలోనే ఉండవలసి వచ్చింది."

"ఆ రోజు సాయంత్రం ఆ వేశ్య కోసమని భోజనం, పిండి వంటలూ మూట కట్టుకొని చీకటిలో ఆ వేశ్యాగృహానికి వెడుతున్నాడు. మనస్సు పూర్తిగా ఆ వేశ్యపై లగ్నమై ఉండడం వల్ల అతడు ఎటుపోతున్నాడో తెలియని స్థితిలో అడుగులు వేస్తున్నాడు. ఆ దారిలో ఒక యోగి కళ్ళు మూసుకొని భగవద్ధ్యానం చేస్తున్నాడు. ఒళ్ళు మరిచిపోయి నడుస్తున్న బిల్వమంగళుడు ఆ యోగిని తొక్కుకుంటూ వెళ్ళాడు. ఆ యోగి ఉగ్రుడై, 'ఏమోయీ! నీకు కళ్ళు మూసుకుపోయినట్లున్నాయే? భగవద్ధ్యానం చేసుకునే నా నెత్తిన నడుస్తూ వెడుతున్నావు!' అని గద్దించాడు. బిల్వమంగళుడు ఆ మాటకు త్రుళ్ళిపడ్డాడు. తన తప్పు తెలుసుకొని ఆ యోగిని క్షమించమన్నాడు. తరువాత ఆ యోగితో, 'అయ్యా! నాదొక ప్రశ్న! నేను వేశ్య మీద మనస్సుతో ఒళ్ళు మరిచిపోయి నడుస్తున్నాను. కానీ, మీరు భగవద్ధ్యానం చేస్తూ కూడా బాహ్యప్రజ్ఞలోనే ఉన్నారే? ఇదేమి ధ్యానమండీ?' అని అడిగాడు."

"ఆ తర్వాత, 'వేశ్యను గురించి ఆలోచిస్తేనే తాను పరవశంలో మునిగిపోతున్నాను కదా, నిజంగా భగవంతుణ్ణి ధ్యానిస్తే నాకు తప్పక ముక్తి కలుగుతుంది!' అని బిల్వమంగళుడికి స్ఫురించింది. ధ్యానాన్నే పనిగా పెట్టుకున్న ఆ యోగికన్నా తానే ఎక్కువ ఏకాగ్రత కలవాడినని అతనికి అనిపించింది. తన మనస్సును పూర్తిగా లాగివేసిన ఆ వేశ్యయే తనకు గురువు అని కూడా అతడికి తోచింది. దానితో వైరాగ్యం కలిగింది. ఆ వేశ్యతో, 'అమ్మా! నీవే నా గురువు! భగవంతుని కోసం మనస్సు ఏ విధంగా వ్యాకులపడాలో నీవు నాకు నేర్పావు!' అని చెప్పాడు. ఆ వేశ్యను అతడు 'అమ్మా!' అని సంబోధించడమే కాక, ఆమెనూ, తన సంసారాన్నీ కూడా త్యజించి వెళ్ళిపోయాడు. ఆ వేశ్యనే మరిచిపోయి, భగవద్ధ్యానంలో మునిగిపోయాడు."

'భగవంతునిలో లీనమైన మనస్సు, శరీరరుగ్మతల మీదికి మరలిపోదని,

భగవద్ధ్యానం చేసేటప్పుడు బాహ్యస్పృహ లేకుండా భగవంతునిలో లీనమవ్వాలని' ఈ కథ ద్వారా గురుదేవులు డాక్టరు సర్కారుకు వ్యక్తపరిచారు.

## 44. ఉండడంగాని, పోవడంగాని భగవదిచ్ఛానుసారమే! (కొండమీద గుడిసె - గాలివాన)

ప్రతాపచంద్ర మజుందారు గొప్ప బ్రహ్మసమాజ నాయకుడు. ఆయన, కేశవచంద్రసేను కలిసి బ్రహ్మ సమాజానికి చాలా సేవ చేశారు. బ్రహ్మసమాజ కార్యనిర్వహణలోనే ప్రతాపచంద్ర యూరపు, అమెరికా ఖండాలలో కూడా పర్యటించాడు. ఆయన గురుదేవుని కలసినప్పుడు గురుదేవులు, "ప్రతాపూ! నీవు, కేశవచంద్రసేను, ఇద్దరూ గొప్ప మేధావులు. మీరు గౌరాంగుడు (చైతన్య మహాప్రభువు), నిత్యానందులలాగా మెలిగారు. ఎన్నెన్నో ఉపన్యాసాలిచ్చారు, వాదోపవాదాలు చేశారు. చర్చలు, ప్రసంగాలు కూడా ఎన్నెన్నో చేశారు. అయితే, ఇప్పుడు కూడా నీకు ఆ విషయాలు సంతృప్తిని కలిగిస్తున్నాయా? ఇప్పటికైనా నీవు నీ మనస్సును పూర్తిగా కేంద్రీకరించి భగవన్నామస్మరణ చేస్తూ, భగవంతునిలో మునిగిపో!" అని చెప్పారు.

దానికి ప్రతాపుడు, "స్వామీ! మీరు చెప్పినది సత్యమే కాని, కేశవచంద్రసేను పేరు నిల్పడానికి మాత్రమే నేను ఈ పనంతా చేస్తున్నాను," అని సమాధానం చెప్పాడు. దానికి గురుదేవులు ఇలా ప్రతిస్పందించారు. "ప్రస్తుతం నీవు ఇలా మాట్లాడుతున్నావు గాని, కొన్నిరోజుల తరువాత నీకు ఈ విధంగా అనిపించదు. ఒక కథ చెపుతా విను!"

"కొండమీద ఒకడు ఇల్లు కట్టుకున్నాడు. వాడు ఎంతో శ్రమపడి, చెమటోడ్చి మట్టితో ఆ ఇల్లు కట్టాడు. కొన్ని రోజుల తరువాత ఒక పెద్ద గాలివాన వచ్చి ఆ గుడిసె అటూయిటూ ఊగడం మొదలుపెట్టింది. పాపం వాడు చాలా గాభరాపడి, 'ఈ గుడిసెను రక్షించడం ఎలా?' అని ఆదుర్దా చెందాడు. వాయుదేవునివల్ల గాలివాన వస్తున్నందున, 'ఓ వాయుదేవా! ఈ ఇంటిని రక్షించు! దీనిని పడగొట్టవద్దు!' అని ప్రార్థించాడు. కానీ వాయుదేవుడు ఆ ప్రార్థన ఆలకించినట్లు లేదు. గాలి తాకిడికి ఇల్లు కూలిపోవడానికి సిద్ధమౌతున్నది. అప్పుడు ఆ ఇంటి రక్షణకు ఒక ఉపాయం పన్నాడు. 'ఓ వాయుదేవా! ఈ ఇల్లు ఎవరిదో కాదు, నీ కుమారుడైన హనుమంతునిది. అందువల్ల దీనిని రక్షించమని వేడుకుంటున్నాను' అన్నాడు. హనుమంతునిది అంటే వాయుదేవుడు కరుణిస్తాడని వాడి ఆశ. కాని గుడిసె ఊగిపోవడం మొదలయింది. వాడి ప్రార్థన వినే నాథులు ఎవరూ కనిపించలేదు. మళ్ళీమళ్ళీ 'ఇది హనుమంతుని ఇల్లు' అని అరుస్తూనే ఉన్నాడు. గాలివాన ఇంకా ఉధృతమైంది. అప్పుడు వాడికి ఇంకొక ఆలోచన తట్టింది.

‘వాయుదేవుని కుమారుడు హనుమంతుడు కదా! హనుమంతుడేమో శ్రీరాముని భక్తుడు. ఆ శ్రీరాముని తమ్ముడే లక్ష్మణుడు. ఆయనకు ఆగ్రహం ఎక్కువ గదా!’ అనుకొని, ఆ దిక్కుతోచని స్థితిలో వాడు ‘ఓ వాయుదేవా! ఇది లక్ష్మణుని ఇల్లు’ అని పెడబొబ్బలు పెట్టాడు. మళ్ళీమళ్ళీ, ‘వాయుదేవా! ఇది శ్రీరాముని ఇల్లు, దీనిని కూలదోయవద్దు స్వామీ!’ అని అరిచినా ఆ అరుపులు కూడా నిష్ఫలమయ్యాయి. ఇల్లు ఒకవైపు కూలిపోయింది. ఇకవాడు చేసేదేమీలేక, ప్రాణాలు కాపాడుకోవడానికి గుడిసెలోనుండి బయటకు వచ్చి ఇలా శాపనార్థాలు పెట్టాడు: ‘ఛీ! ఇది దయ్యాలకొంప! కూలితే కూలిపోనీ, నాకేం!’ అన్నాడు.”

ఇది చెప్పి ప్రతాపచంద్రుని కళ్లలోకి చూస్తూ గురుదేవులు, ‘ప్రతాపూ! ఈ కుంటి సాకులెందుకు? నువ్వు కేశవచంద్రసేను పేరు నిలబెట్టనక్కరలేదు. భగవంతుడి ఇచ్ఛవల్లనే కేశవుడికి పేరు వచ్చింది.

దానివల్లనే అతడు విజయం సాధించాడు. భగవదిచ్ఛవల్లనే అతడి పని సానుకూలమైంది. భగవదిచ్ఛ వల్లనే అది ఇప్పుడు విచ్ఛిన్నం అవుతున్నది కూడా. దానికి నీవేమి చేయగలవు? నీ మనస్సును పూర్తిగా దైవంవైపు మరల్చి ఆయన ప్రేమారాధనలో మునిగిపో! అదే నీ విధి!' అని హితవు చెప్పారు.

## 45. జ్ఞాన భక్తి – ప్రేమ భక్తి
## (ముగ్గురు స్నేహితులు – పెద్దపులి)

ఒకసారి శ్రీరామకృష్ణులు రామచంద్రదత్త ఇంటికి వెళ్ళారు. ఆ సందర్భంగా రామచంద్రదత్త ఒక పౌరాణికుణ్ణి పిలిచి భాగవత కాలక్షేపం ఏర్పాటు చేశాడు. పురాణకాలక్షేపం పూర్తి అయిన తరువాత ఒక భక్తుడు గురుదేవులను, 'ప్రేమభక్తి గొప్పదా? జ్ఞానభక్తి గొప్పదా?' అని ప్రశ్నించాడు. దానికి సమాధానం చెపుతూ గురుదేవులు, 'భగవంతుణ్ణి ప్రేమించి, ఆయన మన సొంతం అని అనుకుంటే తప్ప భగవంతుని యందు ప్రేమభక్తి జనించదు. ఒక కథ చెపుతా విను!' అని ఈ కథను చెప్పారు.

"ఒకసారి ముగ్గురు స్నేహితులు కలిసి అడవిలో నుంచి వెడుతున్నారు. ఆ సమయంలో అకస్మాత్తుగా ఒక పెద్దపులి ఎదురుగా వచ్చింది. దానిని చూచి భయపడి వారిలో ఒకడు, 'మిత్రులారా, మనకు కాలం తీరిపోయింది. మనమిక బ్రతకం!' అని అరిచాడు. వెంటనే రెండవవాడు, 'ఫర్వాలేదు, రండిరా! మనకాలం తీరలేదు, ఏమీ కాలేదు. మనందరం కలిసి భగవంతుణ్ణి ప్రార్థిద్దాం!' అన్నాడు. ఇంతలో మూడవవాడు అందుకొని, 'మిత్రులారా! మనం భగవంతుణ్ణి ఎందుకు కష్టపెట్టాలి? ఇదిగో ఇక్కడే ఉన్న ఈ చెట్టు ఎక్కి ప్రాణాలు రక్షించుకుందాం!' అన్నాడు." "మనకాలం తీరిపోయింది" అని గగ్గోలుపెట్టిన వాడికి, 'భగవంతుడనేవాడు ఒకడున్నాడు, వాడు మనల్ని రక్షిస్తాడు' అనే విషయమే తెలియదు. ఇక 'భగవంతుణ్ణి ప్రార్థిద్దామన్న' రెండవవాడు జ్ఞానభక్తి కలవాడు. భగవంతుడు ఒకడున్నాడని, అతడు సర్వవ్యాపి అని, ప్రపంచాన్ని, మనను అతడు సృష్టించి పోషిస్తాడని వాడికి తెలుసు. ఇక 'చెట్టెక్కి ప్రాణం రక్షించుకుందాం; భగవంతుణ్ణి మనం ఎందుకు కష్టపెట్టాలి' అన్న మూడవవాడు ప్రేమభక్తి కలవాడు. వాడికి భగవంతునియందు గాఢమైన ప్రేమవుంది. అటువంటి ప్రేమ స్వభావం భగవంతుని కంటే తానే బలవంతుడనని భక్తుడు విశ్వసించేలా చేస్తుంది. వాడు ఎల్లప్పుడూ, తన ప్రియసఖుడైన భగవంతుడికి ఎక్కడ నొప్పి కలుగుతుందో అన్న మెలకువతో ఉంటాడు. తన ప్రియుడికి ఏ విధమైన బాధ కలుగకూడదన్నదే అతడి ఏకైక జీవితలక్ష్యము. తన ప్రియుడికి ఆఖరుకు కాలిలో ముల్లు కూడా గుచ్చుకోకుండా ఉండేలా చూస్తాడు."

“బృందావన గోపికల యొక్క భక్తి ఈ రకమైన ‘ప్రేమ-భక్తి’. అది అవ్యభిచారిణీ భక్తి; ఏకాంకితమైన (ఒకే లక్ష్యముగల) భక్తి. ఇక జ్ఞానభక్తి అంటే ఏమిటో తెలుసా? ఆ భక్తిలో జ్ఞానం పాలు కొంత ఉంటుంది. ఆ రకమైన భక్తుడు, ‘ఈ సర్వము భగవన్మయమే. కృష్ణమయమే. కృష్ణపరమాత్మయే ఈ పరబ్రహ్మ. రాముడన్నా, కృష్ణుడన్నా, శివుడన్నా, శక్తి అన్నా పేర్లు వేరు కానీ భగవంతుడు ఒక్కడే!’ అని తలుస్తాడు. కాని ప్రేమభక్తిలో, ఆ మాత్రం జ్ఞానస్పర్శ కూడా ఉండదు” అని గురుదేవులు ‘ప్రేమభక్తి’కి, ‘జ్ఞాన-భక్తి’కి గల తేడాను వివరించారు.

## 46. అంతులేని విశ్వాసం
## (కృష్ణుడు - అర్జునుడు)

“ఒకరోజు కృష్ణుడు, అర్జునుడు రథంలో వెడుతున్నారు. అకస్మాత్తుగా కృష్ణుడు ఆకాశంలోకి చూసి, “అర్జునా! చూడు! చక్కటి పావురాల గుంపు ఎగురుతోంది” అన్నాడు. అర్జునుడు కూడా పైకి చూసి ఆశ్చర్యంతో, ‘ఆహా! పావురాలు ఎంత బాగున్నాయి!’ అన్నాడు. వెంటనే శ్రీకృష్ణుడు మళ్ళీ పైకిచూసి, ‘మిత్రమా! అవి పావురాల లాగా లేవు’ అన్నాడు. అర్జునుడు వెంటనే పైకిచూసి, ‘అవును నిజమే! అవి పావురాలు కావు’ అన్నాడు.

ఈ కథ అర్థాన్ని శ్రీరామకృష్ణులు ఈ విధంగా వివరించారు. “అర్జునుడు గొప్ప సత్యసంధుడు. ఎల్లప్పుడూ నిజమే మాట్లాడుతాడు. అటువంటివాడు కృష్ణుడి మెప్పుదల కోసం ఆయన చెప్పిన ప్రతిదానికీ సరేసరే అని అనడు కదా! ఇక్కడ విషయం ఏమిటంటే, శ్రీకృష్ణుడి మాటలపై అర్జునుడికి ఎంతటి గాఢమైన నమ్మకం ఉందంటే, కృష్ణుడు చెప్పినది చెప్పినట్లు అర్జునుడు చూడగలిగాడు. అఖండమైన విశ్వాసం అలా ఉంటుంది.

## 47. విశ్వాసానికి గల అద్భుతమైన శక్తి
## (శ్రీరాముడు - హనుమంతుడు; హనుమాన్‌సింగ్ కథ)

విశ్వాసానికి ఉండే అద్భుతమైన శక్తిని వివరిస్తూ శ్రీరామకృష్ణులు ఈ కథను చెప్పారు. “పురాణాలలో ఈ విధంగా చెప్పబడి ఉంది. పరబ్రహ్మ స్వరూపము, అవతారమూర్తి అయిన శ్రీరాముడు సముద్రాన్ని దాటి లంకకు చేరడానికి వంతెన నిర్మించుకోవలిసి వచ్చింది. కానీ రామనామం మీద తనకు ఉన్న అఖండమైన విశ్వాసంతో హనుమంతుడు ఒక్క దుముకులో సముద్రాన్ని దాటి లంకను చేరగలిగాడు. ఆయనకు వంతెన అవసరం లేకపోయింది.”

“ఇంకొక కథ చెపుతా వినండి! ఒకసారి ఇద్దరు మల్లయోధుల మధ్య కుస్తీ పోటీ ఏర్పాటు చేయబడింది. వారిలో ఒకడు హనుమాన్‌సింగ్. మరొకడు పంజాబు

నుండి వచ్చిన మహమ్మదీయుడు. ఆ మహమ్మదీయుడు చాలా దృఢంగా, బలంగా, లావుగా ఉన్నాడు. ఈ పోటీకి పదిహేను రోజుల ముందు నుంచి అతడు వెన్న, మాంసం తిన్నాడు. పోటీ జరిగే రోజున కూడా కడుపారా తిన్నాడు. అతడే గెలుస్తాడని అందరూ అనుకున్నారు. హనుమాన్‌సింగ్ మాత్రం పోటీకి కొన్ని రోజుల ముందు నుండి అతి తక్కువగా తింటూ పోటీ జరిగే రోజున పూర్తిగా ఉపవాసం కూడా చేశాడు. అయితే రాత్రింబవళ్ళూ మల్లయోధుల ఆరాధ్యదైవమైన హనుమంతుడి జపం చేశాడు. అతడు తప్పకుండా ఓడిపోతాడని అందరూ అనుకున్నారు. కానీ పోటీలో హనుమాన్‌సింగ్ గెలిచాడు. పదిహేనురోజులపాటు విందారగించిన ఆ మహమ్మదీయుడు ఓడిపోయాడు. హనుమంతుడి మీద విశ్వాసమే హనుమాన్ సింగ్‌ను గెలిపించింది. విశ్వాసానికి అంతటి శక్తి ఉంది!"

## 48. దేవుని పేరుకు గల శక్తి
## (గుహుని కథ)

"ఒక రాజుకు బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంది. దానికి పరిహారం ఏమిటో తెలుసుకుందామని ఒక ముని ఆశ్రమానికి వెళ్ళాడు. ఆ సమయానికి ఆ ముని అక్కడ లేడు. ఆ ముని యొక్క కుమారుడు ఉన్నాడు. అతడు రాజుగారి కథను విన్నాడు. ఆ పాపపరిహారంగా, 'రామనామాన్ని మూడుసార్లు జపించండి, మీ పాపం పరిహారమవుతుంది" అని చెప్పాడు. ఆ ముని తిరిగివచ్చి, తన కుమారుడు రాజుకు చెప్పిన పరిహారాన్ని విన్నాడు. అతనికి చాలా కోపం వచ్చింది. ఆ ముని తన కుమారుడితో, 'ఓరి వెర్రివాడా! జన్మజన్మల పాపాలు ఒక్కసారి రామనామాన్ని జపిస్తేనే పటాపంచలవుతాయి గదా! మూడుసార్లు రామనామం జపించమన్నావా? దీనినిబట్టి రామనామం మీద నీకున్న విశ్వాసం ఎంత బలహీనమైనదో తెలుస్తోంది! ఇటువంటి విశ్వాసరాహిత్యానికిగాను కులభ్రష్టుడివై పో!' అని శపించాడు. ఆ ముని కుమారుడే తరువాత రామాయణంలోని గుహుడు అయ్యాడు. భగవంతుని నామానికి ఉన్న శక్తి అపారం. దానిని తక్కువగా అంచనా వెయ్యకూడదు సుమా!" అని గురుదేవులు చెప్పారు.

## 49. నమ్మకం లేనివాడు నాశనమవుతాడు
## (సముద్రం మీద నడిచిన ప్రయాణీకుడు)

ఒకసారి శ్రీరామకృష్ణులు ఈశ్వరచంద్ర విద్యాసాగరుని ఇంటికి వెళ్ళారు. మాటల మధ్యలో గురుదేవులు ఈ విధంగా అన్నారు. "భగవంతుణ్ణి కేవలం పాండిత్యం ద్వారా, తర్కం ద్వారా తెలుసుకోలేం. దానికి పట్టుసడలని విశ్వాసం, ప్రేమ ఉండాలి. విశ్వాసానికి ఉన్న శక్తి, విశ్వాసం లేనివాని గతి – ఎలా

ఉంటాయో చెప్పే ఒక కథ చెపుతా విను!"

"ఒకసారి ఒకడు సముద్రాన్ని దాటి లంకనుండి భారతదేశానికి రావాలనుకున్నాడు. విభీషణుడి దగ్గరకు వెళ్ళి ఆయన సలహా కోరాడు. విభీషణుడు ఏదో ఒక వస్తువును అతని అంగవస్త్రం అంచులో పెట్టి ముడివేశాడు. ఆ ముడిలో ఏముందో అతనికి తెలియదు. విభీషణుడు అతనితో ఈ విధంగా చెప్పాడు: 'భయపడకు! నువ్వు నీటిపై నడిచి సముద్రాన్ని క్షేమంగా దాటగలుగుతావు. నీ అంగవస్త్రానికి కట్టిన దానిని మాత్రం ముడివిప్పి చూడవద్దు. చూస్తే మునిగిపోతావు సుమా!' అని హెచ్చరించాడు. విభీషణుడి మాటలపై విశ్వాసంతో అతడు నేలమీద నడిచినంత సులభంగా సముద్రంమీద నడచిపోసాగాడు. విశ్వాసానికున్న శక్తి అంత మహత్తరమైనది!"

"కొంతదూరం వెళ్ళాక అతనికి ఒక సందేహం కలిగింది. 'నేను ఇంత సులభంగా నీటి మీద ఎలా నడచిపోతున్నాను! విభీషణుడు నా కొంగు చివర ఏమి కట్టి ఉంటాడు? తీసి చూస్తే బాగుంటుందే' అనుకున్నాడు. అంగవస్త్రం ముడి విప్పి చూశాడు. దానిలో ఒక ఆకు ఉంది. ఆ ఆకు మీద రామనామం వ్రాయబడి ఉంది. దాన్ని చూసి, 'ఓహో! ఇంతేనా!' అనుకున్నాడు. వెంటనే నీటిలో మునిగిపోయాడు. విశ్వాసం కొద్దిగా సడలిపోగానే అంతకు ముందున్న శక్తి పోయింది. అదే అతని వినాశానికి కారణం అయింది."

## 50. అసలైన ప్రేమ - భక్తి
## (అర్జున గర్వభంగము)

శ్రీకృష్ణుని ప్రియమిత్రుడైన అర్జునుడి హృదయంలో ఒకసారి అహంకారం జనించింది. శ్రీకృష్ణుని భక్తులలో తనకు సాటి ఎవ్వరూ లేరని అనుకున్నాడు. అంతా తెలిసిన శ్రీకృష్ణుడు అర్జునుడి మనసులోని విషయాన్ని కనిపెట్టాడు. ఒకరోజు అర్జునుణ్ణి తనతో వాహ్యాళికి తీసుకొని పోయాడు. కొంతదూరం వెళ్ళిన తరువాత వారికి ఒక బ్రాహ్మణుడు కనిపించాడు. అతడు ఎండుగడ్డి తింటున్నాడు. అతని నడుముకు ఒక కత్తి వ్రేలాడుతోంది. అర్జునుడు వెంటనే అతడు గొప్ప కృష్ణ భక్తుడని గ్రహించాడు. అటువంటి భక్తులు ఎవ్వరికీ హాని తలపెట్టరు. కనుకనే పచ్చిగడ్డిలో జీవం ఉంటుందన్న భావంతో ఎండుగడ్డిని మాత్రమే తింటున్నాడు. మరి అతని దగ్గర హింసకు ప్రతీక అయిన ఆ కత్తి ఎందుకు ఉన్నట్టు?

ఈ విషయం అర్థంకాక అర్జునుడు శ్రీకృష్ణుడితో, "ఏమిటిది? ఇతణ్ణి చూస్తే గడ్డిపోచకు కూడా హాని తలపెట్టనివాడిలాగా ఉన్నాడు. అయినా అతని దగ్గర హింసనూ, చావునూ సూచించే కత్తి ఉంది దేనికి?" అని అడిగాడు.

శ్రీకృష్ణుడు చిరునవ్వుతో, "నీవే పోయి అతణ్ణి అడిగితే బాగుంటుంది!" అని చెప్పాడు. అర్జునుడు ఆ బ్రాహ్మణుడి దగ్గరకు వెళ్ళి, "అయ్యా! మీరు ఎవ్వరినీ హింసించరు. ఎండుగడ్డి తిని కాలం గడుపుతున్నారు. మరి ఈ పదునైన కత్తితో మీకేం పని?" అని ప్రశ్నించాడు.

ఆ బ్రాహ్మణుడు, "నలుగురు మనుషులు ఉన్నారు. ఎక్కడైనా ఎదురైతే వాళ్ళకు బుద్ధి చెప్పాలని ఈ కత్తి తీసుకుని తిరుగుతున్నాను" అని సమాధానమిచ్చాడు.

అర్జునుడు :"ఎవరు వాళ్ళు?"

బ్రాహ్మణుడు: "ఆ నీచుడు, నారదుడు – వాళ్ళలో మొదటివాడు!"

అర్జునుడు :"ఎందుకు? ఆయన ఏమి చేశాడు?"

బ్రాహ్మణుడు : "వాడి పొగరు చూడండి! ఎప్పుడూ పాటలతో, సంగీతంతో నా స్వామికి నిద్ర లేకుండా చేస్తుంటాడు. నా స్వామిని కొంచెం సేపైనా విశ్రాంతిగా ఉండనివ్వడు. పగలు, రాత్రి అని చూడకుండా తన ప్రార్థనలతో, స్తోత్రాలతో నా స్వామికి శాంతి లేకుండా విసిగిస్తూ ఉంటాడు."

అర్జునుడు : "మరి రెండవ వ్యక్తి ఎవరు?"

బ్రాహ్మణుడు : "ఆ తెలివితక్కువ ద్రౌపది!"

అర్జునుడు : "ఆమె ఏమి తప్పు చేసింది?"

బ్రాహ్మణుడు : "ఆమె చేసిన దిక్కుమాలిన పని చూడండి! నా స్వామి సరిగ్గా భోజనానికి కూర్చునే సమయానికే ఆమె ప్రార్థన చేసి పిలిచింది. నా స్వామి తన భోజనం మానుకొని కామ్యకవనానికి వెళ్ళి దూర్వాసుడి శాపం నుండి ఆ పాండవులను రక్షించవలసి వచ్చింది. పైగా ఇందుకోసం నా స్వామి చేత తాను తిని వదిలివేసిన ఎంగిలి మెతుకులను తినిపించింది."

అర్జునుడు : "మరి ఆ మూడవ వ్యక్తి ఎవరు?"

బ్రాహ్మణుడు : "ప్రహ్లాదుడు! వాడికి హృదయం లేదు. వాడు ఎంత క్రూరుడంటే నా స్వామిని మరుగుతున్న నూనెలో వేయించాడు. ఏనుగుల చేత త్రొక్కించాడు. దుర్భేద్యమైన రాతి స్తంభాన్ని పగలగొట్టుకుని బయటకు వచ్చేలా చేశాడు."

అర్జునుడు : "నాలుగవ వ్యక్తి ఎవరు?"

బ్రాహ్మణుడు : "ఆ దౌర్భాగ్యుడు, అర్జునుడు!"

అర్జునుడు : "ఏం? అతడు ఏమి తప్పు చేశాడు?"

బ్రాహ్మణుడు : "వాడు ఎంత దుర్మార్గుడో చూడండి! కురుక్షేత్ర యుద్ధంలో నా స్వామిని తన రథసారథిగా చేసుకున్నాడు. అంతకన్నా నీచమైన పని మరొకటి ఉందా?"

అర్జునుడు ఆ బ్రాహ్మణుడి మాటలు విని నిర్ఘాంతపోయాడు. ఆ బ్రాహ్మణుడి భక్తి, ప్రేమ ఎంత గాఢమైనవో చూచి విస్మయం చెందాడు. అతడి గర్వం అణగారిపోయింది. శ్రీకృష్ణుడి భక్తులలో తానే గొప్పవాణ్ణి అనుకునే అహంకారాన్ని వదిలిపెట్టాడు.

## 51. ప్రేమలో మూడు రకాలు ఉన్నాయి
## (గోపికలై జన్మించిన ఋషులు)

“ప్రేమలో మూడు రకాలు ఉన్నాయి. అవి సాధారణ ప్రేమ, సమంజస ప్రేమ, సమర్థ ప్రేమ. సాధారణ ప్రేమలో నేను బాగుంటే చాలు. నువ్వు సుఖంగా ఉన్నా, లేకపోయినా నాకు సంబంధం లేదు అన్న భావం ఉంటుంది. మనం సాధారణంగా చూసే ప్రేమ ఇదే. సమంజస ప్రేమలో నువ్వూ, నేను ఇద్దరమూ సుఖంగా ఉండాలని కోరుకుంటారు. ఇది చాలావరకూ మంచిది. సమర్థ ప్రేమ సర్వోత్కృష్టమైనదే కాక చాలా అరుదైనది కూడా. దీనిలో, ‘నువ్వు సుఖంగా ఉంటే చాలు, నేనేమైపోయినా ఫర్వాలేదు!’ అనే భావం ఉంటుంది. రాధాదేవి, గోపికలు ఇటువంటి భావాన్ని కలిగి ఉండేవారు. ఈ గోపికలు ఎవరో తెలుసా? ఒక పురాణంలో ఇలా చెప్పారు. ‘శ్రీరాముడు అరణ్యవాసం చేసేకాలంలో, ఆయన ఉన్న అరణ్యంలో అరవైవేలమంది ఋషులు నివసించేవారట. వారంతా శ్రీరాముణ్ణి దర్శించాలనుకున్నారట. శ్రీరాముడు వారిని ఒకసారి క్రీగంట చూశాడు. అంతే! ఆ ఋషులే తర్వాత యుగంలో గోపికలుగా జన్మించారట.’ ”

## 52. ఏకాంకిత భక్తి
## (విభీషణుడు, హనుమంతుడు, యశోద, గోపికలు)

“పాండవులు రాజసూయ యాగం చేశారు. అప్పుడు రాజులందరూ కలసి ధర్మరాజుని సింహాసనం మీద కూర్చోబెట్టి, గౌరవసూచకంగా ఆయనకు వంగి నమస్కారం చేశారు. అయితే లంకాధిపతి అయిన విభీషణుడు, “నేను శ్రీ కృష్ణుడికి తప్ప మరొకరికి తలవంచను” అన్నాడు. అది విని శ్రీకృష్ణుడు వచ్చి ధర్మరాజుకు వంగి నమస్కారం చేశాడు. అప్పుడు మాత్రమే విభీషణుడు తన కిరీటంతో సహా వంగి ధర్మరాజుకు నమస్కారం చేశాడు. పట్టుసడలని ఏకాంకిత భక్తి ఆ విధంగా ఉంటుంది.”

“హనుమంతుడు ఒకసారి, ‘సీతారాముల్ని దర్శించుకుంటాను’ అని ద్వారకకు వెళ్ళాడు. అప్పుడు కృష్ణుడు రుక్మిణితో, “నువ్వు త్వరత్వరగా సీతాదేవిలాగా వేషం ధరించు. నేను రాముడి వేషం వేస్తాను. ఆంజనేయుడికి ఆ రూపంలోనే దర్శనమివ్వాలి” అన్నాడు.”

"మరొకసారి ఒకరు, 'ఈ రోజు తిథి వార నక్షత్రాలు ఏమిటి?' అని హనుమంతుణ్ణి అడిగారు. 'నాయనా! నేను ఇవేమీ పట్టించుకోను. నాకు తెలిసింది రాముడొక్కడే. నాకు సంబంధించినంత వరకూ ఈ రోజు రామతిథి, రామవారం, రామనక్షత్రం, రామయోగం, రామకరణం' అని మాత్రమే చెప్పగలను,' అన్నాడు."

ఒకే దేవుణ్ణి కొలిచేవారిలో కూడా ఆ భగవంతుడిలోని ఒక లక్షణమే ఒక భక్తుడికి ఇష్టమైనది కావచ్చు. "ఉద్ధవుడు ఒకసారి కృష్ణుడి దగ్గరనుండి వచ్చి యశోదతో, 'అమ్మా! నీ కృష్ణుడు సామాన్య మానవుడు కాదు. పరబ్రహ్మ స్వరూపుడు. భక్తుల పాలిటి చింతామణి' అని చెప్పాడు. అయితే, యశోద అతడితో, 'ఒరే నాయనా! మీ చింతామణి గురించి నాకు తెలియదు. మా గోపాలుడెలా ఉన్నాడో కొంచెం చెప్పవయ్యా!' అని కోరింది."

మరొక సందర్భంలో, "శ్రీకృష్ణుడు మధురకు వెళ్ళిపోయిన తర్వాత యశోద ఒకసారి రాధ దగ్గరకు వెళ్ళింది. రాధ ధ్యానంలో నిమగ్నమై ఉంది. యశోదతో, 'నేను ఆద్యాశక్తిని. ఏదైనా వరం కోరుకో!' అంది. అప్పుడు యశోద, 'మనస్సు చేత, వాక్కు చేత, శారీరకమైన కర్మల చేత శ్రీకృష్ణుణ్ణే సేవించే వరాన్ని నాకు ప్రసాదించు. కళ్ళతో వాడి భక్తుల్ని దర్శించినప్పుడు కూడా, మనస్సుతో వాడినే ధ్యానించేలాగా, నా నాలుక ఎప్పుడూ వాడినే కీర్తించేలాగా వరం ఇవ్వు!' అని కోరింది" అని గురుదేవులు చెప్పారు.

"గోపికలకు ఒకసారి భగవంతుడి ఇతర రూపాలను దర్శించాలని కోరిక కలిగింది. కృష్ణుడు వారిని యమునానదిలో స్నానం చేసి రమ్మని చెప్పాడు. యమునలో దిగగానే వారికి వైకుంఠ దర్శనం కలిగింది. అక్కడ వారికి షడైశ్వర్య సంపూర్ణుడైన భగవంతుడు కనిపించాడు. కానీ వారికి ఆ రూపం తృప్తికరంగా తోచలేదు. 'కృష్ణా! గోపాలుని దర్శించగలిగేటట్లు, వానిని సేవించగలిగేటట్లు అనుగ్రహించు. ఇది తప్ప మరేదీ అవసరం లేదు,' అని కృష్ణునితో అన్నారు. నిజమైన భక్తులకు భగవంతుడి ఐశ్వర్య సంపదల మీద ఏ మాత్రం మోజు ఉండదు. సరళత్వం నిజమైన భక్తులకు చూడామణిగా భాసిస్తుంది."

## 53. భగవద్భక్తి - ఇంద్రియసుఖాలు
## (రామభక్తుడైన రావణుడు)

సీత అశోకవనంలో బందీగా ఉన్నప్పుడు, మండోదరి తన భర్తతో, "నీవు సీతను నీ రాణిగా చేసుకోవాలనుకుంటే నీ మాయాజాలంతో రాముడి రూపాన్ని ధరించి ఆమెను లోబరుచుకోవచ్చు కదా!" అని సలహా చెప్పింది. వెంటనే రావణుడు, "ఛీ, ఛీ! రాముడి రూపం ధరించి ఇంద్రియ సుఖాలవంటి నీచమైన విషయాలను గురించి ఆలోచించగలనా? రాముడి రూపం తలుచుకుంటేనే నా హృదయం

చెప్పలేని ఆనందంతో నిండిపోతుంది. అప్పుడు స్వర్గసుఖాలు కూడా ఎందుకూ పనికిరానివిగా కనిపిస్తాయి" అన్నాడు. పై కథను వివరిస్తూ, "భగవంతుని ఆలోచనలలో నిండిన మనస్సు ఇంద్రియసుఖాల పైకి మరలదు" అని శ్రీరామకృష్ణులు చెప్పారు.

## 54. జనులకు బోధించడానికే మహర్షుల సగుణభక్తి (నారదుడు – శుకమహర్షి)

"పరీక్షిత్తు మహారాజుకు భాగవతం బోధించవలసినవాడు శుకుడు. అయితే ఆయన నిర్వికల్ప సమాధిలో జడుడిలాగా కూర్చొని ఉన్నాడు. ఆయన అవతారకార్యాన్ని ఆయనకు గుర్తుచేయడానికి నారదుడు వచ్చి చూసేసరికి ఆయనకు బాహ్యస్పృహ లేదు. అప్పుడు నారదుడు వీణ వాయిస్తూ నాలుగు శ్లోకాలలో శ్రీహరి యొక్క మనోహరరూపాన్ని వర్ణిస్తూ పాడాడు. మొదటిశ్లోకం పాడగానే శుకుడి శరీరం పులకించింది. రెండవశ్లోకం పాడేసరికి శుకుడి కన్నుల నుంచి ప్రేమాశ్రువులు రాలసాగాయి. క్రమేణా తన హృదయాంతరాళంలో భగవంతుడి చిన్మయరూపాన్ని దర్శించసాగాడు. జడసమాధి పొందిన తర్వాత కూడా మళ్ళీ సగుణరూపాన్ని దర్శించాడు. ఆ పైన పరీక్షిత్తుకు, పరీక్షిత్తు ద్వారా సకల జగత్తుకు భాగవతాన్ని బోధించాడు."

"శుకమహర్షి ఈశ్వరకోటికి చెందినవాడు. ఇలా ఈశ్వరకోటికి చెందినవారు సమాధిస్థితిని పొందిన తర్వాత కూడా తిరిగి మామూలు స్థితిని పొందగలరు కూడా. ఆంజనేయుడు కూడా సాకార నిరాకార సాక్షాత్కారాలు పొందిన తర్వాత కూడా శ్రీరాముడి మీద అచంచలమైన భక్తిని కలిగి ఉండేవాడు. ఎల్లప్పుడూ చిద్ఘనానందమూర్తి అయిన శ్రీరాముణ్ణే చూసేవాడు."

## 55. భక్తి అన్ని ద్వారాలనూ తెరుస్తుంది (యశోద – రాధ)

కృష్ణుడి క్షేమసమాచారాలు తెలియక యశోద ఒకసారి రాధ దగ్గరకు వచ్చింది. "కృష్ణుడి వార్తలేమైనా తెలుసా?" అని అడిగింది. ఆ సమయంలో రాధ గాఢ సమాధిస్థితిలో ఉంది. ఆ స్థితిలో యశోద పలికిన మాటలు ఆమెకు వినపడలేదు. ఆ తరువాత బాహ్యస్పృహ కలిగాక యశోద తన ఎదురుగా నిలబడి ఉండడాన్ని చూసింది. వెంటనే ఆమెకు నమస్కరించింది. ఆమె వచ్చిన కారణాన్ని తెలుసుకుని, "తల్లీ! నువ్వు కళ్ళు మూసుకుని గోపాలుని రూపాన్ని ధ్యానించు! అతణ్ణి చూడగలుగుతావు!" అని చెప్పింది. యశోద కళ్ళు మూసుకోగానే రాధ తన ఆధ్యాత్మిక శక్తితో యశోదను దివ్యభావ పారవశ్యస్థితిలో ముంచివేసింది. ఆ

దివ్యస్థితిలో యశోద గోపాలుణ్ణి చూడగలిగింది. అప్పుడు యశోద రాధను, "అమ్మా! నేనెప్పుడు కళ్ళు మూసుకున్నా గోపాలుడు నాకు కనపడేట్టు చెయ్యి తల్లీ!" అని కోరింది. భక్తి అన్ని అవరోధాలనూ తొలగిస్తుంది, భౌతికమైన వాటితో సహా!

## 56. అందరూ కోరేవాటిని భక్తుడు కోరడు
## (విభీషణుడు - లంకా రాజ్యం)

రావణుడు మరణించిన తరువాత విభీషణుడు లంకానగరానికి రాజుగా ఉండనన్నాడు. అతడు శ్రీరాముడితో, "ఓ రామా! నేను నిన్ను పొందగలిగాను. ఇంక ఈ రాజ్యంతో పని ఏముంది?" అన్నాడు. దానికి బదులుగా శ్రీరాముడు, "విభీషణా! అజ్ఞానుల కోసం నువ్వు ఈ రాజ్యాన్ని ఏలాలి. ఎందుకంటే, నన్ను ఇంతగా సేవించిన తరువాత నువ్వు ఏ సంపదలు పొందావని వాళ్ళకి సందేహం రావచ్చు, వాళ్ళకి ఒక గుణపాఠం నేర్పడానికైనా నువ్వు రాజుగా ఉండాలి," అని చెప్పాడు. సాధారణంగా లౌకికులు కోరేవాటిని భక్తుడు కోరడు. కానీ భగవంతుని ఆదేశం ఉంటే వాటిని స్వీకరిస్తాడు.

## 57. స్వచ్ఛమైన ప్రేమ
## (గీతా ప్రసంగం - చదువురాని భక్తుడు)

"ఒకచోట గీతాప్రసంగం జరుగుతున్నది. పండితుడు అద్భుతంగా భగవద్గీతలోని శ్లోకాలను వివరిస్తున్నాడు. అక్కడ ఒక చదువురాని పల్లెటూరివాడు కూర్చొని, గీతాప్రసంగం జరుగుతున్నంతసేపూ కన్నీళ్ళు కారుస్తున్నాడు. అయితే ఈ భక్తుడికి ఆ పండితుడు చెప్పే ఒక్క మాట కూడా అర్థం కావడం లేదు. 'మరి ఎందుకు కన్నీళ్ళు కారుస్తున్నావు?' అని అడిగితే ఈ విధంగా సమాధానం ఇచ్చాడు. 'నాకు గీతలోని ఒక్కమాట కూడా అర్థం కావడం లేదన్నది నిజమే. కానీ, భగవద్గీతను వింటున్నానన్న ఆలోచన నా మనస్సులో శ్రీకృష్ణుడి భావాన్ని నింపి వేసింది. కురుక్షేత్రంలో రథం మీద శ్రీకృష్ణుడు, అర్జునుడు నిలబడి ఉండడం, గీతా రహస్యాలను శ్రీకృష్ణుడు, అర్జునుడికి బోధించడం నాకు స్పష్టంగా కనపడుతున్నాయి. అందుకనే నా కళ్ళలోనుండి ఆనందబాష్పాలు కారుతున్నాయి'."

దీనిని వివరిస్తూ గురుదేవులు "అక్షరాలు కూడా రాని ఈ భక్తుడు, మహాజ్ఞానాన్ని పొందాడు. ఇదంతా అతనికి భగవంతుని మీద ఉన్న స్వచ్ఛమైన ప్రేమవల్లనే సాధ్యమయింది."

# 58. భక్తునికి కావలసినది (హనుమంతుడు - మండోదరి)

ఒకసారి శ్రీరామకృష్ణుల గదిలో మహేంద్రనాథ గుప్తతో పాటు చాలామంది యువభక్తులు కూర్చొని ఉన్నారు. గురుదేవులు వారితో చాలా సంతోషంగా కబుర్లు చెపుతున్నారు. సంభాషణ, అక్కడ గోడకు తగిలించి ఉన్న హనుమంతుడి పటం మీదకు మళ్ళింది. హనుమంతుడి భక్తి గురించి చెపుతూ గురుదేవులు ఈ క్రింది కథను వివరించారు. "హనుమంతుని మానసికస్థితి ఎలా ఉండేదో ఊహించండి! అతడు డబ్బును కానీ, పేరుప్రతిష్ఠలను కానీ, ఇంద్రియసుఖాలను కానీ, వేటినీ లెక్కచెయ్యలేదు. భగవంతుణ్ణి మాత్రమే కోరుకున్నాడు. రావణాసురుడు ఒక వరం పొందాడు. ఆ వరప్రభావం వల్ల అతడు ఒక ప్రత్యేకమైన దివ్యాయుధం చేత మాత్రమే చంపబడతాడు. ఆ ఆయుధాన్ని రావణాసురుడు తన భవనంలోని ఒక స్ఫటికస్తంభంలో దాచి ఉంచాడు. హనుమంతుడు ఒక మామూలు కోతివేషంలో ఆ సౌధంలోకి ప్రవేశించి, ఆ స్తంభాన్ని పగులగొట్టి, ఆ ఆయుధాన్ని తీసుకుని పారిపోసాగాడు. అది చూసిన మండోదరి రకరకాల పళ్ళు అతనికి చూపించి మభ్యపెట్టడానికి ప్రయత్నించింది. పళ్ళ కోసం కోతి దిగివచ్చి ఆ ఆయుధాన్ని క్రింద పడవేస్తుందని ఆమె ఉద్దేశ్యం. కానీ హనుమంతుడు అంత సులభంగా మోసపోడు. ఆమె మాటలకు జవాబుగా ఈ పాటను పాడాడు."

"ఫలముకేమి కొదువ నాకు,
జన్మ సఫలమై యుండగ
మోక్షఫలము నొసగు రామ
కల్పతరువు హృదినుండగ"

నిజమైన భక్తుడు సాధారణమైన భోగభాగ్యాలను, సుఖసౌఖ్యాలను ఆశించడు. అతనికి కావలసినది భగవంతుడి ఆశ్రయం మాత్రమే.



# భగవద్దర్శనానికి మార్గాలు

## 59. మొదట హృదయాన్ని పవిత్రం చేసుకోండి! (పద్దయ్య దేవతార్చన)

నరేంద్రుడు (వివేకానంద స్వామి) ఒకసారి ఇద్దరు ముగ్గురు యువకులతో కలిసి దక్షిణేశ్వరానికి వెళ్ళాడు. ఆ యువకులు బ్రహ్మసమాజానికి చెందినవాళ్ళు. అప్పుడు నరేంద్రుని వయస్సు పంతొమ్మిదేళ్ళు. ఆ రోజు అంతా వాళ్ళు గురుదేవుల వద్ద గడిపారు.

మర్నాటి ఉదయం ఆ యువకులు గంగలో స్నానం చేసి, పంచవటిలో కొంచెంసేపు ధ్యానం చేసి, గురుదేవుల గదిలోకి వచ్చి కూర్చున్నారు. అప్పుడు ఆయన వాళ్ళతో, "నాయనా! మొదట మీ హృదయాన్ని పరిశుభ్రం చేసుకొని భగవంతుణ్ణి ప్రతిష్ఠించుకోండి! తరువాత మీరు కోరినన్ని ఉపన్యాసాలివ్వండి! లేకపోతే మీరు చెప్పే మాటలన్నీ కేవలం శంఖం ఊది, గంటలు కొట్టే గందరగోళం అవుతుంది. ఒక కథ చెపుతా వినండి!"

"ఒక పల్లెటూళ్ళో పద్మలోచనుడనే యువకుడున్నాడు. ఆ ఊరివాళ్ళంతా ముద్దుగా అతణ్ణి 'పద్దయ్య' అని పిలుస్తుండేవారు. ఆ ఊళ్ళోనే ఒక పాడుబడిన దేవాలయం ఉంది. అది శిథిలమైపోవడంవల్ల దాని మొండి గోడల మీద రావి మొదలైన చెట్టుచేమలు పెరిగాయి. ఆ గుళ్ళో విగ్రహం లేకపోగా, నిండా చెత్తాచెదారం పేరుకుపోయి, అది ఒక గబ్బిలాల కొంపలాగా తయారయింది. అందువల్ల గ్రామస్థులు ఆ దేవాలయానికి వెళ్ళడం మానుకున్నారు."

"ఇలా ఉండగా ఒకరోజు సాయంత్రం అకస్మాత్తుగా ఆ గుళ్ళోనుండి జేగంటల శబ్దము, శంఖారావము వినవచ్చాయి. ఎవరో ఒక మహాత్ముడు వచ్చి గుడిని బాగుచేసి, ప్రదోషకాలంలో హారతి చేస్తున్నాడనుకుని గ్రామస్థులు అక్కడికి వెళ్ళారు. శబ్దాలు వినపడడమేగాని, ఆ గుడి పరిస్థితి ఎప్పటిలాగానే ఉంది. వాళ్ళలో ఒకడు ముందుకుపోయి, 'లోపల ఏమి జరుగుతున్నదా' అని తలుపు సందుల్లోనుంచి చూచాడు. లోపల పద్దయ్య గోడకు ఆనుకుని బిగ్గరగా శంఖం ఊదడం, గంటలు కొట్టడం కనిపించింది. లోపల విగ్రహం లేదు. నేల పరిశుభ్రం చేయబడలేదు. ఆ విషయం తెలిసి గ్రామస్థులు తలుపు తెరిచి పద్దయ్యను ఇలా మందలించారు:

'ఇది ఏమిర మందమతీ?
విగ్రహమా నెలకొల్పవు, మలినమునా తొలగించవు!
ఆలయమున శంఖూదుచు, గగ్గోలును గావింతువు!'

“ఆలయంలో కొన్ని గబ్బిలాలు కీకురుబాకురుమంటూ, చికాకు పరుస్తున్నాయి. చుట్టూ చెత్తాచెదారం, గబ్బిలాల రెట్టలు నిండిన గర్భాలయంలోకి పవిత్రమైన

దేవతా విగ్రహాన్ని ఎవ్వరూ తీసుకురారు. అలాగే నీకు దైవసాక్షాత్కారం కావాలంటే, హృదయమందిరంలో భగవంతుణ్ణి ప్రతిష్ఠించుకోవాలంటే, మొదట నీ హృదయాన్ని పరిశుభ్రం చేసుకో! అప్పుడు ఆ పవిత్రమైన హృదయమందిరంలో భగవంతుడు ప్రతిష్ఠితమవుతాడు. అయిదు కర్మేంద్రియాలు, అయిదు జ్ఞానేంద్రియాలు, మనస్సు ఒకటి, మొత్తం పదకొండు – వీటినే గబ్బిలాలుగా చెప్పుకోవచ్చు."

ఇలా కథను ముగిస్తూ, గురుదేవులు ఆ బ్రహ్మసమాజ యువకులతో, "నాయనా! మొదట మీ హృదయమందిరాలను వివేకవైరాగ్యాలతో పరిశుభ్రం చేసుకోండి! వివేకవైరాగ్యాలు లేకుండా ఉపన్యాసాలవల్ల, పాండిత్యంవల్ల ప్రయోజనం లేదు. మొదట దేవుణ్ణి హృదయమందిరంలో ప్రతిష్ఠించుకొని తరువాత మీ ఇష్టం వచ్చినన్ని ఉపన్యాసాలివ్వండి! మీ హృదయంలోని అట్టడుగు లోతులలోనికి మునిగితే అక్కడ రాశులుపోసి ఉన్న మణులు, మాణిక్యాలను (ఆధ్యాత్మిక అనుభవాలను) మీరు పొందవచ్చు."

## 60. అనుభవమే ప్రధానం
## (మామిడి పండ్లు తిను!)

శ్రీగురుదేవుల ఆరోగ్యస్థితిని గురించి చెప్పడానికి ఒకరోజు డాక్టరు మహేంద్రలాల్ సర్కారు గారి ఇంటికి మహేంద్రనాథ గుప్త వెళ్ళాడు. ఆ సమయంలో డాక్టరు సర్కారు, మహేంద్రునితో 'గోథే' అనే ఆంగ్లరచయిత గురించి చెపుతూ, 'గోథే ఆత్మ ఆయన శరీరంలో నుంచి బయటకు వచ్చింది. ఆ ఆత్మను గోథే చూచాడు' అని చెప్పారు. ఈ విషయం తనకు డాక్టరు బహదూరి తరచుగా చెపుతుంటాడని కూడా చెప్పాడు. అప్పుడు మహేంద్రుడు డాక్టరుతో, "ఆత్మ ఉన్నదా, లేదా అనే ఈ వాదోపవాదాలతో ప్రయోజనమేమున్నదండీ? మానవజన్మ ఎత్తినందుకు మనం చేయవలసింది భగవంతుణ్ణి దర్శించడమే. ఈ విషయంలో శ్రీరామకృష్ణులు చెప్పిన ఒక కథ మీకు చెపుతాను!" అని ఈ కథను చెప్పాడు.

"మామిడిపండ్లు తినాలని ఒకడు మామిడితోటకు వెళ్ళాడు. అయితే తోటలోకి వెళ్ళిన తరువాత జేబులో నుండి పుస్తకం, కలం తీసి, తోటలో ఎన్ని చెట్లున్నాయో, చెట్టుకు ఎన్ని కొమ్మలున్నాయో, కొమ్మకు ఎన్ని ఆకులు, కాయలు, పండ్లు ఉన్నాయో లెక్కలు కట్టడం మొదలు పెట్టాడు. తోటమాలి ఇతడు లెక్కలు కట్టడం గమనించి దగ్గరకు వచ్చి, 'ఏమయ్యా! ఇక్కడ ఏం చేస్తున్నావు? అసలు నీవు తోటలోనికి ఎందుకు వచ్చావు?' అని ప్రశ్నించాడు. వాడు, 'మామిడిపళ్ళు తిందామని వచ్చాను' అని సమాధానం చెప్పాడు. అప్పుడు ఆ తోటమాలి, 'మామిడిపండ్లు తినడానికి వచ్చినవాడివి అడిగి పండ్లు కోసుకొని హాయిగా

తినివెళ్ళక, ఇదేమిటయ్యా! చెట్లు, కొమ్మలు, ఆకులు లెక్కపెడుతున్నావు. ఈ లెక్కలవల్ల ఏమి సాధించాలనుకుంటున్నావు?' అని అడిగాడు. అందువల్ల నిజంగా కావలసినది భగవదనుభూతి. అది లేకుండా వాదోపవాదాలవల్ల, విమర్శలవల్ల ప్రయోజనమేమీ లేదు."

## 61. మార్గాల వివరాలు తెలిపేవే శాస్త్రాలు (ఉత్తరములోని వస్తువుల జాబితా)

"ఒకడికి ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరం అతడి ముఖ్యబంధువు వ్రాసింది. ఆ బంధువు అతణ్ణి కొన్ని వస్తువులు కొని పంపమని వ్రాశాడు. వాడు ఆ ఉత్తరం చదివి ప్రక్కన పెట్టాడు. తరువాత బజారుకు బయలుదేరేసరికి ఆ వస్తువుల వివరాలు గుర్తులేవు. అందువల్ల ఉత్తరం కోసం చూశాడు. దాన్ని ఎక్కడోపెట్టి మరచిపోవడంవల్ల ఆతురతతో వెతకడం మొదలుపెట్టాడు. అతడి ఆదుర్దా చూసి ఇంట్లో వాళ్ళందరూ కలసి గాలించారు. చివరికి ఎక్కడో ఆ ఉత్తరం దొరికింది. అతడి ఆనందానికి అంతులేదు. గబగబా ఆ ఉత్తరం చదివాడు. అందులో 5 సేర్ల మిఠాయి, ఒక గుడ్డ, అలాంటివే ఇంకా కొన్ని వస్తువులు పంపమని వ్రాసివుంది. ఆ వివరాలు చదివాక అతడికి దాని అవసరం తీరిపోయింది. తరువాత చెయ్యవలసిన పని బజారుకు వెళ్ళి, ఆ వస్తువులను సంపాదించి బంధువుకు పంపడమే. వివరాలు తెలిసేవరకే కదా ఆ ఉత్తరం ప్రయోజనం!"

ఈ కథను శ్రీరామకృష్ణులు శశిధర పండితుడికి, గిరీశచంద్ర ఘోషుకు చెప్పి, "శాస్త్రాలలో కేవలం భగవంతుణ్ణి దర్శించే మార్గం వివరించబడి ఉంటుంది. ఆ మార్గం యొక్క వివరాలు తెలుసుకున్న తరువాత భగవంతుణ్ణి పొందడానికి సాధన ప్రారంభించాలి. అప్పుడే గమ్యాన్ని చేరుకోగలుగుతాం. అంతేకాని, కేవలం పాండిత్యంవల్ల ప్రయోజనం ఏమిటి? గ్రంథాలను కంఠస్థం చేసి, ఆంతర్యంలో మాత్రం 'కామినీ కాంచనాల' కోసం ప్రాకులాడుతుంటే, శాస్త్రాల నిజమైన అర్థాన్ని జీర్ణించుకోలేదని విస్పష్టమౌతుంది గదా! కాబట్టి అటువంటి పాండిత్యం నిష్ప్రయోజనం. వేదాలు, తంత్రాలు, షడ్దర్శనాలు చదవడంవల్ల మాత్రమే భగవంతుడు తెలియబడడు. కావలసింది వైరాగ్యం, ఆధ్యాత్మిక సాధన మాత్రమే" అని పై కథలోని తత్త్వాన్ని విశదీకరించారు.

## 62. ఆర్తివుంటే అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి (పిల్లవాని జబ్బు - పుర్రెలో విషము)

మహిమచరణ చక్రవర్తి ఒకసారి శ్రీరామకృష్ణులను ఇలా ప్రశ్నించాడు: "ఎటువంటి పని చెయ్యడం వల్ల భగవంతుణ్ణి కనుగొనవచ్చునండీ?"

గురుదేవులు: "ఈ కర్మ, ఆ కర్మ చెయ్యడం వల్ల భగవంతుణ్ణి కనుగొనలేము. ఆయన అనుగ్రహం ఉంటే ఆయనే దర్శనమిస్తాడు. కానీ హృదయ వ్యాకులతతో భగవంతుణ్ణి ప్రార్థించాలి. ఆర్తి ఉంటే భగవంతుని అనుగ్రహం కలుగుతుంది. భగవంతుని దర్శనం లభించడానికి కొన్ని అనుకూల పరిస్థితులు ఉండాలి. సజ్జనసాంగత్యం, వివేకం, గురువు యొక్క అనుగ్రహం మొదలైన పరిస్థితులు సమకూరితే భగవత్సాక్షాత్కారం అవుతుంది. ఒక కథ చెపుతా విను!"

"ఒక కుటుంబంలో ఒకడికి జబ్బు చేసింది. అవసానపరిస్థితి వచ్చింది. అప్పుడు ఒకరు వచ్చి, 'ఈ రోగి బ్రతకడానికి ఒక మందున్నది. అదేమంటే, స్వాతి నక్షత్రంలో వాన కురవాలి. ఆ వాననీరు మనిషి పుర్రెలో పడాలి. ఆ పుర్రెలోని వాననీటిలో కప్పను కాటువేస్తున్న పాము యొక్క విషం పడాలి. ఆ విషంతో మందు తయారుచేసి ఇస్తే ఈ రోగి బ్రతుకుతాడు' అని చెప్పాడు."

"ఆ ఇంటి యజమాని వెంటనే పంచాంగం తీసి చూచాడు. సరిగా ఆ సమయంలో స్వాతి నక్షత్రం ఉంది. వెంటనే అతడు ఎంతో ఆర్తితో, 'ఓ ప్రభూ! ఇక మిగిలిన పరిస్థితులన్నీ అనుకూలించేటట్లు అనుగ్రహిస్తే నా పని సానుకూలమౌతుంది,' అని భగవంతుణ్ణి ప్రార్థించసాగాడు. అతడు ఇలా ప్రార్థిస్తూ ప్రార్థిస్తూ బయలుదేరి వెళుతూ ఉండగా ఒక నిర్జనప్రాంతంలో నేలమీద ఒక మనిషిపుర్రె కనిపించింది. అదే సమయంలో వానజల్లు కూడా పడి, ఆ పుర్రెలో నీళ్ళు నిలిచాయి. అతడు ఆనందంతో గంతులువేస్తూ, 'ఓ దయామయా! మనిషి పుర్రె దొరికింది. అంతేకాక దానిలో స్వాతిజల్లు కూడా పడింది. దయచేసి మిగిలినవి కూడా సమకూర్చు!' అని ప్రార్థించాడు. వ్యాకులతతో చేసిన ఆ ప్రార్థనవల్ల ఒక విషసర్పం ఆ పుర్రె వైపు రావడం చూచాడు. ఇక అతడి ఆనందానికి పట్టపగ్గాలు లేవు. ఆ ఆనందంలో అతడి గుండె డబడబా కొట్టుకోవడం అతడికే వినపడింది. మళ్ళీ, 'ఓ దేవా! పాము కూడా వచ్చింది. ఈ వస్తువులు సమకూర్చినట్లే మిగిలిన వాటిని కూడా నాకు ప్రసాదించు' అని ప్రార్థించాడు. అతడు ఈ విధంగా ప్రార్థించాడో లేదో గంతులువేస్తూ ఒక కప్ప అక్కడికి వచ్చింది. వెంటనే పాము దానిని తరిమింది. పాము కాటు వేయబోయే సమయంలో కప్ప పుర్రెమీద నుండి గంతువేయడం, విషపుచుక్కలు పుర్రెలోవున్న నీటిలో పడడం జరిగాయి. అప్పుడు వాడు చప్పట్లు కొడుతూ నృత్యం చెయ్యడం మొదలు పెట్టాడు."

"కాబట్టి, నేను చెప్పేదేమంటే, ఆర్తి వల్ల సమస్తము సమకూరుతుంది."

## 63. జీవితగమ్యం ఏమిటో తెలుసుకోవాలి
## (వీధి భాగవత ప్రదర్శన – నిద్రపోయిన ప్రేక్షకుడు)

బలరాంబోసు శ్రీరామకృష్ణులకు చాలా ప్రియమైన గృహస్థభక్తుడు. ఆయనకు కలకత్తాలో ఒక ఇల్లు ఉంది. గురుదేవులు ఒకరోజు ఆయన ఇంటికి బయలుదేరబోతున్నారు. ఆ సమయంలో అక్కడ నరేంద్రుడు, భావనాథ్ మొదలైన వాళ్ళున్నారు. నరేంద్రునికి అనారోగ్యంగా ఉన్నప్పటికీ గురుదేవులు అతణ్ణి కొన్ని పాటలు పాడమన్నారు. నరేంద్రుడు పాడాడు. "రాఖాలు ఎక్కడున్నాడు?" అని గురుదేవులు ప్రశ్నించారు. "నిద్రపోతున్నాడు" అని వాళ్ళు సమాధానం చెప్పారు.

వెంటనే గురుదేవులు వాళ్ళతో, "మీకొక కథ చెపుతాను, వినండి!" అని ఈ క్రింది కథను చెప్పారు.

"ఒక ఊరిలో ఒకచోట వీధి భాగవత ప్రదర్శన ఉందని ఒకడికి తెలిసింది. దానిని చూద్దామని వాడు బయలుదేరాడు. అక్కడ నేల మీద కూర్చోవలసి వస్తుందని, ఒక చాపను చంకన పెట్టుకొని వెళ్ళాడు. తీరా అక్కడికి చేరేసరికి ఇంకా భాగవతం మొదలుపెట్టడానికి చాలాసేపు పడుతుందని తెలుసు కున్నాడు. అందువల్ల వాడు చాపను నేలమీద పరిచి నడుం వాల్చాడు. వాడు ఇలా పడుకున్నాడో లేదో, ఒళ్ళు తెలియకుండా గుర్రుపెట్టి నిద్రపోయాడు. మెలకువ వచ్చి చూచేసరికి భాగవతం ఆడటమూ అయిపోయింది, వచ్చిన వాళ్ళు ఇళ్ళకు చేరటం కూడా జరిగిపోయింది. ఇక వాడు కళ్ళు నులుముకొని మళ్ళీ ఆ చాప చుట్టి, చంకనపెట్టుకొని నిరాశగా వెళ్ళిపోయాడు. అదే విధంగా జీవితగమ్యమేమిటో తెలియకుండా కాలం గడిపేవాళ్ళు చివరకు నిరాశతో జీవితం చాలించాల్సి వస్తుంది."

## 64. చిత్తశుద్ధి ఉంటే మార్గం ఏర్పడుతుంది (ప్రయాణీకుడు-సాధువు; పూరీ తీర్థయాత్ర; సేవలు చేసే కోడలు)

చిత్తశుద్ధి యొక్క అవసరాన్ని వివరిస్తూ గురుదేవులు ఈ కథను చెప్పారు. "ఒక ప్రయాణీకుడు ఒక ఊరిగుండా నడచిపోతూ విశ్రాంతి కోసం ఒక ఇంటి ముందున్న అరుగుమీద కూర్చున్నాడు. తన ప్రక్కనే మౌనంగా కూర్చున్న ఒక సాధువును, 'అయ్యా! ఫలానా ఊరికి త్రోవ ఎటు?' అని అడిగాడు. అయితే ఆ సాధువు సమాధానం చెప్పలేదు. కొద్దిసేపు వేచి ఉండి మళ్ళీ అడిగాడు. అయినా ఆ సాధువు సమాధానం చెప్పలేదు. ఇలా రెండుమూడుసార్లు జరిగింది. ఈ లోపల సేదదీరిన ఆ యాత్రికుడు ఆ సాధువును అడిగి లాభం లేదని అనుకుంటూ, తానే ఎలాగో తెలుసుకోవచ్చులే అనుకుని, తిరిగి ప్రయాణం కొనసాగిద్దామన్న నిశ్చయంతో లేచి నిలబడి నడక మొదలుపెట్టాడు. అది చూడగానే ఆ సాధువు, 'ఇటు వెళితే ఆ ఊరు వస్తుంది' అని త్రోవ చూపెట్టాడు. అప్పుడు ఆ ప్రయాణీకుడు 'అయ్యా! ఇందాక నేను అన్నిసార్లు అడిగాను. మీరు చెప్పలేదు. తీరా నేను బయలుదేరుతుంటే త్రోవ చూపిస్తున్నారు. మీ ధోరణి ఏమిటో నాకు అర్థం కావట్లేదు' అన్నాడు. అప్పుడు సాధువు, 'ఇందాకా నీవు ఆ ఊరు వెడతావో లేక ఊరికే అడుగుతున్నావో తెలియలేదు. అందుకనే చెప్పలేదు. ఇప్పుడు నిజంగా ఆ ఊరు వెళ్ళేందుకు ఉద్యుక్తుడవయ్యావు. అందుచేత నీకు త్రోవ చూపిస్తున్నాను' అని బదులిచ్చి తిరిగి మౌనం వహించాడు."

"నిజంగా, చిత్తశుద్ధితో ప్రయత్నం మొదలుపెడితే సహాయం దానంతట అదే వస్తుంది. అలా ఉద్యమించనంత వరకూ దేవుడు కూడా మనకు సహాయపడడు" అని గురుదేవులు ఉద్బోధించారు. (ఈ సత్యం ఆధ్యాత్మిక విషయాలలోనే కాక

ప్రాపంచిక జీవితంలో కూడా చక్కగా పనిచేస్తుందని గమనించాలి.)

మరొకసారి డాక్టరు మహేంద్రలాల్ సర్కారు "భగవంతుణ్ణి అసలు పొందవచ్చునా?" అని గురుదేవులను ప్రశ్నించాడు.

గురుదేవులు: "ఒక కథ చెపుతా విను! ఒకసారి ఒక భక్తుడు పూరీజగన్నాథ స్వామిని దర్శించాలనే పట్టుదలతో, భక్తిశ్రద్ధలతో యాత్రకు బయలుదేరాడు. పూరీక్షేత్రానికి దారి ఎటో అతడికి తెలియదు. అందువల్ల అతడు దక్షిణ దిక్కుకు బదులుగా పడమరవైపు వెడుతున్నాడు. కనపడ్డవాళ్ళందరినీ, 'ఏమండీ! ఈ దారి పూరీజగన్నాథం పోతుందా?' అని అడిగేవాడు. అప్పటికి అవసరమైన దారి వాళ్ళు చూపించేవాళ్ళు. కొంతదూరం వెళ్ళిన తరువాత మళ్ళీ దారి తెలిసేది కాదు. అక్కడా అదే ప్రశ్న వేసేవాడు. 'ఇటు పో!', 'అటు పో!' అని ఎవరు చెప్పినా ఆ మాట ప్రకారం ప్రయాణం సాగించేవాడు. ఇలా తంటాలుపడి, తిరిగి తిరిగి, చిట్టచివరకు పూరీ జగన్నాథం చేరుకున్నాడు. జగన్నాథస్వామిని దర్శించి మనసారా అర్చించుకున్నాడు. అందువల్ల నిజమైన ఆర్తివుంటే ఎవరో ఒకరు సరైన దారి చూపిస్తారు. భక్తుడికి సరైనమార్గం తెలియకపోతే పోవచ్చును గాని, భగవంతుణ్ణి తెలుసుకోవాలనే తపన, భక్తి ఉంటే, కేవలం ఆ భక్తి తీవ్రతవల్లనే భగవంతుణ్ణి తెలుసుకోవడం సాధ్యమౌతుంది. ఆ వ్యాకులత వల్లనే భగవంతుణ్ణి పొందుతాడు."

మరొక సందర్భంలో గురుదేవులు, "ఒక అత్త తన కోడలితో, 'నువ్వు అందరికీ సేవ చేస్తున్నావు. నా కాళ్ళు ఒత్తుతున్నావు. కానీ నీ కాళ్ళు కూడా నొప్పి పెడుతూ ఉండి ఉంటాయి. నీ కాళ్ళు ఒత్తేందుకు కూడా ఎవరైనా ఉంటే బాగుండును!' అని ఆప్యాయతతో పలికింది. దానికి కోడలు నవ్వుతూ, 'అమ్మా! ఆ దేవుడే నా కాళ్ళు ఒత్తుతాడు. ఇంకెవ్వరూ అవసరం లేదు!' అని వినయంగా, భక్తిభావంతో సమాధానం చెప్పింది" అని చెప్పారు. 'ఆర్తి ఉన్నప్పుడు ఈశ్వరుడే అన్నీ సమకూరుస్తాడ'ని ఉద్బోధించారు.

## 65. కర్తృత్వము - శరణాగతి
## (భక్తుణ్ణి చాకలివాళ్ళు కొట్టబోవుట)

"అహంకారాన్ని వదలిపెడితే గానీ, అంటే పనులన్నీ మనమే చేస్తున్నామనే కర్తృత్వభావనను వదిలితే గానీ, భగవంతుడు మన బాధ్యత వహించడు. దీనికొక కథ చెపుతా విను!" అని గురుదేవులు అహంకారాన్ని గురించి కెప్టెన్‌కు ఒక కథ చెప్పారు.

"ఒకసారి లక్ష్మీనారాయణులు వైకుంఠంలో కూర్చొని ఉన్నారు. అప్పుడు లక్ష్మీదేవి విష్ణుమూర్తి పాదాలు ఒత్తుతున్నది. అకస్మాత్తుగా విష్ణుమూర్తి లేచి

ఎక్కడికో బయలుదేరాడు. లక్ష్మీదేవి ఆతురతతో, 'అదేమిటి ప్రభూ, అలా వెళ్ళిపోతున్నారు?' అని అడిగింది. దానికి విష్ణుమూర్తి, 'ఏమీ లేదు. నా భక్తుడొకడు అపాయస్థితిలో ఉన్నాడు. వాడిని రక్షించడానికి వెడుతున్నాను' అని చెప్పి వెళ్ళాడు. కాని మరుక్షణమే తిరిగి వచ్చాడు, అది చూచి లక్ష్మీదేవి, 'స్వామీ! అప్పుడే తిరిగి వచ్చారేమిటి?' అని ఆశ్చర్యంతో ప్రశ్నించింది. చిరునవ్వు నవ్వుతూ విష్ణుమూర్తి, 'నా భక్తుడొకడు తన్మయస్థితిలో ఒక మార్గంలో నడుస్తున్నాడు. అక్కడ చాకలివాళ్ళు ఉతికిన బట్టలు నేలమీద ఆరవేశారు. ఒళ్ళు తెలియని స్థితిలో నా భక్తుడు వాటిని త్రొక్కుకుంటూ వెళ్ళాడు. అది చూసి ఆ చాకలివాళ్ళు అతణ్ణి కొట్టడానికి కర్రలతో వెంటపడ్డారు. అందువల్ల అతణ్ణి రక్షించడానికి బయలుదేరాను' అని సమాధానం చెప్పాడు. 'అయితే ప్రభూ, మీరు అంత త్వరగా తిరిగి వచ్చారేం?' అని లక్ష్మీదేవి మళ్ళీ ప్రశ్నించింది. విష్ణుమూర్తి నవ్వుతూ, 'నా భక్తుడు తానే ఒక రాయి తీసుకొని వాళ్ళ మీదకు విసరడానికి సిద్ధం కావడం చూసి నేను తిరిగి వచ్చేశాను,' అన్నాడు. కాబట్టి భక్తుడు తన భారాన్ని పూర్తిగా భగవంతుని మీద ఉంచితే కానీ ఆయన రక్షించడు. భక్తుడు తన కర్తృత్వాన్ని భగవంతునిపై వదలాలి."

## 66. జీవితానికి ఒక లక్ష్యం ఉండాలి (గుమ్మడికాయ పగలగొట్టే పెద్దన్నయ్య)

హరిబాబు, మహేంద్రనాథ్ గుప్త యొక్క స్నేహితుడు. ఆయన వయస్సు 29 సంవత్సరాలు. ఆయనకు చిన్నప్పుడే వివాహం అయింది. భార్య చనిపోయి 11 సంవత్సరాలు గడిచినా రెండవ పెళ్ళి చేసుకోలేదు. తల్లిదండ్రులన్నా, అక్క చెల్లెండ్రన్నా, అన్నదమ్ములన్నా అతడికి చాలా ప్రేమ. వాళ్ళ మంచిచెడ్డలు కనిపెట్టి ఉండటమే తప్ప అతడికి వేరే పనేమీ లేదు.

మహేంద్రనాథ్ ఈ స్నేహితుణ్ణి గురుదేవులకు పరిచయం చేశాడు. అతడు ఏ పనిలేకుండా, సోమరిగా ఉండటం గురుదేవులకు నచ్చలేదు. అందుచేత అతడికి ఈ కథ చెప్పారు.

"చూడు! నిన్ను చూస్తే 'గుమ్మడికాయ పగలగొట్టే పెద్దన్నయ్య'లాగా కనిపిస్తున్నావు! నీవు ప్రాపంచికుడవూ కాదు, భక్తుడవూ కాదు. నీకు తెలుసుననుకుంటాను. ఉమ్మడి కుటుంబాలలో ఒక పెద్దవాడు ఉంటాడు. అతడికి పిల్లలతో కాలక్షేపం చెయ్యటం, వాళ్ళను ఆడించడం తప్ప వేరే పని ఉండదు. ఎప్పుడు చూచినా వాకిట్లో అరుగుమీద కూర్చొని చుట్టకాలుస్తూ ఉంటాడు. అతడికి ఒక పని అంటూ ఏమీ ఉండదు. సోమరిగానే కాలం గడుపుతూ ఉంటాడు. ఎప్పుడో, ఒక్కొక్కసారి వంటింట్లోకి పోతుంటాడు. ఎందుకో తెలుసా?

గుమ్మడికాయ పగలగొట్టడానికి! ఆడవాళ్ళు గుమ్మడికాయను పగలగొట్టకూడదనే ఆచారం ఒకటుంది. అందువల్ల వాళ్ళు అతణ్ణి పిలుచుకు రమ్మని పిల్లల్ని వాకిట్లోకి పంపుతుంటారు. 'గుమ్మడికాయ పగలగొట్టే ఆ పెద్దన్నయ్య' వల్ల కుటుంబానికి ప్రయోజనం అంతమాత్రమే సుమా!"



"అందువల్ల నీవు 'అదీ', 'ఇదీ' రెండూ చేస్తూ ఉండు! సంసార విధులు నిర్వర్తిస్తూనే, భగవంతుని దివ్యపాదారవిందాల మీద మనస్సు నిల్పుతూ ఉండు! భక్తి గ్రంథాలు చదువు! నీకు పనిలో విరామం ఉన్నప్పుడు, భాగవతం, చైతన్యచరితామృతం వంటి గ్రంథాలను అధ్యయనం చెయ్యి! అంతేకానీ, ఏ పనీ లేకుండా ఉండకు' అని సలహా ఇచ్చారు.

## 67. ఏకాగ్రమైన మనస్సు ఎలా ఉంటుంది?
## (గాలం వేసి చేపలు పట్టడం; అర్జునుడి గురి)

ఒకడు చెరువులో గాలం వేసి చేపలు పడుతున్నాడు. చాలాసేపైన తరువాత ఆ గాలానికి కట్టిన బెండు కదలడం, అప్పుడప్పుడు అది నీటిలో మునిగితేలటం మొదలు పెట్టింది. గాలాన్ని గట్టిగా పట్టుకొని చేపను పైకిలాగే అదను కోసం

చూస్తున్నాడు. ఇంతలో ఒకడు అటువైపు వచ్చి అక్కడ ఆగి, 'ఏమయ్యా! బెనర్జీగారి ఇల్లు ఎక్కడ?' అని అడిగాడు. కాని ఈ జాలరివాడు గాలాన్ని పైకిలాగే ప్రయత్నంలో ఉండడంవల్ల బదులు చెప్పలేదు. ఆ కొత్త వ్యక్తి మళ్ళీమళ్ళీ అదే ప్రశ్న వేయడం మొదలుపెట్టాడు. కాని ఇతడు ఏ సమాధానం చెప్పలేదు. చుట్టుపక్కల ఏం జరుగుతున్నదో కూడా తెలియని స్థితిలో ఉన్నాడు. వాని దృష్టి అంతా నీటిపైన తేలుతున్న బెండు మీదనే నిలచివుంది. అందువల్ల కొత్తగా వచ్చిన వ్యక్తి విసిగిపోయి, చికాకు పడుతూ అక్కడ నుండి ముందుకు సాగిపోయాడు. అతడు కొంతదూరం వెళ్ళిన తరువాత గాలానికి కట్టిన బెండు నీటిలో మునిగిపోయింది. వెంటనే జాలరి ఒక్క ఉదుటున గాలాన్ని లాగి, పెద్ద చేపను పట్టాడు. తువ్వాలు తీసుకొని ముఖానికి పట్టిన చెమటను తుడుచుకొని, ఆ కొత్త వ్యక్తిని బిగ్గరగా పిలిచాడు. 'ఏమయ్యా! ఇక్కడికిరా! నిన్నే పిలిచేది!' అని గట్టిగా అరిచాడు. కాని ఆ వ్యక్తి తల వెనక్కు తిప్పలేదు. అదే విధంగా చాలాసార్లు కేకలు పెట్టిన తరువాత ఆ వ్యక్తి తిరిగివచ్చి, 'ఎందుకయ్యా అలా గావుకేకలు పెడుతున్నావు?' అని అన్నాడు. అప్పుడు ఆ జాలరి, 'అయ్యా! ఇందాక ఏదో అడిగారే? ఏమిటది?' అని అడిగాడు. అప్పుడు ఆ వచ్చిన వ్యక్తి చిరాకుపడుతూ, 'ఏమిటయ్యా! అడిగీ, అడిగీ నా నోరు పడిపోయింది. అదే మాట మళ్ళీ చెప్పమంటావా?' అన్నాడు. దానికి వాడు, 'అయ్యా, ఇందాక సరిగ్గా అదే సమయానికి, నా గాలానికి కట్టిన బెండు, నీళ్ళలో మునగడానికి సిద్ధంగా ఉంది. అందువల్ల మీరు ఏమి అడిగారో ఏమో! ఒక్కమాట కూడా నాకు వినపడలేదు' అని మర్యాదగా సమాధానం చెప్పాడు."

శ్రీగురుదేవులు శిష్యులకు తన అనుభవాలను వివరిస్తూ ఇలా చెప్పారు: 'ధ్యానం చేసేటప్పుడు అటువంటి ఏకాగ్రత కుదిరితే, ఏమీ వినపడదు, కనపడదు. వీధి తలుపులను గట్టిగా బిగించి మూసివేస్తే ఇంట్లో ఉన్నవారికి ఎలా ఉంటుందో, ఆ విధంగా ఉంటుంది. ధ్యానానికి కూర్చున్నప్పుడు మొదట్లో సాధకుని ఇంద్రియాలు అన్నీ పనిచేస్తుంటాయి. అందువల్ల చుట్టుపక్కల ఉన్నవి కనిపించడం, వినిపించడం జరుగుతుంది. కాని, ఆ ధ్యానమే తీవ్రమయ్యే కొద్దీ మనస్సు, ఇంద్రియాలు అన్నీ అంతర్ముఖాలై అతణ్ణి బాధించవు."

మరొక సందర్భంలో ద్రోణాచార్యుడు అర్జునుడికి విలువిద్య నేర్పే ఘట్టాన్ని వివరించారు. "అర్జునుడు విల్లు ఎక్కుపెట్టాక ద్రోణుడు అతడితో, 'ఏమి చూస్తున్నావు? ఇక్కడ ఉన్న రాకుమారులు కనిపిస్తున్నారా?' అని అడిగాడు. అర్జునుడు లేదని సమాధానమిచ్చాడు. నన్ను చూస్తున్నావా అని అడిగితే లేదనీ, చెట్టును చూస్తున్నావా అని అడిగితే లేదనీ సమాధానమిచ్చాడు. చివరికి చెట్టుమీదనున్న పక్షి కూడా తనకు కనపడడం లేదనీ, పక్షి కంటిని మాత్రమే

చూస్తున్నాననీ అర్జునుడు సమాధానమిచ్చాడు. అలా పక్షి కంటి మీద మాత్రమే బాణాన్ని గురిపెట్టి వదలగలవాడే నేర్పరి. అదే విధంగా భగవంతుడి మీద మాత్రమే లక్ష్యం కలిగిన వాడికి నిజమైన ఏకాగ్రత, ధ్యానం కుదురుతుంది. వాడి దృష్టి ఇతరవిషయాల మీదకు పోదు."

## 68. చరైవేతి (ముందుకు సాగిపో!)
## (కట్టెలు కొట్టువాడు - సాధువు)

ఈశ్వరచంద్ర విద్యాసాగరు ఒక గొప్ప పండితుడు, విద్యావేత్త, రచయిత, దానధర్మపరాయణుడు. బ్రిటీష్ ప్రభుత్వం ఆయన పాండిత్యాన్ని గుర్తించి 'విద్యాసాగరు' అనే బిరుదును ఇచ్చింది. ఆయనను చూడడానికి ఒకసారి గురుదేవులు స్వయంగా వారి ఇంటికి వెళ్ళి అనేక విషయాలను గురించి ప్రసంగించారు. తరువాత విద్యాసాగరు యొక్క ఆధ్యాత్మిక స్థితిని అంచనా వేసి, ఆయనకు ప్రబోధించడానికి తన ప్రసంగం చివరలో ఈ కథ చెప్పారు.



"కట్టెలుకొట్టి జీవించేవాడొకడు ఉన్నాడు. వాడు ఒకసారి అడవిలో కట్టెలు కొడుతున్నాడు. అప్పుడు అతడికి ఒక సాధువు కనిపించి, 'నాయనా! మరికొంత ముందుకు పో!' అని సలహా ఇచ్చి తనదారిన తాను వెళ్ళిపోయాడు. పని ముగించుకొని కట్టెలుకొట్టేవాడు ఇల్లు చేరాడు కాని, సాధువు చెప్పిన మాట వాడి మనస్సులో ఇంకా మెదులుతూనే ఉంది. 'ఆ సాధువు నన్నెందుకు ముందుకు పొమ్మన్నాడు?' అని ఆలోచించాడు. ఇలా కొన్ని రోజులు గడిచిపోయాయి.

ఒకరోజు వాడికి ఆ సాధువు చెప్పినమాట మళ్ళీ జ్ఞప్తికి వచ్చి, 'ఈ రోజు అడవిలో ముందుకు పోవాలి' అని నిశ్చయించుకున్నాడు. ఆ నిర్ణయం ప్రకారం వాడు అడవిలో ఇంకా దూరం వెళ్ళేసరికి లెక్కలేనన్ని మంచిగంధపుచెట్లు కనిపించాయి. తన అదృష్టానికి వాడు సంతోషపడి బండ్లతో మంచిగంధపు చెక్క తెచ్చి బజారులో అమ్మి చాలా భాగ్యవంతుడైనాడు."

"కాలం గడుస్తూనే ఉంది. మళ్ళీ కొన్ని రోజులకు వాడికి సాధువు తనను 'మరింత ముందుకు పొమ్మన్న' సంగతి జ్ఞాపకానికి వచ్చింది. ఈమారు వాడు అడవిలో మరింత దూరం వెళ్ళాడు. అతడికి అక్కడ ఒక నది, దాని దగ్గర ఒక వెండి గని కనిపించాయి. వాడు ఇలా జరుగుతుందని కలలో కూడా ఊహించలేదు. తన అదృష్టాన్ని మెచ్చుకుంటూ గనిలో నుండి వెండిని బయటకు తీసి బజారులో విక్రయించాడు. దానివల్ల తన దగ్గర ఎంత సంపద ఉన్నదో కూడా గుర్తించలేనంత ధనవంతుడైనాడు."

"ఇలా మరికొంతకాలం గడిచింది. ఒకరోజు మళ్ళీ వాడు ఇలా ఆలోచించాడు: 'ఆ సాధువు నాకు, "అక్కడ వెండి గని ఉంది, పో!' అని చెప్పలేదు గదా, ముందుకు సాగిపొమ్మని మాత్రమే చెప్పాడు. ఈసారి ఇంకా ముందుకుపోయి చూస్తాను.' ఇలా అనుకొని ఈమారు వాడు నదిని దాటి ఆవలిగట్టుకు చేరుకున్నాడు. అక్కడ వాడికి ఒక బంగారుగని కనిపించింది. 'అరె! చూశావా! ఇందుకోసమే ఆయన నన్ను ముందుకు పొమ్మని సలహా ఇచ్చాడు' అని తన హర్షాన్ని వెలిబుచ్చాడు. మళ్ళీ కొంతకాలం గడిచిపోయింది. వాడు ఇంకా, ఇంకా అడవిలో వెళ్ళాడు. అక్కడ వాడు రత్నాలు, వజ్రాలు, వైఢూర్యాలు రాశులు పోసి ఉండడం గమనించాడు. అవి కూడా తీసుకొని కుబేరుడంత వాడైపోయాడు."

"కాబట్టి మహాశయా, మీరు ఏ పని చేసినా 'ముందుకు సాగిపోతే' మీరు సాధించిన వాటి కంటే ఇంకా విలువైనవి లభిస్తాయి. మీ హృదయంలో బంగారం దాగి ఉంది. కానీ అది మీకు తెలియదు. అది ఒక సన్నని మట్టిపొరతో కప్పబడివుంది. ఒకసారి ఆ విషయం తెలుసుకుంటే, మీరు ప్రస్తుతం చేస్తున్న కార్యక్రమాలన్నీ నిస్సారంగా తోస్తాయి. మనోవాక్కాయ కర్మల ద్వారా హృదయంలో భగవద్భక్తి వృద్ధి చెందుతుంది. తరువాత భగవదనుగ్రహం కలిగి, దానివల్ల క్రమంగా భగవత్సాక్షాత్కారం లభిస్తుంది. భగవంతుణ్ణి మీరు చూడవచ్చు. నేను మీతో మాట్లాడుతున్నంత స్పష్టంగా మీరు భగవంతునితో మాట్లాడవచ్చు కూడా! అవును, మాట్లాడవచ్చు!' అని విద్యాసాగరుకు గురుదేవులు సలహా ఇచ్చారు.

## 69. మనస్సే అన్నిటికీ కారణం
## (ఇద్దరు మిత్రుల అంతరంగాలు)

"ఒకసారి ఇద్దరు స్నేహితులు రోడ్డుమీద పోతున్నారు. దారిలో ఒకచోట భాగవత పురాణ కాలక్షేపం జరుగుతోంది. వాళ్ళలో ఒకడు, 'ఒరేయ్! పురాణం విందాము రారా!' అని లోపలికి వెళ్ళి కూర్చొని వినసాగాడు. కాని రెండవవాడు మాత్రం లోపలికి తొంగిచూచి అక్కడ నుండి వెళ్ళిపోయాడు. వాడు నేరుగా ఒక వ్యభిచారగృహం చేరుకున్నాడు. కాని ఎక్కువసేపు అక్కడ ఉండలేక పోయాడు. ఆ పరిసరాలు, వాళ్ళ ప్రవర్తన, అతడికి విరక్తి కలిగించాయి. 'ఛీ! ఎంత సిగ్గుచేటు, నా స్నేహితుడు పవిత్రమైన హరినామాన్ని వింటూ సత్కాలక్షేపం చేస్తుంటే, నేనేం చేస్తున్నాను' అని పశ్చాత్తాప పడ్డాడు."

"ఇక రెండవవాడి సంగతి. వాడు భాగవతం వింటూ విసుగు చెందాడు. 'నేనెంతో బుద్ధిహీనుణ్ణి! వీడి వాగుడు వింటూ ఇక్కడ కూర్చున్నాను. ఇక నా మిత్రుడా! కులాసాగా కాలం గడుపుతూ ఉండి ఉంటాడు. ఆనందం అనుభవిస్తుంటాడు' అని వాపోయాడు."

"కాలం తీరి వాళ్ళిద్దరూ మరణించారు. యమభటులువచ్చి, భాగవతం విన్నవాడి జీవాన్ని నరకానికి ఈడ్చుకుపోయారు. ఇక విష్ణుదూతలు వచ్చి వ్యభిచారగృహానికి వెళ్ళినవాడి జీవాన్ని వైకుంఠానికి తీసుకుపోయారు!"

ఈ కథను ప్రియనాథ ముఖర్జీకి గురుదేవులు చెప్పారు. ప్రియనాథ ముఖర్జీ ఒక ఇంజనీరు. కొంతధనాన్ని నిలువ చేసుకొని చిన్నతనంలోనే ఉద్యోగాన్ని విరమించాడు. అతడికి కలకత్తాలోను, గ్రామ ప్రాంతంలోను ఇళ్ళు ఉన్నాయి. తాను సంసారంలో బందీనైపోయానని తన నిరుత్సాహాన్ని గురుదేవునికి వ్యక్తపరిచాడు. అప్పుడు గురుదేవులు అతడికి ఈ కథ చెప్పి, 'అన్నిటికీ ప్రధానమైనది మనస్సు. బంధించేది మనస్సే, విముక్తి కలిగించేది కూడా మనస్సే! బంధింపబడేది మనస్సే, ముక్తి పొందేది కూడా మనస్సే! భగవంతుడు మానవునిలో చూచేది అతడి మనస్సులోని భావాన్ని, పవిత్రతను మాత్రమే గానీ, అతడు ఏమి చేశాడా, ఎక్కడ ఉన్నాడా అనే విషయాన్ని పట్టించుకోడు' అని కూడా చెప్పారు.

## 70. యాచిస్తే దేవుణ్ణే యాచించండి!
## (అక్బరు పాదుషా - సాధువు)

అక్బరు పాదుషా ఢిల్లీ చక్రవర్తిగా ఉన్న సమయంలో ఆయన దగ్గరకు ఒక సాధువు వచ్చాడు. ఆ సాధువు అరణ్యంలో కుటీరం నిర్మించుకొని తపస్సు చేసుకుంటున్నాడు. ఆయనను దర్శించడానికి చాలామంది ఆ ఆశ్రమానికి

వచ్చేవారు. ఆ భక్తులకు ఏమైనా ఆతిథ్యమిస్తే బాగుంటుందని ఒకసారి ఆ సాధువుకు తోచింది. అక్బరు పాదుషాగారి ద్వారాలు సాధువులకెప్పుడూ తెరచి ఉంటాయన్న సంగతి ఆ సాధువుకు తెలుసు. అందువల్ల ఆయనను దర్శించి ఏమైనా అడగాలని ఆ సాధువు అక్బర్ చక్రవర్తి దగ్గరకు వచ్చాడు."

"సరిగా అదే సమయంలో అక్బరు భగవంతుణ్ణి గురించి ప్రార్థిస్తున్నాడు. అందువల్ల సాధువు ఒక మూల కూర్చున్నాడు. అక్బరు ప్రార్థన ముగిస్తూ భగవంతుణ్ణి, 'నాకు ధనమివ్వు, నాకు సంపదలివ్వు!' అని ఇంకేమేమో అడుగుతున్నాడు. ఆ మాటలు చెవినపడిన ఆ సాధువు దిగ్గున లేచి వెళ్ళిపోవడానికి సిద్ధమయ్యాడు. చక్రవర్తి అది గమనించి విధేయతతో సాధువును కొంచెం సేపు ఆగమని సౌంజ్ఞ చేశాడు"

"తరువాత ప్రార్థన ముగించుకొని సాధువును సమీపించి, 'స్వామీ! మీరు నా కోసం వచ్చినట్లుగా కనిపిస్తున్నది. కాని నాతో మాట్లాడకుండానే వెళ్ళిపోతున్నారు. కారణమేమిటో తెలుసుకోవచ్చునా?' అని ప్రశ్నించాడు. దానికి ఆ సాధువు, 'మీరు ఆ విషయాన్ని పట్టించుకోకండి. నాకు అత్యవసరమైన పని ఉంది, వెళ్ళి వస్తాను' అన్నాడు. కానీ అక్బరు ఆ సాధువును కారణం చెప్పమని బలవంతపెట్టిన తర్వాత సాధువు, 'నా ఆశ్రమానికి చాలామంది భక్తులు వస్తుంటారు. వాళ్ళకు ఏదైనా ఆతిథ్యమిస్తే బాగుంటుందని తోచి మిమ్మల్ని ఏదైనా అడిగి తీసుకువెళ్ళాలని వచ్చాను' అన్నాడు. 'అలా అయితే నన్ను అడగకుండానే వెళ్ళిపోతున్నారేమిటి?' అని అక్బరు తిరిగి ప్రశ్నించాడు. దానికి ఆ సాధువు, 'నేను ఒక యాచకుణ్ణి యాచించదలుచుకోలేదు. మీరే భగవంతుణ్ణి డబ్బు ఇమ్మని, రాజ్యసంపదలిమ్మని, ఇంకేమేమో యాచిస్తున్నారు. అందువల్ల నాకు యాచించవలసిన అవసరమొస్తే మరొక బిచ్చగాణ్ణి యాచించే కంటే ప్రభువునే యాచించడం మంచిదనిపించింది. నేను యాచిస్తే ఆ పరమాత్ముణ్ణే యాచిస్తాను!' అని చెప్పి వెళ్ళిపోయాడు."

శ్రీగురుదేవులు ఈ కథను మన్‌మోహన్ మిత్రాకు చెప్పారు. మన్‌మోహన్ మిత్రా రాఖాలుకు బావమరిది. (రాఖాలు తరువాత సన్న్యసించి 'బ్రహ్మానంద స్వామి' నామంతో శ్రీరామకృష్ణ మఠానికి మొదటి సర్వాధ్యక్షులు అయ్యారు.) గురుదేవులు రాఖాలు విషయం మిత్రాకు చెపుతూ, "నేను చెప్పేమాట నీకు కటువుగా తోచవచ్చు. కాని చెపుతున్నాను. నేను రాఖాలుతో, 'నీవు ఉద్యోగం చేస్తూ ఇతరులకు బానిసగా పడివుంటున్నావన్న విషయం వినడం కంటే నీవు ఏ గంగలోనో పడి చచ్చిపోయావని తెలిస్తే మరింత సంతోషిస్తానని అన్నాను'," అని చెప్పారు. ఆ కథనే విజయకృష్ణ గోస్వామికి కూడా చెప్పి గురుదేవులు అతడితో, "ఇచ్చేవాడు మానవుడు కాదు, దేవుడే సుమా!" అని మరల మరల నొక్కిచెప్పారు.

# 71. తీవ్రవైరాగ్యం - మందవైరాగ్యం
## (ఇద్దరు వ్యవసాయదారులు)

"బద్ధజీవుడు, ముక్తిని పొందాలంటే 'కామకాంచనాల'పై ఉన్న వ్యామోహం నుండి బయటపడాలి. దానికి భగవంతుని అనుగ్రహం కావాలి. తీవ్రవైరాగ్యాన్ని అభ్యాసం చెయ్యాలి. తీవ్రవైరాగ్యం ఉన్నవాడు ఈ సంసారంలో ఉండడమంటే ఒక లోతైన బావిలోపడి మునిగిపోతున్నట్లుగా భావిస్తాడు. అతడు బంధువులను విషసర్పాలుగా భావించి, వాళ్ళ దగ్గరనుండి పారిపోవడానికి ప్రయత్నిస్తాడు. అంతేకాని, ముందు నా కుటుంబానికి తగిన ఏర్పాట్లు చేసిన తరువాత భగవంతుణ్ణి తలుస్తానని అనుకోడు. అతడికి అంతర్వైరాగ్యం ఎంతో ఉంటుంది. ఇక మందవైరాగ్యం కలవాడు 'కాలేనాత్మని విందతి' అన్నట్టు, 'దేని సమయం వస్తే అప్పుడది జరుగుతుందిలే, నేను కేవలం భగవన్నామాన్ని జపం చేసుకుంటూ ఉంటాను' అని అనుకుంటాడు. ఈ తీవ్రవైరాగ్యం గురించి ఒక కథ చెపుతా విను!"

"ఒకసారి అనావృష్టి వల్ల కాటకం ఏర్పడింది. చేలకు నీరు అందడం లేదు. రైతులు నదిలో నుండి కాల్వలు త్రవ్వుకొని పంటలకు నీళ్ళు పెట్టుకుంటున్నారు. ఆ రైతులలో ఒకడు చాలా పట్టుదల గలవాడు. భగీరథుడిలాగా పట్టుపట్టి ఆ సాయంత్రం లోపల పొలానికి నీరు పెట్టాలనుకున్నాడు. నది నుండి పొలానికి కాలవ త్రవ్వుతున్నాడు. ఎండ ఎక్కడంవల్ల స్నానానికి వేళ అయిందని భార్య, కూతురు ద్వారా కబురుపెట్టి, వంటికి రాసుకోవడానికి గిన్నెలో నూనె పంపింది. కూతురు వచ్చి, 'నాన్నా! వంటికి నూనె రాసుకొని స్నానం చెయ్యి' అని చెప్పింది. 'ఇప్పుడు కాదు, నాకు చాలా పనివుంది. ఫో, ఇక్కడ నుంచి!' అని రైతు అన్నాడు."

"మధ్యాహ్నమైంది. సూర్యుడు నడినెత్తి మీదకి వచ్చాడు. రైతు పొలంలో ఇంకా పనిచేస్తూనే ఉన్నాడు. స్నానం మాటే మరచిపోయాడు. ఇంతలో అతడి భార్య పొలానికి వచ్చి, 'ఇంకా స్నానమే చెయ్యలేదు. వండిన వంట చల్లారిపోతున్నది. నీకు ఏ పని పట్టుకున్నా ఒళ్ళు తెలియదు. మిగిలిన పని రేపు గాని, భోజనం తరువాత గాని చెయ్యవచ్చులే. ఇంటికిరా!' అన్నది. రైతు ఉగ్రుడై చేతిలో పలుగు పట్టుకొని ఆమె మీదికి ఉరుకుతూ ఇలా గద్దించాడు: 'ఏమిటే! నీకు బుద్ధిలేదా! వానలు లేక పొలం ఎండిపోతున్నది. ఇదే పరిస్థితి కొనసాగితే, పిల్లలకు ఏం పెడతావు? మీరంతా ఆకలితో మాడి చావాల్సి వస్తుంది. పొలంలోకి నీళ్ళు వచ్చేదాకా స్నానం చెయ్యను సరిగదా నీళ్ళు కూడా ముట్టను!' అని రంకెలు వేశాడు. అతడి రౌద్రాకారం చూసి భార్య భయపడి వెళ్ళిపోయింది."

"ఆ రైతు రెక్కలు ముక్కలు చేసుకొని, రోజంతా కష్టపడి సాయంకాలానికి చేనులోకి నీటిని పారించాడు. గలగలమంటూ పొలంలోకి నీరు పారడం చూచి అతడి మనస్సు సంతోషంతో నిండిపోయింది. తరువాత ఇంటికి వెళ్ళి భార్యను పిలిచి, ఒంటికి రాసుకోవడానికి నూనె, కాల్చుకోవడానికి చుట్ట ఇమ్మని అడిగాడు. తరువాత హాయిగా స్నానం, భోజనం చేసి గుర్రుపెట్టి నిద్రపోయాడు. తీవ్రవైరాగ్యానికి ఇది ఒక ఉదాహరణ,"

"అక్కడే ఇంకొక రైతు ఉన్నాడు. అతడు కూడా నది నుండి పొలానికి కాలువ త్రవ్వడం ప్రారంభించాడు. ఇంతలో అతడి భార్య వచ్చి, 'పొద్దెక్కింది. ఇంటికి రా! అంత ఒళ్ళువిరుచుకుని పని చెయ్యనక్కరలేదులే' అన్నది. ఆ రైతు మారుపలుకకుండా పార, పలుగు పక్కనపెట్టి భార్యతో, 'సరేలే! నీవు రమ్మంటున్నావు, తప్పుతుందా! ఇంటికి పోదాం పద!' అని ఆమెతో కలసి వెళ్ళిపోయాడు. ఆ రైతు సకాలంలో పొలానికి నీరు పెట్టలేకపోయాడు. మందవైరాగ్యం అంటే ఇలా ఉంటుంది. గట్టి పట్టుదల లేకుండా రైతు పొలానికి నీరు పెట్టలేనట్టే, తీవ్ర పరితాపం లేకపోతే భగవంతుణ్ణి కనుక్కోలేరు."

ఈ కథ శ్రీరామకృష్ణులు విజయకృష్ణ గోస్వామికి చెప్పారు. విజయుడు, సాధారణ బ్రహ్మసమాజంలో పూజారిగా పనిచేసేవాడు. అతడు మహాత్ముడైన అద్వైతగోస్వామి వంశానికి చెందినవాడు. అతడిలోని భక్తివైరాగ్యాలు గురుదేవుల సమక్షంలో ప్రజ్వలితమౌతుండేవి. అతడిలో మరింత వైరాగ్యాన్ని కలిగించి, అతడు ఆధ్యాత్మిక మార్గంలో వేగంగా ముందుకు సాగాలనే ఉద్దేశ్యంతో గురుదేవులు ఈ కథను అతడికి చెప్పారు. కథను ముగించి గురుదేవులు విజయుణ్ణి చూస్తూ, "మానవుణ్ణి బంధించి, స్వేచ్ఛను హరించేవి రెండు. ఒకటి కామిని, రెండవది కాంచనం. స్త్రీ కోసం, మానవుడు పరులకు సేవకుడై, స్వాతంత్ర్యాన్ని కోల్పోతాడు. తన ఇష్టప్రకారం నడుచుకోలేడు" అని చెప్పారు.

## 72. నటనే నిజమైతే?
## (సాధువుగా మారిన దొంగజాలరి)

ఒకరాత్రి ఒక బెస్తవాడు దొంగతనానికి బయలుదేరి, ఒక తోటలో ఉన్న చెరువులో వల వేశాడు. ఆ శబ్దానికి తోట యజమాని మేలుకొని తన సేవకులను నిద్రలేపాడు. వాళ్ళు కాగడాలు వెలిగించి నలుమూలలా చుట్టుముట్టి తోటంతా గాలించారు. ఇది చూచి బెస్తవాడు పట్టుబడతానని భయపడి, గుడ్డముక్క ఒకటి చింపి, గోచీ పెట్టుకొని, ఒంటి నిండా బూడిద పూసుకొని, ఒక చెట్టుక్రింద ధ్యానం చేస్తున్నట్లు నటించసాగాడు. సేవకులు తోటంతా గాలించినా ఎక్కడా దొంగ దొరకలేదు. వాళ్ళకు కనిపించినదల్లా చెట్టు క్రింద ధ్యానం చేస్తున్న సాధువు మాత్రమే!"

"తెల్లవారేసరికి సాధువు సంగతి ఊరంతా తెలిసింది. అన్ని దిక్కులనుంచి జనం తండోపతండాలుగా సాధువు దర్శనానికి వచ్చారు. పళ్ళు తెచ్చినవాళ్ళు కొందరు, ఫలహారాలు తెచ్చినవాళ్ళు కొందరు. ఇలా ఎవరికి తోచింది వాళ్ళు తెచ్చి సాధువుకు సమర్పించారు. కొంతమంది వెండినాణాలు, ఇతర నాణాలు కూడా ఆయన ముందుంచారు. ఇదంతా చూస్తున్న ఆ 'దొంగ-సాధువు' ఆలోచనలో పడ్డాడు. 'ఇదేమి ఆశ్చర్యం! నేను నిజంగా సాధువును కాను. అయినా ఈ వేషాన్ని చూచి జనం ఇంత గౌరవిస్తున్నారు. నేనే నిజమైన సాధువునైతే తప్పకుండా భగవంతుణ్ణి సాక్షాత్కారం చేసుకుంటాను. ఇందులో సందేహం ఏమాత్రం లేదు' అని అనుకున్నాడు."

శ్రీరామకృష్ణులు ఈ కథను శ్రీరామకృష్ణ కథామృత రచయిత అయిన మహేంద్రనాథుకు చెప్పి, "కేవలం నటన వల్లనే ఆధ్యాత్మికభావం జాగృతమౌతుంటే నిజమైన సాధన చెయ్యడంవల్ల ఫలితం ఎలా ఉంటుందో నీవే ఊహించుకో! అటువంటి స్థితిలో ఏది సత్యమో, ఏది అసత్యమో నీకే

అవగతమౌతుంది. 'బ్రహ్మమే సత్యము. జగత్తు మిథ్య,' (బ్రహ్మసత్యం జగన్మిథ్యా) అన్నారు.

కానీ ఈ మాటలు వినేసరికి మహేంద్రనాథుని మనస్సులో, 'సన్న్యసించకుండా సంసారంలోనే ఉంటున్నవాడి గతి ఏమౌతుంది?' అనిపించింది. మనస్సులోని భావాలను ఇట్టే కనిపెట్టగల గురుదేవులు అతడివైపు తిరిగి, 'అబ్బాయీ! ఒక ఆఫీసులో గుమాస్తాను ఏదో అపరాధం కారణంగా జైలుకు పంపుతారనుకో! వాడు జైలుశిక్ష అనుభవించిన తరువాత బయటకు వస్తాడు. అప్పుడు వాడేం చేస్తాడు? కుప్పిగంతులు వేస్తూ రోడ్లమీద తిరుగుతాడా? లేకపోతే మరో గుమాస్తాగిరిని సంపాదించుకొని కాలం వెళ్ళదీస్తాడా? అదివరకు లాగానే పనిచేస్తాడు కదా! అదే విధంగా గురువు అనుగ్రహం పొందినవాడు జీవన్ముక్తుడుగా కాలం గడుపుతూ ఉండవచ్చు. సందేహం లేదు' అని గృహస్థులకు ఈ మూలంగా అభయం ఇచ్చారు.

## 73. ఆత్మ వేరు, శరీరం వేరు
## (వ్యాసమహర్షి - గొల్లపడుచులు)

ఒకసారి దక్షిణేశ్వరానికి ఒక యుక్త వయస్కుడైన బ్రాహ్మణుడు వచ్చాడు. అతడు కొన్ని రోజులు గురుదేవుని సాన్నిధ్యంలో గడిపాడు. మూడవరోజున అతడు గురుదేవునితో అనేక విషయాలను గురించి సంభాషించాడు. ఆ సందర్భంలో గురుదేవులు ఆ బ్రాహ్మణునితో ఇలా చెప్పారు: "నీవు తార్కికజ్ఞానాన్ని వదలిపెట్టి, భక్తిని ఆశ్రయించు. సారభూతమైనది భక్తి. శ్రద్ధ గలిగినవాడివై భగవంతుని మీద ఆధారపడి ఉండు! నువ్వు చేయవలసినదేమీ ఉండదు. కాళీమాతయే నీకు కావలసినవన్నీ సమకూరుస్తుంది."

"జ్ఞానం ఎలా ఉంటుందో చెపుతాను విను! జ్ఞానమనేది ఇంటి దగ్గరకు వెళ్ళి, గుమ్మం దగ్గరే ఆగిపోతుంది. కాని భక్తి అలా కాక నేరుగా వంటింటిలోకి వెళ్ళిపోతుంది. అయితే జ్ఞానం పొందడం ఎంతో కష్టం. అది మాటలతో సాధ్యమయ్యేది కాదు. ఒక కథ చెపుతా విను!"

"ఒకసారి వ్యాసమహర్షి యమునానదిని దాటి వెళ్ళవలసి వచ్చింది. అదే సమయానికి చాలామంది గొల్లపడుచులు కూడా అవతలిగట్టుకు వెళ్ళడానికి అక్కడకు చేరారు. వాళ్ళు అవతలి గట్టుకు వెళ్ళి పాలు, పెరుగు అమ్మవలసివుంది. నదిని దాటించే పడవ రాకపోవడం వల్ల ఏమిచెయ్యాలా అనే సందిగ్ధావస్థలో వాళ్ళు ఆరాటపడుతున్నారు. ఇంతలో వ్యాసమహర్షి వాళ్ళ వైపు తిరిగి, 'అమ్మా! నాకు ఆకలిగా వుంది' అన్నాడు. వెంటనే గొల్లపడుచులు తమ దగ్గరవున్న వెన్న, పాలు, పెరుగు మహర్షికి సమర్పించారు. ఆయన వాటన్నింటినీ తృప్తిగా ఆరగించి,

యమునా నదితో, 'ఓ యమునా! నేను ఏమీ తిననివాణ్ణయితే, నాకు త్రోవయివ్వు! మేము అవతలిగట్టుకు వెళ్ళాలి' అన్నారు. వెంటనే యమునానది రెండుపాయలుగా చీలి, దారియిచ్చింది."

"గొల్లపడుచులకు ఇది ఆశ్చర్యాన్ని కల్గించింది. వాళ్ళు తమలో తాము, 'ఇదేమిటి? ఈయన ఇప్పుడే మనం ఇచ్చిన పాలు, పెరుగు, వెన్న – అన్నీ తిన్నారు కదా! తిననివాణ్ణయితే అంటారేమిటి?' అనుకున్నారు."

"అయితే ఇక్కడ వ్యాసమహర్షి, 'నేనేమీ తినని వాణ్ణయితే' అన్నదాని భావమేమంటే: నిజానికి మానవుడు పవిత్రమైన ఆత్మస్వరూపుడు. ఏ మాత్రమూ ప్రకృతి స్పర్శ లేనివాడు. అటువంటి ఆత్మకు ఆకలిదప్పులు లేవు, జననమరణాలు లేవు. ముసలితనం మొదలైన వికారాలు కూడా ఆత్మకు లేవు. ఈ వికారాలన్నీ శరీరానికి చెందినవే. మేరుపర్వతంలాగా ఆత్మ అచలము (కదలిక లేనిది), ధ్రువము (నిలకడగా వుండేది). సర్వవ్యాప్తమైన ఆ బ్రహ్మ యొక్క జ్ఞానాన్ని పొందినవాడు శరీరంలో ఉన్నప్పటికీ జీవన్ముక్తుడుగానే ఉండి, 'ఆత్మవేరు, శరీరంవేరు' అనే జ్ఞానాన్ని కలిగివుంటాడు. ఆ స్థితిలో ఉన్న వ్యాసమహర్షి, శారీరకంగా చాలా ఆహారాన్ని తిన్నా, నిజానికి ఏమీ తిననివాడే. అందువల్లనే యమున ఆయన కోరికను మన్నించి రెండు పాయలుగా చీలి, వారికి దారి ఇచ్చింది. వ్యాసుడు, గొల్లపడుచులు సులభంగా నదిని దాటారు" అని గురుదేవులు ఆత్మతత్త్వాన్ని గురించి ఆ బ్రాహ్మణుడికి విశదీకరించి, బోధించారు.

## 74. ఇతరులకు బోధించడానికి అధికారపత్రం కావాలి (హల్దార్పుకూరు చెరువు)

కేశవచంద్ర సేను ఒకసారి తన అనుచరులతో సహా దక్షిణేశ్వరం వచ్చి శ్రీరామకృష్ణులను తాము తెచ్చిన స్టీమరులో విహారానికి తీసుకువెళ్ళాడు. ఆ సమయంలో గురుదేవులు వారికి అనేక విషయాలు బోధించారు. కేశవుని ఉద్దేశించి, "ఇతరులకు బోధించడం చాలా కష్టం. భగవంతుని ఆదేశం పొందినవారు మాత్రమే బోధించడానికి అర్హులు. ఒక కథ చెపుతా విను!" అని ఈ క్రింది కథను చెప్పారు.

"కమార్పుకూరులో 'హల్దార్పుకూరు' అనే చెరువు ఒకటి ఉంది. ప్రతిరోజూ ఎంతోమంది ఆ చెరువులో స్నానం చేసి, త్రాగడానికి నీళ్ళు తెచ్చుకుంటూ ఉండేవారు. కాని కొంతమంది తుంటరులు ఆ చెరువుగట్టు మీదనే మలవిసర్జనం కూడా చేస్తుండేవాళ్ళు. ఉదయమే స్నానానికి వెళ్ళేవాళ్ళు ఇది చూచి వాళ్ళను అలా చెయ్యవద్దని కేకలు వేస్తుండేవాళ్ళు. కాని ఆ తుంటరులు ఎవ్వరినీ లెక్కచేసేవారు కాదు. మరునాటి ఉదయం మళ్ళీ అదే రోత! ఆ గట్లమీద మలవిసర్జనం చెయ్యడం

మానలేదు. చివరకు గ్రామస్థులు విసిగివేసారి ఈ విషయాన్ని గురించి అధికార్లకు ఫిర్యాదు చేశారు. దాని ఫలితంగా గవర్నమెంటువారి ఉత్తర్వు ప్రకారం ఒక పోలీసు ఆ చెరువు దగ్గరకు వచ్చి 'ఇక్కడ మలవిసర్జన చేయరాదు' అని ఒక బోర్డు పెట్టి వెళ్ళిపోయాడు. అంతే, ఆ తుంటరులు అక్కడికి రావడం మానివేశారు."

"కాబట్టి ఇతరులకు బోధించడానికి అధికారపత్రం కావాలి. 'భగవదాదేశమనే ఆ అధికార పత్రం' లేకపోతే నీమాట ఎవరు వింటారు? నీ బోధ హాస్యాస్పదమైపోతుంది. అజ్ఞాని అయిన వాని బోధలు గ్రుడ్డివాడికి గ్రుడ్డివాడు త్రోవచూపుతున్నట్లు ఉంటాయి. ఇద్దరూ కలిసి గోతిలో పడతారు. అటువంటివారి బోధలు మంచి చెయ్యడానికి బదులు చెరుపు చేస్తాయి. భగవద్దర్శనమైన వాడికి అంతర్దర్శనమౌతుంది. అప్పుడు వాడు ఇతరులకున్న ఆధ్యాత్మిక అవసరాన్ని కనిపెట్టి తగిన ఉపదేశాన్ని ఇవ్వగలడు. బ్రహ్మమనేది విద్య, అవిద్య, జ్ఞానము, అజ్ఞానము - వీటన్నింటికీ అతీతం. అది ద్వంద్వాలకు అతీతం. ఆ బ్రహ్మము ఇటువంటిదని, ఎవ్వరూ, ఎన్నడూ వర్ణించలేదు, వర్ణించలేరు" అని చెప్పారు.

"బారిసాల్ జిల్లాకు చెందిన ఒక ఉన్నతాధికారి నాతో, 'మీరు బోధించడానికి పూనుకుంటే నాకు కూడా చెప్పండి! నేను కూడా నడుం బిగిస్తాను!!' అన్నాడు. అప్పుడు నేను అతడికి ఈ హల్దార్పుకూరు చెరువు కథను చెప్పాను. కాబట్టి, ఒక పనికిమాలినవాడు తన గొంతు చించుకుని బోధించవచ్చు గాక! కానీ దానివల్ల ఎటువంటి ఫలితమూ కలుగదు. భగవదనుజ్ఞ పొందనివాడు బోధించలేడు. బోధకుడు కావాలనుకునేవాడికి గొప్ప శక్తి ఉండాలి" అని గురుదేవులు స్పష్టం చేశారు.

## 75. ధ్యానంలో మనస్సు ఎలా ఉండాలి?
## (పెళ్ళి ఊరేగింపు-వేటగాడు; కొంగ-వేటగాడు)

మనకు గురువు ఒక్కరే ఉంటారు (మనల్ని ఆధ్యాత్మిక మార్గంలో పెట్టేవారొక్కరే మనకు అసలైన గురువు). కానీ ఉపగురువులు అనేకమంది ఉండవచ్చు. మనకు ఏదోవొకటి నేర్పేవారు ఎవరైనా సరే అతడు మనకు ఉపగురువు కావచ్చు. భాగవతంలో అవధూతకు అటువంటి ఉపగురువులు 24మంది ఉన్నారని చెప్పబడింది.

ఒకరోజు అవధూత ఒక మైదానంగుండా నడిచి వెళుతున్నాడు. ఒక పెళ్ళి ఊరేగింపు పెద్ద అట్టహాసంతో, మేళతాళాలతో అతడికి ఎదురువచ్చింది. అయితే ప్రక్కనే ఒక వేటగాడు తన విల్లు ఎక్కుపెట్టి, ఏదో జంతువును గురిచూస్తున్నాడు. అతడికి ఈ పెళ్ళిమేళం ఏ మాత్రం వినిపించడం లేదు. అతడు పరిపూర్ణమైన ఏకాగ్రతతో గురి చూస్తున్నాడు. కనీసం ఆ ఊరేగింపు వైపు క్రీగంటితోనైనా

చూడలేదు. అవధూత అతడికి నమస్కరించి, 'అయ్యా! మీరే నాకు గురువు. మీ మనస్సు ఎలా అయితే మీరు కొట్టబోయే జంతువు మీద ఏకాగ్రం అయిందో, అదే విధంగా నేను ధ్యానంలో కూర్చున్నప్పుడు నా మనస్సు నా ధ్యేయం మీద లగ్నమగుగాక!' అన్నాడు.



మరొకసారి ఒక కొంగలో అవధూత తన ఉపగురువును చూశాడు. ఒక కొంగ చెరువు ఒడ్డున చిత్తడిభూమి మీద నడుస్తూ చేపను పట్టాలని పొంచివుంది. కానీ వెనుక ఒక వేటగాడు అదే కొంగ మీదకు బాణం ఎక్కుపెట్టి కొట్టడానికి సిద్ధమవుతున్నాడు. అయితే ఆ కొంగ ఈ విషయాన్ని ఏ మాత్రం పట్టించుకునే స్థితిలో లేదు. అవధూత ఆ కొంగకు నమస్కరించి, 'ధ్యానం చేసేటప్పుడు నేను నిన్నే ఆదర్శంగా తీసుకుంటాను. ఎప్పటికీ వెనకకు తిరిగి నా వెనుక ఎవరున్నారో చూడడానికి ప్రయత్నించను' అని అన్నాడు.

## 76. అక్కరకు వచ్చేదే అసలైన పాండిత్యం
## (పండితుడు - పడవ ప్రయాణము)

ఒకసారి గురుదేవులు సమాధి స్థితిలోవుండి తూలిపడినప్పుడు వారి చెయ్యి విరిగింది. ఆయన చేతికి కట్టుకట్టారు. ఆ రోజులలో ఒకసారి మణిమల్లిక్ వచ్చాడు. మధ్యాహ్నం భోజనం చేసిన తరువాత గురుదేవులు విశ్రాంతి తీసుకుంటున్నారు. మణిమల్లిక్‌ను చూడగానే తన చేతిని గురించి ఆందోళన పడుతున్నట్లు కనిపించి, అతడితో, "నీవు మామూలుగా ఒక కథ చెపుతుంటావే, ఆ కథ చెప్పు" అని అడిగారు.

మణిమల్లిక్ నవ్వుతూ ఇలా చెప్పాడు: “ఒకసారి చాలామంది పడవలో గంగానదిని దాటుతున్నారు. వాళ్ళలో ఒక పండితుడు కూడా ఉన్నాడు. తాను పండితుణ్ణనే గర్వంతో పాండిత్య ప్రకర్షణ చేస్తూ, తాను వేదాలు, వేదాంగాలు, షడ్దర్శనాలు చదివానని చెపుతున్నాడు. తన ప్రక్కనున్న అమాయకుడైన ప్రయాణీకుణ్ణి చూస్తూ, ‘ఏమోయి! నీకు వేదాంతం తెలుసా?’ అని అడిగాడు. ‘అయ్యా, నాకు తెలియదండీ’ అని వాడు జవాబు చెప్పగానే పండితుడు, ‘అయితే నీ జీవితంలో పాతిక భాగం వ్యర్థమైంది. నువ్వేమన్నా సాంఖ్యం కాని, పతంజలి యోగ సూత్రాలు కాని చదివావా?’ అని మళ్ళీ ప్రశ్నించాడు. పాపం ఆ ప్రయాణీకుడు సిగ్గుపడుతూ, ‘స్వామీ! నాకేమీ తెలియదండీ. నేనెప్పుడూ ఆ పేర్లు కూడా వినలేదు’ అన్నాడు. అప్పుడు ఆ పండితుడు దర్పంతో, ‘ఇంకేముంది! నీ జీవితం సగం వ్యర్థమై పోయింది’ అన్నాడు. అది విని ఆ ప్రయాణీకుడు దిగులుతో తలవంచుకున్నాడు. అంతటితో ఆగక ఆ పండితుడు మళ్ళీ, ‘నీవు ఏ శాస్త్రం చదవలేదన్నమాట’ అనేసరికి ఆ ప్రయాణీకుడికి భయం వేసింది. నెమ్మదిగా పండితునివైపు చూస్తూ, ‘లేదండీ’ అని మౌనం వహించాడు. ఆ పండితుడు ప్రబలమైన గర్వంతో, ‘నీ ముప్పాతిక జీవితం వ్యర్థం చేసుకున్నావన్న మాట’ అని అతణ్ణి ఒక గడ్డిపరకను చూచినట్టు చూచాడు,”

“ఇంతలో అకస్మాత్తుగా ఆకాశం మేఘావృతమైంది. కారుమేఘాలు క్రమ్మి వాన ప్రారంభమైంది. క్రమక్రమంగా అది పెనుతుఫానుగా మారింది. పడవ అటూఇటూ ఊగుతూ మునగడానికి సిద్ధమైంది. ప్రయాణీకులంతా ప్రాణభీతితో దిక్కుతోచకుండా ఉన్నారు. పడవవాడు కూడా ప్రమాదం తప్పదన్నాడు. ఇంతలో పండితుడి ప్రక్కనున్న ప్రయాణీకుడు అతడితో, ‘స్వామీ! మీకు ఈతవచ్చునా?’ అని అడిగాడు. పండితుడు గాభరాపడుతూ తనకు ఈత రాదని చెప్పాడు. అప్పుడు ఆ ప్రయాణీకుడు పండితునితో, ‘మహాశయా! నాకు శాస్త్రాలు ఏమీరావు కాని, ఈత వచ్చు. ఇన్ని శాస్త్రాలు తెలిసినా ఈత రాకపోవడంవల్ల మీ జీవితం ఇప్పుడు పూర్తిగా వ్యర్థం కాబోతోంది’ అంటూ నీళ్ళలో దూకి ఒడ్డుకు చేరుకున్నాడు.”

ఇలా కథ ముగించగానే గురుదేవులు అందుకొని, “బహుశాస్త్ర పాండిత్యంవల్ల వచ్చే ప్రయోజనమేమిటి? కావలిసింది సంసార సాగరాన్ని దాటే ఉపాయం తెలియడం మాత్రమే. భగవంతుడొక్కడే సత్యం. మిగిలినదంతా అనిత్యమే! భగవంతుణ్ణి తెలుసుకోలేనప్పుడు ఎన్ని శాస్త్రాలు చదివినా ప్రయోజనం లేదు” అంటూ మణిమల్లిక్ చెప్పిన కథలోని అంతరార్థాన్ని అక్కడ చేరినవారందరికీ విశదీకరించారు.

## 77. జ్ఞానాన్ని, అజ్ఞానాన్ని – రెంటినీ దాటిపోవాలి (వశిష్టుడి పుత్రశోకం)

"జ్ఞానాన్ని, అజ్ఞానాన్ని – రెంటినీ దాటిపోవాలి. అప్పుడే మనకు భగవత్సాక్షాత్కారం కలుగుతుంది. అనేక విషయాలను గురించిన జ్ఞానాన్ని కూడా అజ్ఞానంగా చెప్పుకోవచ్చు. పాండిత్యం ఉందని అనుకోవడం కూడా అజ్ఞానమే. అన్నింటిలోనూ భగవంతుడు ఉన్నాడనే దృఢమైన విశ్వాసాన్ని కలిగి ఉండడమే జ్ఞానం. అయితే ముల్లును ముల్లుతో తీసిన తర్వాత ఆ రెంటినీ పారవేసినట్టు జ్ఞానాన్నీ, అజ్ఞానాన్నీ రెంటినీ దాటిపోయినప్పుడే మనకు భగవత్సాక్షాత్కారం కలుగుతుంది."

"వశిష్ఠుడి నూరుగురు కొడుకులు చనిపోయారు. వారికోసం ఆయన విలపించాడు. లక్ష్మణుడు రాముడితో ఇలా అన్నాడు: 'సోదరా! వశిష్ఠుడంతటి జ్ఞాని కూడా తన కొడుకులు చనిపోయారని విలపించాడట! ఇది ఎంత ఆశ్చర్యకరమో చూశావా!' అన్నాడు. దానికి సమాధానంగా రాముడు, 'తమ్ముడూ! జ్ఞాని అయిన వాడికి అజ్ఞానం కూడా అంతోయింతో ఉండి తీరుతుంది. ఎంతకాలం జ్ఞానం ఉంటుందో అంతకాలం అజ్ఞానం కూడా ఉండి తీరవలసిందే! మంచి కోరేవాడికి చెడు కూడా జరుగక మానదు. సంతోషం కోరుకునేవాడికి దుఖం కూడా కలుగక తప్పదు. కాంతి అంటే ఏమిటో తెలిసిన వాడికి అంధకారం అంటే ఏమిటో తెలియక తప్పదు కదా!' అన్నాడు."

"బ్రహ్మం జ్ఞానానికీ, అజ్ఞానానికీ; ధర్మానికీ, అధర్మానికీ; పుణ్యానికీ, పాపానికీ; పవిత్రతకూ, అపవిత్రతకూ ఆవల ఉంటుంది. వీటన్నిటినీ దాటిన స్థితినే విజ్ఞానం అంటారు. అటువంటివాడికే దైవసాక్షాత్కారం కలుగుతుంది."

## 78. భగవత్సాక్షాత్కారం తరువాత ప్రపంచం ఆనందమయం (ఇద్దరు సాధువులు – నగర సందర్శనం)

విజయకృష్ణ గోస్వామి ఒక గొప్ప భక్తుడు. అతడు అద్వైత గోస్వామి వంశానికి చెందినవాడు. బ్రహ్మ సమాజంలో అర్చకుడిగా పనిచేశాడు. గురుదేవుని సాంగత్యంవల్ల అతడిలో వివేకవైరాగ్యాలు వృద్ధి చెందాయి. గయ మొదలగు పుణ్యక్షేత్రాలలో ఏకాంతంలో కాలం గడిపి, కాషాయాంబరం ధరించి ఉన్నతమైన మనఃస్థితిలో గురుదేవుని సమక్షంలో దీర్ఘమైన ఆలోచనలో మునిగి ఉన్నాడు. అతడి స్థితిని చూచి గురుదేవులు, "విజయా! నీకు గది దొరికిందా?" అని ప్రశ్నించారు. విజయుడు మౌనంగా ఉన్నాడు. అప్పుడు గురుదేవులు, "నీకొక కథ చెపుతా విను!" అంటూ ఇలా చెప్పారు.

"ఒకసారి ఇద్దరు సాధువులు పరివ్రాజక జీవితం గడుపుతూ ఒక పట్టణంలోనికి ప్రవేశించారు. వారిలో ఒక సాధువు ముందుగా ఒక సత్రంలోని గదిలో తన సామాన్లు పెట్టుకొని, గదికి తాళం వేసుకొని తరువాత సంతోషంగా పట్నంలోని వింతలు, విశేషాలు, బజార్లు, అంగళ్ళు, భవనాలు చూసుకుంటూ నెమ్మదిగా నడుస్తున్నాడు. అదే సమయంలో రెండవ సాధువు ఎదురుగా వచ్చి, 'సోదరా! నీవు హాయిగా ఈ పట్నాన్ని సందర్శిస్తున్నావే. నీ మూట, ముల్లె ఏం చేశావు?' అని అడిగాడు. దానికి మొదటి సాధువు, 'నేను పట్నంలోకి రాగానే ఒక గదిని వెదికి చూసుకొని నా సామాన్లు అందులో భద్రంగా ఉంచి, తాళం వేసుకొని, ఆ తర్వాత నిశ్చింతగా పట్నమంతా కలయ చూస్తున్నాను' అని జవాబు ఇచ్చాడు."

"అదే విధంగా, 'విజయా! నీకు గది (భగవదాశ్రయం) దొరికిందా? అని అడుగుతున్నాను'," అని కథ ముగించి, అక్కడ కూర్చొని ఉన్న మహేంద్రుణ్ణి చూచి, "ఇన్నాళ్ళుగా పూడుకుపోయి ఉన్న విజయకృష్ణుని హృదయంలోని ఊటబావి ఇప్పుడు తెరుచుకుంది" అన్నారు.

## 79. మాయయే అనేక ఉపాధులుగా రూపుదాల్చుతుంది (కప్ప – రూపాయి; నడిమంత్రపు సిరి)

విజయకృష్ణ గోస్వామి గురుదేవుని ఒకసారి ఇలా అడిగాడు. "స్వామీ! మేము ఎందుకు బద్ధులమై ఉన్నామండీ? భగవంతుడు మాకెందుకు కనిపించడం లేదు?" దానికి గురుదేవులు సమాధానం చెపుతూ, "సచ్చిదానందమే జీవునిగా రూపుదాల్చుతుంది. కాని మాయవల్ల జీవుడు తన నిజస్వరూపాన్ని మరచిపోతున్నాడు. ఈ మాయ జీవుడికి అనేక ఉపాధుల్ని సృష్టిస్తుంది. (ఉపాధి అంటే సత్యం కానిదాన్ని నిజమనిపించేలా చేసే పైతొడుగు.) వాటిలో డబ్బు ఒక ఉపాధి. ఒక కథ చెపుతా విను!"

"ఒక కప్పకు ఒక రూపాయి నాణెం దొరికింది. దాన్ని అది తన కన్నంలో దాచుకుంది. ఒకరోజు ఒక ఏనుగు ఆ కన్నం మీదుగా నడవడం సంభవించింది. ఆ కప్ప పట్టలేని కోపంతో పైకి వచ్చి ఆ ఏనుగును తన్నడానికి తన ఎడమకాలు ఎత్తి, 'నా కన్నం మీద నుండి నడవడానికి నీకెంత ధైర్యం!' అని గద్దించింది. డబ్బు మనిషిలో అటువంటి మార్పును తెస్తుంది."

"ఇంకొక సంగతి చెపుతా విను! ఒక బ్రాహ్మణుడు దక్షిణేశ్వర ఆలయ ఉద్యానవనానికి వస్తుండేవాడు. పైకి చాలా నమ్రతగా ఉన్నట్లు కనిపించేవాడు. ఒకరోజు నేను, హృదయుడు కలిసి కొన్నగరు (కలకత్తాలో ఒక పేట) వెళ్ళి తిరిగి వస్తున్నాము. మేము పడవ దిగేసరికి ఆ బ్రాహ్మణుడు గంగాతీరంలో కూర్చొని ఉండడం గమనించాను. బహుశా చల్లగాలికి విశ్రాంతిగా కూర్చున్నాడని

అనుకున్నాను. అతడు మావైపు చూసి, 'ఏమోయీ! పూజారీ! ఎలా ఉన్నావు?' అని అడిగాడు. అతడి వాలకం చూచి, కంఠధ్వని విని, హృదయునితో, 'హృదయా! ఇతనికేదో కొంత డబ్బు (నడిమంత్రపు సిరి) వచ్చిపడినట్లుంది. అందుకే ఇలా మాట్లాడుతున్నాడు' అన్నాను."

"ప్రతి ఉపాధి మనుష్యుని స్వభావాన్ని మారుస్తుంది. ముస్తాబు చేసుకోవడం ఒక ఉపాధి. నల్ల అంచు ధోవతి కట్టుకున్నాడంటే నిధుబాబు జావళీలు (శృంగారగీతాలు) పాడుతూ ఉంటాడు! దాని తరువాత చీట్లపేక, ఆ తరువాత చేతికర్ర వస్తాయి. అస్వస్థతగా ఉన్నవాడైనా సరే పెద్దపెద్ద ఖరీదైన బూట్లు వేసుకున్నాడంటే ఈలలు వేస్తూ మెట్లమీద ఇంగ్లీషువానిలాగా టకటకమంటూ దూకుతూ పోతాడు! ఇక చేతిలో కలం ఉంటే కాగితం మీద గీకివేస్తాడు. కలం యొక్క ప్రభావం అటువంటిది!"

"ఈ ఉపాధులన్నీ మాయయొక్క రూపాలే. ఈ మాయ అంటే ఏమిటో కాదు, జీవుని అహంకారమే."

## 80. తెలిసీ తెలియనివాడు సరిగ్గా బోధించలేడు (గొడ్లపాకలో గుర్రాలు!; గురువులలో రకాలు)

"భగవద్దర్శనం పొందని వాడి బోధలు సరైన ఫలితాన్ని ఇవ్వలేవు. అటువంటివాడు ఒక విషయం గురించి సరిగ్గా చెప్పవచ్చు కానీ, వెంటనే మరొక విషయాన్ని చెప్పడంలో తత్తరపడతాడు."

"ఒకరోజు బ్రహ్మసమాజ నాయకులలో ఒకడైన సమాధ్యాయి ఒక ఉపన్యాసం చెప్పాడు. దానిలో అతడు, 'భగవంతుడు వాక్కునకు, మనస్సుకు అతీతుడు. అతడు రసహీనుడు. కనుక అతణ్ణి మీ భక్తి, ప్రేమలతో పూజించి రసభరితుణ్ణి చెయ్యండి' అని చెప్పాడు. సచ్చిదానంద స్వరూపుడైన భగవంతుణ్ణి ఈ విధంగా రసహీనుడని అనడం ద్వారా ఆయన నిజతత్త్వాన్నే తారుమారు చేశాడు. అటువంటి ఉపన్యాసాలవల్ల ప్రయోజనం ఏమి ఉంటుంది? వాటినుండి ప్రజలు ఏమి నేర్చుకుంటారు? అటువంటి ఉపన్యాసం, 'మా మామగారి గొడ్లపాక నిండా గుర్రాలున్నాయి' అని చెప్పినట్లు ఉంటుంది. 'గొడ్లపాకలో గుర్రాలా? అంటే అక్కడ గుర్రాలు, గొడ్లూ రెండూ లేవన్న మాట!' అనుభూతి చెందని వారి మాటలు అలా ఉంటాయి."

ఇదే విషయాన్ని గురించి మరొక సందర్భంలో మాట్లాడుతూ, "భగవంతుడి నుంచి అనుజ్ఞ పొందిన బోధకుణ్ణి ఎవరూ తికమక పెట్టలేరు. సరస్వతీ దేవి నుంచి ఒక కాంతికిరణాన్ని అందుకున్నవాడు ఎంతటి శక్తిమంతుడవుతాడంటే అటువంటివాడి ముందు సాధారణమైన పండితులు వానపాములలాగా

కనిపిస్తారు. ఒక బ్రహ్మసమాజ బోధకుడు ఒకసారి తన ఉపన్యాసంలో, 'మిత్రులారా! అప్పటిలో నేనెంత తాగేవాడినో!' అన్నాడు. అటువంటి మాటలు అక్కడ ఉన్న శ్రోతలలో చాలా తికమక పుట్టించాయి. కాబట్టి బోధన చేసేవాడు సన్మార్గుడు కాకపోతే దానివల్ల సత్ఫలితం కలుగదు" అని చెప్పారు.

సమర్థుడైన గురువు లభించినప్పుడు సాధకుడు త్వరగా పురోభివృద్ధి సాధించగలడని చెపుతూ, "యదార్థమైన గురువు లభిస్తే జీవుని అహంకారం సులభంగా నశిస్తుంది. కాని అశక్తుడైన గురువు చేతిలో పడితే వాడికి ముక్తి లభించదు. ఒక విషయం చెపుతా విను!" అని ఇలా చెప్పారు.

"ఒకసారి నేను సరుగుడు తోపు మీదుగా బహిర్దేశానికి వెళ్ళి వస్తున్నాను. వెళ్ళేటప్పుడు ఒక కప్ప అరుపు వినిపించింది. బహుశా ఆ కప్ప పాము నోటిలోపడి ఉండవచ్చు అనుకున్నాను. కాని కొంతసేపైన తరువాత మళ్ళీ నేను తిరిగి వచ్చేటప్పుడు కూడా ఆ కప్ప బాధతో అరుస్తూనే ఉంది. ఏమిటో చూద్దామని దగ్గరకు వెళ్ళాను. అక్కడ ఒక పెద్దకప్ప నీటిపాము నోటిలో చిక్కుకుంది. పాము కప్పను లోపలికి మ్రింగలేకపోతోంది, బయటకు కక్కలేకపోతోంది. అందువల్ల ఇటు పాము, అటు కప్ప విపరీతమైన బాధను అనుభవిస్తున్నాయి. అదే కప్ప గనుక ఒక మంచి త్రాచుపాము నోటిలోపడినట్లయితే మూడు అరుపులతో చచ్చి ఊరుకునేది. కాని అది నీటిపాము అవడంవల్ల రెంటికీ బాధ తప్పడంలేదు. అందువల్ల యథార్థమైన గురువు చేతిలో చిక్కినవారి అహంకారం (అంటే అన్ని ఉపాధులు) మూడు అరుపులతో అంతరిస్తుంది సుమా!" అని చెప్పారు.

గురువులలో రకాలను వివరిస్తూ గురుదేవులు ఇలా చెప్పారు. "వైద్యులలో మూడు రకాలు ఉంటారు. రోగి నాడి చూసి, మందు ఇచ్చి, వేసుకోమని చెప్పి ఊరుకునేవాడు మూడవరకం వైద్యుడు. అతడు రోగి మందు నిజంగా వేసుకున్నాడా లేదా అన్న విషయాన్ని పట్టించుకోడు. రెండవరకం వైద్యుడు రోగిని అనునయిస్తూ మాట్లాడతాడు. మందువేసుకోమని బుజ్జగించి చెపుతాడు. 'నీ కోసమే ఈ మందు తయారు చేశాను. మందు వేసుకోకపోతే నీకు ఎలా నయమవుతుంది?" అని తియ్యగా మాట్లాడతాడు. ఇక మొదటిరకం వైద్యుడు రోగి మందువేసుకోక మొరాయిస్తుండడం గమనించి బలవంతంగా ఆ రోగిచేత మందును తినిపిస్తాడు. అవసరమైతే ఆ రోగిని మోకాలి క్రింద నొక్కిపట్టి బలవంతంగా మందును అతడి గొంతులో పోస్తాడు. ఇటువంటి వాడే ఉత్తముడైన వైద్యుడు."

"అదే విధంగా గురువులలో కూడా మూడు రకాల గురువులు ఉంటారు. తక్కువరకం గురువులు శిష్యులకు సూచనలిచ్చి వారి మానాన వారిని

వదిలివేస్తారు. శిష్యులు ఎలా పురోగతి చెందుతున్నారని గమనించరు. మధ్యరకం గురువు రకరకాలుగా ప్రయత్నించి తన బోధన శిష్యుడి తలకెక్కేలా చెయ్యడానికి ప్రయత్నిస్తాడు. అనేక రకాలుగా ప్రేమ కురిపిస్తూ, నేర్చుకోమనీ, సాధన చెయ్యమనీ ప్రాధేయపడతాడు. కానీ ఉత్తముడైన గురువు పైన చెప్పిన మొదటిరకం వైద్యుడిలాగా బలప్రయోగంతోనైనా సరే శిష్యుడికి నేర్పడానికీ, శిష్యుడు బాగుపడేలా చెయ్యడానికీ ప్రయత్నిస్తాడు. అటువంటివాడే సద్గురువు అని నా అభిప్రాయం" అని గురుదేవులు సద్గురువు ఎలా ఉండాలో వివరించారు.

## 81. అతి సులువైన ఉపాయం
## (సాధువు - గొర్రెల కాపరి)

"పిల్లలకుండే కల్లాకపటంలేని మనస్సు, విశ్వాసం కనుక ఉంటే భగవత్సాక్షాత్కారం సులభమౌతుంది," అని చెపుతూ శ్రీరామకృష్ణులు ఈ క్రింది కథను చెప్పారు.

"ఒక గొర్రెలకాపరి ఒక సాధువును దర్శించుకుని, తనకు దేవుణ్ణి పొందే మార్గాన్ని తెలుపమని ప్రార్థించాడు. 'భగవంతుణ్ణి హృదయపూర్వకంగా ప్రేమించు!' అని ఆ సాధువు అతనికి సలహా ఇచ్చాడు. దానికి బదులుగా వాడు, 'నేనెన్నడూ భగవంతుణ్ణి చూడలేదు. ఆయన గురించి నాకేమీ తెలియదు. మరి ఆయనను ప్రేమించడం ఎలా కుదురుతుంది?' అని అడిగాడు. 'నువ్వు అన్నిటికన్నా దేనిని ఎక్కువగా ప్రేమిస్తావు?' అని సాధువు అతణ్ణి అడిగాడు. ఆ గొర్రెల కాపరి, 'అయ్యా, నాకెవరూ లేరు. ఒక గొర్రె మాత్రం ఉంది. దానినే నేను ప్రేమిస్తాను' అన్నాడు. అప్పుడు ఆ సాధువు, 'అలా అయితే, దానిలోనే భగవంతుడున్నాడని అనుకో! ఆ గొర్రెనే నీ సర్వస్వంగా భావించు! దాన్ని జాగ్రత్తగా మేపు! నీ ప్రేమంతా దానిపైనే చూపించు!' అని ఆ గొర్రెల కాపరికి సలహా ఇచ్చి ఆ సాధువు వెళ్ళిపోయాడు. సాధువు చెప్పిన విధంగా ఆ గొర్రెలోనే దేవుడున్నాడని పూర్తిగా నమ్మి, ఎంతో ప్రేమతో ఆ గొర్రెలకాపరి దానిని మేపసాగాడు. చాలాకాలం తరువాత తన తిరుగు ప్రయాణంలో సాధువు అక్కడికి వచ్చాడు. గొర్రెలకాపరిని కలుసుకొని, 'ఎలా ఉన్నావు?' అని కుశలప్రశ్నలు వేశాడు. గొర్రెలకాపరి సాధువుకు నమస్కరించి, 'స్వామీ! నేను మీ దయవల్ల బాగానే ఉన్నాను. మీరిచ్చిన సలహా నాకు చాలా మేలు చేసింది. తరచుగా నాకు నా గొర్రెలో నాలుగు చేతులున్న ఒక అందమైన దేవుడు కనిపిస్తున్నాడు. ఆ సమయంలో నాకు పట్టరాని ఆనందం కలుగుతున్నది' అన్నాడు.

## 82. ఎంతో కొంత నమ్మకం ఉండాలి!
## (లంకె బిందెలు)

"ఏ పని చెయ్యాలన్నా మనిషికి ఆ పని మీద, దాని ఫలితం మీద ఎంతోకొంత నమ్మకం ఉండాలి. అప్పుడే ఆ పనిని సంతోషంగా చెయ్యగలుగుతాడు," అని గురుదేవులు ఈ క్రింది కథను చెప్పారు.

"ఒక ఊరిలో ఒకడున్నాడు. వాడికి తన ఇంటి పెరటిలో లంకెబిందెలున్నాయని ఎవరో చెప్పారు. మొట్టమొదట వాడికి అక్కడ ఆ లంకెబిందెలు ఉన్నాయన్న నమ్మకం కలగాలి. ఆ లంకెబిందెల గురించి ఊహించుకుంటేనే వాడికి ఆనందం కలగాలి. అప్పుడు వాడు త్రవ్వడం ప్రారంభిస్తాడు. కొంచెం త్రవ్వగానే ఖంగుమన్న శబ్దం వినిపిస్తుంది. దానితో వాడి సంతోషం ఇంకా ఎక్కువవుతుంది. మరికొంచెం త్రవ్వగా బిందె అంచు కనిపిస్తుంది. వాడి సంతోషం మరింత ఎక్కువవుతుంది. ఆ విధంగా వాడి సంతోషం ఎక్కువవుతూనే ఉంటుంది. దీనికంతకూ మూలకారణం మొదట వాడికి కొంత నమ్మకం ఉండటమే!"

"కాళీ ఆలయం వసారాలో నిలబడి నేను అక్కడున్న సాధువులు గంజాయి త్రాగడానికి చిలుముల్ని నింపుతూ ఉండడం చూసేవాణ్ణి. పొగ త్రాగబోతున్నామన్న ఆనందం వారి ముఖాలమీద తాండవించేది."

## 83. ఎటువంటి వ్యాకులత కావాలి?
## (అమ్మకోసం ఏడుపు; గాలిపటం కోసం మారాము)

"హృదయంలో వ్యాకులత కలిగితే తప్ప భగవంతుణ్ణి చూడలేము. జీవితపు అనుభవాలన్నింటినీ పూర్తి చేసుకుంటే తప్ప మనిషికి ఈ విధమైన వ్యాకులత కలుగదు. కామకాంచనాలలో మునిగితేలుతూ, తాము పొందవలసిన అనుభవాలన్నింటినీ పూర్తిగా పొందని వారికి భగవంతుడి మీద వ్యాకులత కలుగదు" అని చెపుతూ గురుదేవులు ఇలా వివరించారు.

"నేను కామార్పుకూరులో ఉన్నప్పుడు, హృదయుడి కొడుకు రోజంతా నాతోనే ఉండేవాడు. వాడికి నాలుగైదు సంవత్సరాల వయస్సు ఉంటుంది. వాడు ఆటబొమ్మలతో ఆడుతూ అన్నీ మరచిపోయేవాడు. కానీ సాయంత్రం అయ్యేసరికి, 'నాకు అమ్మ కావాలి!" అనేవాడు. నేను వాణ్ణి రకరకాలుగా ఊరడించాలని చూసేవాణ్ణి. "ఇదుగో! నీకు పావురం బొమ్మ ఇస్తాను తీసుకో!' అనేవాణ్ణి. కానీ వాడికి అవేమీ నచ్చేవి కావు. 'నేను అమ్మ దగ్గరికి పోతాను!' అని ఏడిచేవాడు.

వాడికి ఆపైన ఆట ఎంతమాత్రం నచ్చేది కాదు. వాడి పరిస్థితి చూస్తే నాకే ఏడుపు వచ్చేది."

"ఒక చిన్నపిల్లవాడి లాగా మనిషి భగవంతుడి కోసం విలపించగలగాలి. భగవంతుడిపట్ల వ్యాకులతకు అర్థం అదే. ఆ స్థితిలో మనిషికి తిండి, ఆట – ఏదీ నచ్చదు. మనిషి ఈ ప్రపంచంలో పొందవలసిన అనుభవాలన్నింటినీ పొందిన తర్వాత ఈ రకమైన వ్యాకులత కలిగి భగవంతుడి కోసం విలపించడం ప్రారంభిస్తాడు."

"విషయవాసనలు, సుఖాలు కావాలన్న కోరికలు ఎలా హరిస్తాయి?" అని ఒక భక్తుడు గురుదేవుల్ని అడిగాడు. దానికి గురుదేవులు సమాధానమిస్తూ, "వ్యాకులమైన మనస్సుతో జగజ్జననితో మొరపెట్టుకో! ఆమె మన కన్నతల్లి. పెంచిన తల్లి కాదు. కాబట్టి ఆమె దగ్గర హఠంవేసి పని సాధించుకోవచ్చు. ఒక ఉదాహరణ చెపుతా విను!" అని ఇలా చెప్పారు.

"చిన్నపిల్లవాడు గాలిపటం కొనుక్కుంటాననీ, డబ్బులు కావాలనీ తల్లిని అడుగుతాడు. దానికి తల్లి, 'నేను ఇవ్వను. నాన్న ఇవ్వవద్దని చెప్పారు. ఆ గాలిపటం కొనితెచ్చి ఇప్పుడు లేనిపోని గొడవలు తెచ్చిపెడతావు' అంటుంది. అయినా వినకుండా వాడు ఆమె చీరకొంగు పట్టుకుని లాగుతూ మారాం చేస్తూనే ఉంటాడు. ఆమె పొరుగు స్త్రీలతో మాట్లాడుతూ ఉంటే ఏడుపు లంకించుకుంటాడు. ఎంత మరపించినా మరచిపోడు. ఆగడం చేస్తూనే ఉంటాడు. ఇంక ఆమె వారితో, 'ఒక నిమిషం ఉండండి! మా అబ్బాయి డబ్బులకోసం అల్లరి చేస్తున్నాడు' అంటూ లోపలికి వెళ్ళి వాడికి కావలసిన పైసలు ఇచ్చి పంపుతుంది. అదే విధంగా మీ రు కూడా మొండిపట్టు పట్టి తల్లి దగ్గర మీకు కావలసినది వసూలు చేసుకోవాలి. 'నాకు కనపడి తీరాలి!' అని మీరు విలపిస్తే ఆమె తప్పకుండా కనపడుతుంది, తెలిసిందా! సొంతవారిని కాకపోతే ఇంకెవరిని మనం బలవంతం చేయగలం?"

## 84. వ్యాకులత ఉంటే భగవద్దర్శనం కలుగుతుంది (బాలవితంతువు – గోవిందుడు)

శ్రీరామకృష్ణులు మహేంద్రనాథ గుప్తతో ఈ విధంగా చెప్పారు. "ఎప్పుడు వ్యాకులత కలుగుతుందో అప్పుడు భగవంతుడు దర్శనమిస్తాడు. దేవుణ్ణి పొందాలన్న బలమైన కోరిక, తపన కలగాలి. దాని ద్వారా మనస్సు పూర్తిగా భగవంతుని పైకి మరలుతుంది."

"ఒకడికి బాలవితంతువు అయిన కుమార్తె ఉండేది. ఆమె చాలా చిన్న వయసులోనే వైధవ్యాన్ని పొందింది. ఆమె తన భర్తను కనీసం చూడలేదు కూడా.

ఆమె తన స్నేహితురాళ్ళ భర్తలను చూసి, ఒకరోజు తండ్రితో, 'నా భర్త ఎక్కడున్నాడు?' అని ప్రశ్నించింది. ఆమె తండ్రి, 'గోవిందుడే నీ భర్త! నువ్వు పిలిస్తే ఆయన వస్తాడు' అని సమాధానం చెప్పాడు. ఈ మాటలు విని ఆ అమ్మాయి తన గదిలోకి వెళ్ళి, తలుపులు మూసి, ఏడుస్తూ, 'ఓ గోవిందా! నా దగ్గరకు రావా? నాకు కనపడవా? నువ్వు ఎందుకు రావు?' అని దీనాతిదీనంగా ప్రార్థించింది. దేవుడు ఆర్తితో కూడిన ఆమె ప్రార్థనను విని రాకుండా ఉండలేకపోయాడు. ఆమెకు దర్శనమిచ్చాడు." గురుదేవులు ఇంకా ఇలా చెప్పారు: "పసిపిల్లవాడి వంటి విశ్వాసం ఉండాలి. తల్లిని చూడాలని పసిపిల్లవాడు ఎలా ఆరాటపడతాడో అటువంటి ఆరాటం ఉండాలి. ఆ ఆరాటం, వ్యాకులత సూర్యోదయానికి ముందు తూర్పున కనిపించే ఎర్రని ఆకాశం వంటివి. ఆకాశం ఆ విధంగా కనిపించాక సూర్యుడు ఉదయించి తీరాలి. అటువంటి ఆరాటం కలిగిన మరుక్షణం భగవంతుడు దర్శనమిస్తాడు."

## 85. స్వప్రయత్నము - శరణాగతి
## (ఇద్దరు పిల్లలు - గాలిపటము; మార్జాలకిశోర, మర్కటకిశోర న్యాయాలు)

"ఒక తండ్రి తన ఇద్దరు పిల్లలతో పొలం గుండా నడిచి వెడుతున్నాడు. అతడు ఒక పిల్లవాణ్ణి ఎత్తుకున్నాడు. రెండవ పిల్లవాడు తండ్రి చెయ్యి పట్టుకుని నడుస్తున్నాడు. వారికి ఆకాశంలో ఒక గాలిపటం ఎగురుతూ కనిపించింది. తండ్రి చెయ్యి పట్టుకున్న పిల్లవాడు, తండ్రి చేతిని వదిలి ఆనందంతో చప్పట్లు చరుస్తూ, 'నాన్నా, నాన్నా! చూడు అదిగో గాలిపటం!' అని అరుస్తున్నాడు. అయితే కాలికి ఒక రాయి తగిలి క్రిందపడిపోయాడు. తండ్రి ఎత్తుకున్న పిల్లవాడు కూడా చప్పట్లు చరుస్తూ కేరింతలు కొట్టాడు. కానీ తండ్రి అతణ్ణి ఎత్తుకుని ఉన్నాడు కాబట్టి వాడు క్రింద పడిపోలేదు. ఆధ్యాత్మిక విషయాలకు సంబంధించి, తండ్రి చెయ్యి పట్టుకుని నడుస్తున్న ఆ మొదటి పిల్లవాడు స్వప్రయత్నాన్ని సూచిస్తే, తండ్రి ఎత్తుకుని ఉన్న రెండవ పిల్లవాడు శరణాగతిని సూచిస్తాడు. ఈ రెండింటిలో శరణాగతి సాధకునికి శ్రేయస్కరమైనది."

"పిల్లికూన తల్లిని అంటిపెట్టుకుని ఉంటుంది. తల్లి ఎక్కడ తనను ఉంచితే అక్కడ ఉంటుంది. 'మ్యావ్‌మ్యావ్' అని పిలవడం మాత్రమే ఆ కూనకు తెలుసు. తల్లి ఆ కూనల్ని అనేకచోట్లకు తిప్పుతుంది. ఒక్కొక్కసారి పడకమీద ఉంచుతుంది, కొన్నిసార్లు కట్టెల వెనుక దాచిపెడుతుంది. అయితే ఆ పిల్లికూనలు ఎక్కడుంచితే అక్కడ ఉంటాయి. వాటికి తమ సొంత ఇష్టం అనేదేమీ ఉండదు. ఆ పిల్లికూనల

క్షేమాన్ని తల్లే చూసుకుంటుంది. ఇలాగే కొందరు భక్తులకు జపధ్యానాలు, పూజాపురస్కారాలూ ఏమీ తెలియవు. కేవలం వ్యాకులచిత్తంతో భగవంతుణ్ణి ప్రార్థిస్తూ ఉంటారు. అటువంటివారి మొర విని, భగవంతుడు తాళలేక వచ్చి వారికి దర్శనమిస్తాడు. ఇలా శరణాగతిని పాటించే వారిని మార్జాలకిశోర స్వభావులని అంటారు. మర్కట కిశోర స్వభావులని మరొక రకపు భక్తులు కూడా

ఉంటారు. ఈ రకపు భక్తులు కోతిపిల్ల స్వభావాన్ని కలిగి ఉంటారు. కోతిపిల్ల ఎంతటి కష్టంలోనైనా తల్లిని గట్టిగా పట్టుకుని ఉంటుంది. 'ఇలా పూజ చెయ్యాలి, ఇలా ధ్యానం చెయ్యాలి' అని సాధన ద్వారా, పురుషకారం ద్వారా స్వప్రయత్నంతో భగవంతుణ్ణి పొందడానికి ప్రయత్నిస్తారు. ఇలా చేస్తేనే భగవంతుణ్ణి పొందగలమని అనుకుంటారు. వీటిలో శరణాగతియే సులభమైనది" అని గురుదేవులు చెప్పారు. అయితే సాధనలు కూడా అవసరమేననీ, సాధనలు చేయకుండా మార్జాల కిశోరానికి ఉండేటటువంటి శరణాగతిని పొందిన స్థితి లభించదనీ కూడా బోధించారు.

## 86. తీవ్ర వైరాగ్యం వరదలా వస్తుంది!
## (పదహారుమంది భార్యలు – అంచెలంచెల వైరాగ్యం)

ఒకడు స్నానానికి బయలుదేరాడు. అతని భుజం మీద తువ్వాలు ఉంది. ఆ సమయంలో అతని భార్య అతనితో, "నువ్వు వట్టి పనికిమాలినవాడివి! వయస్సు మీదపడుతున్నా నీ అలవాట్లు మానుకోలేకుండా ఉన్నావు. నేను లేకుండా ఒక్కరోజు కూడా బ్రతకలేవు. ఆ మనిషిని చూడు! ఆయనకు ఎంత వైరాగ్యం ఉందో!" అంది.

భర్త: "ఏం! ఆయన ఏమి చేశాడు?"

భార్య: "ఆయనకు పదహారుమంది భార్యలు. వాళ్ళను ఒక్కొక్కరినే విడిచిపెడుతున్నాడు. నువ్వు ఆ విధంగా ఎప్పటికీ చెయ్యలేవు!"

భర్త: "ఏమిటీ! ఒక్కొక్క భార్యనే విడిచిపెడుతున్నాడా? నువ్వు వట్టి పిచ్చిదానివి! వాడు ఎన్నటికీ సన్న్యసించలేడు. ఎవడన్నా సన్న్యసించదలుచుకుంటే, కొద్దికొద్దిగా సన్న్యసిస్తాడా?"

భార్య (చిరునవ్వు నవ్వుతూ): "అయినా ఆయన నీకంటే నయమే కదా!"

భర్త: "నువ్వొక వెర్రిబాగులదానివి! నీకు అర్థం కాదు! వాడెప్పటికీ సన్న్యసించలేడు! నేనే ఆ పని చెయ్యగలను! ఇదిగో, ఇప్పుడే వెళ్తున్నాను చూడు!"

"అలా పలికి, అతడు వెనుదిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు. దీనినే తీవ్రవైరాగ్యం అంటారు. అతడు వివేచన చేసిన వెంటనే సన్న్యసించాడు. తువ్వాలు భుజం మీద వేసుకుని అలాగే వెళ్ళిపోయాడు. తన కుటుంబ వ్యవహారాలు చక్కబెట్టాలని కూడా అనుకోలేదు. సన్న్యసించాలనుకునేవాడికి గొప్ప మానసికశక్తి కావాలి. బందిపోటు దొంగలకు ఉండే దూకుడు మనస్తత్త్వం ఉండాలి. దోచుకుపోయే ముందు బందిపోట్లు, "కొట్టు, చంపు, దోచుకో!" అని అరుస్తారు కదా! అలాంటి ఉత్సాహం కావాలి!" అని చెప్పారు. గురుదేవులు వైరాగ్యం ఎలా కలుగుతుందో వివరిస్తూ మరొక కథ చెప్పారు.

ఒక భార్య తన భర్తతో, "ఏమండీ! నా తమ్ముణ్ణి గురించి నాకు చాలా ఆందోళనగా వుంది. ఒక వారం రోజులనుంచీ వాడు సన్యాసి అవుదామనుకుంటున్నాడు. సన్యాసజీవితం కోసం అంతా సిద్ధం చేసుకుంటున్నాడు. తన కోరికలను క్రమక్రమంగా తగ్గించుకోవడానికి ప్రయత్నం చేస్తున్నాడు. నాకు చాలా ఆందోళనగా ఉంది" అని చెప్పింది. దానికి భర్త ఈ విధంగా సమాధానం చెప్పాడు: "చూడు! నీ తమ్ముణ్ణి గురించి ఏమీ ఆదుర్దా పడవలసిన పనిలేదు. వాడు ఎప్పటికీ సన్యాసి కాలేడు. అసలు ఎవరైనా ఆ విధంగా సన్యాసి కానే కాలేరు!" "అయితే మరి ఏ విధంగా సన్యాసులవుతారు?" అని భార్య అడిగింది. "ఈ విధంగా!" అంటూ ఆ భర్త తన ఖరీదైన బట్టలను చింపివేసి వాటిలో ఒక ముక్క తీసుకొని తన నడుము చుట్టూ కట్టుకుని భార్యతో, "ఇకపై నువ్వు నాకు తల్లివి!" అని చెపుతూ ఇంటిని వదిలి వెళ్ళిపోయాడు. మళ్ళీ తిరిగి రాలేదు. అందుచేత వైరాగ్యం వాన చినుకుల్లా బొట్టుబొట్టుగా కాకుండా, ఒక వరదలాగా వస్తుంది.

మరొక సందర్భంలో ఇలా చెప్పారు. "కేశవ చంద్రసేను, 'స్వామీ! ఇంటి వ్యవహారాలన్నీ చక్కబెట్టి ఆ తర్వాత భగవంతుణ్ణి గురించి చింతించాలనుకోవడం తప్పా?' అని ప్రశ్నించాడు. నేను అతడితో, 'నిజంగా వైరాగ్యం కలిగినవాడికి సంసారం ఒక మురికికూపంలాగానూ, బంధువర్గం త్రాచుపాములలాగానూ కనపడతారు. అలాంటి స్థితిలో ధనాన్ని కూడబెట్టి తన కుటుంబం కోసం తగిన ఏర్పాట్లు చేయాలన్న యోచన రాదు. ఈశ్వరుడే సత్యం – మిగిలినదంతా అసత్యం. ఈశ్వరుణ్ణి విడిచి విషయ చింతన చేయడం ఎంత ఘోరం! ఒకామెకు గొప్ప కష్టం వచ్చింది. అయితే ముందుగా తన ముక్కుకు ఉన్న ముక్కెరను తీసి చీరకొంగులో భద్రంగా ముడివేసి, ఆ తర్వాత నేలమీద పొర్లుతూ ఏడవడం మొదలుపెట్టింది!! అలా ఏడిచి పొర్లేటప్పుడు కూడా ఆ ముక్కెర ఎక్కడ విరిగిపోతుందో అని జాగ్రత్తగా నేలమీద పొర్లుతోంది. నిజమైన వైరాగ్యం ఇలా ఉండదు!"

వైరాగ్యంలో మూడు నాలుగు రకాలున్నాయని గురుదేవులు చెప్పారు. "ఇంటిలో కష్టాలకు తట్టుకోలేక కాషాయ వస్త్రాలు కట్టుకునే వైరాగ్యం ఎక్కువ కాలం నిలువదు. మరొక రకమైన వైరాగ్యంలో మనిషి కాషాయ బట్టలు కట్టుకుని వారణాసికి వెళ్ళిపోతాడు. అయితే మూడు నెలల తర్వాత ఇంటికి ఉత్తరం వ్రాస్తూ, 'నాకు ఇక్కడ ఉద్యోగం దొరికింది. నేను బాగానే ఉన్నాను, కొద్దిరోజుల్లో ఇంటికి వస్తాను. నా గురించి బెంగ పెట్టుకోకండి' అని ఇంట్లో వారికి ధైర్యం చెపుతాడు. కానీ మరొకడికి కావలసినవన్నీ ఉంటాయి. దేనికీ కొదువ లేకపోయినా తన ఆస్తిపాస్తులతో సుఖాన్ని పొందడు. ఏకాంతంలో కూర్చొని, కన్నీరుమున్నీరుగా

భగవంతుడి కోసం విలపిస్తూ ఉంటాడు. భగవంతుడొక్కడే తనవాడని, అతడే తనకు కావాలనీ విలపిస్తూ ఉంటాడు. అదే నిజమైన వైరాగ్యం."

## 87. మంచి విషయాల అనుకరణతో మంచి ఫలితాలు (రాజకుమారి - దొంగసాధువు)

ఒక అర్ధరాత్రి సమయంలో ఒక దొంగ రాజభవనంలో ప్రవేశించాడు. అదే సమయంలో రాజు రాణితో మాట్లాడుతూ, "మన అమ్మాయిని నది ఒడ్డున తపస్సు చేసుకుంటున్న సాధువులలో ఒకరికిచ్చి వివాహం చేద్దామనుకుంటున్నాను" అని చెపుతున్నాడు. ఈ మాటలు ఆ దొంగ చెవిన పడ్డాయి. దొంగ తనలో, "బాగుంది! నన్నేదో అదృష్టం వరించేటట్టు ఉంది. రేపు ఉదయం సాధువులాగా వేషం వేసుకొని నది ఒడ్డున ఉన్న సాధువులతో కలిసి కూర్చుంటాను. అదృష్టం బాగుంటే, నేనే రాజకుమారిని పెళ్ళాడవచ్చు!" అనుకున్నాడు.

మరుసటిరోజు అతడు అనుకున్న విధంగా చేశాడు. రాజసేవకులు వచ్చి సాధువులనందరినీ, "రాజకుమారిని వివాహం చేసుకుంటారా?" అని అడిగారు. ఎవ్వరూ ఒప్పుకోలేదు. చివరికి ఈ దొంగ-సాధువును కూడా అడిగారు. అతడు ఏమీ మాట్లాడలేదు. అతడి మౌనాన్ని అంగీకారంగా భావించి రాజసేవకులు రాజు దగ్గరికి వెళ్ళి ఆ సన్న్యాసులెవరూ ఒప్పుకోలేదనీ, ఒక యువసన్న్యాసి మాత్రం బహుశా ఒప్పుకోవచ్చుననీ చెప్పారు. రాజు స్వయంగా ఈ దొంగ-సన్న్యాసి వద్దకు వచ్చి తన కూతురిని వివాహం చేసుకోమని ప్రార్థించాడు. కాని రాజు వచ్చి ఈ విధంగా అడిగే సమయానికి ఆ దొంగ మనస్సు మారిపోయింది. అతడు తనలో తాను ఇలా అనుకున్నాడు: "నేను సాధువు వేషం మాత్రమే వేశాను. అయినా ఆశ్చర్యకరంగా రాజే స్వయంగా వచ్చి నన్ను బ్రతిమాలుతున్నాడు. వేషానికే ఇంత శక్తి ఉంటే నిజంగా నేను సాధువునే అయితే ఇంకెంత మంచి ఫలితం కలుగుతుందో కదా!" అనే ఆలోచన అతనిలో బలంగా కలిగింది. అతడు రాజకుమారిని వివాహం చేసుకోలేదు సరికదా, ఆ రోజు నుంచీ తన ప్రవర్తన, పద్ధతులు మార్చుకొని నిజమైన సాధువుగా మారడానికి తీవ్రమైన ప్రయత్నం చేశాడు. కాలక్రమంలో ఆనాటి మహానుభావులలో ఒకరిగా పేరు గాంచాడు. అందువలన మంచి విషయాల అనుకరణ కూడా అనుకోని విధంగా మంచి ఫలితాలను ఇస్తుంది.

## 88. సత్సాంగత్యం
## (ఉమాదేవి – హిమవంతుడు)

పురాణాలలో ఈ విధంగా చెప్పబడి ఉంది: “జగన్మాతయైన ఉమాదేవి హిమవంతుడి కుమార్తెగా జన్మించింది. ఆమె జగన్మాత యొక్క వివిధరూపాలను హిమవంతుడికి చూపించింది. వాటితో హిమవంతుడు సంతృప్తి పడలేదు. ‘అమ్మా! ఇవన్నీ బాగానే ఉన్నాయి కానీ, వేదాలలో చెప్పబడిన బ్రహ్మాన్ని నాకు చూపించు’ అని ఆమెను కోరాడు. అప్పుడు ఉమాదేవి, ‘తండ్రీ! మీరు బ్రహ్మాన్ని చూడదలుచుకుంటే, తప్పనిసరిగా అన్నింటినీ త్యజించి, సర్వసంగ పరిత్యాగులైన సాధువుల సాంగత్యంలో ఉండాలి’ అని చెప్పింది. అయినా హిమవంతుడు తనకు బ్రహ్మాన్ని చూపవలసిందేనని పట్టుపట్టాడు. కానీ ఆ స్వరూపాన్ని చూసిన మరుక్షణం స్పృహతప్పి పడిపోయాడు.” సర్వసంగ పరిత్యాగుల సాంగత్యం వలన ‘ఈ దేహమే నేను!’ అనుకునే భావనలు తొలగిపోతాయి. సత్సాంగత్యం అంత గొప్పది.

## 89. ప్రాపంచికులైన వారిని చైతన్యుడు ఆకర్షించిన విధానము
## (చేపల పులుసు)

“అన్నింటినీ త్యజించి పరిపూర్ణమైన హృదయంతో భగవంతుడికి తమను తాము అర్పించుకోమని చెపితే ప్రాపంచికులు ఎన్నటికీ వినరు. అందువల్ల చైతన్యుడు, నిత్యానందుడు కలిసి ఆలోచించి వారిని ఆకర్షించడానికి ఒక ఉపాయం పన్నారు. అటువంటివారితో వాళ్ళు, ‘రండి! హరినామస్మరణ చేయండి. మీకు చక్కటి “మాగుర్ చేపల పులుసు, అందమైన యువతి పొందు”, లభిస్తాయి!’ అనేవారు. ఆ మాటలకు ఆకర్షితులై ఎక్కువమంది హరినామస్మరణ చేసేవారు. హరినామస్మరణలో కొంచెం రుచి మరిగాక వాళ్ళకు ఈ విషయం అర్థమయ్యేది. ఈ ‘చేపల పులుసు’ అంటే దేవుని కోసం వారు కార్చే కన్నీరని, ‘అందమైన యువతి పొందు’ అంటే దివ్యావేశంలో నేలమీద పొర్లడమని వాళ్ళు తెలుసుకునేవారు.”

## 90. నీ మతాన్నే అంటిపెట్టుకో!
## (బావులు త్రవ్వడం)

ఒకసారి ఒకడు బావి త్రవ్వుదామనుకున్నాడు. మరొకణ్ణి సలహా అడిగితే ఒకచోట త్రవ్వమని చెప్పాడు. పదిహేను అడుగుల లోతు త్రవ్వాక దానిలో నీళ్ళుపడకపోయేసరికి అతడు నిరాశ చెందాడు. ఇంతలో అక్కడికి మరొకడు వచ్చి

ఇతడి తెలివితక్కువ ప్రయత్నాన్ని హేళన చేసి తనకు తోచిన మరొకచోట త్రవ్వమని సలహా ఇచ్చాడు. ఇతడు అక్కడకు వెళ్ళి మళ్ళీ త్రవ్వడం ప్రారంభించాడు. ఈసారి ఇరవై అడుగుల లోతు త్రవ్వాడు. కానీ నీరుపడలేదు. ఇంకొకడు వచ్చి మరొకచోట త్రవ్వమని చెప్పాడు. అక్కడ ముప్పై అడుగులలోతు త్రవ్వాడు. అయినా నీళ్ళు పడలేదు. నిరాశానిస్పృహలతో ఆ పని వదిలేసి వెళుతుండగా నాలుగవవాడు వచ్చి నవ్వుతూ ఇలా చెప్పాడు: "నాయనా! నువ్వు ఇప్పటిదాకా చాలా కష్టపడ్డావు. కానీ తప్పుదారి పట్టడం వలన నీ ప్రయత్నాలన్నీ వృథా అయ్యాయి. దయచేసి నాతో రా! నేనొక ప్రదేశం చూపిస్తాను. అక్కడ నువ్వు పారతో భూమిని ముట్టుకుంటే చాలు. నీరు వరదలా ప్రవహిస్తుంది." నీళ్ళు పడతాయన్న ఆశను చంపుకోలేక వాడు ఆ ప్రదేశానికి వెళ్ళి త్రవ్వడం ప్రారంభించాడు. అక్కడ కూడా నిరాశే ఎదురైంది. ఇక తాను చేసే పనిని పూర్తిగా మానివేశాడు. అప్పటిదాకా అతడు నాలుగుచోట్లలో కలిపి మొత్తం ఎనభై అయిదు అడుగులు త్రవ్వాడు. అతనికే కనుక ఓపిక, పట్టుదల ఉండి ఒకేచోట దానిలో సగం లోతు త్రవ్వినా తప్పకుండా నీరు లభించేది. అదే విధంగా తమ మతానికే అంటిపెట్టుకొని ఉండలేని వారు తొందరపాటుతో ఒకదాని వెంట ఒకటిగా ఇతర మతాలకు మారి చివరకు తమ వృద్ధాప్యంలో అసలు మతప్రస్తావనే మానివేసి నాస్తికులుగా తయారవుతారు. అలాకాక తమకు వచ్చిన ఒకే మతానికి అంటిపెట్టుకుని ఉండేవారు లక్ష్యం సాధించగలుగుతారు.

## 91. కామాన్ని అదుపు చేసేదెలా?
## (పెంపుడు కుక్క)

"ఒకడికి ఒక పెంపుడు కుక్క ఉండేది. వాడు దాన్ని ఎత్తుకుని, ముద్దాడి, ఆడుకుంటూ ఉండేవాడు. అయితే ఇంకొకడు వీడు చేస్తున్న పనిని చూసి ఆ విధంగా ఆ కుక్క మీద ప్రేమ కురిపించడం మంచిది కాదని చెప్పాడు. ఎందుకంటే, ఎంతయినా అది జంతువు కదా! ఏదో ఒకరోజు అతణ్ణి కరిచినా కరవవచ్చు. ఇది విని, ఆ కుక్క యజమాని, మళ్ళీ ఎప్పుడూ దానిని ఎత్తుకుని ఆడించకూడదని నిశ్చయించుకున్నాడు. అయితే ఆ కుక్కకి తన యజమాని ప్రవర్తనలోని ఈ మార్పు అర్థం కాలేదు. మాటిమాటికీ అతని దగ్గరకు పరుగెత్తేది. యజమాని తనను ఎత్తుకుని ఆడిస్తాడని దాని ఆశ. అయితే చాలాసార్లు తన్నులు తిన్న తరువాత అది యజమానిని ఇబ్బంది పెట్టడం మానివేసింది."

పై కథను చెప్పి గురుదేవులు ఇంకా ఇలా అన్నారు: "ప్రతి ఒక్కరి పరిస్థితి ఇలానే ఉంటుంది. హృదయంలో ఎంతగానో కోరుకున్న 'కామం' అనే కుక్కని ఎంతగా వదిలించుకోవాలని చూచినా, అది మనల్ని అంత త్వరగా వదిలిపోదు.

అయితే దీనివల్ల భయపడవలసిన పనిలేదు. ఆ కుక్కను ఎత్తుకుని ముద్దాడడం మానివేయండి! మీ దగ్గరకు ఎత్తుకోమని వచ్చినప్పుడల్లా దాన్ని తరిమి వేయండి! క్రమంగా కామం చూపించే ప్రలోభాల నుంచి మీరు విడుదల అవుతారు!"

## 92. జ్ఞాన, భక్తి, రాజయోగాల సమన్వయం (నారదుడు - హనుమంతుడు - శ్రీరామావతారం)

జ్ఞాన మార్గంలో సాక్షాత్కరించే పరబ్రహ్మమే, భక్తి మార్గంలో భక్తుడి కోసం మానవుడి రూపంలో అవతరిస్తుంది. జ్ఞానము, భక్తి ఆ విధంగా సమన్వయాన్ని కలిగి వున్నాయని గురుదేవులు బోధించారు. అయితే ఒకసారి ఒక భక్తుడు, "భక్తిజ్ఞానాలను మునుపెన్నడూ లేని విధంగా మొదటిసారిగా కేశవచంద్ర సేను సమన్వయపరచాడని అతని అనుయాయులు చెపుతున్నారు" అని శ్రీరామకృష్ణులతో అన్నాడు. గురుదేవులు ఆశ్చర్యంతో, "మరి అధ్యాత్మ రామాయణం మాటేమిటి?" అని ప్రశ్నించారు.

"అందులో నారదుడు శ్రీరాముణ్ణి, 'ఓ రామా! వేదాలలో చెప్పబడిన పరబ్రహ్మానివి నీవే. మానవరూపంలో మాతో ఉంటూ మానవుడిలా ప్రవర్తిస్తున్నావు. నిజానికి నీవు మానవుడవు కావు, ఆ పరబ్రహ్మానివే!' అని స్తుతించాడు. దానికి మెచ్చిన రామచంద్రుడు, 'నీ భక్తికి మెచ్చాను. ఏదైనా వరం కోరుకో!' 'నీ నుంచి ఇంకేమి వరం కోరగలను? నీ పాదపద్మాలపై శుద్ధభక్తిని ప్రసాదించు. నీ భువన మోహినీ మాయ నన్ను మోహించకుండా ఉండేటట్లు ఆశీర్వదించు' అని బదులిచ్చాడు. ఈ విధంగా అధ్యాత్మ రామాయణం అంతా భక్తి జ్ఞానాల సమన్వయాల గురించే."

ఇదే విషయాన్ని గురించి మాట్లాడుతూ గురుదేవులు ఇంకొక కథ కూడా చెప్పారు. "ఒకప్పుడు శ్రీరాముడు హనుమంతుడితో 'నీవు నన్ను ఎటువంటి భావంతో చూస్తున్నావు?' అని ప్రశ్నించాడు. హనుమంతుడు జవాబిస్తూ,

**దేహబుద్ధ్యా దాసోఽస్మి**
**జీవబుద్ధ్యా త్వదంశకః ।**
**ఆత్మబుద్ధ్యా త్వమేవాహం**
**ఇతి మే నిశ్చితా మతిః ॥**

'ఓ శ్రీరామా! నాకు ఎప్పుడెప్పుడు "నేను-నాది" అనే భావం ఉంటుందో అప్పుడు నిన్ను యజమానిగానూ, నన్ను నేను సేవకుడిగానూ భావిస్తాను. నన్ను నేను జీవాత్మగా భావించేటప్పుడు నీవు పరిపూర్ణమైన పరమాత్మవనీ, నేను నీలో ఒక అంశ అనీ భావిస్తాను. కానీ ఓ రామా! తత్త్వజ్ఞానం కలిగిన స్థితిలో నీవు నేను ఒకటేననీ, రెండు కాదనీ భావిస్తాను' అన్నాడు. కాబట్టి భక్తి జ్ఞానం అనేవి మనిషి

మానసిక స్థాయిని అనుసరించి అతడికి ఆధ్యాత్మిక అనుభవాలను ఇస్తాయి.

అంతేకాక జ్ఞానయోగం, భక్తియోగంతో పాటు రాజయోగం కూడా అదే స్థితికి దారితీస్తుందని గురుదేవులు చెప్పేవారు. "ఎవరు ఏ మార్గాన్ని అనుసరించినా మనస్సును స్థిరపరచుకోవడమే అందరి లక్ష్యం. మనస్సు స్థిరపడకపోతే యోగం కుదరదు. మనస్సు స్థిరమైతే వాయువు స్థిరమౌతుంది. దీన్నే కుంభకం అంటారు. అన్ని యోగమార్గాలూ ఇదే స్థితికి దారితీయగలవు. భగవన్నామ స్మరణతో కూడా కుంభకం సిద్ధిస్తుంది. "ఒక ఉపమానం చెపుతా వినండి! ఒక స్త్రీ ఇల్లు ఊడుస్తూ ఉంటుంది. ఎవరో వచ్చి ఆమెతో, 'ఫలానా మనిషి చనిపోయింది,' అని చెపుతాడు. చనిపోయిన స్త్రీ కనుక తన దగ్గర బంధువు కాకపోతే ఆ ఊడుస్తున్న స్త్రీ, 'అయ్యో పాపం! చాలా మంచి మనిషి' అంటుంది. తాను చేస్తున్న పనిని ఆపదు. కానీ, ఆ చనిపోయిన వ్యక్తి తన దగ్గరబంధువు అయితే ఆ మాట చెవిలో పడిన మరుక్షణం 'హా' అంటూ కూలబడుతుంది. నోట మాట రాదు. కాళ్ళు చేతులు ఆడవు. ఒక విధంగా చూస్తే వాయువు స్థిరమై ఆమెకు కుంభకం కలిగిందని చెప్పుకోవచ్చు. ఆ వ్యక్తి తనవాడన్న ప్రేమభావం ఆమెలో ఉన్నది కనుకనే అలా జరిగింది. కాబట్టి అన్ని యోగమార్గాలూ ఒకే విధంగా మనస్సును స్వాధీనంలోకి తెచ్చి, భగవత్సాక్షాత్కారం కలిగించగలవు."

## 93. బలము, తేజస్సు కలవారికే భగవల్లాభం కలుగుతుంది (ఎద్దుల్ని పరీక్షించడం)

"వ్యవసాయదారులు ఎద్దుల్ని కొనడానికి సంతకు వెళతారు. ఎద్దుల లక్షణాలు వారికి బాగా తెలుసు. తోకపట్టుకుని దాన్ని పరీక్షిస్తారు. కొన్ని కోడెదూడలు తోకపట్టుకోగానే నేలమీద పడుకుంటాయి. అటువంటి వాటిని కొనరు. కొన్ని మాత్రం తోక తాకగానే ఎగిరి గంతులు వేస్తాయి. పనులు బాగా చేస్తాయి. ఇటువంటి కోడెదూడల్నే ఇష్టపడతారు. నరేంద్రుడు (వివేకానంద స్వామి) ఇటువంటి కోడెల జాతికి చెందినవాడు. అతడిలో మంచి తేజస్సు ఉంది. అటువంటి వారే భగవద్దర్శనాన్ని పొందగలుగుతారు."



# భగవద్దర్శనానికి అంతరాయాలు

## 94. త్రిగుణములు
## (ముగ్గురు దొంగలు)

శ్రీరామకృష్ణ కథామృత రచయిత అయిన మహేంద్రనాథ గుప్త ఒకసారి గురుదేవులను, "దయ కూడా బంధమేనా?" అని ప్రశ్నించాడు. అప్పుడు గురుదేవులు, "అవును. సత్త్వము, రజస్సు, తమస్సు – ఈ గుణాలు మూడూ బంధహేతువులే. సత్త్వగుణం వల్లనే దయ కలుగుతుంది. కానీ అది కూడా బంధహేతువే. ఈ మూడు గుణాలనూ ముగ్గురు దొంగలతో పోల్చి చెప్పే కథ ఉంది. చెపుతా విను!" అని ఈ కథను చెప్పారు.

"ఒకడు అడవిలో ప్రయాణం చేస్తున్నాడు. అకస్మాత్తుగా చెట్ల వెనుక నుండి ముగ్గురు దొంగలు అతణ్ణి పట్టుకుని, ఎక్కడికో లాగుకొనిపోయారు. అతడి దగ్గర ఉన్నవన్నీ దోచుకున్నారు. అంతటితో ఆగక ఆ దొంగలలో ఒకడు కత్తి తీసి, 'వీణ్ణి వదలకూడదురా! చంపివేద్దాం!" అని నరకబోయాడు. అప్పుడు రెండవ దొంగ

అడ్డం వచ్చి, 'చంపనక్కర లేదురా! వీడి కాళ్ళుచేతులు కట్టి పారవేస్తే చాలు!' అన్నాడు. దానికి ముగ్గరూ అంగీకరించి, వాడి కాళ్ళుచేతులు కట్టివేసి వెళ్ళిపోయారు. అయితే కొంతసేపటి తరువాత మూడవదొంగ తిరిగి వచ్చి, 'అయ్యో, పాపం! బాధపడుతున్నావే! నిన్ను విడిపిస్తాను ఉండు!' అని కట్లు విడిపించి, 'ఇక నాతో రా! నిన్ను రహదారి చేరుస్తాను' అన్నాడు. అడవిలో చాలాదూరం నడచిన తరువాత వాళ్ళు రహదారి దగ్గరకు వచ్చారు. అక్కడికి వచ్చిన తరువాత దొంగ అతడితో, 'ఈ త్రోవలో నేరుగా వెళ్ళు! అది నిన్ను మీ ఊరుకు చేరుస్తుంది,' అని చెప్పి తన దారిన తాను వెళ్ళబోయాడు. అప్పుడా ప్రయాణీకుడు కృతజ్ఞత తెలుపుతూ, 'అయ్యా! మీరు నాయందు ఎంతో దయగా ప్రవర్తించారు. మా ఇంటికి వస్తే చాలా సంతోషిస్తాను' అని బ్రతిమాలాడు. అప్పుడా దొంగ, 'వద్దు, వద్దు, నేను రాను! అక్కడికి వస్తే పోలీసులకు తెలుస్తుంది' అని చెప్పి వెళ్ళిపోయాడు."

ఈ కథ చెప్పి మహేంద్రునితో, "ఈ సంసారం ఒక మహారణ్యం. దీనిలో సత్త్వరజస్తమో గుణాలనే ముగ్గురు దొంగలు పొంచి ఉన్నారు. వాళ్ళే మానవుని వివేకాన్ని, జ్ఞానాన్ని దొంగిలిస్తారు. వారిలో చంపివేద్దామన్న దొంగలాంటి తమోగుణం వినాశనాన్ని కలిగిస్తుంది. కట్టిపడవేద్దామన్న దొంగలాంటి రజోగుణం సంసారంలో బంధించి వేస్తుంది. కాని సత్త్వగుణం మాత్రం రజస్సు, తమస్సు ఏర్పరిచే బంధాల నుండి రక్షిస్తుంది. సత్త్వగుణం యొక్క అండదండలవల్ల మానవుడు, కామక్రోధాల నుండి, తమోగుణం నుండి జనించే దుష్ఫలితాల నుండి తప్పించుకుంటాడు. కాని సత్త్వగుణం కూడా దొంగే! అది పరమాత్ముని యొక్క పరంధామానికి దారి చూపినా, బ్రహ్మజ్ఞానాన్ని కల్గించలేదు. దారి చూపిన దొంగ, 'ఆ దూరంగా కనిపిస్తున్న దాన్ని చూడు! అదే నీ ఇల్లు!' అని చెప్పి ఆగిపోయినట్లుగా, సత్త్వగుణం కూడా బ్రహ్మజ్ఞానానికి ఆమడ దూరంలో ఆగిపోతుంది" అని గురుదేవులు వివరించారు.

## 95. గాలిలో మేడలు
## (హృదయుడు - కోడెదూడ)

శ్రీరామకృష్ణులకు మేనల్లుడు అయిన హృదయరాం ఛటోపాధ్యాయ (హృదయుడు) ఒక కోడెదూడను దక్షిణేశ్వరం దేవాలయానికి తెచ్చాడు. దానిని పెద్దతాడుతో గడ్డి మేయడానికి అక్కడ తోటలో కట్టివేశాడు. గురుదేవులు ఇది గమనించి హృదయుణ్ణి పిలిచి, "హృదయా! ఈ కోడెదూడ ఎక్కడిది? ఎందుకు దీన్ని ఇక్కడ కట్టివేస్తున్నావు?" అని ప్రశ్నించారు. దానిపై హృదయుడు, "మామా!

ఈ దూడను మా ఊరు తీసుకుపోదామని తెచ్చాను. అది పెద్దదయిన తరువాత పొలం దున్నడానికి పనికి వస్తుంది గదా!" అని సమాధానం చెప్పాడు. ఆ మాట విని శ్రీరామకృష్ణులు నిశ్చేష్టులై స్పృహతప్పి పడిపోయారు. ఎంతోసేపటికిగాని వారికి బాహ్యస్పృహ రాలేదు. మామూలుస్థితిలోకి వచ్చిన తరువాత, "ఆహా! మహామాయ విలాసాన్ని ఎవరు గ్రహించగలరు? దాన్ని తెలుసుకోవడం ఎంత కష్టమో కదా! ఎక్కడి కలకత్తా? (ప్రస్తుతం ఆ కోడెదూడ ఉన్నచోటు) ఎక్కడి సిహోరు? (కలకత్తాకు 80మైళ్ళ దూరంలోని హృదయరాం సొంత ఊరు) పాపం ఈ పసిదూడ అంత దూరం పోవాలా? పెద్దదయిన తరువాత అరకదున్ని పొలం పండించాలా? ఆహా! ప్రాపంచికులు ఎంత దూరం ఆలోచించి పథకాలు వేస్తారు! మాయ అంటే ఇదే కదా!" అనుకున్నారు.

ఈ విషయాన్ని గురుదేవులు మణిమల్లిక్, మహేంద్రుడు (యం.) మొదలయిన గృహస్థభక్తులకు చెప్పి మహామాయ ప్రభావాన్ని గురించి ఇంకా ఇలా చెప్పారు: "త్రిగుణాలను అతిక్రమించడం దుర్ఘటం. దైవసాక్షాత్కారం కానిదే వాటిని దాటలేము. మాయ మానవుడి కళ్ళకు అడ్డుపడి దైవాన్ని చూడనివ్వదు, అజ్ఞానంలో ముంచి తన బానిసగా చేసుకుంటుంది."

## 96. సాంగత్యాన్ని బట్టి గుణాలు కలుగుతాయి (చిత్రపటాల ప్రభావం)

ఒకరోజు గురుదేవులు తమ గదిలో ఉన్నారు. మహేంద్రనాథ గుప్త కూడా ఉన్నాడు. గురుదేవులు మాటిమాటికీ గోడకు తగిలించిన పటాలవైపు చూస్తున్నారు. శ్రీరామకృష్ణులకు ఎడమవైపున సరస్వతి పటం, దాని పక్కన గౌరాంగ నిత్యానందులు సంకీర్తన చేస్తున్న పటం, ఎదురుగా ధ్రువుడు, ప్రహ్లాదుడు, కాళికా మాత పటాలు, కుడివైపున రాజరాజేశ్వరీ దేవి పటం, వెనుకవైపు మునిగిపోతున్న పీటర్‌ను లేవనెత్తుతున్న ఏసుక్రీస్తు పటం ఉన్నాయి. ఉన్నట్టుండి గురుదేవులు మహేంద్రనాథ గుప్తతో, "చూడు! సాధువుల, సన్యాసుల చిత్రపటాలను ఇంట్లో తగిలించి ఉంచడం మంచిది. నిద్ర లేవగానే ఇతరుల ముఖం చూడకుండా సాధువుల, సన్యాసుల ముఖాలను చూడడం శ్రేయస్సును కలిగిస్తుంది. రజోగుణ స్వభావులైన వారు తమ ఇళ్ళలో 'క్వీన్' పటం, 'క్వీన్ కుమారుని' పటం, ఇంగ్లీషు దొరసానులు వాహ్యాళికి పోతున్న పటాలను తగిలించుకుంటారు. ఎటువంటి వారి సాంగత్యం చేస్తే అటువంటి గుణాలు మనకు కలుగుతాయి. అందుకే ఇంటిలో మనం ఎటువంటి చిత్రపటాలను రోజూ చూస్తూ ఉంటామనే విషయంలో చాలా జాగ్రత్తగా ఉండాలి. లేకపోతే వాటివల్ల కూడా సాంగత్యదోషం అంటుతుంది" అని చెప్పారు.

ఆధునిక యుగంలో మనం ఇళ్ళలో ఉంచుకుంటున్న రకరకాల దృశ్యశ్రవణ యంత్రాలు, సాహిత్యం, వాటి ద్వారా మనకు లభించే హీనమైన సాంగత్యం, అది మనకు కలిగించే అత్యంత అపాయకరమైన అనర్థాలను గురించి గురుదేవులు ఆనాడే మనల్ని హెచ్చరించారు.

## 97. ప్రాపంచిక జీవితపు ప్రభావం (గురుదేవుల చిన్ననాటి స్నేహితుడు; రావణుడి ఎముకలలో తూట్లు)

"బాల్యంలో కామార్పుకూరులో రామ్ మల్లిక్ అనే స్నేహితుడు ఉండేవాడు. నేను అతణ్ణి ఎంతగానో ప్రేమించాను. కానీ తర్వాత అతడు ఇక్కడకు (దక్షిణేశ్వరానికి) వచ్చినప్పుడు నేను కనీసం అతణ్ణి తాకలేకపోయాను. బాల్యంలో మేము ప్రాణస్నేహితులం. రాత్రీ పగలూ కలిసి తిరిగేవాళ్ళం. కలిసి నిద్రించేవాళ్ళం. అప్పుడు నాకు పదహారుపదిహేడేళ్ళ వయస్సు ఉండేది. 'వీరిలో ఒకరు అమ్మాయి అయితే వీళ్ళిద్దరూ పెళ్ళి చేసుకుంటారు రా!' అని అందరూ అనేవాళ్ళు. అతడి ఇంట్లో మేమిద్దరం ఆడుకునేవాళ్ళం. నాకు ఆ రోజులు ఇప్పటికీ కళ్ళ ముందు తారాడుతున్నాయి. అతడి బంధువులు పల్లకీలలో వచ్చేవాళ్ళు. చెనక్ అనే చోట ఇప్పుడు అతడికి ఒక దుకాణం ఉంది. ఇక్కడకు రమ్మని అతనికి చాలాసార్లు కబురు పెట్టాను. ఒకసారి వచ్చి రెండు రోజులు ఉన్నాడు. తనకు పిల్లలు కలగలేదని చెప్పాడు. తన మేనల్లుణ్ణి పెంచుకున్నాడు. కానీ ఆ పిల్లవాడు చనిపోయాడు. నాకు ఈ మాట చెప్పి నిట్టూరుస్తూ కళ్ళలో నీళ్ళు పెట్టుకున్నాడు. మేనల్లుని కోసం దుఃఖంలో మునిగిపోయాడు. సొంతబిడ్డలు లేని కారణం చేత తన భార్య ఆమె ప్రేమనంతా ఆ పిల్లవాడి మీదే ఒలకబోసేదని చెప్పాడు. ఆమె దుఃఖానికి అంతులేదు. రామ్ ఆమెతో, 'నువ్వు వట్టి పిచ్చిదానివి. ఇలా దుఃఖించి ఏమి ప్రయోజనం? కాశీకి పోదామనుకుంటున్నావా ఏమిటి?' అని ఆమెతో అన్నాడు. చూడండి! తన భార్యనే పిచ్చిదానివని అన్నాడు. పిల్లవాడి గురించిన దుఃఖంతో పూర్తిగా నీరుగారిపోయాడు. అతడిలో ఏమీ సరుకు లేదని నేను గమనించాను. నేను కనీసం అతణ్ణి తాకలేకపోయాను," అంటూ గురుదేవులు ప్రాపంచిక జీవితపు ప్రభావం మనిషిని ఏ విధంగా దిగజారుస్తుందో వివరించారు.

ఇదే విషయాన్ని గురించి మరొక సందర్భంలో కూడా వివరించారు. "కడుపున కాసిన బిడ్డ పోతే దుఃఖం కలుగదా? రావణుడి వంటి రాక్షసుడికి కూడా తన కొడుకుల చావు ఎంతో దుఃఖాన్ని కలిగించింది. ఆ దుఃఖం అతడి ఎముకల్ని తొలిచివేసింది. రావణాసురుడు మరణించగానే లక్ష్మణుడు రాముడి వద్దకు వెళ్ళి,

"అన్నా! నీ బాణాల మహిమ ఏమని చెప్పను? నీ బాణాల దెబ్బకు రావణుడి ఎముకలన్నీ రంధ్రాలతో నిండిపోయాయి!' అని చెప్పాడు. అప్పుడు రాముడు లక్ష్మణుడితో, 'తమ్ముడూ! అవి నా బాణాల దెబ్బలు కావు. పుత్రశోకమే అలా రావణుడి ఎముకల్ని తూట్లు పొడిచింది' అని బదులిచ్చాడు. ఇల్లు, వాకిలి, భార్యాపుత్రాదులు అన్నీ అనిత్యం – రెండు దినాల భాగ్యం. అటువంటి అనిత్యమైన సంసారం కోసం ఎందుకీ దుఃఖం? తాటిచెట్టు నుంచి రాలిపోయే ఒకటిరెండు తాటికాయల కోసం విలపిస్తే ఏమిటి ప్రయోజనం?"

"సంసారంలోనే మునిగి ఉంటే అది మనస్సును చాలా క్రిందికి లాగుతుంది. మనం ఎంత దిగజారామో మనకే తెలియదు. ఒకసారి నన్ను కోట చూడడానికి తీసుకువెళ్ళారు. ఆ కోటను చేరుకునే రోడ్డు చాలా లోతుకు దిగి ఆ కోట గుమ్మానికి చేరుతుంది. కోట గుమ్మం ముందు బండి దిగి చూసిన తర్వాతనే అంత ఎత్తునుంచి దిగివచ్చామని నాకు తెలిసింది. సుమారు మూడునాలుగు అంతస్థుల ఎత్తునుంచి దిగివచ్చాము. బండినడిచేటప్పుడు అంత లోతుకు దిగిపోతున్నామని మాకు తెలియనే లేదు. అలాగే కామినీ కాంచనాల మీద ఆసక్తి మనస్సును అట్టడుగుకు లాగివేస్తుంది. మానవులకు అలా జరిగిందని కూడా తెలియదు. దయ్యము పట్టినవాడికి తనకు దయ్యము పట్టిందని తెలియదు. తాను బాగానే ఉన్నానని అనుకుంటూ ఉంటాడు."

## 98. అష్టసిద్ధులు అనర్థదాయకాలు (అష్టసిద్ధుల్ని కోరమన్న హృదయుడు)

"అప్పట్లో నా పక్కన ఉన్నవాళ్ళు ఏది చెప్పినా చిన్నపిల్లవాడిలాగా నేను వినేవాణ్ణి. ఒకసారి హృదయనాథ ఛటోపాధ్యాయ అణిమాది అష్టసిద్ధుల కోసం దివ్యజననిని ప్రార్థించమని చెప్పాడు. నేను కాళికాలయానికి వెళ్ళాను. హృదయుని కోరికను అమ్మకు నివేదించాను. అప్పుడు నాకు ఒక భావనామయమైన దృశ్యం కనిపించింది. దానిలో సుమారు ముప్ఫై ఏళ్ళ వయస్సులో ఉన్న ఒక వితంతువు మలంతో పూర్తిగా కప్పబడివున్నట్టుగా నాకు కనిపించింది. సిద్ధులు ఆ మలంతో సమానమైనవని నాకు గోచరమైంది. ఇటువంటి సలహా ఇచ్చినందుకు హృదయుని మీద ఎంతో కోపం వచ్చింది కూడా," అని గురుదేవులు అష్టసిద్ధుల గురించి తన అభిప్రాయాన్ని తెలిపారు.

నిర్మలమైన భక్తితో కేవలం భగవంతుడు మాత్రమే కావాలని కోరకుండా అష్టసిద్ధులు కావాలని కోరడం మలంతో నిండిన ఆ వితంతువు యొక్క శరీరంతో సమానమని గురుదేవుల ఉద్దేశ్యం. మరొక సందర్భంలో, 'అష్టసిద్ధుల మీద నేను ఉమ్మి వేస్తాను!' అని గురుదేవులు వ్యాఖ్యానించారు.

## 99. సిద్ధులు భగవంతుణ్ణి దర్శించడానికి ఆటంకాలు (సాధువు – తుఫాను; ఏనుగు – చావడం, బ్రతకడం)

శ్రీరామకృష్ణులు దక్షిణేశ్వరంలో తమ గదిలో ఉన్నారు. అప్పుడు రామచంద్ర దత్త, మహేంద్రనాథ గుప్త, చునీలాల్, మహేంద్ర ముఖర్జీ మొదలైన భక్తులు అక్కడ కూర్చొని ఉన్నారు. వాళ్ళతో ప్రసంగిస్తూ గురుదేవులు, "అష్టసిద్ధులు అనర్థదాయకాలు. నంగ్తా (తోతాపురి) నాకొక కథ ద్వారా ఈ విషయాన్ని బోధించారు. ఆ కథ చెపుతా వినండి!" అని ఈ క్రింది కథను చెప్పారు. "ఒక సాధువు కొన్ని సిద్ధులు సాధించాడు. ఒకనాడు అతడు సముద్రతీరంలో కూర్చొని ఉన్నాడు. ఆ సమయంలో ఒక భయంకరమైన తుఫాను చెలరేగి అతడికి చాలా చికాకు కలిగించసాగింది. దానిని భరించలేక, 'ఈ తుఫాను ఆగిపోవు గాక!" అన్నాడు. అతడు సిద్ధుడు గదా! అతడి మాటలకు అమోఘమైన శక్తి ఉంది. అవి తప్పడానికి వీలులేదు. తక్షణమే గాలివాన ఆగిపోయింది. కాని దానితోపాటు ఒక ఉపద్రవం కూడా జరిగింది. ఆ సమయంలో చాలామంది ప్రయాణీకులతో ఒక ఓడ సముద్రంలో ప్రయాణం చేస్తున్నది. అకస్మాత్తుగా గాలివాన ఆగేసరికి ఆ ఓడ తల్లక్రిందులై సముద్రంలో మునిగిపోయింది. అందులో ప్రయాణిస్తున్న వారంతా నీటి పాలయ్యారు. వారిని చంపిన పాపం ఈ సాధువుకు చుట్టుకుని అతడికున్న శక్తులన్నీ నశించిపోవడమే కాక అతడు నరకానికి కూడా పోవలసివచ్చింది."

"ఇంకొక కథ చెపుతా వినండి! ఇంకొకచోట మరొక సిద్ధుడున్నాడు. అతడు అనేక సిద్ధులు సాధించాడు. ఆ సిద్ధులను తలచుకొని గర్వపడేవాడు. కాని అతడు సహజంగా మంచివాడే. అతడిలో మంచితనంతోపాటు వైరాగ్యం కూడా ఉంది. అందువల్ల భగవంతుడు అతని కళ్ళు తెరిపిద్దామని ఒక సాధువు రూపం ధరించి అతడి దగ్గరకు వచ్చి కూర్చొని, 'మహాత్మా! మీకు అనేక శక్తులున్నాయని విన్నాను' అని పొగిడాడు. దానితో ఆ సిద్ధుడు పొంగిపోయి ఆ సాధువుకు మర్యాదలు చేసి గౌరవించాడు. అదే సమయంలో ఆ వైపుగా ఒక ఏనుగు నడచిపోవడం తటస్థపడింది. సాధువు వేషంలో ఉన్న భగవంతుడు ఆ సిద్ధుడికి ఆ ఏనుగును చూపించి, 'స్వామీ! మీరు ఈ ఏనుగును చంపగలరా?' అని ప్రశ్నించాడు. 'ఓ! అదెంత పని!' అని సిద్ధుడు చిటికెడు మట్టి మంత్రించి ఆ ఏనుగు మీద చల్లాడు. దానితో ఆ ఏనుగు నేలమీదపడి, గిలగిల తన్నుకుని చచ్చిపోయింది. సిద్ధుడు సంతోషంతో చూస్తున్నాడు. సాధువు వేషంలో ఉన్న భగవంతుడు అతడితో, 'స్వామీ! మీరు ఇప్పుడు ఈ ఏనుగును బ్రతికించగలరా?' అని ప్రశ్నించాడు. దానితో సిద్ధుడు మరింత గర్వంతో చూస్తూ, 'నాకు అదెంత పని' అని మళ్ళీ చిటికెడు మట్టిని మంత్రించి ఆ చచ్చిపడి ఉన్న ఏనుగు మీద చల్లాడు. వెంటనే ఆ

ఏనుగు లేచి నిలబడి నడిచి వెళ్ళిపోయింది. అప్పుడు భగవంతుడు అతడి మహిమను అమోఘంగా కొనియాడి, 'స్వామీ! నాదొక సందేహం. అడగమంటారా? మీరు ఏనుగును చంపారు, మళ్ళీ బ్రతికించారు. కానీ దానివల్ల మీకేమైనా ప్రయోజనం కలిగిందా? అది మీ ఆధ్యాత్మిక ఉన్నతికి కానీ, భగవత్సాక్షాత్కారానికి కానీ ఉపయోగపడిందా?' అన్నాడు. తన ప్రశ్నకు సిద్ధుడు సమాధానమిచ్చే లోపల భగవంతుడు అదృశ్యమైపోయాడు."

కాబట్టి ధర్మమార్గం అతిక్లిష్టమైనది. కోరిక లవలేశం మిగిలివున్నా భగవత్సాక్షాత్కారం కలగదు. సూదిబెజ్జానికి చిన్న నలక అడ్డుపడినా, దారం దానిలోకి ఎక్కదు. అందువల్ల నిజమైన భక్తుడు భగవంతుణ్ణి ఏదీ కోరడు. భక్తిని మాత్రమే వాంఛిస్తాడు. అతడికి శక్తులుగాని, మహత్తులుగాని, ఏ ఒక్క సిద్ధి గానీ అవసరంలేదు. బృందావన గోపికలే దీనికి తార్కాణం. వారి ప్రేమ అతీంద్రియమైనది. అందువల్ల దానిలో ఏ విధమైన కోరిక లేదు" అని గురుదేవులు ఈ కథ ద్వారా, 'సిద్ధులు భగవత్సాక్షాత్కారానికి ఆటంకాలు' అని ఆ భక్తులకు బోధించారు.

## 100. కామినీ వ్యామోహం (గోలపి - నిరుద్యోగి)

ఒకసారి శ్రీరామకృష్ణులు కలకత్తాలోని బలరాంబోసు ఇంటికి వచ్చారు. అక్కడ చాలామంది గృహస్థభక్తులు, బ్రహ్మసమాజ అనుయాయులు, గిరీశచంద్రఘోష కూడా ఉన్నారు. వారంతా గురుదేవుల బోధలు వింటున్నారు. "సంసారమంటే 'కామినీకాంచనాలే', అవి భగవంతుణ్ణి మరిపిస్తాయి" అని గురుదేవులు చెప్పగానే గిరీశుడు, "స్వామీ! కామినీ కాంచనాల నుండి బయటపడడం ఎలా?" అని ప్రశ్నించాడు. అప్పుడు శ్రీరామకృష్ణులు ఇలా చెప్పారు. "భగవంతుణ్ణి వ్యాకులచిత్తంతో ప్రార్థించు! వివేకాన్ని ప్రసాదించమని వేడుకో! స్త్రీల వ్యామోహశక్తి ఎటువంటిదో చూడు! స్త్రీలు అంటే నేను ఇక్కడ చెప్పేది అవిద్యా స్వరూపాలైన స్త్రీల విషయం మాత్రమే (అవిద్య అంటే అజ్ఞానం). వారు పురుషులను 'వెధవలను' చేసి కూర్చోబెడతారు. వారి వ్యక్తిత్వాన్ని లాగివేస్తారు. భార్య 'అక్కడికి వెళ్ళు!' అంటే చాలు, వెంటనే భర్త వెళ్ళడానికి లేచి నిలబడతాడు. ఆమె 'కూర్చో!' అంటే వెంటనే కూర్చుంటాడు. ఒక కథ చెపుతా విను!"

"నిరుద్యోగి ఒకడు ఉద్యోగం కోసం ఒక ఆఫీసు మేనేజరు చుట్టూ కాళ్ళు అరిగేలా తిరిగాడు. కాని ఉద్యోగం మాత్రం రాలేదు. ఎప్పుడు వెళ్ళినా సరే, 'ఇప్పుడు ఖాళీలు లేవు. మళ్ళీ ఇంకొకసారి వచ్చి కనపడు!' అని మేనేజరు అనేవాడు. ఇలా తిరిగి తిరిగి, విసిగివేసారి, ఒకరోజు ఆ నిర్భాగ్యుడు ఈ సంగతి

తన స్నేహితునితో మొరపెట్టుకున్నాడు. ఆ స్నేహితుడు వాడితో, 'నీకు బుద్ధిలేదు రా! చెప్పులు అరిగేలాగా ఆ వెధవ చుట్టూ ఎందుకు తిరుగుతావు? "గోలపి" దగ్గరకు వెళ్ళు! నీకు రేపే ఉద్యోగం దొరుకుతుంది' అన్నాడు. 'ఇదుగో ఇప్పుడే వెడుతున్నా' అని నిరుద్యోగి బయలుదేరాడు. 'గోలపి' అంటే ఆ మేనేజరు ఉంపుడుగత్తె. ఈ నిరుద్యోగి అమెను సమీపించి, 'అమ్మా! నేను చాలా దురవస్థలో ఉన్నాను. ఒక బీద బ్రాహ్మణుడి కుమారుణ్ణి! నీవు తప్పితే నాకు సహాయం చేసేవాళ్ళు ఎవరూ లేరు. అమ్మా, ఎన్నో రోజులుగా ఉద్యోగం లేకుండా తిరుగుతున్నాను. పిల్లలు ఆకలితో అలమటించి చావడానికి సిద్ధంగా ఉన్నారు. మీరు ఒక్కమాట చెపితే నాకు ఉద్యోగం వస్తుంది' అని మొరపెట్టుకున్నాడు. అప్పుడు గోలపి, 'పాపం! ఈ బీద బ్రాహ్మణుడు చాలా కష్టపడుతున్నాడు' అని తనలో అనుకొని, 'అబ్బాయీ! నన్ను ఎవరికి చెప్పమంటావు?' అని ప్రశ్నించింది. వెంటనే వాడు, 'అమ్మా! మేనేజరుతో ఒక్క మాట చెప్పితే చాలు. నాకు తప్పక ఉద్యోగం లభిస్తుంది' అన్నాడు. గోలపి వాడితో, 'సరే! ఈ రోజు నేను మాట్లాడి అన్నీ సరిచేస్తాను. నీవు ఇంటికి వెళ్ళు' అని అతణ్ణి పంపివేసింది."

"మర్నాటి ఉదయమే ఆఫీసు జవాను వచ్చి, నిరుద్యోగితో, 'ఈ రోజునుంచే నీవు మేనేజరుగారి ఆఫీసులో ఉద్యోగానికి రా!' అని చెప్పి వెళ్ళిపోయాడు. ఆ మేనేజరు వాణ్ణి తన ఆంగ్లేయ ఆఫీసరు దగ్గరికి తీసుకువెళ్ళి, 'ఇతడు చాలా సమర్థుడండీ! ఇతన్ని ఈ రోజు నుండే ఉద్యోగంలో పెట్టాను. ఇతడు మన సంస్థకు గౌరవం తీసుకువస్తాడు' అని వివరించాడు."

"కాబట్టి, గిరీష్! అందరూ కామినీకాంచన వ్యామోహంలో పడివున్నవారే! కాని వాటిని నేను ఎంతమాత్రమూ లెక్క చెయ్యను. నాకు భగవంతుడు తప్ప మరొకటి తెలియదని ఒట్టుపెట్టి చెప్పగలను" అని గురుదేవులు కథను ముగించారు.

## 101. కాంచన వ్యామోహం
## (టిక్కెట్టు లేకుండా నాటకం చూడడం)

మహేంద్ర ముఖర్జీ ఒక వ్యాపారస్థుడు. అతడికి ఒక పిండిమర, ఇతర వ్యాపారాలు ఉన్నాయి. అతడికి సుమారు ముప్పైయారు సంవత్సరాల వయస్సు ఉంటుంది. అతడికి గ్రామ ప్రాంతంలో ఒక ఇల్లు, కలకత్తాలో ఒక బంగళా ఉన్నాయి. తన వ్యాపారవిషయాలు చూడడానికి ఉద్యోగులను నియమించుకున్నాడు. అందువల్ల అతడికి చాలా తీరిక ఉండేది. అనేకసార్లు శ్రీరామకృష్ణులను దర్శిస్తుండేవాడు. ఒకసారి చాలారోజుల తరువాత అతడు దక్షిణేశ్వరం రావడం సంభవించింది. అప్పుడు గురుదేవులు, "ఏమిటి? దక్షిణేశ్వరం రావడం మానుకున్నావే?" అని అడిగారు. దానికి సమాధానంగా

అతడు, "అయ్యా! నేను గ్రామంలో ఉన్నాను. అందువల్ల రావడానికి వీలుపడలేదు" అన్నాడు.

గురుదేవులు, "చూడు! నీకు పిల్లలు కూడా లేరు. అంతే కాకుండా, నువ్వు ఎవ్వరి దగ్గరా నౌకరీ చెయ్యడం లేదు. అయినా నీకు తీరిక లేదంటున్నావు. చూస్తే ఆశ్చర్యంగా ఉందే! ఇక్కడ జరిగే కాలక్షేపాలకు వేటికీ డబ్బులు వసూలు చెయ్యములే! ఒకసారి యదుమల్లిక్ నాతో, 'సాధువులు ఎప్పుడూ డబ్బులు అడుగుతూ ఉంటారు. కాని మీరు అడగడం లేదేం?' అన్నాడు. ప్రాపంచికులు డబ్బు ఖర్చు పెట్టాలంటే అలా బాధపడతారు. ఒక కథ చెపుతా విను!"

"ఒకసారి, ఒకచోట నాటకం వేస్తున్నారు. దానిని చూడాలని ఒకడు వచ్చాడు. కూర్చోవడానికి చోటు కోసం లోనికి తొంగి చూచాడు. కాని అక్కడ ప్రేక్షకుల నుండి డబ్బులు వసూలు చెయ్యడం వాడికి కనిపించింది. నాటకం చూడడానికి డబ్బు ఖర్చు పెట్టడం వాడికి ఎంతమాత్రం ఇష్టంలేదు. వెంటనే అక్కడ నుండి పలాయనమంత్రం పఠించి, ఇంకొకచోట మరొక నాటకం వేస్తుంటే అక్కడికి వెళ్ళాడు. అక్కడ విచారిస్తే డబ్బేమీ తీసుకోవడం లేదని తెలిసింది. అయితే అక్కడ నాటకం చూడడానికి జనం త్రొక్కిసలాడుతున్నారు. అయినా వీడు తోసుకుంటూ లోపలికి వెళ్ళి ప్రేక్షకుల మధ్యలోకి చేరాడు. కూర్చోడానికి అనువైన చోటు కూడా చూచుకొని, తాను చేసిన ఘనకార్యానికి మీసాలు తిప్పుకుంటూ, నాటకం పూర్తి అయ్యే వరకూ కదలకుండా చూస్తూ కూర్చున్నాడు' అని గురుదేవులు ప్రాపంచికుల ధనవ్యామోహాన్ని వివరించారు.

ముఖర్జీతో, 'నీ మనస్సు అటూయిటూ ఊగులాడడానికి నీకు పిల్లలు లేరు. అందువల్ల అప్పుడప్పుడు దక్షిణేశ్వరం వస్తూ ఉండు! ఇక్కడికి వచ్చేవాళ్ళకు మాత్రం ఇళ్ళూవాకిళ్ళూ లేవా? వాళ్ళకు బరువు బాధ్యతలు లేవనుకుంటున్నావా? అలా ఉన్నా వాళ్ళు రావడం లేదా? నీవు కూడా ఆ విధంగా ఎందుకు రావు?" అని హెచ్చరించారు.

## 102. మనుష్యులను బంధించేవి (గోవిందస్వామి దేవాలయ అర్చకులు)

విజయకృష్ణ గోస్వామి బ్రహ్మసమాజంలో పూజారిగా పని చేస్తున్నాడు. ఆ పూజాకలాపాలవల్ల దక్షిణేశ్వరం రావడానికి తీరిక లేదని ఆయన గురుదేవులతో ఒకసారి చెప్పాడు. అప్పుడు గురుదేవులు విజయునితో, "ఒక కథ చెపుతా విను!" అని ఈ కథను చెప్పారు.

"జయపూరులో గోవిందస్వామి దేవాలయం ఉంది. అందులో పనిచేసే పూజారులంతా బ్రహ్మచారులు కావడంవల్ల, తీవ్రమైన వైరాగ్యంతో ఉండేవారు.

జయపూరు రాజుగారు ఒకసారి ఆ పూజారులను రమ్మని కబురుచేశారు. కాని ఆ అర్చకులు రాజాజ్ఞను పెడచెవినిపెట్టి, వారి దగ్గరకు వెళ్ళకుండా, 'అవసరమైతే రాజుగారినే మా దర్శనానికి రమ్మని చెప్పు' అని కబురు చేశారు. ఈ విధంగా తిరస్కారం పొందిన రాజు, ఎలాగయినా ఈ అర్చకులను తన దగ్గరకు రప్పించుకోవాలనుకున్నాడు. తన మంత్రులను పిలిచి, వారితో మంతనాలు జరిపి, చివరకు ఎలాగైతేనేం ఆ అర్చకులందరికీ వివాహాలు చేయించాడు. దీనితో ఇక కథ అడ్డం తిరిగింది. రాజుగారికి అర్చకులను రమ్మని కబురుచేసే అవసరమే లేకుండా పోయింది. అర్చకులే ఆయన దగ్గరకు రావడం ప్రారంభించారు. ప్రతిరోజు ఎవరో ఒకరు వచ్చి, రాజును దర్శించి, 'మహారాజా! ఇవిగో మంత్రాక్షతలు! ఇవిగో నిర్మాల్యపుష్పాలు! స్వీకరించండి! మా ఆశీర్వాదాలందుకోండి!' అని చెప్పసాగారు. ఎందుకంటే వివాహానంతరం వారిలో ప్రతి ఒక్కరికీ, రోజూ డబ్బు అవసరం అయ్యేది. ఇల్లు కట్టుకోవడానికో, పిల్లల బారసాలకో, అన్నప్రాశనకో, చదువులకో అవసరం ఏర్పడి రాజుగారిని తరచుగా దర్శించడం ప్రారంభించారు."

ఈ కథ చెప్పి గురుదేవులు విజయునితో, "కామినీకాంచనాలే' మనుష్యుణ్ణి బంధించేవి. అవి అతడి స్వాతంత్ర్యాన్ని హరించివేస్తాయి. స్త్రీ వల్లనే పురుషుడు మరొకరికి బానిస అవడంగాని, అస్వతంత్రుడు కావడంగాని జరుగుతుంది. ఆ స్థితిలో తన ఇష్టం వచ్చినట్లు చెయ్యలేడు" అని చెప్పారు.

## 103. సాధకులకు స్త్రీల సాంగత్యం పనికిరాదు
## (పన్నెండు వందల బ్రహ్మచారుల పతనం)

"మరొక కథ చెపుతా విను! నిత్యానంద గోస్వామి కుమారుడైన వీరభద్రుడికి పదమూడువందలమంది బ్రహ్మచారులైన శిష్యులు ఉండేవారు. వాళ్ళు గొప్ప ఆధ్యాత్మిక సిద్ధులను పొందారు. ఈ శిష్యుల ఆధ్యాత్మిక స్థితి ఎంత ఉన్నతికి చేరుకున్నదంటే నది ఒడ్డున వారు ధ్యానంలో కూర్చొని సమాధిమగ్నులయితే, నదికి పోటువచ్చి నీరు వారి తలలపై నుండి పారుతున్నా వాళ్ళకి తెలిసేది కాదు. పోటు తీసిన తరువాత చూసినా వాళ్ళు ఇంకా ధ్యానంలో మునిగి ఉండేవారు. ఇది చూసి వారి గురువుకు ఆందోళన కలిగింది. 'నా శిష్యులు గొప్ప ఆధ్యాత్మిక శక్తులను సంపాదించారు. వాళ్ళు ఏది పలికినా అది జరుగుతుంది. జనం తెలియక, పొరపాటున వీళ్ళకు ఆగ్రహం కలిగిస్తే, వీరి శాపాలవలన కష్టాలపాలవుతారు' అని వీరభద్రుడు భావించాడు. ఈ పరిస్థితిని సరిదిద్దాలని అనుకొని అతడు వాళ్ళను పిలిచి, "గంగానది ఒడ్డున ఈ రోజు మీ పూజాకార్యక్రమాలు పూర్తయిన తరువాత నన్ను కలవండి" అని చెప్పాడు.

"వారిలో ఒక వందమంది శిష్యులు తమ గురువు ఆరోజు తమకు ఇవ్వబోయే ఆదేశాన్ని ముందుగానే ఊహించారు. ఆయన ఆజ్ఞను ధిక్కరించాల్సి వస్తుందన్న భయంతో వారు గురువుకు కనపడకుండా వెళ్ళిపోయారు. మిగిలిన పన్నెండు వందలమంది గురువుగారి దగ్గరకు వెళ్ళారు. వీరభద్రుడు వారికి అక్కడున్న బ్రహ్మచారిణులను చూపిస్తూ, "ఈ పదమూడువందల మంది బ్రహ్మచారిణులు మీకు సేవచేస్తారు. మీరు వారిని వివాహం చేసుకోండి" అని చెప్పాడు. ఆ బ్రహ్మచారులు, 'స్వామీ! మీ ఆజ్ఞను శిరసావహిస్తాము. అయితే మాలో ఒక వందమంది వెళ్ళిపోయారు' అని చెప్పారు. ఆ విధంగా ఆ పన్నెండు వందలమంది బ్రహ్మచారులకు ఒక్కొక్క భార్య లభించింది. స్త్రీల సాంగత్యం వారి స్వేచ్ఛను హరించి, వారి ఆధ్యాత్మికతను నిర్వీర్యం చేసింది. క్రమంగా వాళ్ళు తమ ఆధ్యాత్మిక శక్తులను కోల్పోయారు. వారి తపస్సు ఇదివరకటి తీవ్రతనూ, శక్తినీ కోల్పోయింది. (ఇదే బోధన స్త్రీలకు కూడా వర్తిస్తుంది. సాధకులైన స్త్రీలకు పురుషుల సాంగత్యం పనికిరాదు.)

## 104. అలవాట్ల (వాసనల) ప్రభావము (చేపల బుట్ట)

సంసార జీవితం గడుపుతూ భగవంతుణ్ణి కనుగొనడం చాలా కష్టం. సన్నిపాత జ్వరం వచ్చినవాణ్ణి ఊరగాయలు, చింతపండు, నీళ్ళబిందెలు ఉన్న గదిలో ఉంచితే అతడి రోగం కుదిరేదెలా? (అవన్నీ రోగాన్ని ఇంకా ఎక్కువ చేస్తాయి.) అందువల్ల సాధకుడైనవాడు అప్పుడప్పుడు ఏకాంతప్రదేశానికి వెళ్ళి సాధన చెయ్యాలి. చెట్టు పెద్దదయిన తరువాత దానికి ఏనుగునైనా కట్టివేయవచ్చు గాని మొక్క లేతదయితే దానిని పశువులు సులభంగా తినివేస్తాయి కదా!

సుప్రసిద్ధుడైన కేశవచంద్రసేను తన అనుచరులతో సహా ఒకసారి దక్షిణేశ్వరంవచ్చి శ్రీరామకృష్ణుల సాంగత్యంలో చాలాసేపు గడిపాడు. రాత్రి 10 గంటలయింది. కేశవుని అనుచరులకు ఆ రాత్రి అక్కడే గడపాలని ఉంది. గురుదేవులు కూడా అందరినీ ఆ రాత్రి అక్కడే ఉండమని కోరారు. కాని కేశవుడు మాత్రం, "కాదండీ! నేను ఈ రాత్రి వెళ్ళక తప్పదు. నాకు చెయ్యవలసిన పని కొంచెం మిగిలివుంది," అన్నాడు. అప్పుడు శ్రీరామకృష్ణులు, "అదేమిటి? నీ చేపల బుట్ట దగ్గర లేకపోతే నీకు నిద్రపట్టదా ఏమిటి? ఒక కథ చెపుతా విను!" అని ఈ కథను చెప్పారు.

"ఒకసారి ఒక బెస్తపడుచు చేపలు అమ్మడానికి పట్నం వచ్చింది. చేపలన్నీ అమ్ముడుపోయేసరికి చీకటి పడింది. ఆ చీకటిలో తన గ్రామానికి తిరిగి వెళ్ళలేక

ఆ రాత్రి గడపడానికి తన స్నేహితురాలింటికి వెళ్ళింది. ఆ స్నేహితురాలు ఒక పూలవ్యాపారి. ఆమె ఈ బెస్తపడుచును పూలు ఉంచిన గదిలో పడుకోబెట్టింది. కాని ఆ పూల పరిమళంవల్ల బెస్తవనితకు చాలాసేపు నిద్రపట్టలేదు. ఆ పూలవ్యాపారి ఆమె అవస్థను కనిపెట్టి, 'అదేమిటమ్మా! అటు ఇటు దొర్లుతున్నావు! నిద్రపట్టడం లేదా?' అని అడిగింది. ఆ బెస్త వనిత, 'కారణమేమిటో తెలియడం లేదమ్మా! బహుశా ఈ పూల 'కంపు' వల్లనే నాకు నిద్రపట్టడం లేదు కాబోలు. దయచేసి నా చేపలబుట్ట కాస్త తెచ్చిపెడతావా? అది దగ్గరవుంటే నిద్రపడుతుందేమో!' అన్నది. అప్పుడు ఆ స్నేహితురాలు ఆ చేపలబుట్ట తెచ్చి ఇచ్చింది. అప్పుడా బెస్తవనిత ఆ బుట్టమీద నీళ్ళు చిలకరించి ముక్కుకు దగ్గరగా పెట్టుకుని పడుకుంది. వెంటనే మైమరచి, గురకపెడుతూ రాత్రంతా నిద్రపోయింది."



సంసారం ఆ చేపలబుట్ట లాంటిది. ప్రాపంచికులు దాన్ని వదిలి ఉండలేరు. ఒకవేళ ఒక్కరోజయినా వదలవలసి వస్తే నిశ్చింతగా ఉండలేరు. అలవాట్ల ప్రభావం అటువంటిది.

(కేశవచంద్ర సేను సుప్రసిద్ధ బ్రహ్మసమాజనాయకుడు. సాధారణ బ్రహ్మసమాజ స్థాపకుడు కూడా. ఆయన గొప్ప వక్త. ఇంగ్లండు మొదలగు పాశ్చాత్య దేశాలలో పర్యటించడమే కాక, ఒక పత్రికను కూడా నడిపాడు. ఆయన తన రచనల ద్వారా పాశ్చాత్య లోకానికి, ఆనాటి యువకులకు శ్రీరామకృష్ణుల గురించి, వారి భావాలను గురించి పరిచయం చేశాడు. అనేకసార్లు గురుదేవుని సందర్శించి వారి బోధలు విన్నాడు. శ్రీరామకృష్ణుల పరిచయం కలిగిన తరువాత కేశవచంద్ర సేను యొక్క అభిప్రాయాలలోను, స్వభావంలోను చాలా మార్పు కన్పించింది.)

## 105. ప్రాపంచిక వాసనలే అనర్థాలకు మూలం (గ్రద్ద - చేప)

విజయకృష్ణ గోస్వామి చాలా రోజులు గయక్షేత్రంలో ఏకాంతవాసంలోను, సజ్జనసాంగత్యంలోను గడిపి వచ్చాడు. వాటి ప్రభావంవల్ల కాషాయ వస్త్రాలు ధరించి, ఉన్నత భావాలతో అంతర్ముఖుడై ఉన్నాడు. అతడితో గురుదేవులు ఈ విధంగా చెప్పారు: "ప్రాపంచిక విధులు, వాటితోబాటు ఆందోళనను, చికాకును తెస్తాయి. భాగవతంలో అవధూతకు 24మంది గురువులు ఉన్నారని చెప్పబడింది. వాటిలో గ్రద్ద ఒకటి. ఆ కథ చెపుతా విను!"

"ఒక ఊరిలో ఒకరోజు కొంతమంది బెస్తలు చేపలు పడుతున్నారు. ఆ సమయంలో ఆకాశంలో ఎగురుతున్న ఒక గ్రద్ద రివ్వున క్రిందికి వచ్చి ఒక చేపను తన్నుకుపోయింది. గ్రద్ద నోటిలో చేప కనపడేసరికి, కాకులు గుంపులు గుంపులుగా, కావుకావుమని గోలపెడుతూ దాని వెంటపడ్డాయి. ఆ గ్రద్ద ఎటుపోతే కాకులు కూడా అటే ఎగిరాయి. తూర్పుకు వెడితే తూర్పుకు, పడమరకు వెడితే పడమరకు, ఉత్తరంవైపు వెడితే ఉత్తరంవైపు వెంబడించాయి. గ్రద్ద దక్షిణంవైపు ఎగిరితే అవి కూడా దక్షిణంవైపు తరుముతూ వెళ్ళాయి. అటు ఇటు ఎగురుతున్న గందరగోళంలో గ్రద్ద నోటిలోనుంచి చేప జారి క్రింద పడిపోయింది. తక్షణమే కాకులన్నీ గ్రద్దను వదలి చేప కోసం పరుగెత్తాయి. ఈ విధంగా చికాకులో నుండి బయటపడిన ఆ గ్రద్ద ఓ చెట్టుకొమ్మ మీద వాలి నిశ్చింతగా ఇలా ఆలోచించింది: 'ఛీ! నికృష్టమైన ఆ చేప ఈ అనర్థాలన్నిటికీ మూలం! అది వదలిపోయేసరికి నాకు మనశ్శాంతి లభించింది."

ఈ కథ చెప్పి గురుదేవులు విజయుడివైపు చూచి, "ఎంతవరకైతే మనుష్యుని వద్ద ఆ చేప అనే ప్రాపంచిక వాసనలు ఉంటాయో అంతవరకు అతడు అనేక కష్టాలు పడుతూ, వాటివల్ల ఎంతో ఆందోళన, అశాంతి చెందుతాడు గదా! ఎప్పుడు తన కోర్కెలను వదలిపెడతాడో, ఆ క్షణంనుండే అతడు ఆత్మశాంతిని

అనుభవిస్తాడు. స్వార్థం లేకుండా పని చెయ్యడం మంచిదేగాని, తెలియకుండా ఎక్కడనుండో స్వార్థం లోనికి ప్రవేశిస్తుంది - మనిషిని కష్టాలలో పడవేస్తుంది. కానీ ఆధ్యాత్మిక సాధన చేసి, భగవత్సాక్షాత్కారం పొందినవాడు సులభంగా నిస్వార్థసేవ చేయగలుగుతాడు. కష్టాల పాలవకుండా ఉంటాడు. ఇతరులకు నిజంగా మేలు చేయగలుగుతాడు" అన్నారు.

## 106. వితండవాదం పనికిరాదు
## (ఇల్లు కూలడం - వార్తాపత్రిక)

డాక్టరు మహేంద్రలాల్ సర్కారుకు భగవంతుని అవతారాల మీద నమ్మకం లేదు. పంచభూతాలతో నిర్మితమైన శరీరంలో భగవంతుడు అవతరించడని ఆయన విశ్వాసం. గిరీశచంద్ర ఘోషు, ఈశానచంద్ర చక్రవర్తి, డాక్టరు వాదాన్ని ఖండిస్తూ మాట్లాడారు. ఈశానుడు అవతారాల గురించి చెపుతూ, 'డాక్టర్‌గారూ! మీరు భగవంతుడు అవతారం ఎత్తుతాడని ఎందుకు నమ్మరు? భగవంతుడు అనేకమైన రూపాలను సృష్టిస్తూ ఉంటాడు కాబట్టి ఆయనకు ఆకారమున్నదని, ఆకారంలేని మనస్సును సృజించాడు కాబట్టి ఆయనకు ఆకారం లేదని మీరు ఇప్పుడే గదా అన్నారు. అంతేకాక భగవంతుడికి అన్నీ సాధ్యమే అని మీరే క్షణం క్రితం అన్నారు కదా!' అని డాక్టరు సర్కారుతో తర్కించాడు.

గురుదేవులు మధ్యలో కల్పించుకొని, "ఈశాన్! ఆయన దాన్ని అంగీకరించడు. ఎందుకంటే ఆయన చదివిన విజ్ఞానశాస్త్రంలో భగవంతుడు అవతారమెత్తుతాడని చెప్పలేదేమో!" అని చమత్కారంగా నవ్వుతూ, "ఒక కథ చెపుతా వినండి!" అన్నారు.

"ఒకసారి ఒకడు తన స్నేహితుని ఇంటికి వెళ్ళాడు. వాడు వెళ్ళేదారిలో ఒక ఇల్లు కూలడం చూచాడు. ఆ విషయం ఆ స్నేహితునికి చెపుతూ, 'నేను వస్తుంటే దారిలో అకస్మాత్తుగా ఒక ఇల్లు పెద్దశబ్దంతో కూలిపోయిందిరా' అన్నాడు. అతడి స్నేహితుడు ఆంగ్ల విద్యావిధానంలో చదువుకున్నవాడు. అందువల్ల తన స్నేహితుని మాటను విశ్వసించకుండా, 'ఉండు, ఉండు! వార్తాపత్రికలో ఈ విషయం పడిందేమో చూడనీ!' అని దినపత్రికను తీసి ఈ మూలనుండి ఆ మూలవరకు తిరగవేసి చూచాడు. ఇల్లుకూలిన విషయం ఆ పత్రికలో ఎక్కడా కనిపించలేదు. అందువల్ల వాడు మిత్రునితో, 'నేను నీ మాటను నమ్మను రా! ఈ విషయం పత్రికలలో ఎక్కడా రాలేదు. కావాలంటే నీవే చూడు!' అని పత్రికను ఇస్తూ, 'నీ మాట శుద్ధ అబద్ధం!' అని ఆ విషయాన్ని తోసివేశాడు."

"తనకు తెలిసింది మాత్రమే సర్వమని తలుస్తూ, కంటితో చూచిన దానినే కాదని వితండంగా వాదించేవాళ్ళతో మాట్లాడి, వాళ్ళను నమ్మించడమెలా?" అని

గురుదేవులు ఈ కథ ద్వారా నేటి ఆంగ్లవిద్యాప్రాభవాన్ని చమత్కారంగా తెలియజేశారు.

## 107. సంసారబంధం భ్రాంతి మాత్రమే (హఠయోగి - గురువు)

"ఒక శిష్యుడు గురువుగారితో, 'స్వామీ! నా భార్య నన్నెంతో ప్రేమగా చూస్తుంది. ఆమె కోసమే నేను ఈ సంసారాన్ని వదలలేకుండా ఉన్నాను' అని చెప్పాడు. ఆ శిష్యుడు హఠయోగాన్ని అభ్యసించాడు. గురువుగారు ఆ శిష్యుడికి ఒక కిటుకు చెప్పి, నిజంగా అతడి భార్య అతణ్ణి ఎంతవరకు ప్రేమిస్తున్నదో పరీక్షించమన్నాడు. ఒకరోజు ఆ శిష్యుని ఇంటిలో నుండి ఏడుపులు, పెడబొబ్బలు వినబడ్డాయి. ఇరుగుపొరుగు వారంతా సంగతేమిటో తెలుసుకోవడానికి అక్కడకు చేరుకున్నారు. హఠయోగి హఠంలో కూర్చుని ఉన్నాడు. అతడి అవయవాలన్నీ బిగుసుకుపోయి ఉన్నాయి. శ్వాస ఆడటం లేదు. వచ్చిన వాళ్ళంతా అతణ్ణి పరీక్షించి చనిపోయాడని నిర్ధారణ చేశారు. భార్య నేలమీదపడి దీనంగా ఏడుస్తూ, 'అయ్యో! నాకెంత కష్టం వచ్చిపడింది. నేనెలా బతకను? అయ్యయ్యో! నాకీ కష్టం వస్తుందని కలలో కూడా అనుకోలేదు!' అని వాపోతున్నది. ఈ లోపల బంధువులు, స్నేహితులు శవాన్ని తీసుకుపోవడానికి ఒక మంచం తెచ్చారు. కానీ వారికి ఒక చిక్కు సమస్య ఎదురైంది. అతడి శరీరం కొయ్యబారి, మెలికలు తిరిగిపోవడంవల్ల దానిని గుమ్మంలో నుండి తీసుకుపోవడానికి వీలులేకపోయింది. ఇంతలో ఒక పొరుగువాడు, గొడ్డలి తెచ్చి గుమ్మాన్ని నరకడం ప్రారంభించాడు. ఒక్క గొడ్డలి వేటు పడిందో లేదో, ఏడుస్తూనే హఠయోగి భార్య, గుమ్మం వద్దకు పరుగెత్తుకొని వచ్చి, 'అయ్యా! ఇదేం పని?' అని అడిగింది. దానికా పొరుగువాడు, 'అమ్మా! శవం గుమ్మంలోనుంచి పట్టడం లేదు. అందువల్ల ద్వారబంధాన్ని కొంచెం చెక్కుతున్నాను' అన్నాడు."

"ఆమె వెంటనే, 'అయ్యా! దయచేసి ఆ పని చెయ్యకండి. ఇప్పుడు నేను విధవరాలిని. నా దిక్కు చూసే వాళ్ళెవ్వరూ లేరు. ఈ చిన్నపిల్లల్ని పెంచాల్సిన బాధ్యత కూడా నా నెత్తిన పడింది. మీరు ఈ గుమ్మాన్ని పాడుచేస్తే ఇంకొక దాన్ని పెట్టించుకోగలనా? ఆలోచించండి, నాయనలారా! చావు ఎవరికైనా తప్పదు కదా! పోయిన నా భర్త ఎలాగూ బ్రతికిరాడు. కాబట్టి ఆయన కాళ్ళు, చేతులు నరికి శవాన్ని బయటకు తీసుకొని పొండి' అని చెప్పి ఏడ్చింది. భార్య చెప్పే ఆ ములుకులవంటి పలుకులు విని హఠయోగి దిగ్గునలేచి నిలబడ్డాడు. వాడు భార్యవైపు తిరిగి, 'ఛీ! దుర్మార్గురాలా! నా కాళ్ళు, చేతులు నరికిస్తావుటే?' అని చెప్పి, తక్షణమే సంసారాన్ని వదలి, సన్న్యసించి, గురువుగారిని అనుసరించి వెళ్ళిపోయాడు."

"కాబట్టి సంసార బంధం అంతంత మాత్రమే! ఎంతవాడైనా తనవాళ్ళను గురించి అలాగే తలుస్తాడు. కాని నిజంగా ఈ ప్రేమ అంతా భ్రాంతి మాత్రమే!" అని ఈ కథను యువకుడైన నరేంద్రునకు (స్వామి వివేకానంద) గురుదేవులు చెప్పారు.

## 108. భగవంతుడొక్కడే నిజంగా నీవాడు!
## (సంసారి - గురువు)

నేను, నాది అనేది అజ్ఞానం. నిజమైన జ్ఞానం కలిగితే భగవంతుడే సర్వమూ చేస్తున్నాడనీ, నిజానికి అతడే మన సొంతవాడనీ, ఈ వస్తు వాహనాలు, బంధువులు మొదలైనవన్నీ అతడికి చెందినవేననీ తెలుస్తుంది. అజ్ఞానంవల్ల అంతా నా వల్లనే జరుగుతున్నదనీ, నేనే చేస్తున్నాననీ, ఈ గృహారామాలు, వస్తువాహనాలు, సిరిసంపదలు, బంధుమిత్రులు అన్నీ నావేననీ అనిపిస్తుంది. ఈ విషయాలను ఒక గురువు తన శిష్యుడికి బోధించి, 'నాయనా, ఈ ప్రపంచంలో 'నీది' అనేది ఏదీ లేదు. అంతా అశాశ్వతం. అందువల్ల వీటన్నిటియందు మమకారం వదలి నాతో రా, పోదాం!' అని చెప్పాడు. అప్పుడు ఆ శిష్యుడు, 'స్వామీ, నా తల్లి, తండ్రి, భార్య నన్నెంతో ప్రేమిస్తున్నారు. వారినెలా వదలిపెట్టి రాగలను?' అని ప్రశ్నించాడు.

గురువుగారు వెంటనే, 'నాయనా! నీవు చెప్పింది నిజమే. కాని ఈ ప్రేమలో, 'నేను, నాది' అనే భ్రాంతి ఉంది. ఆ భ్రాంతి నీ మనస్సువల్లనే కలుగుతున్నది. నీకొక కిటుకు చెబుతాను. అది చేస్తే, నీవు 'నా వారు' అని అనుకునేవారు నిన్ను ఎంతవరకు ప్రేమిస్తున్నారో నీకే తెలుస్తుంది' అని చెప్పి శిష్యుడికి ఒక మాత్ర ఇచ్చి, 'నీవు ఇంటికి వెళ్ళి ఈ మాత్ర వేసుకో! దాని ప్రభావంవల్ల నీవు చచ్చినట్లుగా పడివుంటావు కాని, నీ చుట్టూ జరుగుతున్నదంతా నీకు తెలుస్తూనే ఉంటుంది. ఎవరు ఏమి మాట్లాడుతున్నా నీకు వినబడుతుంది. అంతేకాక ఆ సమయంలో నేను కూడా మీ ఇంటికి వస్తాను. భయపడకు' అని చెప్పి పంపాడు."

"శిష్యుడు గురువు చెప్పినట్లు చేసి ఒక శవంలాగా పడిపోయాడు. ఇల్లంతా ఏడ్పులతో, పెడబొబ్బలతో నిండిపోయింది. అతడి తల్లి, భార్య, దగ్గర బంధువులు నేలమీద పడి ఏడుస్తున్నారు. ఇంతలో అక్కడికి గురువుగారు ఒక బ్రాహ్మణుడి వేషంలో వచ్చి, 'అమ్మా! ఎందుకు ఏడుస్తున్నారు. ఏమైంది?' అని ప్రశ్నించాడు. 'అయ్యా! నా కొడుకు చనిపోయాడు' అని అతడి తల్లి ఏడుస్తూ బదులు చెప్పింది. ఆ బ్రాహ్మణుడు నాడిని పరీక్షిస్తున్నట్లుగా అతడి చెయ్యి పట్టుకొని చూచి, 'భయం లేదు. ఇతడు బ్రతికే ఉన్నాడు. ఇదొక రకమైన జబ్బు. ఈ జబ్బుకు నా దగ్గర ఒక మందు ఉంది' అని తన సంచిలో నుండి ఒక మాత్రను బయటకు తీశాడు."

“ఇది చూచి అంతా సంతోషపడ్డారు. ఒక్కసారిగా స్వర్గమే వారింటికి నడచివచ్చినట్లున్నది. ఆ బ్రాహ్మణుడు ఇంకా ఇలా చెప్పాడు. ‘మీకో సంగతి చెప్పడం మరచాను. ఈ మందు నీళ్ళలో వేసి కరిగించి, ముందుగా ఎవరో ఒకరు కొంచెం త్రాగి, మిగిలినది ఈ రోగికి ఇవ్వాలి. దానివల్ల రోగి బతికి బయటపడతాడు కాని ముందు త్రాగినవాడు మాత్రం మరణిస్తాడు. ఇక్కడ చూస్తే నాకు ఇతడికి ముఖ్యమైన తల్లి, భార్య కనిపిస్తున్నారు. వాళ్ళలో ఎవరో ఒకరికి ఈ మందు త్రాగడానికి అభ్యంతరం ఉండదనుకుంటాను.”

“ఈ మాటలు వినేసరికి ఇల్లంతా నిశ్శబ్దమైపోయింది. అప్పుడు అతడి తల్లి, ‘నాయనా! మాది చాలా పెద్దకుటుంబం. నేను చచ్చిపోతే ఈ సంసారాన్ని చక్కదిద్దే వాళ్ళెవ్వరున్నారా అని సందేహిస్తున్నాను’ అని చెప్పి ఆలోచనలో పడిపోయింది. తరువాత, అప్పటివరకు తన దురవస్థకు విలపిస్తున్న భార్య అందుకొని, ‘అయ్యా! మానవులంతా చివరకు ఏ దారి పడతారో, ఆ దారే నా భర్త ఇప్పుడు పట్టాడు. నాకు ఇద్దరు పసిపిల్లలున్నారు. నేను కూడా పోతే వాళ్ళను ఎవరు పోషించి పెద్దచేస్తారు’ అని అన్నది. ఈ మాటలన్నీ శిష్యుడు వింటున్నాడు. ఇంతలో గురువుగారు ఇచ్చిన మాత్ర ప్రభావం తగ్గిపోయింది. తనవారని అనుకునేవారు నిజంగా తనవారు కారని తెలిసివచ్చింది. దిగ్గున మంచంమీద నుంచి ఇవతలకు దూకి గురువుగారికి నమస్కరిస్తూ, ‘స్వామీ! మనమిక వెడదాము. నేను మిమ్మల్ని



అనుసరిస్తున్నాను' అని గురువు వెంట వెళ్ళడానికి సిద్ధపడ్డాడు. ఇద్దరూ నడిచిపోసాగారు. అప్పుడు గురువుగారు అతడితో, 'నాయనా! నీవాడని చెప్పుకునేవాడు నిజంగా ఒకడున్నాడోయీ! అతడే భగవంతుడు!' అని చెప్పాడు."

"కాబట్టి మానవుడు పరమాత్ముడొక్కడే తనవాడని నమ్మి, ఆయన పాదపద్మాలయందు భక్తి ఏ విధంగా కలుగుతుందో తెలుసుకొని, ఆ విధంగా నడుచుకోవాలి. నీ చుట్టూవున్న ప్రపంచాన్ని చూస్తున్నావు కదా! అదంతా మూణ్ణాళ్ళ ముచ్చటే. దానిలో సారమనేది లేదు," అని గురుదేవులు షిరిడీ నుండి వచ్చిన ఒక బ్రాహ్మణ పండితునితో మాట్లాడుతూ, ఈ కథ చెప్పారు.

## 109. అహంకారం వల్లనే కష్టాలన్నీ!
## (ఆవుదూడ - దాని కష్టాలు)

శ్రీరామకృష్ణులు ఒకసారి సింథీ బ్రహ్మసమాజ ఉత్సవాన్ని తిలకించడానికి వెళ్ళారు. అనేక విషయాలు ముచ్చటించిన తరువాత విజయుడు గురుదేవుల సమక్షంలో సభావేదిక మీదికి వెళ్ళి కార్యక్రమాన్ని నడపడానికి సందేహించి శ్రీరామకృష్ణుల వద్దకు వచ్చి ఆయన అనుజ్ఞ కోరాడు. అప్పుడు గురుదేవులు, "నేను బోధిస్తున్నాను! - మీరు వినండి!' అనే తుచ్ఛమైన అహంభావం లేకుండా నీ కార్యక్రమాన్ని నడపడం మంచిది. అహంకారం ఉన్నంతవరకు మానవుడు జ్ఞానాన్నిగాని, ముక్తినిగాని పొందలేడు" అన్నారు. "ఆవుదూడను చూడు! అది 'అంబా, అంబా' అని అరుస్తుంది. 'అంబా (అహం) అంటే 'నేను, నేను' అని అది అరుస్తుందన్న మాట. దీనితో దాని కష్టాలు ప్రారంభమవుతాయి. అది పెరిగి పెద్దదయిన తరువాత దానిని కాడికి కట్టి ఎండల్లో, వానల్లో దున్నిస్తారు. తరువాత కసాయివాడు దాన్ని చంపి తోలు తీస్తాడు. ఆ తోలుతో చెప్పులు చేస్తారు. అంతేకాక ఆ తోలుతో డోళ్ళు కూడా తయారుచేసి నిర్దాక్షిణ్యంగా కర్రలతో బాదుతారు. అప్పటికైనా దాని దౌర్భాగ్యం తొలుగుతుందా? తొలగదు! చివరకు దాని ప్రేగులు తీసి దూదిని ఏకే యంత్రానికి కడతారు. ఇక అప్పుడది 'తుహూ, తుహూ' (నువ్వు! నువ్వు!) అంటుంది. అప్పటికి కానీ అది కష్టాల నుండి బయటపడలేదు. ఇక అది 'అంబా' అనడం మాని 'తుహూ' అని మాత్రమే అంటుంది. ఈ తుహూ అన్న శబ్దానికి, 'ఓ దేవా! చేసేవాడివి నీవు! నేను కాదు! నేను కేవలం ఒక యంత్రాన్ని మాత్రమే! నీవో, దానిని నడిపేవాడివి! సమస్తమూ నీవే!' అని భావం."

ఈ కథ విజయుడికి చెప్పి, "అసలు అహంకారాన్ని కలిగించేది ఏది? జ్ఞానమా? అజ్ఞానమా? వినమ్రశీలుడైన వాడికే జ్ఞానం లభిస్తుంది. నీరు పల్లప్రదేశంలో నిలుస్తుంది గాని, ఎత్తైన ప్రదేశంలో నిలుస్తుందా? అక్కడ నుండి క్రిందికి దూకుతూ ప్రవహిస్తుంది కదా!" అని ముగించారు.

ఈ కథనే ఈశ్వరచంద్ర విద్యాసాగరుకు చెప్పి, "జ్ఞానం పొందిన తరువాత కూడా ఈ 'నేను' అనే భావం తలెత్తుతుంది. అది ఎక్కడ నుండి తలెత్తుతుందో ఎవ్వరికీ తెలియదు. ఒకడు కలలో పెద్దపులిని చూచి ఉలిక్కిపడి లేచి కూర్చుంటాడు. మెలకువ వచ్చినా, గుండెల్లో దడగానే ఉంటుంది. అందువల్ల మన కష్టాలన్నీ ఈ 'నేను' అనే అహంకారంవల్ల వచ్చినవే. సమాధిస్థితిలో ఉన్నప్పుడు మాత్రమే ఈ 'నేను' నశిస్తుంది. కానీ తరువాత మళ్ళీ తలెత్తుతుంది. కానీ సామాన్యుల విషయంలో ఈ 'నేను' అనేది ఎప్పుడూ కనిపించకుండా పోనేపోదు," అని విపులీకరించారు.

ఇదే కథను గురుదేవులు ప్రతాపచంద్ర మజుందారుకు చెప్పి, "ఓ దేవా! నేను కర్తను కాదు. నీవే కర్తవు! నేను యంత్రాన్ని. నీవు యంత్రం నడిపేవాడివి!' అని భావించినప్పుడే ఈ అహంకారజనితమైన సాంసారిక బాధలన్నీ అంతరిస్తాయి. అహంకార విముక్తి అప్పుడే కలుగుతుంది. ఆ విముక్తి పొందిన దేహధారి ఇక ఈ ప్రపంచంలో జన్మించ నక్కరలేదు," అని వివరించారు.

## 110. అహంకారమే సర్వనాశనానికి కారణం (నీట మునిగిన గురువు)

"ఒక శిష్యుడికి తన గురువు మీద అఖండమైన విశ్వాసం ఉండేది. ఆ గురువు నామాన్ని జపిస్తూ నీటి మీద నడిచి ఏకంగా నదిని దాటి వెళ్ళిపోయాడు. ఇది చూసి ఆ గురువు ఆశ్చర్యపోయాడు. నా పేరులోనే ఇంత మహత్తు ఉంటే ఇక నేనెంత గొప్పవాడినో అని అనుకున్నాడు. మర్నాడు ఆ గురువు కూడా నదిని దాటడానికి ప్రయత్నించాడు. "నేను, నేను, నేను" అని జపం చేస్తూ నీటి మీద అడుగు పెట్టాడు. అయితే అడుగు పెట్టడంతోనే నీటిలో మునిగిపోయాడు. పాపం ఆ నిర్భాగ్యుడికి ఈత కూడా రాదు."

"విశ్వాసం అద్భుతమైన మహత్కార్యాలను సాధించగలదు. గర్వం, అహంకారం నాశనాన్ని కొనితెస్తాయి."

## 111. గర్వం కళ్ళు నెత్తికెక్కేలా చేస్తుంది (పనిమనిషి గర్వం)

ఏవో కొన్ని పుస్తకాలు చదివినంత మాత్రాన మనిషికి గర్వం తొలిగిపోదు. ఒకసారి నేను కాళీకృష్ణ టాగూరుతో భగవంతుడి విషయాలు మాట్లాడాను. వెంటనే అతడు నాతో, "నాకవన్నీ తెలుసు" అని చెప్పాడు. నేను అతడితో, "ఢిల్లీ వెళ్ళివచ్చినవాడు దాన్ని గురించే గొప్పలు చెపుతూ కూర్చుంటాడా? ఒక పెద్దమనిషి తాను పెద్దమనిషిని అని అందరితో చెప్పుకుంటూ తిరుగుతాడా?" అన్నాను.

"గర్వం ఎలా కళ్ళు నెత్తికెక్కేలా చేస్తుందో చూడండి. దక్షిణేశ్వరంలో ఆలయాన్ని ఊడ్చే పనిమనిషి ఉండేది. ఆమెకు ఎంత గర్వమో! ఏవో నాలుగు నగలు పెట్టుకున్నానని మిడిసిపడుతూ ఉండేది. ఒకరోజు ఆమె నడుస్తున్న దారిలో కొందరు అడ్డుగా వచ్చారు. 'ఏయ్! తప్పుకోండి' అని వాళ్ళ మీద అరిచింది. ఒక పనిమనిషి కనుక ఆ విధంగా అరిచేటట్టయితే ఇంక మిగిలినవారి గర్వాన్ని గురించి చెప్పేదేముంది?" అని గురుదేవులు వ్యాఖ్యానించారు.

ఇటువంటి గర్వాన్నే వర్ణిస్తూ, హృదయుడు గురుదేవులను వదిలివెళ్ళే ముందు ఏమి జరిగిందో వివరించారు. "హృదయుడు గర్వంతో కన్నూమిన్నూ కానక ప్రవర్తించడం ప్రారంభించాడు. సూటిపోటి మాటలతో నన్ను బాధించేవాడు. అయినదానికీ, కానిదానికీ అరుస్తూ మితిమీరి ప్రవర్తించాడు. అందుచేతనే ఇక్కడనుంచి అతడు వెళ్ళిపోవలసివచ్చింది. సత్త్వగుణం ఉన్నవారు ఆ కేకలను సహించరు. దూరంలో పిడుగుపడితే ఇంటి కిటికీ గడియలు చప్పుడు చేస్తాయేమో కానీ ఇంటిలోని వస్తువులు కదలవు కదా!" అని గురుదేవులు సాధువుల సాంగత్యంలో మన ప్రవర్తన ఎలా ఉండాలో తెలియజెప్పారు.

## 112. అహంకారం పోయినప్పుడే భగవద్దర్శనం అవుతుంది (దయ్యము - వంకర వెంట్రుక)

"అహంకారం వల్లనే మానవుడు భగవంతుణ్ణి దర్శించలేడు. భగవంతుని సౌధానికి ముందు 'అహంకారం' అనే అడ్డుగోడ ఉంది. దాన్ని దాటితేగానీ ఎవ్వరూ లోపలికి వెళ్ళలేరు."

"దయ్యాలను మచ్చిక చేసే శక్తిని సంపాదించిన వాడొకడున్నాడు. ఒకరోజు వాడు ఒక దయ్యాన్ని ఆహ్వానించాడు. ఆ దయ్యం వచ్చి అతడి ఆజ్ఞ కొరకు వేచి ఉంది. అది అతడితో, 'నన్ను ఎందుకు ఆహ్వానించావు? నీవు ఏ పని చెప్పినా చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను. కాని ఏ క్షణంలో నీవు పని చెప్పవో, ఆ క్షణంలో నీ గొంతు నులిమివేస్తాను!' అని చెప్పి నిలబడింది. వాడికి కావాల్సిన పనులు చాలానే ఉన్నాయి. ఒకదాని తరువాత ఒకటి చొప్పున ఆ పనులు చెప్పడం మొదలు పెట్టాడు. కాని ఎన్ని పనులు చెప్పినా ఆ దయ్యం మరుక్షణంలోనే వాటిని పూర్తిచేసి తరువాత పనికి సిద్ధమయ్యేది. ఇక చెప్పడానికి పనులు లేక, వాడు భయపడి, 'ఇదుగో ఇప్పుడే వస్తాను, ఉండు!' అని చెప్పి, తన గురువుగారి దగ్గరకు పరుగెత్తాడు. గురువు పాదాలమీద పడి, 'స్వామీ! నేను గొప్ప ఆపదలో పడ్డాను,' అని జరిగినదంతా వివరించి, 'ఇప్పుడు నన్ను ఏమి చెయ్యమంటారు?' అని ప్రార్థించాడు. గురువుగారు, 'అబ్బాయీ! భయపడవద్దు. ఒక పని చెయ్యి! ఆ దయ్యం ముందు ఒక ఉంగరాలు తిరిగిన వెంట్రుకను పడవేసి దానిని సాఫీగా

ఉండేట్లు చెయ్యమని చెప్పు' అని సలహా యిచ్చాడు. పాపం! ఆ దయ్యం రాత్రింబగళ్ళు ఆ వెంట్రుకతో కుస్తీ పట్టింది. కాని దాని వంకర తీయలేకపోయింది. ఉంగరాలు తిరిగిన వెంట్రుక అసలు సాఫీగా ఎలా అవుతుంది?"



గురుదేవులు ఈ కథను కెప్టెనుకు చెబుతూ, "అదే విధంగా అహంకారం కూడా ఈ క్షణంలో లేనట్లు తోచినా మరుక్షణంలో ఎదురుగా ప్రత్యక్షమవుతుంది. ఈ అహంకారాన్ని త్యజిస్తేగాని భగవదనుగ్రహం లభించదు. కాని పసిబిడ్డకున్న అహంకారంవంటి అహంకారం ఎటువంటి హానీ చెయ్యదు. దానిని అసలు అహంకారం అనడానికే వీలులేదు. అటువంటి అహంకారంతో సచ్చిదానంద పరబ్రహ్మాన్ని ప్రేమించడం సాధ్యమౌతుంది. అయితే అహంకారం నుండి తప్పించుకోవడం ఈ కథలోని దయ్యం నుండి తప్పించుకోవడంలాగా అసాధ్యమైన పని. అందువల్ల మానవుడు దానిని అణచివుంచడానికి తాను భగవంతుని భక్తుణ్ణి లేక భగవంతుని దాసుణ్ణి అని భావించడం ఉత్తమమైన మార్గం" అని చెప్పారు.

## 113. పైపై ఆచారాలు ముఖ్యం కావు (తోలుతిత్తి)

ఒక సాధువు ఎండలో నడుస్తున్నాడు. అతడికి మిక్కుటమైన దాహం వేసింది.

నాలుక ఎండిపోయింది. అదే సమయంలో ఒకడు తోలుతిత్తిలో నీళ్ళు తీసుకొని అటువైపుగా వెడుతున్నాడు. ఈ సాధువు యొక్క పరిస్థితిని చూచి, వాడు ఆయనకు నీళ్ళు ఇవ్వడానికి ముందుకు వచ్చాడు. ఆ సాధువు అతణ్ణి, 'అబ్బాయీ! నీ తోలుతిత్తి శుభ్రంగా ఉన్నదా?' అని ప్రశ్నించాడు. వాడు వెంటనే, 'స్వామీ నా తోలుతిత్తి శుభ్రంగానే ఉన్నదిగానీ, మీ తోలుతిత్తి లోపల కశ్మలమైన పదార్థాలెన్నో ఉన్నాయి. అందువల్ల అంతకంటే పరిశుభ్రంగావున్న నా తోలుతిత్తిలోని నీరు మీరు త్రాగవచ్చును. అవి మీకెటువంటి అపకారం చెయ్యవు' అన్నాడు. 'మీ తోలుతిత్తి' అని అనడంలో వాడి ఉద్దేశమేమిటో తెలుసా? శరీరంలోవున్న తిత్తులు, గ్రంథులు, ప్రేగులు, వాటిలో ఉన్న మలము మొదలైనవని వాడి భావం."

ఈ కథను గురుదేవులు ఈశానచంద్ర చక్రవర్తికి చెప్పి, "ఈశానూ! నీకో విషయం చెపుతాను. బాహ్యాచారాలను గురించి నీవు అంతగా పట్టించుకోవద్దు. భగవన్నామం మీద విశ్వాసం కలిగివుంటే పుణ్యక్షేత్రాలకు పోనవసరం లేదు!" అని ఉద్బోధించారు.

## 114. ఎంతటివాడైనా మాయలో చిక్కుకుంటాడు (విష్ణుమూర్తి – వరాహావతారము)

ఒకసారి శ్రీరామకృష్ణులు ఆధార్‌సేను ఇంటికి వెళ్ళారు. అక్కడకు చాలామంది భక్తులు వచ్చి చేరారు. అక్కడ వాళ్ళు అనేక భక్తిగీతాలు ఆలపించారు. ఆ సమయంలో ప్రసంగిస్తూ గురుదేవులు, "గోపికలు కృష్ణుణ్ణి తమ భర్తగా పొందాలనుకున్నారు. అందుచేత జగన్మాతను కాత్యాయనీ రూపంలో పూజించే వ్రతం చేశారు. అంటే సర్వమూ ఆద్యాశక్తి ఆధీనంలోనే ఉంటుందని వారి విశ్వాసం. అందువల్లనే అవతార పురుషులు కూడా తమ ప్రయోజనాలను నెరవేర్చుకోవడానికి మహామాయ సహాయాన్ని తీసుకున్నారు. కాబట్టి ఆద్యాశక్తిని ఆరాధించడం అవసరం."

"మహామాయ ప్రభావం ఎలా వుంటుందో చూడండి! ఎంత వారినైనా అది మోహంలో ముంచివేస్తుంది. విష్ణుమూర్తి ఆది వరాహరూపం దాల్చి హిరణ్యాక్షుడనే రాక్షసుణ్ణి సంహరించాడు. అంతటితో ఆ రూపం వదలకుండా, పిల్లలను కని, వాటినే అంటిపెట్టుకొని, వాటి తోటిదే లోకమని సంతోషంగా కాలం గడుపుతున్నాడు. తాను ఎందుకు వచ్చానో, తన నిజస్వరూపం ఏమిటో మరచిపోయి, ఆ పంది పిల్లలకు పాలిస్తూ, ఆ వరాహ శరీరంలోని సుఖం అనుభవిస్తూ, కాలం గడుపుతున్నాడు. విష్ణుమూర్తిని ఆ శరీరంలోనుంచి విడిపించడం దేవతలకు సాధ్యం కాలేదు. ఎన్నాళ్ళు గడిచినా వైకుంఠవాసుడు తిరిగి రాకపోయేసరికి దేవతలు ఈశ్వరుడికి మొరపెట్టుకున్నారు. అప్పుడు

ఈశ్వరుడు తన త్రిశూలంతో ఆ వరాహమూర్తి రూపంలో ఉన్న విష్ణువును సమీపించి, 'ఇదేమి పని? నీ నిజస్వరూపాన్ని మరచిపోయి ఇక్కడ ఉన్నావేమిటి?' అని అడిగాడు. దానికి ఆ వరాహశరీరంలో ఉన్న విష్ణువు 'ఇప్పుడేమైంది? నేను బాగానే ఉన్నానుగా!' అని సమాధానం చెప్పాడు. ఇక మాటలతో ప్రయోజనం లేదనుకొని ఈశ్వరుడు తన త్రిశూలంతో ఆ వరాహ శరీరాన్ని చీల్చివేశాడు. వెంటనే విష్ణుమూర్తి వరాహరూపం వదిలి, నవ్వుకుంటూ బయటకు వచ్చి వైకుంఠానికి వెళ్ళిపోయాడు."

"కాబట్టి, మాయాప్రభావం వలన పాంచభౌతికమైన ఈ శరీరంలో చిక్కుకొని 'పరబ్రహ్మము' కూడా విలపిస్తాడు. శ్రీరాముణ్ణి చూడలేదా? మానవరూపం దాల్చడంవల్ల సీతకొరకు ఆయన సామాన్య మానవునిలాగా ఎంతగా విలపించాడో కదా! కాబట్టి ఆ మాయతెరను తొలగించమని ఆద్యాశక్తిని ఉపాసించడం మానవుని యొక్క ముఖ్యకర్తవ్యం" అని గురుదేవులు అచ్చటి భక్తులకు బోధించారు.

## 115. అవసరం చిన్నదైనా అనేక బంధాలను కొనితెస్తుంది (సన్న్యాసి - గోచీ)

"ఒక సన్న్యాసి అడవిలో ఏకాంతంగా తపస్సు చేసుకుంటున్నాడు. అతడికి 'నావి' అని చెప్పుకోదగినవి రెండు గోచీలు మాత్రమే. ఒకరోజు ఆ రెండు గోచీలలో ఒకదాన్ని ఒక ఎలుక కొంచెం కొరికింది. ఇక రెండవదాన్ని కూడా కొరికితే ఇబ్బంది అవుతుంది కదా! అందుచేత మర్నాడు ఇంకొక గుడ్డను యాచించడానికి దగ్గరలో ఉన్న గ్రామానికి వెళ్ళాడు. ఎవరినో బ్రతిమాలి తనకు అవసరమైన గుడ్డముక్కను సంపాదించాడు. అయితే దాన్ని కూడా ఎలుకలు కొట్టివేశాయి. దీనితో అతడు, 'అరే! ఇప్పుడు ఎలా? ఎన్నిసార్లు ఇలా యాచించాలి?' అని మథనపడ్డాడు. కానీ చేసేదిలేక మర్నాడు అదే గ్రామస్థుల దగ్గరకు వెళ్ళి జరిగిన విషయాన్ని వివరించాడు. బుద్ధిమంతులైన గ్రామస్థులు ఇదంతా విని, 'రోజూ నీకు ఇలా గుడ్డముక్కలు ఎవరు సరఫరా చేస్తారు? ఒక పని చెయ్యి! పిల్లిని పెంచుకో! దాని దెబ్బకు ఎలుకలు రాకుండా ఉంటాయి!' అని సలహా ఇచ్చారు. సాధువు ఆ గ్రామంలోనే తిరిగి ఒక పిల్లిని సంపాదించి తన గుడిసెకు తీసుకువచ్చాడు. ఆ రోజు నుంచీ అతడికి ఎలుకల పీడ వదిలింది. అతడి ఆనందానికి మేరలేదు. ఆ సాధువు ఇలా తనకు ఎంతో మేలు చేస్తున్న ఆ పిల్లికి గ్రామంలో నుంచే పాలు అడిగితెచ్చి, పోయసాగాడు. అయితే కొన్ని రోజుల తరువాత మేధావులైన ఆ గ్రామస్థులు అతనితో 'సాధువు గారూ! మీకు రోజూ పాలు కావాలి. బిచ్చమెత్తే వారికి రోజూ పాలు కావాలంటే ఎవరు ఇస్తారు? ఒక

పని చెయ్యండి! మీరే ఒక ఆవును పెంచుకోండి! పిల్లితో పాటు మీరు కూడా దాని పాలు త్రాగవచ్చు!' అని సలహా ఇచ్చారు. కొద్ది రోజులలో ఆ సాధువు ఒక పాడియావును సంపాదించాడు. ఇక పాల కోసం బిచ్చమెత్తవలసిన అవసరం లేకపోయింది. కానీ ఆవు కోసం గడ్డి కావలసివచ్చింది. గడ్డి కోసం చుట్టుప్రక్కల గ్రామాలకు తిరిగాడు. ఇది చూసి గ్రామస్థులు అతడితో, 'మీ గుడిసె చుట్టూ బీడు భూములు చాలా ఉన్నాయి. వాటిలో పంట వేస్తే సరిపోతుంది కదా! అలా చేస్తే మీ ఆవుకు గడ్డి కరవు ఉండదు!' అని సలహా ఇచ్చారు! వారి సలహా పాటించి సాధువు భూమి దున్నడం కూడా మొదలుపెట్టాడు. ఈ పంటలూ, పొలాలూ చూడడం కోసం జీతగాళ్ళను పెట్టుకోవలసివచ్చింది. అలా జీతగాళ్ళు, పాలేర్లు రావడంతో పశువులమంద పెరిగిపోయింది. ఇవన్నీ ఇలా క్రమక్రమంగా పెరిగిపోయి ఆ సన్న్యాసి ఒక పెద్ద భూస్వామిలా తయారయ్యాడు. ఇక అంత పెద్ద సంసారాన్ని సరిదిద్దడానికి అతడికి భార్య కూడా అవసరమైంది. చివరకు పెళ్ళి కూడా చేసుకున్నాడు."

"కాలచక్రం తిరిగిపోతున్నది. ఈ సంసారం పెరిగిపోతున్నది. ఇలా ఉండగా ఒకరోజు ఇతని గురువు అడవిలో వెతుక్కుంటూ ఇతన్ని చూడడానికి వచ్చాడు. అక్కడ ఏర్పడిన ఆ పటాటోపాన్ని చూచి ఆయన, ఈ సన్న్యాసి-గృహస్థుతో, 'ఇదేమిటి? ఇలా తయారయ్యావు?' అని ప్రశ్నించాడు. దానికి ఆ సన్న్యాసి-గృహస్థు, **'కౌపీన సంరక్షణార్థం అయం పటాటోపః'** (గోచీని కాపాడడానికే ఈ పటాటోపమంతా ఏర్పడింది) అని సమాధానం చెప్పాడు."

ఈ కథను గురుదేవులు తరచుగా శిష్యులకు చెబుతుండేవారు. ఒకసారి దీనిని నరేంద్ర బెనర్జీ, మహేంద్రనాథ గుప్త (యం), హరి (తరువాత తురీయానందస్వామి) – ఈ ముగ్గురికి చెప్పారు. ఆ సమయంలో నరేంద్ర బెనర్జీ కుటుంబ చిక్కులవల్ల వేరే ఇల్లు తీసుకొని తన భార్యతో కాపురం పెట్టాడు. అదే విధంగా కుటుంబ సమస్యలవల్ల మహేంద్రుడు కూడా భార్యతో వేరే కాపురం పెట్టాడు. ఇక హరి, తన అన్న ఇంటిలోవుంటూ మెట్రిక్యులేషన్ వరకు చదివి, తరువాత విద్యాభ్యాసం మాని, సద్గ్రంథపఠనంలోను, భగవద్ధ్యానంలోను కాలం గడుపుతున్నాడు.

గురుదేవులు ఈ కథను ఆ ముగ్గురి హృదయాలకు సూటిగా తగిలేలా చెప్పి ఇంకా ఇలా అన్నారు: "చూడండి! ఈ కష్టాలన్నీ గోచీపాత కోసమే. మానవుడు పెళ్ళిచేసుకొని పిల్లల్ని కంటాడు. వారికోసం ఉద్యోగం చేసి సంపాదించాల్సి వస్తుంది. గోచీపాత కోసం ఆ సాధువు బాధపడినట్లే, గృహస్థు తన భార్య కోసం బాధపడతాడు. అందువల్లనే గృహస్థు తన ఇంట్లో ఇతర బంధువులతో అన్యోన్యంగా ఉండలేకపోతాడు కూడా! అందుకే భార్యతో వెళ్ళిపోయి వేరే కాపురం పెడతాడు. దీనిని వివరిస్తూనే చైతన్యమహాప్రభువు ఒకసారి నిత్యానందునితో ఇలా అన్నారు: 'సోదరా! నా మాటవిను! సంసారంలో ఒకసారి చిక్కుకున్న వాడు బయటపడనే పడలేడు'."

## 116. వివేక వైరాగ్యాలతో కూడిన పాండిత్యం కావాలి (నాలుగు అరకల భాగవత పండితుడు; రాజు – భాగవత పండితుడు)

"ఒక భక్తుడు మోక్షగ్రంథమైన భాగవతాన్ని వినాలనుకున్నాడు. వివేకవైరాగ్యాలు కలిగి భాగవతం చెప్పే వారెవ్వరూ అతడికి కనపడలేదు. ఈ విషయం అతడి స్నేహితునితో చెప్పినప్పుడు, 'నాకొక భాగవత పండితుడు తెలుసు' అన్నాడు. అది విని ఆ భక్తుడు సంతోషించి, ఆ పండితుణ్ణి తన కోసం ఆహ్వానించి తీసుకురమ్మని కోరాడు. అప్పుడా స్నేహితుడు, 'నేను ఆయనను ఆహ్వానిస్తాను. కానీ ఇందులో ఒక చిక్కువుంది. ఆయనకు నాలుగు అరకలు,

దానికి తగిన వ్యవసాయము ఉన్నాయి. దానితో సతమతమవడంవల్ల ఆయనకు తీరిక దొరకదు' అని బదులు చెప్పాడు. ఈ మాటవిని ఆ భక్తుడు, 'అలా అయితే ఆ అరకలు, ఎద్దులు ఉన్న పండితుడు నాకక్కరలేదు. నాకు తీరికగా భగవంతుణ్ణి గురించి మాత్రమే ప్రసంగించే పండితుడు కావాలి' అని చెప్పాడు. ప్రాపంచిక వ్యాసంగాలలో నిమగ్నమైన వాడు భాగవతం చెప్పటానికి అనర్హుడని అతని భావం. ఇంకొక కథ చెపుతా వినండి!"

"ఒక రాజుగారు నిత్యము ఒక పండితునివద్ద భాగవత పురాణాన్ని వినేవాడు. ప్రతిరోజూ పురాణపఠనం తరువాత ఆ పండితుడు రాజుగారిని, 'అయ్యా! నేను చెప్పింది మీకు అర్థమయిందా?' అని ప్రశ్నించేవాడు. రాజుగారు దానికి సమాధానం చెప్పకుండా, 'అయ్యా, ముందు మీరు అర్థం చేసుకొని ఆ తర్వాత చెప్పండి!' అనేవాడు. చాలారోజులు ఇలాగే గడిచిపోయాయి. పండితుడు ఎంతో శ్రమపడి గ్రంథాన్ని చదివి రాజుగారికి శ్రద్ధగా చెప్పేవాడు. కాని రాజుగారు మాత్రం, 'ముందు మీరు అర్థం చేసుకోండి!' అంటూనే ఉన్నాడు. ప్రతి రోజూ ఇంటికి తిరిగివచ్చి పండితుడు, 'రాజుగారి మాటలలోని అంతరార్థమేమిటి?' అని ఆలోచించేవాడు. ఆ పండితుడు మంచి భక్తుడు. జపధ్యానాలతో కాలం గడిపే భక్తిపరాయణుడు. లోతుగా ఆలోచించడంవల్ల క్రమంగా అతడికి రాజుగారి మాటలలోని ఆంతర్యం బోధపడింది. ఈ ప్రపంచంలో నిత్యమైనది భగవంతుడొక్కడేనని, మిగిలినదంతా అనిత్యము, నశ్వరము (నశించిపోయేది) అనే నిశ్చితాభిప్రాయానికి వచ్చి, సంసారంపై విరక్తి కలిగి, సన్న్యాసం స్వీకరించాడు. ఇల్లు వదలి వెళ్ళి పోతూ, రాజుగారికి ఇలా కబురు పంపాడు, 'రాజా నాకిప్పుడు అర్థమైంది'." గురుదేవులు ఈ కథను డాక్టరు మహేంద్రలాలు సర్కారుకు వివరించి, "మీకు ఇది అర్థమైందా"? అని ప్రశ్నించి, "సంసారులకు భగవంతుణ్ణి తలచుకోవడానికి తీరిక ఎక్కడిది? అసలు విషయమేమిటో చెప్పమంటారా? పాండిత్యంవల్ల మీరు సాధించగలిగేదేమిటి? ఆ పాండిత్యంవల్ల ప్రయోజనమేమిటి? కావలసింది, వివేకము, వైరాగ్యము" అని గురుదేవులు బోధించారు. వివేకవైరాగ్యాలు కలవాడు చేసే బోధనలే సఫలమవుతాయి.

## 117. స్వమత దురభిమానము
## (గుడ్డివాళ్ళు – ఏనుగు)

ఒకసారి ఒక వైష్ణవగోస్వామి గురుదేవుని వద్దకు వచ్చాడు. ఆయనను చూడగానే శ్రీరామకృష్ణులు, "అయ్యా! ముక్తిని పొందడానికి మార్గమేమిటి?' అని ప్రశ్నించారు. ఆ వైష్ణవగోస్వామి, "కలియుగంలో తరించడానికి భగవన్నామస్మరణమే సులభోపాయము!' అని సమాధానం చెప్పాడు. అప్పుడు

గురుదేవులు దానిని వివరిస్తూ ఆ గోస్వామికి ఇలా ప్రబోధించారు: "మీరు చెప్పింది నిజమే! కానీ భగవద్దర్శనం కలగలేదనే ఆరాటం, హృదయంలో పరితాపం లేకుండా కేవలం భగవన్నామస్మరణ చేయడంవల్ల ప్రయోజనమేముంది? నేను చెప్పేదేమంటే, భగవన్నామస్మరణ చేయండి! దానితోపాటు భక్తి కలగాలని, ప్రాపంచిక బంధాలయిన పేరుప్రతిష్ఠలు, సంపదలు, ఇంద్రియ భోగాల మీద కోరిక తగ్గిపోవాలని భగవంతుణ్ణి ప్రార్థించండి. వ్యాకులత, ఆసక్తి ఉన్నట్లయితే ఏ మతాన్ని అనుసరించినా ఫరవాలేదు. భగవంతుడు తప్పక సాక్షాత్కరిస్తాడు. వైష్ణవులైనా, శాక్తేయులైనా, వేదాంతులైనా, బ్రహ్మసమాజ భక్తులైనా అందరూ భగవంతుణ్ణి దర్శిస్తారు. కావలసినది ఆర్తి! అది ఉన్నట్లయితే ఏ మతాన్ని అనుసరించినా భగవంతుణ్ణి పొందగలరు."

"కాని స్వమతదురభిమానం ఉన్నవాళ్ళు మాత్రం నా మతం ఒక్కటే సత్యమనీ, తక్కినవన్నీ కాదనీ తలుస్తారు. తగవులాడుకుంటారు. కాని భగవంతుని స్థితి ఇది అని ఎవ్వరూ నిర్ణయించలేరు, నిర్వచించలేరు. అది ఎవ్వరికీ సాధ్యం కాదు. భగవంతుడు సర్వలక్షణ సమన్వితుడు. ఒక కథ చెపుతా విను!"

"ఒక ఊరిలో నలుగురు గుడ్డివాళ్ళు ఉన్నారు. వాళ్ళు ఒకసారి ఏనుగును చూడాలని బయలుదేరారు. ఏనుగును సమీపించాక ఒకడు, 'అక్కడ నిలబడివున్న జంతువే ఏనుగు!' అని వాళ్ళకు చెప్పాడు. వాళ్ళు ఏనుగు దగ్గరకు వెళ్ళి దానిని చేతులతో తడిమి చూశారు. ఆ నలుగురిలో ఒకడు ఏనుగు స్తంభంలాగా ఉందని చెప్పాడు. కారణమేమంటే వాడు ఏనుగు కాలును మాత్రమే తాకి చూచాడు. మరొకడు ఏనుగు చేటలాగా ఉందని చెప్పాడు. కారణమేమంటే వాడు ఏనుగు చెవిని మాత్రమే స్పృశించాడు. అదే విధంగా తోకను తాకినవాడు ఏనుగు పాములాగా ఉందని, పొట్టను తాకినవాడు అది పెద్దపీపాలా ఉందని వర్ణించారు. ఆ గుడ్డివాళ్ళు ఆ ఏనుగు శరీరంలోని ఒక్కొక్క భాగాన్ని మాత్రమే తాకారు. అయితే ఆ ఒక భాగాన్నే వాళ్ళు మొత్తం ఏనుగుగా భావించి వర్ణించారు.

అదే విధంగా భగవంతుని యొక్క ఒక లక్షణాన్ని మాత్రమే తెలుసుకున్నవాడు భగవంతుడు ఆ లక్షణంతో మాత్రమే ఉంటాడని భావించి, తన సంకుచిత దృష్టితో భగవంతుణ్ణి ఆ మేరకు పరిమితం చేస్తాడు. భగవంతుడు వేరొకటి కాజాలడని అతడి నిశ్చితాభిప్రాయం కూడా. స్వమతదురభిమానులు ఏనుగును తాకిన గుడ్డివారిలాగా ప్రవర్తిస్తారు. అందుకే వారిలోవారు తగవులాడుకుంటారు. కాని భగవంతుని తత్త్వాన్ని తెలుసుకొన్నవారు, భగవంతునికి అనేక పేర్లున్నాయనీ, అనేక రూపాలున్నాయనీ, ఆయన సాకారుడనీ, నిరాకారుడనీ, సగుణుడనీ, నిర్గుణుడనీ, సగుణనిర్గుణాలకు అతీతుడని కూడా గ్రహిస్తారు."

## 118. భక్తులలో మోసగాళ్ళు (కేశవా! గోపాలా!)

గురుదేవుల గృహస్థభక్తులలో ఆధారసేన్ ముఖ్యుడు. గురుదేవులు అతడి ఇంటికి వచ్చినప్పుడు, ఆధార్ తన మిత్రుడైన బంకించంద్ర ఛటర్జీని కూడా ఆహ్వానించాడు. గురుదేవులతో బంకించంద్ర ఛటర్జీ అనేక విషయాలు చర్చించాడు. తరువాత బంకించంద్ర సెలవు తీసుకుంటూ గురుదేవులను తన ఇంటికి రమ్మని ఆహ్వానించాడు, ఆ సమయంలో బంకించంద్ర గురుదేవులతో, "స్వామీ! మీరు ఒకసారి మా ఇంటికివచ్చి మా ఇల్లు పావనం చేయగోరుతున్నాను. మా ఇంటి దగ్గర కూడా కొంతమంది భక్తులున్నారు" అన్నాడు.

వెంటనే గురుదేవులు అందుకొని, "ఆ భక్తులు ఎలాంటివాళ్ళు? కేశవా, గోపాలా, గోవిందా అనే రకమైన భక్తులా?" అని ప్రశ్నించారు. ఆ మాట విని అక్కడవున్న భక్తులలో ఒకరు, "స్వామీ! ఆ భక్తుల కథ ఏమిటో సెలవిస్తారా?" అని అడిగాడు. అప్పుడు గురుదేవులు ఈ కథను చెప్పారు.

"ఒక ఊరిలో ఒక బంగారు దుకాణంవుంది. అందులో పనిచేసేవారంతా గొప్ప దైవభక్తులలాగా కనిపిస్తారు. వారందరూ మెడలో తులసిపూసల మాలలు, నుదుట తిలకం, చేతిలో జపమాల సంచులు ఉంచుకొని బిగ్గరగా హరినామస్మరణ చేస్తూవుంటారు. ఎవరైనా వారిని చూస్తే అసలైన సాధువులే అని అనుకుంటారు. బేరగాళ్ళు ఎవరైనా దుకాణంలోకి వచ్చేసరికి పనివాళ్ళంతా నోటితో హరినామస్మరణ చేస్తూ, చేతితో పనిచేస్తుండడం కనిపిస్తుంది. బేరగాడు లోనికివచ్చి కూర్చునేసరికి, పనివారిలో ఒకడు బిగ్గరగా, 'కేశవా! కేశవా!' అంటాడు. బేరగాడు వారితో కొంచెంసేపు మాట్లాడిన తరువాత వాళ్ళలో ఒకడు, 'గోపాలా! గోపాలా!' అని కేకవేస్తాడు. మరికొంతసేపటికి ఇంకొకడు, 'హరీ! హరీ!' అని అరుస్తాడు. ఈ లోపల బేరసారాలు చాలావరకు కుదిరిపోతాయి. అప్పుడు నాల్గవవాడు బిగ్గరగా, 'హరా! హరా!' అంటాడు. పనివాళ్ళ శ్రద్ధాభక్తులు, యజమానుల ఉత్సాహం చూచి బేరగాళ్ళు చాలా సంతృప్తి చెంది, తమ సొమ్ము వీళ్ళ చేతులలో భద్రంగా ఉంటుందనీ, మోసం ఏమాత్రం ఉండదనీ, పూర్తిగా నమ్ముతారు.

"కానీ ఈ భగవన్నామాల వెనుకనున్న రహస్యమేమిటో మీకు తెలుసా? బేరగాడు వచ్చిన తరువాత 'కేశవా! కేశవా!' అనే వాడు, ఈ వచ్చిన వాడు ఎటువంటివాడు, ఎంత తెలివిగలవాడు, అని అడుగుతున్నాడన్నమాట. 'గోపాలా! గోపాలా!' అని జవాబుగా అరిచేవాడు, 'వీళ్ళు ఒఠ్ఠి అమాయకులు, అడవిగొడ్లు! అంతకు మించి మరేమీ కాదు' అని తెలియజేస్తున్నాడు. ఇక 'హరీ! హరీ!' అనేవాడు 'వీరిని మోసగించవచ్చునా?' అని అడుగుతున్నాడు. 'హరా! హరా!' అన్నవాడు 'వీరి సొమ్మును హరించు' అని చెపుతున్నాడన్నమాట. ఈ వచ్చినవాళ్ళు గోవులలాంటి వాళ్ళు కాబట్టి వాళ్ళను మోసగించవచ్చునని వాడి భావం."

ఈ కథ ముగించి, "అయ్యా, ఇక్కడ కూడా చాలామంది భక్తులుండడం మీరు చూస్తున్నారు. కాని వీరు మాత్రం భగవద్భక్తి కలవాళ్ళు సుమా!" అని గురుదేవులు బంకించంద్రతో చెప్పేసరికి అక్కడ ఉన్న వారంతా గొల్లుమని నవ్వారు.

## 119. హృదయంలో పవిత్రత ఉండాలి
## (సన్న్యాసి - వేశ్య)

ఒక గుడి దగ్గర ఒక సన్న్యాసి నివసిస్తున్నాడు. ఎదురుగా ఒక వేశ్య ఇల్లు ఉంది. విటులు చాలామంది రోజూ ఆమె ఇంటికి వచ్చిపోవడం చూచి సన్న్యాసి ఒకరోజు ఆమెను పిలిచి, 'నీవు మహాపాపివి! రాత్రింబగళ్ళు పాపం చేస్తూనే ఉన్నావు. నీకెటువంటి ఘోరమైన దశ కలుగుతుందో కదా!" అని చీవాట్లు పెట్టాడు. పాపం ఆ వేశ్య తను చేసే పనులను తలుచుకొని చాలా దిగులుపడి, తన పాపాలను

క్షమించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ, మనఃపూర్వకంగా పశ్చాత్తాపపడింది. అయినా వ్యభిచారం ఆమె వృత్తి, వంశాచారం. అందుచేత జీవనోపాధికై మరో వృత్తి చెయ్యడానికి వీలులేక తన శరీరాన్ని అమ్ముకుంటున్నప్పుడల్లా తనను తాను నిందించుకుంటూ చాలా పశ్చాత్తప్త హృదయంతో క్షమించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తూనే ఉంది. ఆ సన్యాసి తాను వేశ్యకు చేసిన హితోపదేశం వ్యర్థమైందని, తనలో తాను, "సరే! ఇక ఈమె ఇంటికి ఎంతమంది విటులు వస్తుంటారో చూస్తాను" అనుకున్నాడు. తన దగ్గర కొన్ని రాళ్ళు పెట్టుకొని ఆమె ఇంటికి విటుడు వచ్చినప్పుడల్లా ఒక చిన్నరాయిని తీసి ఒకచోట పడవేయసాగాడు. రానురాను, ఆ రాళ్ళకుప్ప పెద్దగుట్టగా పెరిగిపోయింది. ఒకరోజు ఆయన ఆ గుట్టను వేశ్యకు చూపిస్తూ, "చూచావా! ఇది నీవు చేసిన పాపాలరాశి. పాపం చెయ్యవద్దని నిన్ను మందలించాను. నీవు వినలేదు. అప్పటినుండి నీవు మానకుండా వ్యభిచారం చేసినప్పుడల్లా ఒక రాయి తీసి ఇక్కడ వేశాను. ఆ రాళ్ళతో ఏర్పడిన నీ పాపాలరాశి ఇది. దీనివల్ల నీకు ఎటువంటి దుర్గతి వస్తుందో తెలుసా?" అని హెచ్చరించాడు. పాపం ఆ నిర్భాగ్యురాలు తన పాపాలరాశిని చూచి గజగజ వణికిపోతూ తన అశక్తతను గురించి భగవంతునితో, "భగవంతుడా! ఈ ఘోరపాపం నుండి నన్ను రక్షించవా?" అని అంతరంగంలో క్షోభిస్తూ మొరపెట్టుకుంది. ఆమె ప్రార్థన భగవంతుడు విన్నాడు. ఆ రోజే మృత్యుదేవత ఆమె ఇంట్లో ప్రవేశించి ఆమెను ఈ ప్రపంచం నుండి విడిపించింది. అనుకోని విధంగా, విధివశాత్తూ సన్యాసి కూడా అదే సమయంలో మరణించాడు. యమదూతలు వచ్చి సన్యాసి జీవాత్మను పాశాలతో బంధించి యమలోకానికి తీసుకుపోయారు. విష్ణుదూతలు వచ్చి పశ్చాత్తాపపడ్డ వేశ్య జీవాత్మను వైకుంఠానికి తీసుకువెళ్ళారు. ఆ వేశ్య అదృష్టాన్ని చూచి సన్యాసి కోపంతో, "ఇదే కాబోలు భగవంతుని న్యాయం! జీవితమంతా నేను కఠిననిష్ఠతో గడిపాను. నన్ను నరకానికి ఈడ్చుకుపోతున్నారు. యావజ్జీవం మహాపాతకాలు చేసిన ఆ వ్యభిచారిణి వైకుంఠానికి పోతున్నది!" అని అరిచాడు.

ఈ మాటలు విన్న విష్ణుదూతలు ఇలా చెప్పారు: "ఓయీ! విధాత నిర్ణయం ఎప్పుడూ న్యాయంగానే ఉంటుంది. సంకల్పానికి తగినట్లే ఫలితం వస్తుంది. పేరుప్రతిష్ఠలకోసం నీ జీవితమంతా బాహ్యాడంబరాలతోను, అహంభావంతోను జీవించావు. నీవెప్పుడూ మనఃపూర్వకంగా భగవంతుడు కావాలని పరితపించిన పాపానపోలేదు. తన శరీరంతో పాపం చేసినా ఆ వేశ్య రాత్రింబగళ్ళూ పశ్చాత్తప్తహృదయంతో భగవంతుణ్ణి ప్రార్థించింది. అదిగో చూడు! లోకంలో నీ శరీరానికి ఎటువంటి గతి కలుగుతున్నదో! ఆమె శరీరానికి ఎటువంటి స్థితి

పట్టిందో! శరీరంతో నువ్వు ఎప్పుడూ పాపం చెయ్యలేదు. అందుకే నీ శరీరాన్ని పూలమాలలతో అలంకరించి, మేళతాళాలతో ఊరేగిస్తూ పుణ్యనదిలో వెయ్యబోతున్నారు. కాని ఆ వేశ్య శరీరం పాపాలపుట్ట కాబట్టి దానిని కాకులు, గ్రద్దలు చీల్చి తింటున్నాయి. ఆమె హృదయం పవిత్రమైనది గాబట్టి పుణ్యలోకానికి పోతున్నది. ఇక నీ హృదయమేమో, ఆమె పాపాలను గురించే రాత్రింబగళ్ళు మననం చేస్తుండడంవల్ల అపవిత్రమై పోయింది. అందుకే పాపాత్ములుండే నరకానికి నిన్ను తీసుకుపోతున్నాము. నిజంగా వ్యభిచరించింది నువ్వే కానీ, ఆ వేశ్య కాదు." (మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః – వివేకచూడామణి. బంధానికీ, మోక్షానికీ కారణం కేవలం మనస్సే.)

## 120. యోగి ఎలా దిగజారతాడు?

## (ముంగిస – ఇటుకముక్క)

"కామార్పుకూరులో నేను ఒక ముంగిసను చూశాను. అది ఒక గోడలోని కన్నంలో గూడు కట్టుకొని ఉండేది. దానికి ఆ కన్నంలో చాలా హాయిగా ఉండేది. కానీ కొన్నిసార్లు, కొందరు తుంటరివాళ్ళు దాని తోకకి ఒక ఇటుక రాయిని తాడుతో కట్టివేసేవాళ్ళు. కన్నంలో హాయిగా పడుకుందామని ఆ ముంగిస ప్రయత్నించిన ప్రతిసారీ, పాపం ఆ రాయి బరువును భరించలేక బయటకు రావలిసి వచ్చేది." మానవుడికి కూడా సంసారమనే రాయి కట్టివేసి ఉంటుంది. సాధన చేసే మార్గంలో ముందుకు పోవాలని చూసిన ప్రతిసారీ దాని బరువు అతణ్ణి క్రిందికి లాగుతూ, బాధిస్తూ ఉంటుంది.

"ఎల్లప్పుడూ ప్రాపంచిక విషయాలను గురించి ఆలోచించడంవల్ల సాధకుడు యోగపథం నుండి దిగజారిపోతాడు," అని వివరిస్తూ శ్రీరామకృష్ణులు పై కథను చెప్పారు.

## 121. మాయాప్రభావం

## (నారదుడు – మాయ)

మాయ యొక్క ప్రభావాన్ని వివరిస్తూ గురుదేవులు ఈ కథను చెప్పారు.

"ఒకసారి నారదుడు విష్ణుమూర్తి దగ్గరికి వెళ్ళి, 'స్వామీ! అసాధ్యమైన దానిని సాధ్యమయ్యేట్లు చేసే మీ మాయను ఒకసారి నాకు చూపించండి!' అని ప్రార్థించాడు. విష్ణుమూర్తి సరేనన్నాడు. తర్వాత ఒకరోజు విష్ణుమూర్తి, నారదుడు కలిసి ప్రయాణమై వెళుతున్నారు. దారిలో విష్ణుమూర్తి అలిసిపోయి, నేలమీద కూర్చుని, నారదుడితో, 'నారదా! నాకు చాలా దాహంగా ఉంది. ఎక్కడికైనా వెళ్ళి కొంచెం నీరు తీసుకురా!' అని చెప్పి పంపాడు. నారదుడు వెంటనే నీటిని వెతుకుతూ బయలుదేరాడు,"

"చాలాదూరం వెళ్ళిన తరువాత ఒక నది కనపడింది. ఆ నదిని సమీపించేసరికి అక్కడ అద్భుత సౌందర్యరాశి అయిన ఒక యువతి కనిపించింది. నారదుడు ఆమె అందాన్ని చూసి ముగ్ధుడయ్యాడు. నారదుడు ఆమెను సమీపించేసరికి ఆమె మృదుమధురమైన పలుకులతో అతడితో మాట్లాడసాగింది. త్వరలోనే వారిద్దరూ ప్రేమలో పడిపోయారు. నారదుడు ఆమెను వివాహం చేసుకుని, గృహస్థుగా స్థిరపడిపోయాడు. అతడు ఆ విధంగా ఆమెతో సుఖంగా సంసారం చేస్తూ ఉండగా, కాలక్రమేణా వారికి చాలామంది పిల్లలు కూడా కలిగారు. రోజులు ఇలా హాయిగా గడిచి పోతున్నాయి. అప్పుడు ఆ ప్రాంతంలో ఒక గొప్ప కరవు వచ్చింది. అన్నిచోట్లా ఆకలి చావులు సంభవిస్తున్నాయి. నారదుడు ఆ ప్రాంతాన్ని వదిలి మరొకచోటికి పోదామని నిశ్చయించుకున్నాడు. అతని భార్య కూడా అందుకు అంగీకరించింది. పిల్లలను తీసుకుని, ఇల్లు విడిచి, ఇద్దరూ నడచిపోసాగారు. వారు నదిని దాటడానికి వంతెన దగ్గరికి వచ్చేసరికి పెద్ద వరద వచ్చి పిల్లలందరూ ఒక్కొక్కరుగా ఆ నీటి ప్రవాహంలో కొట్టుకుపోయారు. చివరకు భార్య కూడా కొట్టుకుపోయింది. నారదుడు ఒక్కసారిగా పుట్టెడు దుఃఖంలో మునిగిపోయాడు. నది ఒడ్డున కూలబడి, భోరున ఏడవడం మొదలుపెట్టాడు. ఆ క్షణంలోనే విష్ణుమూర్తి అతని వద్దకు వచ్చి, 'నారదా! ఏడుస్తున్నావేమిటి? దాహంగా ఉందని మంచినీరు తెమ్మన్నాను కదా! నీరు తీసుకురాలేదేం?' అని ప్రశ్నించాడు. విష్ణుమూర్తిని చూసి నారదుడు అదిరిపడ్డాడు. అతనికి క్షణంలో అంతా అర్థమయిపోయింది. విష్ణుమూర్తితో, 'స్వామీ! మీకు కోటి నమస్కారాలు! అద్భుతమైన మీ మాయకు శతకోటి నమస్కారాలు!' అన్నాడు.

## 122. గ్రుడ్డి అనుకరణ పనికిరాదు
## (ఆది శంకరుడు – తెలివితక్కువ శిష్యుడు)

ఆదిశంకరులకు ఒక తెలివితక్కువ శిష్యుడు ఉండేవాడు. అతడు గురువుగారిని అన్ని విషయాలలో అనుకరిస్తూ ఉండేవాడు. శంకరాచార్యులు 'శివోహం' అంటే శిష్యుడు కూడా 'శివోహం' అనేవాడు. శిష్యుడి లోపాన్ని సరిదిద్దాలని శంకరులు అనుకున్నారు. వారు వెళ్ళే త్రోవలో ఒక కంసాలి అంగడి ఉంది. శంకరులు అక్కడ ఒక పాత్రలో అప్పుడే కరుగబెట్టి, ఎర్రగా మండుతూ ఉన్న ఇనుమును చూశారు. దానిని తీసుకొని శంకరులు గడగడా త్రాగివేశారు. శిష్యుణ్ణి కూడా త్రాగమన్నారు. గురువుగారు చేసిన ఈ పనిని మాత్రం శిష్యుడు అనుకరించలేకపోయాడు. అప్పటి నుండి 'శివోహం' అనడం కూడా మానివేశాడు.

## 123. సంసార బంధాలు లెక్కలేనన్ని!
## (బాగ్‌బజార్ వంతెన)

"ప్రతి ఒక్కరూ ఆధ్యాత్మిక జీవితాన్ని ఎందుకు గడపలేరు?" అన్న విషయాన్ని గురుదేవులు ఒకసారి ప్రస్తావించి ఈ క్రింది విషయాన్ని చెప్పారు. "అది చాలా కష్టం! నేనొకసారి కలకత్తాలోని బాగ్‌బజార్ వంతెన మీదుగా వెడుతున్నాను. దాన్ని పరీక్షగా చూస్తే అది ఎన్నో గొలుసులతో కట్టబడి ఉంది. వాటిలో ఏ గొలుసు తెగినా ఫరవాలేదు. మిగిలినవన్నీ కలసి దాన్ని సరైన స్థానంలో పట్టి ఉంచుతాయి. అదే విధంగా ప్రపంచంలో ఉండే మానవులు లెక్కలేనన్ని బంధాలలో చిక్కుకుని ఉంటారు. వాటిలో ఒకటి తొలిగినా, మిగిలినవన్నీ కలిసి వాళ్ళని ప్రపంచానికి పట్టి బంధించే ఉంచుతాయి. వాటినుండి తప్పించుకోవడానికి భగవంతుని అనుగ్రహం తప్ప వేరే మార్గం లేదు."

## 124. మాయ తొలగినప్పుడే భగవద్దర్శనమౌతుంది
## (రాముడు, సీత, లక్ష్మణుడు; నీటి మీద నాచు)

"వనవాస సమయంలో రాముడు, సీత, లక్ష్మణుడు వరుసగా నడచిపోతూ ఉండేవారు. సాక్షాత్తూ భగవంతుడైన శ్రీరాముడు బారెడు దూరంలోనే ఉన్నా, మాయారూపిణి అయిన సీత అడ్డంగా ఉండడం వలన లక్ష్మణుడు ఆయనను చూడలేకపోయేవాడు. జీవుల అహంకారమే మాయ. ఈ మాయ మేఘంలాంటిది. చిన్న మేఘం అడ్డువచ్చినా సూర్యుణ్ణి చూడలేము. ఎప్పుడైతే మాయ తొలగిపోతుందో అప్పుడు భగవద్దర్శనం మనకు కలుగుతుంది."

"ఇంకొక ఉదాహరణ చెపుతాను. కామకాంచనాలే మాయ. ఈ మాయ అనే తెరను తొలగించినప్పుడు భగవత్సాక్షాత్కారం అవుతుంది. కామార్పుకూరులో ఒక మంచినీళ్ళ గుంటలో నీరు నాచుతో కప్పబడివుంది. ఆ గుంట దగ్గరికి ఒక వ్యక్తి వచ్చి ఆ నాచును తొలగించి, నీటిని త్రాగాడు. ఆ నాచు కింద ఉన్న నీరు స్వచ్ఛంగా స్ఫటికంలాగా ఉంది. ఆ నీటిలాంటి సచ్చిదానంద స్వరూపుడైన భగవంతుణ్ణి నాచు రూపంలో ఉన్న మాయ కప్పి వుంచింది. దానిని తొలగించినప్పుడు మాత్రమే స్వచ్ఛమైన నీటిని త్రాగగలిగినట్లుగా భగవంతుణ్ణి తెలుసుకోగలుగుతాము."

## 125. సంసారంలో బంధించి ఉంచడమే మహామాయ కోర్కె
## (ఎలుకలు - బెల్లం మరమరాలు)

"ఇదంతా తల్లి ఆడించే ఆట. ఆమె లీల. దాగుడు మూతల ఆటలో దొంగను తప్పించుకుని వచ్చి తల్లిని తాకినవాడు పండిపోతాడు. వాడు ఇక ఆడడానికి

వీల్లేదు. ఆట ఆపి కూర్చోవాలి. అందరూ వచ్చి త్వరత్వరగా తల్లిని తాకేస్తే ఆట కొనసాగదు కదా! ఆటగాళ్ళు తనను త్వరగా తాకడం తల్లికి ఇష్టం ఉండదు. ఆట కొనసాగాలనీ, అందులో ఆనందించాలనీ, ఆట త్వరగా ముగిసిపోకూడదనీ తల్లి కోరుకుంటుంది."

"పెద్దపెద్ద గోదాములలో బియ్యం, పప్పులు బస్తాలలో నిలువ ఉంచుతారు. బస్తాలను ఎలుకలు కొట్టకుండా ఉండడానికి యజమానులు ఒక చేటలో బెల్లం కలిపిన మరమరాలు పెడతారు. బెల్లం వాసనకు ఎలుకలు ఆ చేట వద్దకే వస్తాయి కానీ లోపల బస్తాల నిండా ధాన్యమూ, పప్పులూ ఉన్నాయని తెలుసుకోలేవు. అలాగే మనుష్యులు కామకాంచనాల వాసనకు ముగ్ధులై వాటి మోజులోపడి అక్కడే ఆగిపోతారు. తమలోనే దాగివున్న అత్యద్భుతమైన పారమార్థిక పెన్నిధులను తెలుసుకోలేరు."

## 126. గర్వమే భక్తిని కృశింపజేసే వ్రణం (నారద గర్వభంగం)

ఒకసారి నారదుడిలో తనకంటే గొప్ప భక్తులు ఈ ప్రపంచంలో మరెవ్వరూ లేరన్న గర్వం జనించింది. అతడి మనస్సు తెలుసుకున్న విష్ణుమూర్తి, "నారదా! ఫలానా ఊరికి వెళ్ళు! అక్కడ నా భక్తుడొకడున్నాడు. అతడితో పరిచయం చేసుకో! అతడు నా నిజమైన భక్తుడు సుమా!" అని చెప్పాడు. నారదుడు అక్కడికి వెళ్ళి, అతణ్ణి చూశాడు. అతడు ఒక వ్యవసాయదారుడు. ఉదయాన్నే లేచి ఒక్కసారి హరినామస్మరణ చేసి పొలానికి వెళ్ళి రోజంతా పొలం పనులు చేసుకుంటాడు. రాత్రి నిద్రపోయే ముందు మరొకసారి హరినామస్మరణ చేస్తాడు. ఇదంతా చూసి నారదుడు, తనలో తాను, "ఈ పల్లెటూరి రైతు భగవద్భక్తుడు ఎలా అవుతాడు? ఇతనెప్పుడూ పొలం పనులలోనే మునిగి ఉంటున్నాడు. భక్తుల లక్షణాలు ఇతనిలో ఏమాత్రం కనిపించడం లేదే!" అనుకున్నాడు. నారదుడు విష్ణుమూర్తి దగ్గరకు తిరిగి వెళ్ళి ఈ విషయాన్ని చెప్పాడు.

అప్పుడు విష్ణుమూర్తి మళ్ళీ ఈ విధంగా ఆదేశించాడు: "నారదా! ఈ నూనె గిన్నె తీసుకొని వైకుంఠాన్ని చుట్టిరా! ఆ నూనె గిన్నెలోనుంచి ఒక్క బొట్టు కూడా నేలమీద పడకూడదు సుమా!" నారదుడు ఆయన చెప్పినట్టే చేశాడు. అతడు తిరిగి వచ్చిన తరువాత విష్ణుమూర్తి, 'నారదా! వైకుంఠం చుట్టి వచ్చేటప్పుడు నా నామాన్ని ఎన్నిసార్లు తలుచుకున్నావు! అని ప్రశ్నించాడు. సమాధానంగా నారదుడు, "ఒక్కసారి కూడా తలుచుకోలేదు స్వామీ! అయినా నిండుగా ఉన్న ఆ నూనె గిన్నెలో నుండి నూనె ఎక్కడ కారుతుందోనన్న ఆలోచన తప్ప నాకు వేరే ఆలోచనే కలగలేదు. అటువంటప్పుడు మీ నామస్మరణ ఎలా చేయగలుగుతాను?"

అన్నాడు. విష్ణుమూర్తి, "ఈ ఒక్క నూనె గిన్నె నీ మనస్సును నా మీద నుండి ప్రక్కకు మరల్చి, నన్నే మరిచిపోయేలా చేసింది. కానీ ఆ రైతును చూడు! కుటుంబ బరువుబాధ్యతలన్నీ మోస్తూ కూడా రోజుకు కనీసం రెండుసార్లయినా నన్ను తలుచుకుంటున్నాడు. కాబట్టి వాడే గొప్ప భక్తుడు" అన్నాడు. దీనితో నారదుడి కళ్ళు తెరచుకున్నాయి. గర్వం భక్తిని కృశింపజేస్తుందని తెలుసుకున్నాడు.

## 127. మోహంలో ముంచివేసే అవరోధాలు

## (న్యాయాధికారి - నాటకప్రదర్శన)

మహేంద్ర ముఖర్జీ అనే భక్తుణ్ణి గురుదేవులు హెచ్చరిస్తూ, "నీకు పిల్లలు లేరు. నీవు ఎవరికీ ఊడిగం చేయడం లేదు. అయినా ఇక్కడికి రావడానికి తీరిక లేదంటున్నావు. చాలా ఆశ్చర్యంగా ఉందే! ఒక విషయం చెపుతా విను" అని ఇలా చెప్పారు.

"నీ మనస్సును పరిపరివిధాలుగా లాగడానికి నీకు పిల్లలు లేరు కదా! నాకు తెలిసిన డిప్యూటీ మేజిస్ట్రేటు ఒకడు ఉన్నాడు. అతడికి ఎనిమిది వందల రూపాయల జీతం. కేశవచంద్ర సేను ఇంటిలో జరుగుతున్న ఒక నాటక ప్రదర్శనను చూడడానికి వచ్చాడు. నేను కూడా అక్కడకు వెళ్ళాను. రాఖాలు, మరికొంతమంది భక్తులు నాతో వచ్చి కూర్చున్నారు. కొద్దిసేపటి తర్వాత రాఖాలు రెండు నిముషాలు బయటకు వెళ్ళాడు. తన చోటు చూడమని నాతో చెప్పాడు. అంతలో ఈ డిప్యూటీ మేజిస్ట్రేటు వచ్చి కూర్చుంటూ, రాఖాలు కూర్చున్నచోట చిన్నపిల్లవాడైన తన కొడుకుని కూర్చోపెట్టాడు. నేను అతడితో అక్కడ కూర్చోవడానికి వీల్లేదు అని చెప్పాను. ఆ సమయంలో నా ప్రక్కన ఉన్నవాడు ఏది చెపితే అది చేసేవాణ్ణి. అందుకని రాఖాలును నా ప్రక్కనే కూర్చోపెట్టుకున్నాను. ప్రదర్శన జరుగుతున్నంతసేపూ ఆ డిప్యూటీ మేజిస్ట్రేటు తన కొడుకుతో కోతి వేషాలు వేస్తూనేవున్నాడు. ఒక్క నిముషమైనా నాటకాన్ని చూసిన పాపాన పోలేదు ఆ వెధవ! వాడు తన భార్య చేతిలో కీలుబొమ్మ అని కూడా నేను విన్నాను. ఆమె నిలబడమంటే నిలబడతాడుట. కూర్చోమంటే కూర్చుంటాడుట. చప్పిడిముక్కుతో పిల్లకోతిలా ఉన్న తన కొడుకును చూసుకుని మురిసిపోతూ కూర్చున్నాడు కానీ ఆ మనిషి ఒక్క క్షణమైనా ఆ నాటకాన్ని చూడలేదు."

పై విషయాన్ని వివరించడం ద్వారా విద్యాధికులైనవారు కూడా సాంసారిక వ్యామోహం వలన ఎలా బంధాలలో పడిపోతారో వివరించారు.

❀ ❀ ❀ ❀ ❀

# జీవితంలో, సమాజంలో ఎలా మెలగాలి?

## 128. మనస్సుని ఎల్లప్పుడూ భగవంతుడిపై ఉంచు! (పనిమనిషి)

సుప్రసిద్ధ బ్రహ్మసమాజ నాయకుడైన ప్రతాపచంద్ర మజుందారు శ్రీరామకృష్ణులను ఇలా ప్రశ్నించాడు: "మహాశయా! మీ దగ్గరకి వచ్చేవాళ్ళంతా ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందుతున్నారా?" గురుదేవులు ఈ ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పకుండా ఇలా అన్నారు.

గురుదేవులు: "నీకో విషయం చెపుతాను. సాంసారిక జీవితంలో తప్పేమీ లేదని, యజమాని ఇంట్లో ఉండి పనిచేసే పరిచారికలాగా సంసారంలో ఉండమని నేను చెపుతుంటాను. ఆ మనిషి యజమాని ఇంటిని గురించి చెపుతూ, 'ఇది మా ఇల్లు' అంటుంది. కాని తన ఇల్లు ఎక్కడో దూరంలోవున్న మారుమూల పల్లెటూరిలో ఉందని ఆమెకు గట్టిగా తెలుసు. తన యజమాని పిల్లవాణ్ణి ఎత్తుకుంటూ, 'నా హరి! ఎంత అల్లరివాడైనాడు. వీడికి తీపి వస్తువులంటే మహా ఇష్టం!' అంటుంది. కాని ఆమె హృదయాంతరాళంలో 'హరి' తన కొడుకు కాదనీ, యజమాని కొడుకనీ, తన సొంత కొడుకు దూరంలోవున్న తన పల్లెటూరులో, గుడిసెలో ఉన్నాడనీ ఆమెకు స్పష్టంగా తెలుసు."

"నా దగ్గరకు వచ్చేవాళ్ళకు ఇలా చెపుతూ ఉంటాను: 'మీరు సంసారజీవితం గడిపితే నష్టమేముంది? దానిలో ప్రమాదమేమీ లేదు. కాని మీ మనస్సును ఎల్లప్పుడూ భగవంతుని మీద ఉంచండి! మీ ఇల్లు, మీ కుటుంబం, ఆస్తిపాస్తులు మీవి కావనీ, భగవంతుడికి చెందినవనీ, మనఃస్ఫూర్తిగా నమ్మండి! మీ నిజనివాసము భగవంతునిలోనే ఉంది. అటువంటి విశ్వాసాన్ని కలిగివుండి, వ్యాకులచిత్తంతో భగవంతుణ్ణి ప్రార్థించండి!' అని కూడా వాళ్ళతో చెబుతాను" అని గురుదేవులు మజుందారుకు సమాధానమిచ్చారు. జీవితంలో మెలగవలసిన విధానాన్ని గురించి గృహస్థులకు గురుదేవులు ఇచ్చిన అమూల్యమైన సలహా ఇది.

## 129. సంసారంలో ఎలా మెలగాలి? (అటుకులు అమ్మే స్త్రీ)

ఒకసారి శ్రీరామకృష్ణులు భక్తులతో కూర్చొని ఉండగా, 'జ్ఞానబాబు' అనే వ్యక్తి వచ్చాడు. జ్ఞానబాబు ఒక ప్రభుత్వోద్యోగి. నాలుగు విశ్వవిద్యాలయ పట్టాలు కూడా పొందాడు. అతణ్ణి చూడగానే గురుదేవులు నవ్వుతూ, "నీవు జ్ఞానివి! మరి నీకు అజ్ఞానమెందుకుంది? చూడు! నీ కాలిలో ముల్లు గుచ్చుకుంటే ఏం చేస్తావు! మరో ముల్లుతో దానిని తీస్తావు. తరువాత రెంటినీ పారవేస్తావు గదా! గుచ్చుకున్న

ముల్లును తీయడానికి వాడిన రెండవ ముల్లు మంచిది అని చెప్పి దానిని దాచిపెట్టుకోవు. అదే విధంగా అజ్ఞానమనే ముల్లును జ్ఞానమనే ముల్లుతో తీసివెయ్యాలి. ఆ తర్వాత ఆ రెండింటినీ విడిచిపెట్టాలి. జ్ఞానము, అజ్ఞానము అనే రెండింటికీ అతీతంగా ఉన్నవాడికి, ఈ లోకం ఒక 'ఆనందసౌధంగా' మారిపోతుంది. అటువంటివాడు భగవంతుడే ఈ విశ్వంగానూ, అందలి జీవరాసులుగానూ, చతుర్వింశతి తత్త్వాలుగానూ (ఇరవైనాలుగు తత్త్వాలుగానూ) రూపుదాల్చినట్లు దర్శిస్తాడు."

"ఒక విషయం చెపుతాను విను! భగవంతుణ్ణి దర్శించిన తరువాత మానవుడు సంసారంలో ఉంటే ఉండవచ్చు. ఎలాగంటే, మా గ్రామప్రాంతాలలో వడ్రంగి స్త్రీలు దంపుడు యంత్రంతో అటుకులు తయారుచెయ్యడం చూశాను. వాళ్ళలో ఒక స్త్రీ రోటిలో ఉన్న వడ్లగింజలను చేతితో అటూయిటూ కదుపుతూ, మెదిగిన అటుకులను పైకి తోడుతూ ఉంటుంది. ఒడిలో పడుకుని పాలు త్రాగుతున్న చంటిపిల్లను రెండవచేతితో పట్టుకుంటుంది.

అదే సమయంలో బేరగాడితో బేరసారాలు కూడా కొనసాగిస్తుంది. 'నీవు పాతబాకీ రెండణాలు ఇవ్వాలి. ఇచ్చి వెళ్ళు!' అంటుంది. ఇన్ని పనులు చేస్తున్నా, రోకలి పోటుకు చెయ్యి ఎక్కడ నలిగిపోతుందోనని తన మనస్సును మాత్రం నూటికి డెబ్బది ఐదుపాళ్ళు చేతి మీదనే ఉంచుతుంది. అదే విధంగా గృహస్థు, నాల్గవవంతు మనస్సుతో సంసారవిధులు నిర్వహిస్తూ మిగిలిన మనస్సునంతా భగవంతుని మీదనే ఉంచాలి." అని గురుదేవులు జ్ఞానబాబును నిమిత్తమాత్రుణ్ణి చేసుకొని సంసారులకు కర్తవ్యాన్ని బోధించారు.

## 130. గృహస్థులు ప్రపంచంలో ఎలా మెలగాలి? (పాము - సాధువు)

ఒక భక్తుడు: "స్వామీ! దుష్టులు అపకారం చెయ్యబోతున్నా, లేక అపకారం చేసినా మాట్లాడకుండా ఊరుకోమంటారా?" గురుదేవులు: "సంసారులు దుష్టుల నుండి తప్పించుకోవడానికి వారికి కొంత భయం చూపడం అవసరం. 'వీళ్ళు మనల్ని ఏం చేస్తారో!' అనే భయాన్ని దుష్టులకు కలిగించగలగాలి. కానీ ఆ దుష్టులే తమకేదో అపకారం చేస్తారన్న లేనిపోని ఊహలతో తామే ముందుగా వాళ్ళకు అపకారం చెయ్యకూడదు. ఒక కథ చెపుతా విను!"

"ఒక పచ్చికబయలులో కొంతమంది పిల్లలు ఆవులు మేపుతూ ఉండేవారు. ఆ ప్రాంతంలో ఒక పుట్టలో ఒక పెద్ద విషసర్పం ఉండటంవల్ల వాళ్ళు చాలా జాగ్రత్తగా మెలుగుతూ ఉండేవారు. ఒకరోజు ఆ వైపుగా ఒక సాధువు వెడుతున్నాడు. గొల్లపిల్లలు ఆయన వద్దకు వెళ్ళి, 'స్వామీ! అటు వెళ్ళకండి! అక్కడ ఒక పెద్ద విషసర్పం ఉంది జాగ్రత్త!' అని చెప్పారు. కాని ఆ సాధువు, 'ఉంటే ఉండనివ్వండి. నాకేమీ భయంలేదు. నాకు చాలా మంత్రాలు తెలుసు' అని అంటూ ముందుకు సాగిపోయాడు. గొల్లపిల్లలు భయంతో ఆయన వెంట వెళ్ళకుండా అక్కడే ఆగిపోయారు. సాధువు కొంతదూరం వెళ్ళేసరికి నిజంగానే ఒక పెద్దవిషసర్పం పడగ ఎత్తి బుసలుకొడుతూ, సరసరా ప్రాకుతూ, సాధువు మీదకు వచ్చింది. సాధువు తక్షణమే చిటికెడు మట్టితీసి మంత్రించి దానిమీద చల్లేసరికి అది ఒక వానపాములాగా ఆయన కాళ్ళ ముందు పడిపోయింది. సాధువు ఆ పాముతో, 'చూడు! ఎందుకు ఇతరులకు అపకారం చేస్తావు? నీకొక మంత్రం చెపుతాను. దానిని జపించావంటే నీకు భగవంతుని మీద భక్తి కలుగుతుంది. చివరకు నీ క్రూరత్వం నశించడంతో పాటు, నీకు భగవంతుడు కనిపిస్తాడు కూడా!' అని హితవు పలికాడు. ఇలా చెప్పి ఆ పాముకు ఆయన ఒక మహామంత్రాన్ని ఉపదేశించి, దానిని సన్మార్గంలో పెట్టాడు. పాము, 'మహానుభావా! నన్ను సాధన ఎలా చెయ్యమంటారు?' అని వివరాలు అడగడంతో

ఆయన, 'నీవు జపం మానవద్దు, ఎవరినీ కాటు వెయ్యవద్దు' అని చెప్పి, 'నేను మళ్ళీ కొన్నాళ్ళ తరువాత ఇటు వచ్చినప్పుడు నిన్ను చూచిపోతానులే' అంటూ వెళ్ళిపోయాడు."

"కొంతకాలం గడిచింది. ఈ పాము ఎవరినీ కాటువెయ్యడం లేదని గొల్లపిల్లలు కనిపెట్టారు. దానితో భయం పోయి దానిమీద రాళ్ళు రువ్వడం మొదలుపెట్టారు. అయినా ఆ పాము వాళ్ళనేమీ చెయ్యలేదు. దానితో ఆ పిల్లలకు ఇంకా ధైర్యం వచ్చింది. వాళ్ళలో ఒకడు ఆ పాము తోకను పట్టుకొని గిరగిర తిప్పి, ఠపీమని నేలకేసి కొట్టి, విసిరి పారవేశాడు. ఆ దెబ్బతో పాము రక్తం కక్కుకుని, స్పృహతప్పి పడిపోయింది. ఆ స్థితిలో పామును చూచి, అది చచ్చిపోయిందనుకుని ఆ గొల్లపిల్లలు వెళ్ళిపోయారు."

"అర్ధరాత్రి అయిన తరువాత పాముకు స్పృహ వచ్చింది. ఎంతో కష్టంమీద శరీరాన్ని ఈడ్చుకుంటూ పుట్టలోకి చేరింది. ఎముకలు విరగడంవల్ల కదలడం కష్టమైంది. ఇలా కొంతకాలం గడచి పాము చిక్కిశల్యమైపోయింది. చర్మం మాత్రమే దాని ఒంటిమీద మిగిలింది. పిల్లలు మళ్ళీ కొడతారేమోనన్న భయంతో అది రాత్రిపూట మాత్రమే బయటకు వచ్చి, ఆకులు, అలములు, రాలిన పండ్లూ తింటూ ప్రాణాలు నిలుపుకుంటోంది. ఉపదేశం పొందిన తరువాత ఇతరులకు అపకారం చెయ్యడమనే మాటే అది మరచిపోయింది."

"ఒక సంవత్సరం గడిచింది. సాధువు మళ్ళీ ఆ వైపు వచ్చి పామును గురించి గొల్లపిల్లలను అడిగాడు. దానిని గిరగిర తిప్పి నేలకు కొట్టడం వల్ల అది చచ్చిపోయిందని వాళ్ళు బదులు చెప్పారు. కానీ ఆ సాధువు నమ్మలేదు. ఎందువల్లనంటే తాను ఇచ్చిన మంత్ర ప్రభావంవల్ల, సాఫల్యాన్ని పొందకుండా ఆ పాము చనిపోదని ఆయనకు తెలుసు. అందువల్ల పామును వెతుకుతూ పుట్ట దగ్గరకి వెళ్ళి, తాను దానికి పెట్టిన పేరుతో బిగ్గరగా పిలిచాడు. గురువుగారి కంఠధ్వనిని గుర్తించి పాము పుట్టలోనుండి బయటకు వచ్చి ఆయన పాదాలకు మ్రొక్కింది. 'ఎలా ఉన్నావు?' అని సాధువు కుశలప్రశ్నలు వేశాడు. 'మీ అనుగ్రహంవల్ల బాగానే ఉన్నానండీ' అని పాము బదులు చెప్పింది. చిక్కిపోయిన దాని శరీరాన్ని చూచి సాధువు, 'అదేమిటి, అంత బక్కచిక్కిపోయావెందుకు?' అని ప్రశ్నించాడు. 'మీరిచ్చిన మంత్రాన్ని జపిస్తూ ఎవ్వరికీ అపకారం చెయ్యకుండా ఉంటున్నాను. ఆకులు, అలములు తింటూ కాలం గడుపుతున్నాను. అందువల్ల కొంచెం చిక్కినట్లు మీకు కనిపిస్తున్నానేమో' అన్నది."

"ఆ పాములో ఇప్పుడు క్రూరత్వం నశించి సత్త్వగుణం ఏర్పడింది. అది ఎవ్వరికీ అపకారం చెయ్యలేకపోతున్నది. గొల్లపిల్లలు తనను చావబాదారన్న

విషయమే మరచిపోయింది. సాధువు, 'ఆహారం వల్ల నీవు ఇలా మారడానికి వీలులేదు. ఏదో కారణం ఉండివుండాలి. బాగా జ్ఞాపకం చేసుకోమని' దానిని హెచ్చరించాడు. అప్పటికిగాని ఆ పాముకు గొల్లపిల్లలు చేసిన ఆగడం గుర్తుకు రాలేదు. అప్పుడు, 'స్వామీ! నాకిప్పుడు గుర్తుకు వచ్చింది. ఒకరోజు ఒక పిల్లవాడు నా తోక పట్టుకుని గిరగిరా త్రిప్పి నేలకు కొట్టాడు. కానీ వాడు అజ్ఞానంవల్ల అలా చేశాడు. పాపం! నా మనస్సులో కలిగిన మార్పు వాళ్ళకేం తెలుస్తుంది' అన్నది. ఆ మాట విన్న సాధువు, 'ఛీ! ఎంత సిగ్గుచేటు! నీ తెలివి ఇలా తెల్లవారిందా? నిన్ను దుష్టులనుండి ఎలా రక్షించుకోవాలో కూడా నీకు తెలియటం లేదా? నేను నిన్ను కాటువెయ్యవద్దన్నాను గాని బుసకొట్టి భయపెట్టవద్దని చెప్పానా?' అని పామును మందిలించాడు."

"అందువల్ల గృహస్థులు దుష్టుల విషయంలో బుసకొట్టడం చాలా అవసరం. అలా భయపెట్టకపోతే ఆ దుష్టులు అపకారం చేస్తారు. మీరు బుసకొట్టవచ్చు కానీ మీ విషంతో వాళ్ళకు హాని చెయ్యకూడదు" అని గురుదేవులు ఆ భక్తునికి చెప్పడం ద్వారా గృహస్థులకు సంసారంలో ఎలా మెలగాలో బోధించారు.

## 131. వార్ధక్యంలో ఎలా మెలగాలి?
## (పళ్ళు ఊడిన తరువాత దుర్గపూజ)

శ్యామ బసు వయసు మీరినవాడు. తన కాలాన్ని సద్వినియోగం చేసుకోవాలనే జిజ్ఞాస అతడికి కలిగింది. గురుదేవులను ప్రథమ పర్యాయం అతడు దర్శించినప్పుడు, దివ్యజ్ఞాన సమాజాన్ని గురించి, స్థూలసూక్ష్మశరీరాలను గురించి ప్రశ్నించాడు. గురుదేవులు అతడికి హితబోధ చేస్తూ, 'నీవిక సంసారచింతలు పూర్తిగా వదలిపెట్టు! భగవంతుని మాటలు తప్పితే వేరొక మాటలు మాట్లాడవద్దు. ప్రాపంచికులు ఎదురు వస్తున్నట్టయితే వారిని తప్పించుకొని దూరంగా వెళ్ళిపో! జీవితమంతా సంసారంలో గడిపావు కదా. దాని బండారం ఏమిటో నీకు బాగా తెలుసు. ఇన్నాళ్ళు సంసారంలో ఉన్న తరువాత కూడా ఈ గందరగోళంలో భగవంతుణ్ణి ధ్యానించలేమని గ్రహించలేదా? అధమపక్షం, ఇంటికి అరమైలు దూరమైనా వెళ్ళి ఏకాంత ప్రదేశంలో సమయం గడపడం నీకిప్పుడు అవసరం. నీకా పళ్ళు ఊడిపోయాయి. ఇంకా దుర్గపూజ గురించి తాపత్రయ పడతావెందుకు? దీనికొక కథ ఉంది. చెపుతా విను!" అని ఈ చిన్న కథను చెప్పారు.

"ఒకడు ఎన్నో సంవత్సరాలుగా, వైభవోపేతంగా దుర్గపూజ చేస్తూ ఉండేవాడు. కాని ఒకసారి ఉన్నట్టుండి దుర్గపూజ మానివేశాడు. అతడి స్నేహితుడు అతడి

దగ్గరకు వచ్చి, 'ఏమిటోయీ! ఈసారి దుర్గపూజ మానివేశావేం?' అని అడిగాడు. దానికి అతడు, 'మిత్రమా! నీకు కనిపించడం లేదా! ఇప్పుడు నా పళ్ళన్నీ ఊడిపోయాయి, నాకు మేక మాంసం నమిలే శక్తి పోయింది' అని సమాధానమిచ్చాడు."

ఈ కథ విని శ్యామ బసు, 'ఆహా! ఆహా! ఎటువంటి మధుర వచనాలు' అని ప్రశంసించాడు. గురుదేవులు అప్పుడు నవ్వుతూ, 'ఈ సంసారం సుఖదుఃఖాల మిశ్రమం. చీమలాగా ఉండి చక్కెరను మాత్రమే తిను. భగవద్ధ్యానానికి ఒక ప్రశాంత ప్రదేశాన్ని నిర్మించుకో! అది తయారైన తరువాత నేను దాన్ని చూడడానికి వస్తాను. అన్ని విషయాలు తెలుసుకోవాలనే తాపత్రయం ఇక మంచిది కాదు. మొదట దేవుణ్ణి తెలుసుకో! అప్పుడు నీకు అవసరమయినదంతా ఆ భగవంతుడే తెలిసేటట్లు చేస్తాడు" అని శ్యామ బసు ద్వారా వృద్ధాప్యంలో ఉన్న ఆస్తికులకు హితబోధ చేశారు.

## 132. తాను ఆచరించిన దానినే మరొకరికి చెప్పాలి (మందు - పథ్యము)

"భగవంతుణ్ణి గురించి బోధించాలనుకునేవాడి జీవితం అసిధారావ్రతంలా ఉంటుంది. అతడు సంసారాన్ని త్యజించాలి. లేకపోతే అతడి మాటలను ఎవ్వరూ లక్ష్యపెట్టరు. అటువంటి వాడికి మానసిక త్యాగం ఒక్కటే చాలదు. బాహ్య సన్న్యాసం కూడా అవసరం. అప్పుడు అతడు చెప్పే మాటలకు సార్థకత ఉంటుంది. లేకపోతే అతణ్ణి గురించి ఇతరులు, 'మనల్ని కామకాంచనాలకు దూరంగా ఉండమంటాడు గాని, తాను మాత్రం రహస్యంగా వాటిని అనుభవిస్తూ ఉంటాడు' అనుకుంటారు. ఒక కథ చెపుతా విను!"

"ఒకసారి ఒక వైద్యుడు రోగికి మందు ఇస్తూ, 'ఇవాళ నీకు మందు ఇచ్చాను గదా! పథ్యం సంగతి చెపుతాను. ఫలానా రోజు రా!' అన్నాడు. ఆ రోగి చాలా దూరం నుండి వచ్చాడు. కాని వైద్యుని సలహా మేరకు శ్రమకోర్చి మళ్ళీ అంతదూరం నుండి వైద్యుడు చెప్పిన రోజు వచ్చాడు. అప్పుడు వైద్యుడు ఆ రోగితో, 'అబ్బాయీ! పథ్యం విషయంలో నీవు చాలా జాగ్రత్తగా ఉండాలి. బెల్లం పాకం తినడం నీ ఆరోగ్యానికి మంచిది కాదు. కాబట్టి దానిని నీవు ముట్టవద్దు' అని చెప్పాడు. 'సరే' అని సెలవు తీసుకుని రోగి వెళ్ళిపోయాడు. వైద్యుని దగ్గరే ఉండి ఇదంతా గమనిస్తున్న ఒక వ్యక్తి వైద్యునితో, 'డాక్టరుగారూ! ఎంతోదూరం నుండి వచ్చిన ఆ రోగిని మరల రమ్మని శ్రమపెట్టారెందుకండీ? ఈ రోజు ఇచ్చిన సలహా ఆ రోజే మీరు చెప్పివుండవచ్చు కదా! అతడికి ఈ వృథా శ్రమ తప్పివుండేది

కదా?' అని ప్రశ్నించాడు. 'అబ్బాయీ! దానికొక కారణముంది. బెల్లంపాకం తినవద్దని నేను ఆ రోజే చెప్పివుంటే అతడికి నా మాట మీద విశ్వాసం కలగదు. ఎందుకంటే ఆ రోజు నా గదిలో చాలా జాడీలనిండా బెల్లంపాకం ఉంది. ఆ రోగి, 'ఈ డాక్టరు గదిలో ఇన్ని బెల్లంపాకం జాడీలు ఉన్నాయి కదా! ఆయన తినకుండా ఉంటాడా? బెల్లంపాకమే అంత చెడ్డదయితే ఆయనెందుకు తింటాడు? కాబట్టి బెల్లంపాకం అంతచెడ్డది కాదు. తిన్నా తప్పేమీ ఉండదు' అని అనుకుంటాడు. అందువల్ల నా గదిలో నుండి జాడీలన్నింటినీ తీసివేయించాను. ఇప్పుడు అతడికి నా మాటలలో విశ్వాసముంటుంది' అని వైద్యుడు సమాధానం చెప్పాడు."

ఈ కథను రామకృష్ణులు మణిమల్లిక్‌కు చెప్పారు. మణిమల్లిక్ బ్రహ్మసమాజానికి చెందినవాడు. వ్యాపారస్థుడు కూడా. సంపన్నుడైనప్పటికీ, డబ్బు ఖర్చు చెయ్యడానికి వెనుకాడేవాడు. గురుదేవులను దర్శించేసరికి అతడి వయస్సు అరవై అయిదు సంవత్సరాలు. అంతకు ముందే తీర్థయాత్రలు చేసి ఉండడంవల్ల కాశీలో తాను చూచిన మహాపురుషులను గురించి చెబుతుండేవాడు. గురుదేవులు వృద్ధుడైన మణిమల్లిక్ స్వభావానికి అనుగుణమైన సలహా ఇస్తూ, వార్ధక్యంలో మానవుడు కార్యభారాన్ని వదలి, కామకాంచనాలకు దూరంగా ఉండి, భగవద్ధ్యానంలో కాలం గడపాలని బోధించారు.

## 133. బోధకుల జీవనసరళి కత్తిమీద సాము!
## (మహేంద్ర కవిరాజు; లక్ష్మీనారాయణ మార్వాడీ)

"నేను ఆదిబ్రహ్మసమాజానికి చెందిన ఒక బోధకుణ్ణి చూశాను. అతడు రెండోమూడో పెళ్ళిళ్ళు చేసుకున్నాడట. అతడికి చెట్టంత ఎదిగిన పిల్లలు కూడా ఉన్నారు. అటువంటి వాళ్ళా మతబోధకులు! అటువంటి బోధకుడు కనుక, 'భగవంతుడొక్కడే నిజం, మిగిలినదంతా మిథ్య' అని చెప్పినట్లయితే అతడి మాటల్ని ఎవరు విశ్వసిస్తారు? ఆపైన అటువంటి వారి శిష్యులు ఇంకెంత గొప్పగా ఉంటారో మీరు చక్కగా అర్థం చేసుకోవచ్చు!"

అంతేకాక ఇదే విషయాన్ని వివరిస్తూ, మరొక సందర్భంలో, తమ అనుభవాన్ని ఒకదాన్ని కూడా గురుదేవులు చెప్పారు. "సింథీకు చెందిన మహేంద్ర కవిరాజు ఒకసారి రామ్‌లాలుకు (గురుదేవుల అన్నగారి కొడుకు) ఐదు రూపాయలు ఇచ్చాడు. నాకు ఆ సంగతి తెలియదు. రామలాలు నాతో ఆ విషయం చెప్పినప్పుడు, 'ఆ డబ్బు ఎవరికోసం?' అని నేను అడిగాను. అది నా కోసమేనని రామలాలు చెప్పాడు. మొదట నేను ఆ డబ్బును పాలవాడికి ఇవ్వడానికి ఉపయోగించవచ్చు కదా అని అనుకున్నాను. కానీ తర్వాత ఏమి జరిగిందో చెపితే





మీరు నమ్మరు! నేను నిద్రకు ఉపక్రమించానో లేదో అదిరిపడి లేచి కూర్చున్నాను. ఛాతీమీద ఒక పిల్లి గీరితే ఎలా బాధ కలుగుతుందో అటువంటి బాధతో మెలికలు తిరిగిపోతున్నాను. లేచి రామలాలు దగ్గరికిపోయి, 'ఆ డబ్బును నా కోసం ఇచ్చారా? మీ అత్త కోసం (శారదాదేవి కోసం) ఇచ్చారా?' అని అడిగాను. నాకోసమేనని రామలాలు చెప్పాడు. నేను అతడితో, 'అయితే వెంటనే ఆ డబ్బును వాపసు చేసిరా!' అని చెప్పాను. రామలాలు మర్నాటి ఉదయమే ఆ డబ్బును తిరిగి ఇచ్చివేశాడు." ఇతరులకు బోధించాలనుకునేవాడు ఎంత ఖచ్చితమైన జీవితం గడపాలో గురుదేవులు ఈ సంఘటనతో వివరించారు.

శ్రీరామకృష్ణులు తాను స్వయంగా పాటించే నియమాల వలన లోకులు తనను చిన్నచూపు చూసినా పట్టించుకోకుండా, ఖచ్చితంగా నియమాలకే ఎలా కట్టుబడి ఉండాలో ఈ సంఘటన ద్వారా తెలియజెప్పారు. ఆయన తరచు ఇలా బోధించేవారు: "సన్న్యాసి పాటించవలసిన నియమాలు పదునైన కత్తి అంచుమీద నడవడం (అసిధారావ్రతం)లాగా అతి కఠోరంగా ఉంటాయి. అతనికి కామకాంచనాలతో అణువంతైనా సంబంధం ఉండకూడదు. అతడు తన చేతులతో డబ్బు తీసుకోకూడదు. తన దగ్గర డబ్బు వదిలివెళ్ళడానికి (అంటే దాని సంరక్షణకు) కూడా అంగీకరించకూడదు."

"వేదాంతి అయిన లక్ష్మీనారాయణ మార్వాడీ తరచుగా ఇక్కడికి వస్తూ ఉండేవాడు. ఒకరోజు నా పక్కమీద ఉన్న దుప్పటి మురికిగా ఉండడం చూశాడు. అతడు నాతో, 'అయ్యా! మీ పేరు మీద పదివేల రూపాయల నిధి ఏర్పాటు చేస్తాను. దాని నుంచి వచ్చే వడ్డీ మీ ఖర్చులకు వినియోగిస్తుంది,' అని అన్నాడు. అతడు ఆ మాటలు పలికిన మరుక్షణం ఎవరో నా తలమీద దుడ్డుకర్రతో బాదినట్లు నేను స్పృహ తప్పి పడిపోయాను. తిరిగి స్పృహలోకి వచ్చిన తర్వాత, 'అయ్యా! దయచేసి మీరు ఇటువంటి మాటలు మాట్లాడవద్దు. అలా మాట్లాడదలుచుకుంటే మీరు ఇక్కడికి రానవసరం లేదు. నాకు డబ్బును ముట్టుకోవడం అసాధ్యం. దానిని నా దగ్గర ఉంచుకోవడం కూడా అసాధ్యమే,' అని అతనితో చెప్పాను."

"అయితే అతడు చాలా తెలివిగలవాడు. నాతో, 'తీసుకోవడం, వద్దనడం మొదలైన భావనలు మీకు ఇంకా పోలేదన్నమాట. అంటే మీకు పరిపూర్ణమైన జ్ఞానం ఇంకా కలుగలేదు,' అన్నాడు. నేను ఆయనతో, 'అయ్యా! మహానుభావా! నేనింకా అంత ఉన్నతమైన స్థితికి చేరుకోలేదు,' అని సమాధానం చెప్పాను."

"అయితే అతడు అంతటితో వదలకుండా ఆ డబ్బుని హృదయుడికి ఇచ్చి వెడతానని అన్నాడు. దానికి కూడా నేను ఒప్పుకోలేదు. అతడితో, 'అదేమీ కుదరదు. మీరు ఆ డబ్బును హృదయుడికి ఇచ్చి వెడితే దానిని నా అవసరాల

నిమిత్తం ఖర్చు పెట్టడానికి నేను అతనికి పురమాయించవలసి వస్తుంది. అతడు నామాట వినకపోతే నేను క్రోధానికి లోనుకావచ్చు. ధనంతో అణుమాత్రమైన సంపర్కం కూడా నిస్సందేహంగా చేటు తెచ్చిపెడుతుంది. కాబట్టి మీరు దానిని హృదయుడికి ఇవ్వడానికి వీలులేదు. అద్దం ముందు ఉంచిన వస్తువు యొక్క ప్రతిబింబం అద్దంలో కనపడకమానదు కదా!' అని చెప్పాను."

## 134. వేషానికి తగినట్టుగా ప్రవర్తన ఉండాలి (పగటివేషగాడు - శివుని వేషం)

గురుదేవుల మహాసమాధి (నిర్యాణం) తరువాత శ్రీరామకృష్ణకథామృత రచయిత అయిన మహేంద్రనాథ గుప్త ఒకసారి బారానగరమఠానికి వెళ్ళి నరేంద్రునితో అనేక విషయాలు చర్చించాడు. వాళ్ళ సంభాషణలో శ్రీరామకృష్ణులు నరేంద్రుణ్ణి ఎంత గొప్పగా భావించారో అన్న విషయము, నరేంద్రుని మీద గురుదేవులు ఉంచిన బాధ్యత, మొదలైన అనేక విషయాలు ప్రస్తావనకు వచ్చాయి. అప్పుడు నరేంద్రుడు వైరాగ్యభావం ఉట్టిపడుతూ, "అయ్యో! నేనేమీ సాధించలేదే" అన్నాడు.

మహేంద్రుడు : "నీవు ఇప్పుడు శివుని వేషం వేశావు. నీవు డబ్బు ముట్టుకోవడానికి వీలులేదు. గురుదేవులు ఈ విషయంలో చెప్పిన కథ జ్ఞాపకం లేదా? చెపుతా విను!"

"ఒకసారి ఒక పగటివేషగాడు శివుని వేషం వేసుకొని ఒక ఇంటిదగ్గరకి వచ్చాడు. ఆ ఇంటి యజమాని వాడికి ఒక రూపాయి ఇవ్వజూపాడు. కాని వాడు దానిని తీసుకోలేదు. తరువాత ఆ వేషధారి తన ఇంటికి వెళ్ళి వేషం తీసివేసి మామూలు మనిషిగా మళ్ళీ వచ్చి, 'అయ్యా! మీరు నాకు రూపాయి ఇస్తానన్నారే, ఇప్పుడు ఇవ్వండి!' అని అడిగాడు. అప్పుడు ఆ గృహస్థు, 'అదేమిటయ్యా? ఇందాక నేనే ఇస్తానంటే వద్దని వెళ్ళిపోయావు. ఇప్పుడు మళ్ళీ వచ్చి యాచిస్తున్నావు' అని అడిగాడు. ఆ వేషగాడు, 'అయ్యా! అప్పుడు నేను సర్వసంగ పరిత్యాగి అయిన శివుని వేషంలో ఉన్నాను. శివుడు సన్న్యాసి, కాబట్టి ఆ సమయంలో నేను డబ్బు ముట్టకూడదు కదా!' అని సమాధానమిచ్చాడు."

అలా కథ ముగించి మహేంద్రుడు నరేంద్రునితో, "నీవిప్పుడు భవవైద్యుని వేషం వేశావు. ఈ యువకులందరికీ సంరక్షకుడివయ్యావు. కాబట్టి బాధ్యతంతా నీ మీదనే ఉన్నది. ఈ మఠంలోని సోదర సన్న్యాసులందరినీ పైకి తీసుకు రావలిసిన బాధ్యత నీమీదనే ఉంది" అని చెప్పాడు.

## 135. దురాశ దుఃఖమునకు చేటు
## (మంగలి - ఏడు బిందెల బంగారం)

ఒక మంగలివాడు ఒక భూతం ఆవహించిన చెట్టు క్రింద నడుస్తూ, "బంగారంతో నిండిన ఏడు బిందెలు నీకు కావాలా?" అన్న అశరీరవాణిని విన్నాడు. ఆ మంగలి అటూయిటూ చూశాడు. ఎవ్వరూ కనపడలేదు. ఏడుబిందెల బంగారం ఇస్తానన్నమాట అతడిలో పేరాశ కలిగించింది. వాడు, "ఆహా! తీసుకుంటాను!" అని గట్టిగా అరిచాడు. "ఇంటికి పో! ఆ ఏడు బిందెల్నీ నీ ఇంటికి చేర్చాను!" అని సమాధానం వినిపించింది. ఈ విచిత్రం ఎంతవరకూ నిజమో చూద్దామని ఆత్రుతతో వాడు ఇంటికి పరుగెత్తాడు. ఇల్లుచేరి చూసేసరికి బిందెలు ఎదురుగా కనపడ్డాయి. వాటిని తెరిచిచూస్తే అన్నీ బంగారునాణాలతో నిండి ఉన్నాయి. కానీ ఏడవదానిలో కొంచెం వెలితి ఉంది. ఆ మంగలి మనస్సులో ఇప్పుడొక తీవ్రమైన కోరిక కలిగింది. ఏడవ బిందెని కూడా నింపాలని, లేకపోతే తన ఆనందానికి వెలితి కలుగుతుందని భావించాడు. అందువల్ల అతడు ఇంట్లో ఉన్న వెండి, బంగారు నగలన్నింటినీ అమ్మివేసి, వరహాలుగా మార్చి ఆ బిందెలో వేశాడు. కాని ఆ బిందె నిండలేదు! దానిలో ఇంకా కొంత వెలితి ఉంది.

దీనితో మంగలికి చాలా అసంతృప్తి, తీరని ఆరాటం కలిగాయి. తాను, తన కుటుంబం సరిగా తిండి కూడా తినకుండా కడుపు మాడ్చుకుని, మరికొంత ధనం పోగుచేసి ఆ బిందెలో వేశాడు. కాని ఆ 'వింత–బిందె' ఎప్పటిలా వెలితిగానే ఉండిపోయింది. ఆ మంగలి రాజుగారి వద్ద పనిచేసేవాడు. వాడు రాజుగారిని సందర్శించి, తన రాబడి కుటుంబ పోషణకు చాలడం లేదని, తన జీతాన్ని పెంచమని కోరాడు. ఆ మంగలి మీద అభిమానం ఉండడంచేత వాడు కోరగానే, రాజు వాడి జీతం రెట్టింపు చేశాడు. ఈ జీతాన్ని కూడా మంగలి కూడబెట్టి బిందెలో వేస్తున్నాడు కాని ఆ 'వింత–బిందె' ఎంతకూ నిండదే! చివరికి ఆ మంగలి ఇంటింటికి తిరిగి బిచ్చమెత్తి, ఆ సొమ్మును, తన నెలజీతంతో సహా ఆ 'వింత–బిందె'లో పడవెయ్యడం మొదలుపెట్టాడు. అయినా సరే, అది ఎప్పటిలానే ఉన్నది. అది నిండే సూచనలేమీ కనపడలేదు. నెలలు గడుస్తున్నాయి. కానీ ఏడు–బిందెల భాగ్యం కలిగివుండీ, నిర్భాగ్యుడైన ఆ మంగలి దుఃఖం నానాటికీ పెరిగిపోతోంది. రాజు వాడి దైన్యస్థితిని కనిపెట్టి ఒకరోజు, "ఏరా! నీ జీతం ఇప్పుడున్న దానిలో సగం ఉన్నప్పుడే ఎంతో ఆనందంగాను, ఉల్లాసంగాను ఉండేవాడివే. ఇప్పుడు రెట్టింపు జీతం సంపాదిస్తున్నా దీనంగా, బిక్కమొఖం వేసుకొని ఉన్నావెందుకు? నీకు ఏమి కష్టం వచ్చింది? ఒకవేళ నీకుగానీ ఆ ఏడుబిందెలు తారసపడ్డాయా?" అని ప్రశ్నించాడు. ఈ మాటలు విని ఆ మంగలి ఉలిక్కిపడి, "మహాప్రభూ! ఏలినవారికి ఈ సంగతి ఎవరు చెప్పారు?" అని అడిగాడు. రాజు ఇలా అన్నాడు: "నీకు తెలియదా! ఎవరికి ఆ యక్షుడు ఆ ఏడుబిందెలు ఇస్తాడో, వాడికి ఇటువంటి లక్షణాలు వస్తాయి. నాకు కూడా ఆ యక్షుడు ఆ ఏడు బిందెలు ఇస్తానన్నాడు. కానీ నేను ఆ సొమ్ము 'దాచుకోవడానికా, లేక ఖర్చు పెట్టుకోవడానికా?' అని అడిగేసరికి వాడు పారిపోయాడు. ఆ డబ్బు వాడుకోవడానికి పనికిరాదని నీకు తెలియదా? ఆ డబ్బు చేజిక్కినవారికి ఇంకా, ఇంకా కూడబెట్టాలనే ఉంటుంది కానీ, ఖర్చుపెట్ట బుద్ధికాదు. తక్షణమే వెళ్ళి ఆ బిందెలు తిరిగి ఇచ్చివేసి రా!" ఈ సలహా విని, మంగలి బుద్ధి తెచ్చుకొని యక్షుడు ఆవహించిన ఆ చెట్టు దగ్గరకు వెళ్ళి, "ఓ యక్షుడా! నీ ఏడు బిందెలను నీవే తీసుకో!" అన్నాడు. "సరే!" అని ఆ యక్షుడు బదులు పలికాడు. మంగలి ఇల్లు చేరి చూచేసరికి ఆ ఏడుబిందెలు ఎంత విచిత్రంగా వచ్చాయో అంత విచిత్రంగా మాయమయిపోయాయి. వాటితోపాటు వాడు యావజ్జీవం కష్టపడి సంపాదించిన ధనమంతా కూడా ఎగిరిపోయింది.

లోకంలో కొందరి పరిస్థితి ఇలాగే ఉంటుంది. నిజమైన ఆదాయమేమిటో, నిజమైన ఖర్చు ఏమిటో తెలియని వాళ్ళకు ఉన్నదంతా సర్వనాశనమౌతుంది.





## 136. ధనాన్ని సక్రమంగా వినియోగించాలి (వరిపొలం గట్లు - వరదనీరు)

"ఈ ప్రపంచం అంటే కామకాంచనాలే! ఎక్కువమంది డబ్బే ప్రాణంగా జీవిస్తూ ఉంటారు. అయితే మీరు దాన్ని ఎంతగా ప్రేమించినా సరే, ఏదోవొకనాడు అది మీ చేతిలోనుంచి జారిపోక మానదు."

"కామార్పుకూరులో వరిపొలాలచుట్టూ గట్లు కడతారు. ఇవి ఎలా ఉంటాయో మీకు తెలుసు కదా! పొలంలో నీరు నిలచి ఉండడం కోసం ఈ గట్లను నిర్మిస్తారు. కొందరు రైతులు ఎంతో జాగ్రత్తగా పొలంచుట్టూ గట్టు కట్టి నీటిని ఏమాత్రం బయటకు పోనీయకుండా ఉంచుతారు. అయితే వానలతో వరదనీరు నిండుగా వచ్చి చేరేసరికి ఆ గట్లు కొట్టుకుపోతాయి. అయితే కొందరు రైతులు చుట్టూ గట్టు కట్టినా, దానిలో ఒకమూల పచ్చగడ్డితోవున్న మట్టిపెళ్ళల్ని కొంచెం అడ్డుగా వేసి, గట్టు పూర్తిగా కట్టకుండా వదిలివేస్తారు. దీనివల్ల ఎక్కువైన వరదనీరు ఎప్పటికప్పుడు బయటకు పోవడమే కాక పొలంలో ఒండ్రుమట్టి కూడా పేరుకుంటుంది. ఇలా చేసిన వాళ్ళకి మంచి దిగుబడి వస్తుంది కూడా."

"అదే విధంగా డబ్బును లోభంతో దాచిపెట్టుకోకుండా భగవంతుడి సేవకోసం, లోకకళ్యాణం కోసం ఖర్చుపెట్టినప్పుడు మాత్రమే అది సద్వినియోగమవుతుంది, ఫలప్రదమవుతుంది."

## 137. తల్లి కృప త్వరగా లభిస్తుంది (లోభివర్తకుడు - గురువు)

"ఒక పేద బ్రాహ్మణుడికి ధనికుడైన ఒక బట్టల వర్తకుడు శిష్యునిగా ఉండేవాడు. ఆ వర్తకుడు పరమలోభి. ఒకరోజు ఆ బ్రాహ్మణుడికి తన దేవతార్చన గ్రంథాన్ని కప్పుకోవడానికి ఒక గుడ్డ కావలసి వచ్చింది. ఆయన తన శిష్యుని వద్దకు వెళ్ళి అడిగాడు. ఆ వర్తకుడు, 'అయ్యో! పది నిముషాల క్రితం చెపితే మీకు కావలసిన గుడ్డ ఇచ్చేవాణ్ణే. మీకు పనికివచ్చే చిన్న ముక్క ఇప్పుడేమీ లేదే! ఏం దురదృష్టం! కానివ్వండి. మీరడిగింది నేను గుర్తుంచుకుంటాను. ఐనా అప్పుడప్పుడు జ్ఞాపకం చేస్తూ ఉండండి', అన్నాడు. పాపం! ఆ బ్రాహ్మణుడు నిరాశతో తిరిగి వెళ్ళబోతున్నాడు. గురువుగారికి, ఈ శిష్యోత్తముడికి మధ్య జరిగిన సంభాషణ వర్తకుని భార్య తెరచాటు నుండి విన్నది. వెళ్ళిపోతున్న ఆ బ్రాహ్మణుణ్ణి ఆమె లోపలికి పిలిచి, 'స్వామీ! ఆయనను మీరేమి అడుగుతున్నారు?' అని విచారించింది. జరిగినదంతా విన్న తరువాత, 'చిత్తం, మీరు ఇంటికి వెళ్ళండి. మీరు కోరినగుడ్డ రేపు ఉదయమే మీకు చేరుతుంది!' అని వర్తకుని భార్య

పలికింది. రాత్రి వర్తకుడు ఇంటికి రాగానే 'దుకాణం మూశారా?' అని భార్య అడిగింది. 'ఔను! ఏమిటి విశేషం,' అని వర్తకుడు అన్నాడు. 'ఇప్పుడే వెళ్ళి మన దుకాణంలో వున్న నాణ్యమైన రెండు బట్టలు తీసుకురండి' అని భార్య పలికింది. వర్తకుడు, 'ఏమిటి ఈ తొందర! రేపు ఉదయమే తెస్తాను' అన్నాడు. 'అలా కాదు, ఇప్పుడే కావాలి!' అని భార్య నొక్కి చెప్పింది. పాపం ఆ నిర్భాగ్యుడు ఏం చేస్తాడు? మాయమాటలతో, కల్లబొల్లి వాగ్దానాలతో పంపి వెయ్యడానికి ఈమె తన ఆధ్యాత్మిక గురువు కాదు గదా! తన తెరచాటు గురువు!! ఈమె ఆజ్ఞ అప్పటికప్పుడు అమలు చేసి తీరాలి! లేకపోతే 'ఇంటిలోని పోరు ఇంతింతగాదయా!' అన్నట్లు అవుతుంది. వర్తకుడు విధిలేక ఆ అర్ధరాత్రి వేళలోనే వెళ్ళి, దుకాణం తీసి, భార్య కోరిన బట్టలు తెచ్చాడు. మరునాటి ఉదయమే ఆ ఇల్లాలు గురువుగారికి కావలసిన బట్టలను పంపిస్తూ, 'ఇక మీదట మీకేమైనా కావలసివస్తే నన్ను అడగండి. మీకు అవి లభిస్తాయి' అని కబురు చేసింది."

"కాబట్టి దయామయి అయిన లోకేశ్వరిని శరణువేడి, ఆమె వరప్రసాదాన్ని కోరే వారి ప్రార్థనలు, భగవంతుణ్ణి పితృస్వభావంతో అర్చించేవారి ప్రార్థనలకంటే శీఘ్రంగా, సులభంగా నెరవేరడానికి అవకాశముందని గ్రహించాలి" అని గురుదేవులు చెప్పారు.

## 138. మన పనులకు మనమే బాధ్యులము (మిట్టవేదాంతి అయిన బ్రాహ్మణుడు)

ఒక బ్రాహ్మణుడు ఒక తోటను పెంచి, రాత్రింబగళ్ళు దానిని జాగ్రత్తగా కనిపెట్టుకొని ఉంటున్నాడు. ఒకరోజు, ఒక ఆవు ఆ తోటలో ప్రవేశించి, వాడెంతో ప్రీతితో పోషిస్తూ వచ్చిన ఒక మామిడి అంటును తినివేసింది. తనకెంతో ప్రియమైన ఆ మొక్కను ఆవు మేయడం చూసి, బ్రాహ్మణుడు కాలరుద్రుడై ఒక బడితె తీసుకొని ఆవును బాదసాగాడు. ఆ దెబ్బలకు ఆవు చచ్చిపోయింది. బ్రాహ్మణుడు గోహత్య చేశాడనే వార్త అన్ని వైపులా వ్యాపించింది. ఈ బ్రాహ్మణుడు తాను వేదాంతినని చెప్పుకునేవాడు. గోహత్యాపాతకం తనకు చుట్టుకున్నదని ఎవరైనా అంటే చాలు, అతడు ఇలా చెప్పేవాడు: "లేదు. నేను గోహత్య చెయ్యలేదు. ఆ పని చేసింది నా చెయ్యి. చేతికి అధిష్ఠాన దేవత ఇంద్రుడు. కాబట్టి ఆ గోహత్యాపాతకం ఇంద్రునిదే గాని నాది కాదు!"

స్వర్గంలో ఇంద్రుడు ఈ మాటలు విన్నాడు. ఆయన ఒక వృద్ధబ్రాహ్మణవేషంలో తోటలో ఉన్న ఈ బ్రాహ్మణుడి దగ్గరకు వచ్చి ఇలా ప్రశ్నించాడు: "అయ్యా! ఈ తోట ఎవరిదండీ?"

బ్రాహ్మణుడు : "నాది."

ఇంద్రుడు: "ఇది ఎంత చక్కని తోట! చాలా నేర్పుగల తోటమాలి మీకు దొరికి ఉంటాడు. చూడండి! మొక్కలను ఎంత సొగసుగా, ఎంత నైపుణ్యంతో నాటాడో!"

బ్రాహ్మణుడు: "ఇదంతా నా పనేనండీ! చెట్లన్నింటినీ నేనే స్వయంగా పరీక్షించి, స్థలం కూడా నేనే నిర్ణయం చేసి, నేనే పాతించానండీ."

ఇంద్రుడు: "అలాగా! చాలా చక్కగా పాతించారే! ఇక్కడ ఈ త్రోవ ఎవరు వేయించారండీ? దీనిని కూడా చాలా అందంగా నిర్మించారే!" బ్రాహ్మణుడు: "అంతా స్వయంగా నేను చేసిన దేనండీ!"

అప్పుడు ఇంద్రుడు అతణ్ణి ఘాటుగా విమర్శిస్తూ, "ఈ పనులన్నీ నావేననీ, ఈ తోట ఘనత అంతా నాదేననీ చెప్పుకుంటున్నావు గదా! కాని ఆవును చంపిన పాపం మాత్రం ఇంద్రుడికి అంటగట్టడం చాలా అన్యాయం సుమా!" అని పలికాడు. మనుష్యులు గొప్పవిగా కనిపించేవాటిని తమ ప్రజ్ఞగా చెప్పుకుంటారు కానీ తాము చేసే పొరపాట్లకూ, పాపాలకూ కారణాలనూ, బాధ్యతనూ ఇతరులమీదకో, అది కుదరకపోతే దైవంమీదకో నెడతారు. అలా చెయ్యకూడదు. మనం చేసే పనులకు బాధ్యత మనదే.



అంతేకాక, మనకు అనుకూలంగా వేదాంతశాస్త్రాలకు భాష్యం చెప్పడం ద్వారా ప్రజల్ని మోసగించకూడదు. ఒక ఉన్నతాదర్శానికి తగినట్టు జీవించడంలో విఫలమయినప్పుడు మన చేతగానితనాన్ని అంగీకరించడమే మేలు. అలాకాక ఆ ఆదర్శాన్ని క్రిందికి లాగడానికి ప్రయత్నించడం అత్యంత నికృష్టం. అలా చేయడంవల్ల మనల్ని మనమే మోసగించుకున్నవారమౌతాము కూడా.

## 139. ధనవంతుని ముఖస్తుతి
## (నక్క – ఎద్దు)

ఒకసారి శ్రీరామకృష్ణులు యదు మల్లిక్ ఇంటికి వెళ్ళారు. అక్కడ చాలామంది భట్రాజులు, ముఖస్తుతి చేసేవాళ్ళు యదు మల్లిక్ చుట్టూ కూర్చొని వున్నారు. గురుదేవులను యదు మల్లిక్ లోనికి ఆహ్వానించాడు. గురుదేవులు చిరునవ్వుతో, "ఈ విదూషకులందరినీ నీ చుట్టూ ఉంచుకుంటావెందుకు?" అని అడిగారు. యదు మల్లిక్ నవ్వుతూ, "మీరు వారిని బంధవిముక్తుల్ని చేస్తారని!" అని సమాధానం చెప్పాడు. అక్కడి వారందరూ బిగ్గరగా నవ్వారు. గురుదేవులు, "భాగ్యవంతుని చుట్టూ అతని ముఖస్తుతి చేసేవాళ్ళు చేరి అతణ్ణి పొగుడుతూ, తమకేమన్నా నాలుగురూకలు విదిలిస్తాడేమోనని ఎదురు చూస్తూ ఉంటారు. కానీ అతని వద్దనుండి ఏమైనా పొందడం చాలా కష్టం. ఒక కథ చెపుతా విను!" అని ఈ క్రింది కథను చెప్పారు.

"అడవిలో ఒక నక్క ఒక పెద్ద ఎద్దును చూచింది. 'ఈ ఎద్దు వృషణాలు చక్కగా, పెద్దవిగా వ్రేలాడుతున్నాయి. ఇవాళో, రేపో అవి రాలిపడతాయి. అప్పుడు వాటిని తినవచ్చు,' అని ఆ నక్క ఆశపడింది. ఆ ఎద్దు తిరిగిన చోటికల్లా ఈ నక్క దాన్ని అనుసరించి పోసాగింది. ఆ ఎద్దు పడుకుని విశ్రాంతి తీసుకుంటే ఈ నక్క కూడా అదే పని చేసింది. మళ్ళీ ఎద్దు లేచి నడవడం ప్రారంభిస్తే ఈ నక్క దాని వెన్నంటి పోసాగింది. ఈ విధంగా చాలారోజులు గడిచాయి. కాని ఆ ఎద్దు వృషణాలు రాలి పోకుండా దాని శరీరానికే అంటిపెట్టుకుని వ్రేలాడుతున్నాయి. చూసిచూసి నక్క నిరాశతో వెళ్ళిపోయింది."

## 140. ప్రతిదానికీ ఒక అవసరం ఉంది!
## (గోలక్ చౌదరి కథ; సీతాదేవి – తాపీ పనివాళ్ళు)

"ఒకసారి ఒక పెద్దతోట యొక్క కౌలుదారులు తమ యజమాని అయిన జమీందారుకు ఎదురు తిరిగారు. ఆ జమీందారు వారితో సామరస్యంగా సంప్రదింపులు జరిపి సమస్యను పరిష్కరిద్దామనుకున్నాడు. కానీ, ప్రయోజనం లేకపోయింది. ఆ తోట జమీందారు వారిని అదుపులోకి తేవడానికి గోలక్ చౌదరిని





పంపాడు. వాడు ఒక పెద్ద రౌడీ. వాడు ఎటువంటి వాడంటే, వాడి పేరు వినగానే ఆ కౌలుదారులు గడగడలాడారు. సమస్య సులభంగా పరిష్కారమయింది. అందుకని మంచివారితో పాటు దుర్మార్గులు కూడా ఈ ప్రపంచంలో అవసరమే!" పై కథ చెప్పి శ్రీరామకృష్ణులు ఆ విషయాన్నే వివరిస్తూ మరొక కథ చెప్పారు.

"ప్రతీ దానికీ అవసరం ఉంది. సీత శ్రీరాముడితో ఒకసారి, "స్వామీ! అయోధ్యలోని ప్రతి ఇల్లు ఒక పెద్ద మేడ అయితే ఎంత బాగుంటుందో కదా! చాలా ఇళ్ళు పాతబడి శిథిలమై పోతున్నాయి" అన్నది. అది విని శ్రీరాముడు, 'సీతా! అన్ని ఇళ్ళు అందంగా, చక్కగా ఉంటే తాపీపని వాళ్ళందరూ ఏం చేస్తారు?' అని అడిగాడు. దేవుడు అన్నిరకాల వస్తువులను సృష్టించాడు. మంచి చెట్లు, జంతువులనే కాకుండా, విషపు మొక్కల్ని, కలుపు మొక్కల్ని, పులులు, సింహాలు, పాములు మొదలైన జంతువులను, అన్ని రకాలను సృష్టించాడు. వాటన్నిటితోనూ ఈ ప్రపంచంలో అవసరం ఉంటుంది."

## 141. మనుష్యులలో రకరకాలు ఉంటారు (వలలో పడ్డ చేపలు)

మనుష్యులు రకరకాలుగా ఉంటారని మహేంద్రనాథ గుప్త, నరేంద్రుడు, మొదలైన భక్తులకు వివరిస్తూ గురుదేవులు ఇలా చెప్పారు:

"మనుష్యుల్ని నాలుగు రకాలుగా విభజించవచ్చు: నిత్యముక్తులు, ముక్తిని పొందినవాళ్ళు, ముక్తిని కోరుకొనేవాళ్ళు, ప్రాపంచిక బంధాలలో చిక్కుకుపోయిన వాళ్ళు."

"నారదుడు మొదలైన మహర్షులను మనం నిత్యముక్తులుగా ఉదహరించవచ్చు. ఇతరులకు మంచి చేయడానికి, ఆధ్యాత్మిక సత్యాలు బోధించడానికి మాత్రమే వాళ్ళు జీవిస్తారు. సొర, గుమ్మడి వంటి కొన్ని తీగలను గమనించండి. అవి ముందు పిందెలు పెట్టి ఆ పైన పుష్పిస్తాయి. వీరు ఈ కోవకు చెందుతారు."

"ముక్తిని పొందిన సాధువులు, మహాత్ములు ఈ ప్రపంచంలోని బంధాలలో చిక్కుకోరు. వాళ్ళ మనసుల్లో ప్రాపంచికత అనేదే ఉండదు. అంతేకాక, వాళ్ళు ఎప్పుడూ దేవుడి పాదపద్మాలను ధ్యానిస్తూ ఉంటారు."

"ముక్తిని కోరేవాళ్ళు ప్రాపంచిక బంధాలను వదిలించుకోవడానికి ప్రయత్నిస్తారు. వీళ్ళలో కొంతమంది ప్రయత్నాలు మాత్రమే సఫలీకృతమవుతాయి."

"సంసారంలో మునిగిపోయినవాళ్ళు దేవుణ్ణి పూర్తిగా మరిచిపోతారు. పొరపాటున కూడా దేవుణ్ణి తలుచుకోరు. దీన్ని గురించి ఒక కథ చెపుతా విను!"

"ఒక చెరువులో చేపలు పట్టడానికి వలవేశారు. కొన్ని చేపలు ఎంతో తెలివిగా దానిలో పడకుండానే తప్పించుకుంటాయి. అవి నిత్యముక్తులు. కానీ చాలా చేపలు వలలో పడిపోతాయి. వలలో చిక్కుకున్న చేపలలో కొన్ని తప్పించుకోవాలని ప్రయత్నిస్తాయి. అవి ముక్తి కోసం ప్రయత్నించే వారిలాంటివి. కానీ అవన్నీ తప్పించుకోలేవు. చాలాకొద్ది చేపలు మాత్రం వలలోనుంచి బయటకు దూకి పెద్ద శబ్దం చేస్తూ నీళ్ళలోపడి పారిపోతాయి. చేపలు పట్టేవాళ్ళు, "అదిగో, ఒక పెద్ద చేప పోయింది రా!' అని కేక పెడతారు. ఇవి ముక్తిని కోరుకుని, దాని కోసం ప్రయత్నించి, సఫలీకృతమయిన సాధకుల వంటివి. కానీ వలలో పడ్డ చేపలలో అధికభాగం తప్పించుకోలేవు సరికదా, తప్పించుకోవడానికి కనీసం ప్రయత్నమైనా చెయ్యవు. పైగా నోటితో వలను కరుచుకుని, బురదలోకి దూరి, "ఇంక భయపడాల్సిన పనిలేదు! ఇక్కడ మనకు ఏ ఆపదా రాదు!" అనుకుంటాయి. కానీ జాలరులు తమను వలతోపాటు బయటకు లాగుతారని వాటికి తెలియదు. ఇవి ప్రాపంచిక బంధాలలో చిక్కుకుపోయిన మనుష్యుల వంటివి."

## 142. ప్రాపంచిక సంపదలను చూసి విర్రవీగకు! (సేవకుడి ప్రగల్భాలు)

"ఒక ధనవంతుడు తన ఆస్తిని తన ముఖ్యసేవకుడైన ఒక గుమాస్తాకు అప్పగించి దాని వ్యవహారాలు చూడమని చెప్పాడు. ఎవరైనా, 'ఈ ఆస్తి ఎవరిదండీ?' అని అడిగితే ఆ గుమాస్తా గర్వంగా, 'నాదేనండీ! ఈ ఇళ్ళూ, తోటలూ అన్నీ నావే!' అని సమాధానం చెప్పేవాడు. వాడు ఈ విధంగా ప్రగల్భాలు పలుకుతూ, గర్వంతో వ్యవహరిస్తున్నాడు. ఆ ధనవంతుడు వీణ్ణి ఒక చెరువులో చేపలు పట్టవద్దని హెచ్చరించాడు. అయినా ఆ గుమాస్తా గర్వంతో, యజమాని ఆదేశాలను లెక్క చెయ్యకుండా, అదే చెరువులో ఒకరోజు చేపల్ని పట్టిస్తున్నాడు. దురదృష్టవశాత్తూ, ఆ ధనవంతుడు అదే సమయానికి అక్కడికి వచ్చి, జరుగుతున్న తతంగాన్ని చూసి మండిపడి, ఆ గుమాస్తాను ఉద్యోగం నుంచి తొలగించి, తరిమివేశాడు. వాడి వస్తువులను కూడా తానే లాగివేసుకున్నాడు. ఆ నిర్భాగ్యుడు అవమానంతో తన సొంత ఆస్తి అయిన పాత మామిడి చెక్క పెట్టె, గిన్నెలు, కంచాలు కూడా వదులుకుని పోవలసివచ్చింది. గర్వంతో విర్రవీగితే పొందే శిక్ష ఈ విధంగా ఉంటుంది.

అలాగే ఈ ప్రపంచంలోని వస్తువులన్నీ భగవంతునివే. వాటిని 'నావి!' అనుకుని గర్వించకూడదు.

# 143. పరమత సహనం
## (నూతిలో కప్ప)

ఒక నూతిలో ఒక కప్ప ఉంది. అది ఆ బావిలోనే పుట్టి, పెరిగిన కప్ప. ఒకనాడు సముద్రంలో నుండి మరో కప్ప వచ్చి ఆ నూతిలో పడింది. నూతిలోని కప్ప ఆ కొత్తగా వచ్చిన దానితో, "నీవెక్కడ నుంచి వచ్చావు?" అని ప్రశ్నించింది. సముద్రపు కప్ప, "నేను సముద్రంలో ఉండేదాన్ని" అని సమాధానమిచ్చింది. అప్పుడు ఆ నూతికప్ప, "సముద్రమా! అదెంత పెద్దది?" అని ప్రశ్నించింది. "అది చాలా పెద్దది" అని సముద్రపు కప్ప బదులు చెప్పింది. నూతికప్ప తన కాళ్ళను బారజాపి, "మీ సముద్రం ఇంత పెద్దదిగా ఉంటుందా?"

అంది. "అంతకంటే చాలా పెద్దది" అని సముద్రపు కప్ప ప్రత్యుత్తరం ఇచ్చింది. అప్పుడు నూతికప్ప ఈవైపు నుండి ఆవైపుకు ఒక్క గంతువేసి, "ఇదిగో ఈ నా నూతికన్నా మీ సముద్రం పెద్దదా?" అంది. "మిత్రమా! సముద్రాన్ని నువ్వు ఈ నూతితో ఎలా పోలుస్తావు?" అని సముద్రపు కప్ప ఎదురు ప్రశ్నించింది.

అప్పుడు నూతికప్ప ఇలా నొక్కి వక్కాణించింది: "కాదు! కాదు! నా నూతి కంటే మరేదీ పెద్దదిగా ఉండడానికి వీలు లేదు! ఈ సముద్రపు కప్ప వట్టి అబద్ధాలకోరు! దీనిని తరిమి వేయండి" అని తన తోటికప్పలతో చెప్పింది. సంకుచిత అభిప్రాయాలుగల వాళ్ళ ధోరణి ఇలాగే ఉంటుంది. తమ చిన్న నూతిలో కూర్చుని అదే ప్రపంచమని, తమ నూతికంటే మరొకటి పెద్దదిగా ఉండజాలదని తలపోస్తారు.

## 144. వ్యర్థవిషయాలు
## (కంసాలి – జడసమాధి; హఠయోగి – బాంకునోటు)

గురుదేవులు, "కొందరు సిద్ధుల్ని పొందడానికి రకరకాల తాంత్రిక సాధనల్ని చేస్తారు. అటువంటి వాళ్ళు ఎంత నీచులో! కృష్ణుడు అర్జునునితో, 'అష్టసిద్ధుల్లో ఏ ఒక్క సిద్ధి ఉన్నా, నీవు నన్ను సాక్షాత్కరింపజేసుకోలేవు!' అన్నాడు. సిద్ధుల్ని ఉపయోగించినంత కాలం మానవుడు మాయనుండి తప్పించుకోలేడు. 'మాయయే అహంకారానికి మూలం' అనీ, 'సిద్ధులను వ్యర్థవిషయాలుగానూ, హానికరమైనవి'గానూ పేర్కొంటూ ఈ క్రింది కథను చెప్పారు. "శరీరం, సంపద అనిత్యమైనవి, వాటి కోసం అంత బాధపడడం ఎందుకు? హఠయోగుల కష్టాలు చూడండి! వారి ఏకైక జీవితలక్ష్యం దీర్ఘాయుష్షు – ఎక్కువకాలం జీవించడం! అదే లక్ష్యంతో ప్రేగులను కడుక్కోవడం, గొట్టంతో పాలు త్రాగడం మొదలైన ఎన్నో సాధనలు చేస్తారు. దేవుణ్ణి సాక్షాత్కరింపజేసుకోవాలని వాళ్ళు ఎంతమాత్రం అనుకోరు."

"ఒక కంసాలి ఉండేవాడు. ఒకరోజు అకస్మాత్తుగా వాడి నాలుక వెనుకకు తిరిగి గొంతులో ఇరుక్కొనిపోయింది. వాడు చూడడానికి సమాధిస్థితిలో ఉన్నట్టు కనిపించాడు. ఏ మాత్రం కదలకుండా చాలా రోజులు అలా ఉండిపోయాడు. జనం వచ్చి, వాణ్ణి చూసి ఒక మహాయోగి అనుకొని పూజలు చెయ్యడం మొదలుపెట్టారు. చాలా సంవత్సరాల తరువాత వాడి నాలుక అకస్మాత్తుగా యథాస్థితికి వచ్చింది. వాడు స్పృహలోకి వచ్చాడు. మళ్ళీవాడు యథాప్రకారం తన కంసాలి పని చేసుకోవడం మొదలుపెట్టాడు."

"ఈ శరీరసంబంధమైన విషయాలకు, భగవంతుడికి ఎటువంటి సంబంధం లేదు. ఎనభై రెండు యోగాసనాలు నేర్చుకొని, యోగసమాధి గురించి ప్రగల్భాలు

పలికేవాడు ఒకడు ఉండేవాడు. కానీ వాడు తన మనస్సులో కామినీకాంచనాల కోసం వెంపర్లాడేవాడు. ఒకసారి వాడికి కొన్నివేల రూపాయలు ఖరీదు చేసే బాంకు నోటు ఒకటి దొరికింది. ఆశను అణుచుకోలేక వాడు దాన్ని మ్రింగివేశాడు. తరువాత ఏదో ఒక విధంగా తన యోగశక్తితో దానిని బయటకు తేవచ్చునని వాడి ఉద్దేశ్యం. ఆ కాగితం చక్కగానే బయటకు వచ్చింది కానీ వాణ్ణి మాత్రం మూడు సంవత్సరాలు జైలుకు పంపారు."

సిద్ధుల కోసం వెంపర్లాడడం తెలివితక్కువతనం!

## 145. వైరాగ్యం ముసుగులో ఆత్మవంచన పనికిరాదు (ఆధునిక జనక మహారాజులు!)

ఒకరోజు ఆధునిక విద్యను నేర్చిన ఒక పెద్దమనిషి గురుదేవులతో జనక మహారాజులాగా నిష్కళంకంగా వుండే గృహస్థులను గురించి చర్చిస్తున్నాడు. గురుదేవులు అతనితో, "ఈ రోజుల్లో మీ నిష్కళంకమైన గృహస్థులు – 'ఆధునిక జనక మహారాజులు' ఎలా ఉంటారో నాకు తెలుసు! అటువంటి వారి సంగతి చెపుతా విను!" అని ఈ క్రింది కథను చెప్పారు.

"ఎవరైనా ఒక బీద బ్రాహ్మణుడు ఇటువంటి నిష్కళంకమైన గృహస్థు దగ్గరకు వచ్చి డబ్బు అడిగితే, అతడు, 'అయ్యా! నేను డబ్బు తాకనండీ! ఎందుకు నన్ను అడిగి కాలం వృథా చేసుకుంటారు?' అంటాడు. కానీ ఆ బ్రాహ్మణుడు అంత సులభంగా వదిలిపెట్టే రకం కాదు. ఇంటి యజమాని అయిన ఆ గృహస్థు మళ్ళీ మళ్ళీ అడిగించుకుని, 'ఒక రూపాయి ఇద్దాం లే!' అనుకుని, 'సరే, రేపు రా! చూద్దాం!' అంటాడు. ఇంటి లోపలికి వెళ్ళి భార్యతో, 'చూడు! ఆ పేద బ్రాహ్మణుడు చాలా కష్టాలలో ఉన్నాడు. అతనికి ఒక రూపాయి ఇద్దాం!' అంటాడు. 'రూపాయి' అన్నమాట వినబడడంతోనే అతడి భార్య రౌద్రాకారంతో, 'ఆహా! మీరు ఎంత ఉదారహృదయులండీ! ఆలోచించకుండా పారవెయ్యడానికి రూపాయలేమన్నా ఎండుటాకులా, గడ్డిపోచలా?' అంటుంది. దానితో అతడు ఆమెను అనునయిస్తూ, 'ఆ బ్రాహ్మణుడు చాలా పేదవాడు. రూపాయికన్నా తక్కువ ఇస్తే బాగుండదు' అంటాడు. అప్పుడు అతని భార్య, 'కుదరదు! నేనంత ఇవ్వను. ఇదిగో, ఒక పావలా! దీన్ని ఇస్తే ఇవ్వండి, లేకపోతే లేదు!' అంటుంది. ఇక మన గృహస్థు జనక మహారాజు అంతటి నిష్కళంకమైన సంసారి కనుక ఆ పావలానే తీసుకుని మర్నాడు ఆ బ్రాహ్మణుడికి ఇచ్చి పంపిస్తాడు."

"చూశావా! కనుక మీ ఆధునిక జనకమహారాజులు నిజంగా స్వతంత్రులు కారు. వారి కుటుంబ విషయాలను వాళ్ళు చూడరు కనుక, మేము మంచివాళ్ళమనీ, ప్రాపంచిక వాసనలేమీ లేనివాళ్ళమనీ చెబుతుంటారు.

అటువంటి వారిని సగటు మానవులుగా కూడా పరిగణించలేం! నిజానికి వాళ్ళు పూర్తిగా భార్యావిధేయులు. భార్యల చేతుల్లో కీలుబొమ్మలు!"

## 146. సన్న్యాసి దిగజారితే..
## (భాగితేలి కథ)

"సన్న్యాసి కామినీ కాంచనాలకు లొంగిపోవడం ఎలా ఉంటుందో తెలుసా? ఒక బ్రాహ్మణ వితంతువు చాలా సంవత్సరాలు అన్నం, కూరలు, పాలువంటి సాత్త్వికమైన ఆహారం తిని, కఠోర బ్రహ్మచర్యదీక్షతో కాలం గడిపి, అకస్మాత్తుగా ఒకణ్ణి తన ప్రియుడిగా వలచినట్లు ఉంటుంది."

"మా ప్రాంతంలో 'భాగితేలి' అనే పేరున్న ఒక భక్తురాలు ఉండేది. ఆమెకు చాలామంది భక్తులు, శిష్యులు ఉండేవారు. ఆమెను జనం ఆ విధంగా గౌరవించడం చూసి ఆ ప్రాంతపు భూస్వామికి కన్నుకుట్టింది. ఆమె పేరును చెడగొట్టడానికి ఒకణ్ణి నియోగించాడు. ఆమె వాడి వలలో పడిపోయింది. ఆమె చేసిన ఆధ్యాత్మిక సాధన అంతా ఎందుకూ పనికి రాకుండా పోయింది. సన్న్యాసి దిగజారితే ఆ విధంగా ఉంటుంది."

## 147. కామాన్ని జయించే మార్గం
## (కార్తికేయుడు – పిల్లి)

ఒకసారి ఒకడు గురుదేవులను, "అయ్యా! మీరు మీ భార్యతో కలిసి సంసార ధర్మాన్ని ఎందుకు నిర్వర్తించలేదు?" అని ప్రశ్నించాడు. దానికి గురుదేవులు, "ఒక కథ చెపుతా విను!" అని ఈ క్రింది కథను చెప్పారు.

"కార్తికేయుడు ఒకసారి ఒక పిల్లిని గిల్లాడు. తరువాత అతడు తన తల్లి దగ్గరకు వెళ్ళినప్పుడు ఆమె బుగ్గపైన ఒక గాయం అతనికి కనిపించింది. కార్తికేయుడు, 'అమ్మా! నీ బుగ్గమీద ఎంత గాయమయిందో చూడు! అది ఎలా తగిలింది?' అని అడిగాడు. పార్వతీదేవి, "నువ్వే కదా, నాయనా! నన్ను గిల్లావు!" అని సమాధానం చెప్పింది. కార్తికేయుడు నివ్వెరపోయి, 'అమ్మా! నేను నిన్ను ఎప్పుడు గిల్లాను? నాకేం గుర్తులేదే!' అన్నాడు. పార్వతీదేవి, 'నాయనా! ఈ రోజు ఉదయం నువ్వు ఆ పిల్లిని గిల్లావు కదా! ఆ సంగతి మర్చిపోయావా?' అని అడిగింది. కార్తికేయుడు, 'అది నిజమే! మరి నేను పిల్లిని గిల్లితే, నీ బుగ్గమీద ఎందుకు గాయమైంది?' అని మళ్ళీ అడిగాడు. అప్పుడు ఆ జగజ్జనని, 'నాయనా! ఈ ప్రపంచంలో నేను కానిది వేరే ఏదీ లేదు. ఈ సృష్టి అంతా నేనే! అందువల్ల నువ్వు ఎవరిని గాయపరిచినా నన్ను గాయపరచినట్టే!' అని చెప్పింది. అది విని కార్తికేయుడు చాలా ఆశ్చర్యపోయాడు. జీవితంలో తానెప్పటికీ పెళ్ళి చేసుకోకూడదని

నిశ్చయించుకున్నాడు. అందరు స్త్రీలలోను తన తల్లి పార్వతి మూర్తీభవించి ఉంది కదా! ఇంక ఎవరిని పెళ్ళి చేసుకుంటాడు?" గురుదేవులు, "నేను కూడా కార్తికేయుడి లాగానే ఉంటున్నాను. ప్రతి స్త్రీని నేను ఆ జగన్మాతగానే భావిస్తాను" అని వివరించారు.

## 148. గురువుగా వ్యవహరించడం చాలా కష్టం (ఆమె ఎంత ఎదిగిపోయిందో!)

గిరీశచంద్ర ఘోషు మొదలైన భక్తులతో గురుదేవులు సంభాషిస్తున్నారు. "జనం సిద్ధుల్ని సంపాదించాలనీ, ఇతరులకు గురువులుగా వ్యవహరించాలనీ కోరుకుంటారు. కానీ గురువుగా వ్యవహరించడం చాలా కష్టం" అని వారితో ఈ క్రింది విషయాలను చెప్పారు.

"సిద్ధుల ద్వారా కొద్దిగా శక్తిని పొంది, వాటి ద్వారా కొందరు పేరుప్రతిష్ఠలను సంపాదిస్తారు. వాళ్ళలో చాలామంది గురువులుగా ఉండి, శిష్యులను, భక్తులనూ తయారుచేసుకోవాలని అనుకుంటారు. అటువంటి గురువును చూసి జనం, 'ఆహా! ఆయన పని చాలా బాగుంది! ఎంతమంది ఆయనను చూడడానికి వస్తున్నారు! ఆయనకు చాలామంది శిష్యులు, అనుచరులు కూడా ఉన్నారు. ఆయన ఇల్లు వస్తువులతో నిండిపోయి ఉంది! ప్రజలు ఆయనకు ఎన్నో బహుమతులు ఇస్తుంటారు. తలుచుకుంటే ఎంతమందికైనా భోజనం పెట్టగల శక్తి ఆయనకు ఉంది,' అని గొప్పగా చెప్పుకుంటారు."

"ఒక గురువు యొక్క వృత్తిని వ్యభిచారంతో పోల్చవచ్చు. అది తనను తాను అమ్ముకోవడమే! అటువంటి వస్తువులు, భౌతిక సుఖాలు, మొదలైన నీచమైన వాటికోసం దైవసాక్షాత్కారం పొందడానికి తోడ్పడే శరీరాన్ని, మనస్సును, ఆత్మను వ్యభిచరింపజేయటం మంచిది కాదు. కొందరు ఒక స్త్రీని గురించి ఈ విధంగా చెప్పుకుంటున్నారు. 'ఆహా! ఆమె పని ఇప్పుడు చాలా బాగుంది! ఆమె ఎంత ఎదిగిపోయిందో! మంచి ఇంటిని అద్దెకు తీసుకొని దానిలో పెద్దమంచం, పరుపులు, దిళ్ళు, ఇంకా ఇతర వస్తువులెన్నో ఏర్పాటు చేసుకుంది. ఎంతమంది ఆమె చెప్పుచేతలలో ఉన్నారో తెలుసా! వాళ్ళు ఎప్పుడూ ఆమె దగ్గరికి వస్తూనే ఉంటారు.' మరొకమాటలో చెప్పాలంటే, ఆమె ఇప్పుడు ఒక వేశ్యగా మారిందన్నమాట. అందుచేత ఆమె ఆనందానికి అంతులేదు. ఇంతకు ముందు ఆమె ఒక పెద్దమనిషి ఇంట్లో పనిమనిషిగా ఉండేది. గౌరవంగా బ్రతికేది. కానీ ఇప్పుడు ఆమె ఒక వేశ్య. అల్పసుఖాలకోసం తన జీవితాన్నే నాశనం చేసుకుంది."

గురువుగా వ్యవహరించదలుచుకున్నవాడు ఆడంబరాలకు, కామకాంచనాలకు దూరంగా ఉండాలి. అనవసరమైన బహుమతుల్ని అంగీకరించకూడదు. అప్పుడే ఎవరికీ లొంగిపోకుండా, ఆదర్శప్రాయమైన జీవితం గడిపి, నలుగురికీ మార్గదర్శకుడు కాగలుగుతాడు.

## 149. నటనే నిజమౌతుంది!

## (పిచ్చివానిలా నటన)

“అప్పుల ఊబిలో కూరుకుపోయి ఉన్న ఒక వ్యక్తి, అప్పులవాళ్ళ బారి నుంచి తప్పించుకోవడానికి పిచ్చివాడిలా నటించసాగాడు. వైద్యులు అతడి వ్యాధిని కుదర్చలేకపోయారు. చికిత్స చేస్తున్నకొద్దీ అతడి పిచ్చి ముదిరిపోసాగింది. చిట్టచివరకు ఒక తెలివైన వైద్యుడు అసలు నిజాన్ని కనిపెట్టగలిగాడు. పిచ్చివాడిలా నటిస్తున్న ఆ వ్యక్తిని ప్రక్కకు తీసుకువెళ్ళి మందలిస్తూ, ‘ఏమోయి! ఏమి చేస్తున్నావు? ఇదే విధంగా నువ్వు నటిస్తుంటే నిజంగానే పిచ్చివాడివైపోతావు తెలుసా! ఇప్పటికే నీలో కొన్ని పిచ్చిలక్షణాలు కనిపిస్తున్నాయి, జాగ్రత్త!’ అని హెచ్చరించాడు. ఈ తెలివైన సలహావల్ల అతడు తన తప్పు తెలుసుకొని అప్పటి నుంచి పిచ్చివాడిలా నటించడం మానివేశాడు.”

పై కథను చెప్పి, గురుదేవులు “నిరంతరం మనం దేన్ని గురించి ఆలోచిస్తామో, దానిలాగానే తయారవుతాము (యద్భావం తద్భవతి!)” అని హెచ్చరించారు.

## 150. చేసేవాడు దేవుడే!

## (నందీశ్వరుని పళ్ళు)

“ఒక పండితుడు పరమశివుడిపై ఒక స్తోత్రాన్ని రచించాడు. జనులు దాన్ని చదివి చాలా ప్రశంసించారు. ఆ పండితుడు తాను సాధించిన ఈ పనిని చూసుకొని గర్వంతో పొంగిపోయాడు. మరునాడు అతడు శివాలయానికి వెళ్ళి నమస్కారం చేస్తుండగా అక్కడ ఉన్న నంది తన పళ్ళను బయటపెట్టి చూపించాడు. ఆ దంతాలమీద ఈ పండితుడు వ్రాసిన స్తోత్రంలోని ప్రతిమాట వ్రాయబడివుంది. అది చూసి పండితుడు నిర్ఘాంతపోయాడు. అతని అహంకారం పటాపంచలయింది.”

ఈ కథను చెప్పి గురుదేవులు, “దీని అర్థం ఏమిటో తెలుసా? దేవుని మహిమలను తెలియజెప్పే ఆ స్తోత్రాలు అనాదిగా, ఏనాటినుంచో ఉన్నవే! పండితుడు వాటిని మళ్ళీ కనుక్కున్నాడు. అంతే! దీనిని బట్టి తెలిసేదేమిటంటే, దేవుడే అన్ని పనులూ చేసేవాడు! మనం ఆయన చేతిలో పనిముట్లు మాత్రమే.”

  

## 151. దైవమే జ్ఞానానికి తరగని పెన్నిధి
## (ధాన్యం వ్యాపారులు; రాధ – నీటి కుండ)

"దైవానుగ్రహం కలవారికి జ్ఞానానికి కొదువ ఏముంది? నన్ను చూడండి! నేనొక తెలివితక్కువ వాణ్ణి! నాకేమీ తెలియదు. అయితే ఈ మాటలన్నీ చెప్పేది ఎవరు? జ్ఞానపెన్నిధి అయిన భగవంతుడే!" అని శ్రీరామకృష్ణులు ఈ క్రింది కథను చెప్పారు.

"కామార్పుకూరులో ధాన్యం వ్యాపారులుండేవారు. ధాన్యం అమ్మేటప్పుడు, ఒకడు ధాన్యాన్ని తూచేవాడు. మరొకడు ధాన్యపురాశి నుంచి ధాన్యాన్ని తూకం వేసేవాడి చేతికి అందేలాగా తోస్తూ ఉండేవాడు. తూకం వేసేవాడి చేతి కింద ధాన్యం తరగకుండా పెద్దరాశి నుంచి తోస్తూ వుండడమే వాడి పని. నా మాటలు కూడా అంతే! అవి తరిగిపోతున్నాయని అనిపించగానే దివ్యజనని తన పెన్నిధి నుంచి నాకు మరిన్ని అందిస్తుంది."

ఇంకా దీనిని వివరిస్తూ శ్రీరామకృష్ణులు మరొక కథ చెప్పారు. "ఒకసారి రాధ తన పవిత్రతను నిరూపించుకోవడానికి తన తలపై నీటితో నిండిన కుండను మోసుకుంటూ బయలుదేరింది. ఆ కుండకు వెయ్యి రంధ్రాలు ఉన్నాయి. కానీ ఒక్క నీటిచుక్క కూడా క్రింద పడలేదు. అది చూసిన జనం, 'ఆహా! రాధ ఎంత పతివ్రత! అటువంటి స్త్రీ ఈ ప్రపంచంలో మరొకరు లేరు' అన్నారు. అప్పుడు రాధ వారితో, 'మీరు నన్నెందుకు పొగుడుతారు? నేను శ్రీకృష్ణుడి పాదదాసిని మాత్రమే. "జయకృష్ణ, జయకృష్ణ" అని ఆయననే కీర్తించండి!' అని చెప్పింది. ఈ కథను వివరిస్తూ గురుదేవులు, "నాకేమీ తెలియదు. అయితే నాచేత ఇవన్నీ చెప్పిస్తున్నది ఎవరు? ఆ దివ్య జననియే! మనం ఆమె చేతిలో పనిముట్లు మాత్రమే," అన్నారు.

## 152. నిజమైన వినయము ఎలా ఉంటుంది?
## (సాధకుడు – మలము)

ఒక సాధకుడు ఒక సాధువు దగ్గరకు వెళ్ళి అతివినయాన్ని కనబరుస్తూ, 'నేను పరమ నీచుణ్ణి! నన్ను దరిజేర్చే మార్గాన్ని చెప్పండి, స్వామీ!" అన్నాడు. ఆ సాధువు ఇతడి హృదయాన్ని కనిపెట్టి, "పోయి నీకన్నా నీచమైన వస్తువును ఒకదాన్ని తీసుకు రా" అన్నాడు. ఆ సాధకుడు పోయి అన్నిచోట్లా చూచాడు. కానీ ప్రపంచంలో ఏదీ తనకన్నా నీచమైనదిగా అతడికి తోచలేదు. చివరికి తానే విసర్జించిన మలాన్ని చూసి, "నాకన్నా నీచమైన పదార్థం ఇదే. ఇంకొకటి ఉండడానికి వీల్లేదు" అనుకున్నాడు. ఆ సాధువుకు చూపించడానికి తీసుకుందామని దానిని తీయబోయేసరికి, అది మాట్లాడడం మొదలుపెట్టి, "ఓరీ

పాపాత్ముడా! నన్ను తాకకు! నేనింతకు ముందు మధురమైన రుచితో అందరికీ నోరూరించే మిఠాయిని! దేవతలకు నైవేద్యంగా పెట్టదగినదాన్ని. నా అదృష్టం బాగా లేక నీ చేతిలోపడి, నీ పొందువల్ల ఇటువంటి నీచస్థితికి దిగజారాను. జనం ఇప్పుడు నన్ను చూసి ముక్కు మూసుకుని పారిపోతున్నారు. ఒక్కసారి నువ్వు నన్ను తాకితేనే నాకు ఇటువంటి గతి పట్టింది. నువ్వు ఇంకొకసారి తాకితే నా గతి ఏమవుతుందో, ఇంకా ఎటువంటి హీనమైన స్థితి కలుగుతుందో తెలియదు. నన్ను తాకకు ఫో!" అని సాధకుణ్ణి చీవాట్లు పెట్టింది. ఈ మాటలు విని ఆ సాధకుడు నిర్ఘాంతపోయాడు. నిజమైన వినయమంటే ఏమిటో తెలుసుకున్నాడు. గొప్ప వినయశీలుడిగా మారాడు. కాలక్రమేణా అత్యున్నతస్థితులకు ఎదిగాడు. నిజమైన వినయం కలవారికి ప్రపంచంలో ఏదీ తనకన్నా హీనమైనదిగా కనిపించదు. తనలోని అహంభావమే అన్నింటికన్నా హీనమైనదని తెలుసుకున్నవాడికే ఆధ్యాత్మిక పురోభివృద్ధి సాధ్యమవుతుంది.

## 153. పరమత ద్వేషం పనికి రాదు (ఘంటాకర్ణుడు)

"ఘంటాకర్ణుడిలాగా పరమత ద్వేషం కలిగి ఉండకండి!" అంటూ గురుదేవులు ఈ క్రింది కథను చెప్పారు. "ఒక ఊరిలో ఒక శివభక్తుడు ఉండేవాడు. కానీ అతడు ఇతర దేవతలనందరినీ ద్వేషించేవాడు. ఒకరోజు అతనికి శివుడు ప్రత్యక్షమై, 'నాయనా! నువ్వు ఇతర దేవతలను ద్వేషిస్తే నాకు సంతోషం కలగదు' అని చెప్పాడు. అయినా అతనిలో మార్పు రాలేదు.

కొన్నాళ్ళ తరువాత శివుడు మళ్ళీ ప్రత్యక్షమయ్యాడు. ఈసారి ఆయన హరిహరరూపంలో దర్శనమిచ్చాడు. అయితే ఈ భక్తునికి అది సగం సంతోషాన్ని, సగం దుఃఖాన్ని కలిగించింది. శివునిరూపం ఉన్న వైపే నైవేద్యాన్ని అర్పించి, విష్ణురూపం ఉన్నవైపు ఏమీ అర్పించలేదు. తన ఇష్టదైవం అయిన శివరూపానికి ధూపం అర్పించినపుడు, విష్ణువు దానిని వాసన చూస్తాడేమోనని, ఆయన ముక్కు మూసి పట్టుకున్నాడు. అప్పుడు శివుడు, 'ఓరీ! నీ ద్వేషం పోగొట్టడం ఎవరి తరం? దేవుళ్ళందరూ ఒకటే అన్న సత్యం నీకు బోధించడానికే నేను ఈ రూపం ధరించాను. దీనినుంచి కూడా నువ్వు ఎటువంటి పాఠం నేర్చుకోలేదు. నీ ద్వేషానికి తగిన ఫలితాన్ని అనుభవిస్తావు. దీని ఫలితాన్ని నువ్వు చాలా కాలం అనుభవించవలసి ఉంటుంది కూడా!' అని శపించి మాయమయ్యాడు. ఆ భక్తుడు అక్కడనుండి వెళ్ళిపోయి వేరొక గ్రామంలో స్థిరపడ్డాడు. త్వరలోనే అతడొక గొప్ప విష్ణుద్వేషిగా పేరు తెచ్చుకున్నాడు. అతనిలోని ఈ బలహీనతను గమనించి గ్రామంలోని పిల్లలు అతనిని ఏడిపించడానికి, అతనికి వినబడేటట్టుగా, 'విష్ణు!

విష్ణు!' అని కేకలు పెట్టేవారు. దీంతో విసిగిపోయి అతడు తన రెండు చెవులకు రెండు గంటలు కట్టుకున్నాడు. పిల్లలు 'విష్ణు' అని అరచినప్పుడల్లా ఆ గంటల్ని జోరుగా వాయించి విష్ణునామం తన చెవులలో పడకుండా చేసుకునేవాడు. ఆ విధంగా అతడు ఘంటాకర్ణుడనే పేరు తెచ్చుకున్నాడు.

## 154. దేవుడు నవ్వుతాడు!

## (వైద్యుడి అభయం; ఇద్దరు అన్నదమ్ములు)

దేవుడు రెండు సందర్భాలలో నవ్వుతాడు. వైద్యుడు ఒక రోగి తల్లితో, "భయపడకమ్మా! తప్పకుండా మీ కొడుకు వ్యాధిని నేను నయం చేస్తాను!" అన్నప్పుడు దేవుడు నవ్వుకుంటూ, "నేను అతని ప్రాణాలను కొన్ని క్షణాల్లో తీసివేయబోతున్నాను! ఇతడేమో అతణ్ణి రక్షిస్తాను అంటున్నాడు!" అని తనలో తాను అనుకుంటాడు. భగవంతుడే అన్నీ చేసేవాడని మర్చిపోయి ఆ వైద్యుడు తానే సర్వశక్తిమంతుణ్ణని అనుకుంటాడు.

దేవుడు మరొక సందర్భంలో నవ్వుతాడు. ఇద్దరు అన్నదమ్ములు భూమిని ఒక తాడుతో విభజించి, "ఈ వైపు భూమి నాది! ఆ వైపు భూమి నీది!" అనుకుంటున్నప్పుడు భగవంతుడు మళ్ళీ నవ్వుతాడు. "ఈ విశ్వమంతా నాది! కానీ, వాళ్ళు 'ఇది నా భాగం, అది నీ భాగం' అనుకుంటున్నారే!" అని తనలో తాను నవ్వుకుంటాడు.



## 155. కూడబెట్టేది ఒకడు – కొల్లగొట్టేది మరొకడు (తేనెటీగ – బాటసారి)

అవధూత ఒకసారి తేనెటీగను చూశాడు. తేనెటీగ ఎంతో కష్టంతో, చాలాకాలం శ్రమించి, తేనెను కూడబెట్టింది. ఇంతలో ఒక మనిషి ఎక్కడి నుండో వచ్చి, ఆ తేనెపట్టును పడగొట్టి, తేనె త్రాగి వెళ్ళిపోయాడు. ఆ తేనెటీగకు తన కష్టఫలాన్ని అనుభవించే అదృష్టం లేదు. ఇదిచూసి అవధూత ఆ తేనెటీగకు నమస్కరిస్తూ 'నీవే నా గురువు! కూడబెట్టిన సంపదలకు ఏ గతి పడుతుందో, నిన్ను చూసి నేర్చుకున్నాను' అన్నాడు.

## 156. అద్వైతాన్ని అపార్థం చేసుకోకూడదు (మూర్ఖుడైన రాజు – గురువు)

ఒక రాజుకు అతని గురువు అద్వైతసారాన్ని బోధించాడు. అద్వైత వేదాంత ప్రకారం, 'ఈ విశ్వమంతా బ్రహ్మమే! వేరొకటి కాదు.' ఈ సిద్ధాంతం రాజుగారికి చాలా నచ్చింది. అతడు రాణి దగ్గరకు వెళ్ళి, "నీకు, నీ పరిచారికకు ఏమీ తేడా లేదు. కాబట్టి ఈ రోజునుంచి నీ పరిచారిక నా రాణి అవుతుంది" అని చెప్పాడు. రాజుగారి పిచ్చిమాటలు విని రాణికి తలమీద పిడుగుపడినట్టు అయింది. ఆమె గురువుగారికి కబురుపెట్టి పిలిపించింది. ఆయనతో రాజుగారి మాటలను వివరించి. "అయ్యా! మీ బోధనలు ఎలా పరిణమించాయో చూశారా!" అని జాలిగా మొరపెట్టుకుంది. గురువు ఆమెను ఓదార్చి, "అమ్మా! ఈ రోజు రాత్రి భోజనంలో రాజుగారికి ఆవుపేడను వడ్డించండి" అని సలహా ఇచ్చాడు.

రాత్రి రాజుగారు, గురువుగారు భోజనానికి కూర్చున్నారు. తన కంచంలో అన్నంతో పాటు ఆవుపేడ కనిపించేసరికి రాజు మండిపడ్డాడు. గురువుగారు ఇది చూసి, శాంతంగా, "ఓ మహారాజా! మీరు అద్వైత జ్ఞానాన్ని పొందినవారు కదా! ఆవుపేడకి, అన్నానికి మధ్య తేడా చూస్తున్నారెందుకు?' అని ప్రశ్నించాడు. రాజు కోపం పట్టలేక, 'గొప్ప అద్వైత వేదాంతినని మీరు కూడా గొప్పలు చెపుతారు కదా! చేతనైతే తిని చూపించండి!' అన్నాడు. గురువు గారు, 'మంచిది, ఇలా చూడు!' అని, వెంటనే ఒక పందిగా మారిపోయి, ఆ పేడను లొట్టలు వేస్తూ తిని, మళ్ళీ మానవ రూపంలోకి మారాడు. ఇది చూసి రాజు చాలా సిగ్గుపడ్డాడు. మళ్ళీ ఎప్పుడూ రాణితో అటువంటి పిచ్చి ప్రతిపాదనలు చెయ్యలేదు."

"అద్వైతభావంతో ఉంటాననే వాడు అన్నింటినీ ఒకే భావంతో చూడగలగాలి; సమదర్శిత్వమనే ఆ పరిస్థితిని చేరుకోనంతవరకూ విచక్షణ చూపడం తప్పనిసరి!"





# 157. భవిష్యత్తుని దృష్టిలో ఉంచుకో!
# (మేకపిల్ల - తంగేడు పూలు)

ఒక మేకపిల్ల జూన్ నెలలో తన తల్లి మేక దగ్గర గంతులు వేస్తూ ఆడుకుంటూ ఉంది. ఆ ప్రక్కనే తంగేడు పొదలు ఉన్నాయి. అవి నవంబరు నెలలో 'రాసలీల' పండగ సమయానికి నిండుగా మొగ్గలు తొడిగి పూలు పూస్తాయి. మేకలు వాటిని ఇష్టంగా తింటాయి. ఈ మేకపిల్ల గంతులు వేస్తూ, తల్లితో, "అమ్మా! నేను తంగేడు పూలు తింటానమ్మా" అంది. అది విని తల్లిమేక ఇలా చెప్పింది: "మంచిది! కానీ ఆ పని నువ్వు అనుకుంటున్నంత సులభం కాదు. ఆ పూలను తినడానికి ముందు నువ్వు చాలా అపాయాలను దాటిపోవాలి. వచ్చే సెప్టెంబరు, అక్టోబరు నెలలు నీకు అంత మంచివి కాదు. ఆ నెలలలో దుర్గాదేవికి బలి ఇవ్వడానికి నిన్ను ఎవరో ఒకరు తీసుకుపోవచ్చు. ఆ తరువాత భయంకరమైన కాళీపూజ పండగ వస్తుంది. ఆ పూజకు మన జాతిలోని మగజంతువులన్నీ బలి అయిపోతాయి. ఈ గండాలన్నీ గట్టెక్కి పెరిగి పెద్దదానివయితే నవంబరు నెలకు నువ్వు ఆ పూలను తినగలుగుతావు."

యవ్వనంలో మన మనస్సులు ఎన్నో కోరికలను కలిగి ఉంటాయి. అయితే మనం వాటన్నిటినీ తీర్చుకోవాలని ప్రయత్నించకూడదు. రాబోయే జీవితంలో రకరకాల గండాలు అడుగడుగునా ఎదురవుతాయని గుర్తుంచుకొని గొంతెమ్మ కోరికలు సాధ్యమయినంత వరకు తగ్గించుకోవాలి.



## 158. ప్రాపంచికులకు దూరంగా ఉండాలి
## (దివ్యావేశం పొందిన జాలరులు)

"ఒకసారి శ్రీగౌరాంగుడు (చైతన్య మహాప్రభువు) భావసమాధిస్థితిలో ఉండగా సముద్రంలో పడిపోయారు. కొందరు జాలరులు తమ చేపల వలలో ఆయన చిక్కుకోవడం చూసి పైకిలాగి రక్షించారు. అయితే ఆయనను తాకడం చేత వారందరికీ కూడా దివ్యావేశం కలిగింది. వాళ్ళు పనిపాటలు మానివేసి హరినామ స్మరణ చేస్తూ, పిచ్చిపట్టినట్లు తిరగడం ప్రారంభించారు. వాళ్ళ బంధువులకు ఈ పిచ్చిని వదిలించడం సాధ్యం కాలేదు. మరోదారి తోచక వాళ్ళు గౌరాంగుడి దగ్గరకు వెళ్ళి తమ బాధలను ఆయనతో మొరపెట్టుకున్నారు. గౌరాంగుడు వారిని చూసి జాలిపడి, 'పూజారుల ఇంట్లో నుండి కొంచెం అన్నం తెచ్చి వాళ్ళ నోళ్ళలో పెట్టండి. మామూలు మనుష్యులవుతారు' అని చెప్పారు. వాళ్ళు ఆ విధంగా చెయ్య గానే ఆ జాలరులు మామూలు మనుష్యులయ్యారు." పూజారుల ప్రాపంచికతను వివరించడానికి శ్రీ రామకృష్ణులు తరచూ పై కథను చెపుతూ ఉండేవారు.

## 159. దానంలో విచక్షణ అవసరం
## (కసాయివాడు - ధర్మసత్రం)

"ఒకసారి ఒక కసాయివాడు దూరప్రాంతంలో ఉన్న కబేళాకు ఒక ఆవును తోలుకుని పోతున్నాడు. అయితే కసాయివాడు ఎక్కువగా కొడుతూ ఉండేసరికి ఆ ఆవు అతని మాట వినకుండా ఇష్టం వచ్చినట్లు పరిగెత్తసాగింది. దానిని తోలడం వాడికి శక్తికి మించిన పని అయింది. కొన్ని గంటల తరువాత వాడు ఎలాగో ఆ ఆవుతో ఒక గ్రామానికి చేరాడు. బాగా అలిసిపోయి ఉండడంతో అక్కడ ఒక ధర్మసత్రంలోకి వెళ్ళి వాళ్ళు పెట్టిన భోజనం తిని, సేదతీరి రెట్టించిన ఉత్సాహంతో ఆ ఆవును కబేళాకు తోలుకుని పోయాడు. అయితే ఆ ఆవును చంపిన పాపంలో కొంత భాగం ధర్మసత్రంలో అన్నదానం చేసినవాడికి చుట్టుకుంది. కాబట్టి దానం చేసేవాడు, ఆ దానం తీసుకునేవాడు ఎటువంటివాడో గమనించి దానం చేయాలి. ఆ తీసుకునేవాడు దుర్మార్గుడు కానీ, పాపి కానీ అయివుండి, పట్టిన దానాల్ని చెడ్డపనులకు ఉపయోగిస్తే దానం చేసినవాడు ఆ పాపంలో కొంతభాగాన్ని పొందవలసి వస్తుంది."

ఫలానా పనివల్ల పాపం చుట్టుకుంటుందని చెప్పడం ఈ కథలోని ఉద్దేశ్యం కాదు. మన నుంచి సహాయం పొందేవాడి స్వభావం సరైనది కాక వాడు అ సహాయాన్ని దుర్వినియోగం చేస్తే దానిలో మనకు కూడా వాటా తప్పక వస్తుందని చెప్పడమే ఈ కథలోని ఉద్దేశ్యం. అందుకే అపాత్రదానం పనికిరాదని చెపుతారు.

## 160. ఒక యజమానికే సేవచెయ్యి!
## (శీలవంతుడైన ముసల్మాను)

ఆధార్‌లాల్ సేన్ డిప్యూటీ మేజిస్ట్రేట్‌గా పనిచేస్తున్నాడు. నెలకు మూడు వందల రూపాయల జీతం సంపాదిస్తున్నాడు (ఆ రోజుల్లో, అంటే దాదాపు 125 సంవత్సరాల క్రితం, అది చాలా ఎక్కువ). అయితే అతడు దానితో తృప్తి పడకుండా కలకత్తా మునిసిపాలిటీలో ఉపాధ్యక్షపదవి కావాలనుకున్నాడు. ఆ పదవికి జీతం వెయ్యి రూపాయలు. ఆ పదవిని పొందడానికి ఆధార్ చాలామంది చేత సిఫార్సు చేయించాడు. ఈ విషయాన్ని అతనితో చర్చిస్తూ గురుదేవులు ఈ కథను చెప్పారు. "ఇప్పుడు ఎవరి క్రింద పని చేస్తున్నావో ఆ యజమానికే సేవ చెయ్యి! ఒకరికన్నా ఎక్కువమందికి సేవచేస్తే మనస్సు కలుషితమయి పోతుంది. అయిదుగురికి సేవ చేస్తే ఏమవుతుందో ఎవరికి తెలుసు!"

"ఒక స్త్రీ ఒక ముసల్మానును చూసి మనసు పడింది. అతణ్ణి తన ఇంటికి ఆహ్వానించింది. అయితే ఆ ముసల్మాను శీలవంతుడు. అతడు ఆమెతో, తాను మరుగుదొడ్డికి వెళ్ళాలనీ, అందుకోసం తన నీళ్ళచెంబుని ఇంటి దగ్గరనుంచి తెచ్చుకోవాలనీ చెప్పాడు. అప్పుడు ఆ స్త్రీ అతనితో తన నీళ్ళచెంబు ఇస్తాననీ, వాడుకోమనీ చెప్పింది. కానీ ఆ ముసల్మాను, 'అలా కుదరదు! నేను ఇంతకు ముందు నుంచీ వాడుతున్న చెంబునే వాడతాను. కొత్తచెంబును వాడడం నాకు ఎంత మాత్రం ఇష్టం లేదు' అని వెళ్ళిపోయాడు. దానితో ఆ స్త్రీకి కళ్ళు తెరుచు కున్నాయి. కొత్త చెంబు అంటే తన విషయంలో ప్రియుడు అని ఆమె అర్థం చేసుకుంది."

## 161. బద్ధజీవుల తీరుతెన్నులు
## (మరణశయ్య మీది పిసినారి - నూనె దీపం)

బద్ధజీవులు కామకాంచనాలతోనే సుఖం కలుగుతుందని భావిస్తారు. ఒక బద్ధజీవుడైన పిసినారి మరణించడానికి సిద్ధంగా ఉంటే, మరొక బద్ధజీవురాలైన అతడి సహధర్మచారిణి, 'నీవు పోనేపోతున్నావు! నాకేమి దాచిపెట్టావు?' అని ఎత్తిపొడుస్తుంది. అటువంటివాళ్ళు ఎంత మాయలో ఉంటారంటే, ఇంకొక క్షణంలో ప్రాణం పోయేలా ఉన్నప్పుడు కూడా భగవంతుణ్ణి తలచుకోకుండా, 'దీపం వత్తి పెద్దమంటతో వెలుగుతూ ఉంది! బోలెడు నూనె తగలేస్తున్నారు. కొంచెం వత్తి తగ్గించండి!' అని కేకలు పెడతారు."

బద్ధులైన జీవులు ఈశ్వర చింతన చేయరు. సమయం దొరికితే పుక్కిటి పురాణాలతో కాలక్షేపం చేస్తారు. లేకపోతే నిష్ప్రయోజకమైన పనులు చేస్తూ ఉంటారు. 'ఏమి చెయ్యమంటారు? ఊరకే కూర్చోలేను! అందుకని కంచె

కడుతున్నాను!' అంటారు. యాభైయ్యవపడిలో పడిన తర్వాత బహుశా చీట్లపేకతో ఆట మొదలుపెడతారు.

## 162. ఎదుటివారికి అర్థమయ్యే భాషనే మాట్లాడాలి (మంగలి - పెద్ద మనిషి)

ఒకసారి శ్రీ రామకృష్ణులు బంకించంద్ర ఛటర్జీతో, ఆయన స్నేహితులతో మాట్లాడుతున్నారు. గురుదేవులు కొంత సంభాషించిన తరువాత బంకించంద్ర తన స్నేహితులతో ఇంగ్లీషులో గుసగుసలాడసాగాడు. గురుదేవులు వారితో, "మీరేమి మాట్లాడుతున్నారు?" అని ప్రశ్నించారు. బంకించంద్ర గురుదేవులతో, "మీరు చెప్పినదేనండీ! కృష్ణుడి రూపాన్ని గురించి మీరు చెప్పిన దానినే చర్చిస్తున్నాం" అని చెప్పాడు. అప్పుడు గురుదేవులు వారితో ఇలా అన్నారు. "దీన్ని చూస్తే నాకొక హాస్యకథ గుర్తుకు వస్తోంది. నాకు నవ్వు వస్తోంది కూడా! ఒకసారి ఒక మంగలి ఒక ఇంగ్లీషు భాష తెలిసిన పెద్దమనిషికి గడ్డం గీస్తున్నాడు. అప్పుడు అతని గడ్డం కొద్దిగా తెగింది. ఆ పెద్దమనిషి బాధతో, 'డామ్!' అన్నాడు. (డామ్ అనే మాటకు ఇంగ్లీషులో నరకం, అధోగతి మొదలైన అర్థాలు ఉన్నాయి.) కానీ ఆ మంగలికి ఈ మాటకు అర్థం తెలియదు. ఆయన తన్నేదో తిట్టాడనుకున్నాడు. దీని సంగతి ఏమిటో ఇప్పుడే తేలాలనుకున్నాడు.

తన మంగలి పొదిని ప్రక్కన పెట్టి, అది చలికాలమైనా లెక్క చెయ్యకుండా, చొక్కా చేతులు పైకి మడిచి, ఆ పెద్దమనిషితో, "నువ్వు నన్ను 'డామ్' అన్నావు! ఇప్పుడు ఆ మాటకు అర్థం ఏమిటో చెప్పు!" అన్నాడు. ఆ పెద్దమనిషి, "ఏమీలేదు లేవయ్యా! నువ్వు నీ పని చెయ్యి, చాలు!" అన్నాడు. అయితే ఆ మంగలి అంత సులభంగా వదిలేవాడు కాదు. వాడు కోపంగా, "ఏదో మాట్లాడి, ఏమీ లేదులే అంటే సరిపోతుందా? అదే గనక మంచి మాటయితే నేను 'డామ్', మా నాన్న డామ్, మా పెద్దవాళ్ళందరూ డామ్‌లే! అదే గనక చెడ్డమాట అయితే నువ్వు 'డామ్', మీ నాన్న 'డామ్', మీ తాత 'డామ్', వాళ్ళ పై తరాల వాళ్ళందరూ కూడా 'డామ్'లే! వాళ్ళు వట్టి 'డామ్'లే కాదు! 'డామ్-డామ్-డామ్-డా-డా-డామ్'లు!" అని కేకలు పెట్టాడు.

ఈ కథ విని అక్కడ ఉన్నవారందరూ బిగ్గరగా నవ్వారు. చాలామంది ఒకచోట చేరి మాట్లాడుతున్నప్పుడు వారందరికీ అర్థమయ్యే భాషనే మాట్లాడాలి కానీ వారికి తెలియని భాషను మాట్లాడకూడదు. అందరికీ అర్థమయ్యేలా మాట్లాడడం కనీసమర్యాద అని మనం గుర్తించాలి.



# పూర్వజన్మ సంస్కారాలు

## 163. పూర్వజన్మ సంస్కారాల ప్రభావం

## (రాజకుమారుడు; మట్టికుండలు – కాలినవి, కాలనివి)

ఒకసారి దక్షిణేశ్వరంలోని శ్రీరామకృష్ణుల గదిలోకి కొంతమంది యువకులు వచ్చారు. అప్పుడు సమయం సాయంత్రం నాలుగు గంటలు. వాళ్ళంతా గురుదేవులకు నమస్కరించి కూర్చున్న తరువాత వారిలో ఒకడు గురుదేవులను, “స్వామీ, జ్ఞానమంటే ఏమిటండీ?” అని ప్రశ్నించాడు. గురుదేవులు: “భగవంతుడొక్కడే సత్యం, మిగిలినదంతా మిథ్య (బ్రహ్మ సత్యం జగన్మిథ్యా) అని తెలుసుకోవడమే జ్ఞానం!”

యువకుడు: “ప్రపంచం ఒక భ్రాంతిలా, లేకపోతే ఒక గారడీలా అసత్యమైనదయితే, దాని నుండి మనం ఎందుకు తప్పించుకోలేమండీ?”

గురుదేవులు: “ఇది పూర్వజన్మలలో సంపాదించుకున్న సంస్కారాలను బట్టి కలుగుతుంది. మాయామయమైన జగత్తులో మళ్ళీమళ్ళీ పుట్టడంవల్ల, మాయయే సత్యమని అనిపిస్తుంది. పూర్వజన్మ సంస్కారాలు ఎంత బలమైనవో చెపుతాను వినండి!”

“ఒక రాజకుమారుడున్నాడు. పూర్వజన్మలో వాడొక చాకలివాడు. బండల మీద బట్టలు ఉతకడమే వాడి పని. అందువల్ల ఆ సంస్కారం అతడిలో జీర్ణించుకొని పోయింది. అయితే ఆ జన్మలో వాడు చేసిన పుణ్యఫలితంగా మరుజన్మలో ఒక రాజకుమారుడై పుట్టాడు. ఒకరోజు ఆ రాజకుమారుడు స్నేహితులతో ఆడుకుంటూ, వాళ్ళను పిలిచి, ‘మీరు ఆడుతున్న వెధవ ఆటలు మానండిరా! ఈ రోజు మీకో కొత్త ఆట నేర్పుతాను చూడండి! నేను నేలమీద బోర్లా పడుకుంటాను. చాకలివాళ్ళు ఉతికినట్లుగా నా వీపు మీద ఈలలు వేస్తూ మీరు బట్టలు ఉతకండి’ అని చెప్పాడు!”

ఇలా చెప్పి గురుదేవులు ఆ యువకునితో, “ఇక్కడికి చాలామంది యువకులు వస్తుంటారు. కాని వాళ్ళలో కొంతమంది మాత్రమే భగవంతుని కోసం తాపత్రయపడతారు. పెళ్ళి అనే మాట వింటేనే అదిరిపడతారు. ఇదంతా పూర్వజన్మ సంస్కారాన్ని బట్టి వస్తుంది. అయితే మిగిలినవాళ్ళు డబ్బు కావాలని, ఇళ్ళు, వస్తువాహనాలు ఏర్పరుచుకోవాలని, చివరకు పెళ్ళి చేసుకోవాలని ఆరాటపడతారు. తగిన సంబంధం కోసం ఎన్నోచోట్ల విచారిస్తారు. పిల్ల అందంగా ఉందా, లేదా అని చూడడానికి వాళ్ళే స్వయంగా బయలుదేరి వెళతారు” అని సంస్కారాల ప్రాబల్యాన్ని గురించి ఆ యువకులకు విశదీకరించారు.

ఎంతవరకూ జ్ఞానోదయం (భగవత్సాక్షాత్కారం) కలుగదో అంతవరకూ పునర్జన్మలు కలుగుతూనే ఉంటాయి. కానీ జ్ఞానం కలిగిన తర్వాత ఈ ప్రపంచం లోనికి రానవసరం లేదు. ఈ విషయాన్ని వివరిస్తూ గురుదేవులు ఇలా చెప్పారు.

"కుమ్మరివాళ్ళు కుండలు ఎండబెడతారు. వాటిలో కాలినవి, కాలనివి కూడా ఉంటాయి. ఒక్కొక్కసారి ఏ జంతువులైనా ఆ కుండల్ని తొక్కి పగలగొడితే కాలిన కుండల పెంకుల్ని ఎత్తి అవతల పారబోస్తారు. అవి ఇక పనికిరావు. కానీ పచ్చి కుండలు పగిలిపోతే వాటి ముక్కల్ని మళ్ళీ ఏరి, తడిపి, ముద్దచేసి మళ్ళీ కుండలు తయారుచేయడానికి వాడతారు. అంటే జ్ఞానాగ్నిలో కాలిన శరీరం కాలిన కుండలాగా మరలా పునర్జన్మను పొందదు. కానీ జ్ఞానం కలుగని వాడు, 'మళ్ళీమళ్ళీ కుమ్మరివాడి చేతిలోపడి పునర్జన్మను పొందవలసిందే!' " అని గురుదేవులు వివరించారు.

## 164. సంస్కారాలను బట్టే పునర్జన్మలు కలుగుతాయి (విప్రవినోది - జడసమాధి)

"ఒక విప్రవినోది (గారడీ చేసేవాడు) రాజుగారి ఆస్థానానికి వచ్చి కొన్ని వినోదాలు చూపడం ప్రారంభించాడు. రాజుగారి మెప్పుపొంది ఆయనవద్ద నుండి మంచి బహుమతులు పొందాలని వాడి ఉద్దేశ్యం. వాడు వినోదాలు చేస్తున్నట్లే చేస్తూ మధ్యమధ్యలో, 'యక్షిణీ రావే! శాంభవీ రావే! రాజా నాకు డబ్బు ఇవ్వు! రాజా నాకు దుస్తులివ్వు!' అని అరుస్తున్నాడు. అకస్మాత్తుగా వాడి నాలుక అంగిలిలో చిక్కుకుపోయి కుంభకం ఏర్పడడంవల్ల వాడికి స్పృహ తప్పింది. కూర్చున్నవాడు కూర్చున్నట్లే ఉండిపోయాడు. ఎంతసేపటికీ శరీరస్మృతి రాలేదు. వాడు చనిపోయాడని నిర్ధారణ చేసుకొని రాళ్ళతో ఒక సమాధిని నిర్మించి దానిలో వాడి శరీరాన్ని ఉంచారు. వెయ్యి సంవత్సరాలు గడిచిపోయాయి. కాలక్రమేణా ఆ ప్రాంతమంతా చెట్టుచేమలతో నిండిపోయింది. ఆ ప్రాంతంలో నివసించే వాళ్ళు వ్యవసాయానికో, మరే పనికో అక్కడ తవ్వుతుండగా వారికి ఈ గోరీ (సమాధి) కనిపించింది. దానిలోనికి చూడగా ఈ విప్రవినోది జడసమాధిలో అలాగే కూర్చొనివున్నాడు. అతడెవరో మహాపురుషుడని అక్కడి వాళ్ళంతా అతడికి పూజాపురస్కారాలు చెయ్యడం మొదలుపెట్టారు. ఆ సమయంలో అతడి శరీరం కదిలి అకస్మాత్తుగా అతడి నాలుక అంగిలిలో నుండి యథాస్థానంలోకి వచ్చి అతడి కుంభకం పోయింది. బాహ్యస్థితి కలిగి మామూలు మనిషి అయ్యాడు. తక్షణమే వాడు, 'యక్షిణీ రావే! శాంభవీ రావే! రాజా నాకు డబ్బు ఇవ్వు! దుస్తులివ్వు!' అని అరవసాగాడు." అదే విధంగా మనిషి మరణసమయంలో ఏ సంస్కారాలను కూడగట్టుకుని మరణిస్తాడో వాటితోనే తిరిగి జన్మిస్తాడు.

ఈ కథను గురుదేవులు శశిధర పండితుడికి చెప్పి సంస్కారాల ప్రభావాన్ని వివరిస్తూ ఇలా అన్నారు. "సాధన కాలంలో ఏ కోర్కెలుంటాయో అవే చివరకు ఫలిస్తాయి. ఏది కోరితే అదే వస్తుంది. భగవంతుడు కల్పవృక్షంవంటి వాడు కాబట్టి మనం కోరిన దానినే ఇస్తాడు" అని అన్నారు.

## 165. తప్పించుకోలేనివి
## (కాలువీర్; ఖుల్లానా; దేవకీ దేవి)

ఒకరోజు శ్రీరామకృష్ణులు, శ్రీరామకృష్ణ కథామృత రచయిత అయిన మహేంద్రనాథ్ గుప్తతో తన గదిలో కూర్చుని మాట్లాడుతున్నారు. అంతలో కొందరు భక్తులు వచ్చారు. వాళ్ళలో ఒకడు కాబూల్‌లో జరుగుతున్న రాజకీయ తిరుగుబాటును, అంతర్యుద్ధాన్ని ప్రస్తావనకు తెచ్చాడు. ఆ భక్తుడు, ఆఫ్ఘనిస్థాన్ రాజయిన యాకూబ్ ఖాన్‌ను పదవీచ్యుతుణ్ణి చేశారని, అతడు గొప్ప దైవభక్తుడని చెప్పాడు. అప్పుడు గురుదేవులు వారితో ఇలా అన్నారు: "గతంలో చేసిన కర్మఫలాన్ని ప్రతివారూ అనుభవించి తీరాలి. ప్రారబ్ధకర్మ ఫలంగా మనిషికి పూర్వజన్మల నుండి కొన్ని సంస్కారాలు సంక్రమిస్తాయి. ఈ సంస్కారాల ప్రభావం నుండి మనిషి తప్పించుకోలేడు. మానవజన్మ ఎత్తిన తరువాత కష్టసుఖాలు తప్పవని మనం ఎల్లప్పుడూ గుర్తుంచుకోవాలి. కవి కంకణుడు వ్రాసిన 'చండి' అనే గ్రంథంలో కాలువీర్ అనేవాడి కథ ఉంది. కాలువీర్ జగన్మాత వరప్రసాదంగా జన్మించాడు. అయినప్పటికీ అతణ్ణి జైలులో ఉంచి, అతని ఛాతీమీద ఒక కొండరాయిని పెట్టే శిక్ష విధించారు. కాబట్టి శరీరంలోకి ప్రవేశించిన తరువాత కష్టసుఖాలు తప్పవు."

"శ్రీమంతుడు అని ఒకడు ఉండేవాడు. అతడు గొప్పభక్తుడు. అతడి తల్లి 'ఖుల్లనా' ఒక గొప్ప దేవీ భక్తురాలు. అయినప్పటికీ అతని కష్టాలకు అంతులేదు. చివరకు అతని తల తీసివేసే పరిస్థితి కూడా వచ్చింది."

"కట్టెలు కొట్టుకునేవాడి కథ ఇంకొకటి ఉంది. అతడూ జగన్మాత భక్తుడే! ఎంతో కృపతో, ప్రేమతో జగన్మాత అతనికి దర్శనం ఇచ్చింది. అయినా అతడు తన కట్టెలు కొట్టే వృత్తిని కొనసాగించాడు. ఆ విధంగా కష్టపడి పనిచేయడం ద్వారానే తన పొట్టపోసుకొనవలసి వచ్చింది."

"శ్రీ కృష్ణుడి తల్లి అయిన దేవకీదేవి పరిస్థితి చూడండి! కారాగారంలో ఆమె బందీగా ఉన్న సమయంలో శ్రీమహావిష్ణువు, నాలుగు చేతులలో శంఖం, చక్రం, గద, పద్మం ధరించి ఆమెకు దర్శనమిచ్చాడు. అయినా ఆమె ఆ కారాగారం నుండి బయటపడలేక పోయింది." గురుదేవులు ఈ విషయాన్ని ఇంకా వివరిస్తూ,

"దీనివల్ల తెలిసే నిజమేమిటంటే, ప్రారబ్ధకర్మ ఫలితాన్ని తప్పక అనుభవించి తీరాలి. పూర్వజన్మకర్మల ఫలితాలు పూర్తిగా నశించేదాకా శరీరం నిలచి ఉంటుంది. మరొక సంఘటన చెపుతాను విను" అని ఇంకా ఇలా చెప్పారు.

"ఒకసారి ఒక పుట్టు గ్రుడ్డివాడు గంగానదిలో స్నానం చేశాడు. దాని ఫలితంగా పాపాలన్నీ పోయాయి. కానీ గ్రుడ్డితనం మాత్రం అలాగే ఉండిపోయింది. పూర్వం చేసిన చెడ్డపనులవల్ల ఆ గ్రుడ్డితనం అతనికి వచ్చింది."

"అయితే శారీరకంగా ఎన్ని కష్టాలు, సుఖాలు అనుభవించినా, భక్తుడు దేవుని మీద ప్రేమను, దేవుడున్నాడనే జ్ఞానసంపదను ఎల్లప్పుడూ కలిగి ఉండాలి. అది ఎన్నటికీ తరగని సంపద. ఉదాహరణకు, పాండవులను చూడండి! వాళ్ళు ఎన్ని కష్టాలపాలయ్యారు? కానీ జీవితంలో ఒక్కసారైనా దేవుడున్నాడనే విషయాన్ని వాళ్ళు మర్చిపోలేదు."

## 166. పూర్వజన్మల సాధనాఫలితం (పూర్వజన్మ సంస్కారాలు – శవసాధన)

అరియధార అనేచోట ఒక పిల్లవాడు ఉన్నాడు. అతడి పేరు 'విష్ణు'. విష్ణు శ్రీరామకృష్ణుల దగ్గరకు వచ్చివెడుతుండేవాడు. సంసార జీవితం తనకు ఇష్టంలేదని కూడా వారితో చెబుతుండేవాడు. ఉత్తర పరగణాలలో ఉన్న తన బంధువుల ఇంటికి వెళ్ళినప్పుడు విష్ణు దగ్గరలో ఉన్న కొండకోనలలోకి వెళ్ళి ఏకాంత ప్రదేశంలో ధ్యానం చేస్తుండేవాడు. అతడికి అనేక భగవద్దర్శనాలు కూడా కలిగాయి. శ్రీరామకృష్ణులు తన గదిలో కూర్చొని ఉన్నారు. ఆ సమయంలో అక్కడ కృష్ణగోస్వామి అనే సాధువు, బలరాం బోసు, మహేంద్రుడు మొదలైన భక్తులు ఆసీనులై ఉన్నారు. విష్ణు కత్తితో గొంతు కోసుకొని ఆత్మహత్య చేసుకున్నాడనే విషయం విని గురుదేవులు వారితో ఇలా చెప్పారు: "ఇది ఆ పిల్లవాడికి ఆఖరు జన్మ అయివుంటుంది. అతడు తన పూర్వజన్మలోనే సాధనలన్నీ పూర్తి చేసి ఉండవచ్చు. పూర్వపుణ్యం వల్ల వచ్చే సంస్కారాలు ఉంటాయని మనం అంగీకరించక తప్పదు. ఒక కథ చెపుతా వినండి!"

"తంత్రశాస్త్రంలో 'శవసాధన' అనేది ఒకటుంది. దేవీదర్శనం కొరకు ఒకడు ఆ సాధన చేశాడు. దట్టమైన కీకారణ్యంలో ఉపాసన సాగించాడు. మొదట్లో అతడికి అనేకమైన భీకరదృశ్యాలు కనిపించాయి. చివరికి ఒక పెద్దపులి వచ్చి అతణ్ణి చంపివేసింది కూడా. ఇంతలో అటువైపు వెడుతున్న బాటసారి ఒకడు దీన్ని చూడడం తటస్థించింది. పెద్దపులి బారినుండి తప్పించుకోవడానికి అతడు దగ్గరలోవున్న ఒక చెట్టు ఎక్కి కూర్చున్నాడు. పులి వెళ్ళిపోయాక వాడు చెట్టుదిగి

చూచేసరికి, శవసాధనకు అవసరమైన వస్తువులన్నీ అక్కడ కనిపించాయి. కాళ్ళు చేతులు కడుక్కొని, ఆచమనం చేసి, శవంమీద కూర్చొని మార్జనం చేసుకొని కొన్ని మంత్రాలు చదివి శుచిర్భూతుడై, కొద్దిగా జపం చేశాడో లేదో, జగన్మాత అతడి ముందు సాక్షాత్కరించి, 'నాయనా! నీయందు ప్రసన్నురాలనైనాను. వరం కోరుకో!' అని అంది. వాడు అమ్మవారి పాదపద్మాలకు ప్రణమిల్లి, 'అమ్మా! నాదొక సందేహం. నీవు అనుగ్రహిస్తే అడుగుతాను. నీ లీల నాకు ఆశ్చర్యం కలిగిస్తోంది. నిన్ను శాంతపరిచి, ప్రసన్నురాలిని చేసుకోవాలని ఇంతకు ముందు నీ భక్తుడొకడు ఎంతకాలం నుంచో శ్రమపడుతున్నట్లుగా కనిపిస్తున్నది. అతడు పూజకు కావలసిన దుర్లభమైన పదార్థాలన్నీ సేకరించాడు. కాని నీవు అతణ్ణి అనుగ్రహించి అతడికి ప్రసన్నం కాలేదు. ఇక నా విషయానికొస్తే, నాకు ఈ ఉపాసన ఎటువంటిదో తెలియదు. నేను దీనినెప్పుడూ చేయలేదు. నాకు భక్తి శ్రద్ధలు లేవు. జ్ఞానమూ లేదు. ఎన్నడూ తపస్సు చేసి ఎరుగను. కాని నిర్హేతుకమైన నీ అనుగ్రహానికి పాత్రుణ్ణి అయ్యాను! ఇది ఎలా సాధ్యం తల్లీ?' అని సవినయంగా విన్నవించాడు. పరాశక్తి చిరునవ్వు నవ్వుతూ, 'నాయనా! నీ పూర్వజన్మ వృత్తాంతం నీకు తెలియదు. నన్ను ప్రసన్నం చేసుకోవడానికి ఎన్నో జన్మలుగా నీవు తపస్సు చేశావు. ఆ తపస్సు ఫలితంగానే ఇవన్నీ నీకు సంసిద్ధమై ఉన్నాయి. అందువల్లనే నా దర్శనం చేసుకోగలిగావు. కాబట్టి నీకే వరం కావాలో కోరుకో!' అని అనుగ్రహించింది."

ఈ కథ ముగించి పరమహంసదేవులు ఇలా చెప్పారు: 'ఆత్మహత్య నిస్సంకోచంగా మహాపాతకమైనదే. ఆత్మహత్య చేసుకున్నవాడు అనేక జన్మలు ఎత్తవలసి వస్తుంది. కాని భగవద్దర్శనం కోసం శరీరత్యాగం చెయ్యటంలో తప్పేమీ లేదు. జ్ఞానం కలిగిన తరువాత కొంతమంది అలా శరీరాన్ని వదలుతారు. బంగారుబొమ్మను పోతపోసిన తరువాత మట్టి మూసతో పనేముంటుంది? అవసరమనిపిస్తే దాన్ని ఉంచుకోవచ్చు. లేకపోతే పగలగొట్టి అవతల పారవేయవచ్చు కూడా."



# అనుభవము

## 167. అత్యంత సాధనాఫలితం (ఉపాసకుడు - ఇస్లాం మతము)

"ఒక దేవీభక్తుడున్నాడు. అతడెప్పుడూ దేవీమంత్రాన్ని జపిస్తూ, ఉపాసిస్తూ ఉండేవాడు. భారతదేశాన్ని మహమ్మదీయ రాజులు జయించిన తరువాత, బలవంతంగా హిందువులను ఇస్లాం మతంలోకి మార్చేవాళ్ళు. ఈ దేవీభక్తుణ్ణి కూడా ఇస్లాం మతం పుచ్చుకోమని నిర్బంధించి మతమిచ్చారు. వాళ్ళు అప్పుడు ఆయనతో, 'ఏమయ్యా! నీవిప్పుడు మహమ్మదీయుడవయ్యావు. 'అల్లా' అని చెప్పు! ఇక నుండి నీవు అల్లా నామజపం మాత్రమే చేస్తూ ఉండాలి సుమా' అని బెదిరించారు. ఆ భక్తుడు ఎంతో ప్రయత్నం మీద 'అల్లా' అన్నాడు గానీ, మాటిమాటికీ 'జగదంబా' అనడం మానలేదు. ఇది చూచి ముసల్మానులు కోపంతో అతణ్ణి కొట్టబోయారు. పాపం ఆ భక్తుడు, 'అయ్యా! మిమ్మల్ని వేడుకుంటున్నాను. నన్ను చంపకండి. నా శక్తివంచన లేకుండా 'అల్లా' అనడానికే ప్రయత్నిస్తున్నాను. కాని 'మా జగదంబ' నా శరీరమంతా నిండివుండడంవల్ల మీ 'అల్లా'ను బయటికి తోసివేస్తున్నది' అని సమాధానమిచ్చాడు."

ఈ కథను గురుదేవులు శశిధర పండితుడికి చెప్పారు. ఆ సమయంలో గురుదేవులు శశిధరపండితునితో మణిమల్లిక్ స్వభావాన్ని గురించి మాట్లాడుతున్నారు. ఈ కథ చెప్పి పండితునితో, "మణిమల్లిక్ బ్రహ్మసమాజ సిద్ధాంతాలను ఎంతోకాలంనుండి అనుసరిస్తున్నాడు. అవి అతడిలో జీర్ణించుకొని పోయాయి. అందువల్ల మీరు అతడితో వాదించి, అతడిలో ఏర్పడ్డ సంస్కారాలను తుడిచివేయాలని ప్రయత్నించడం అంత సులభమైన పనికాదు. మనుష్యులలో ఏ విధంగా అనేక రకాల జీర్ణశక్తి గలవాళ్ళు ఉన్నారో, అదే విధంగా అనేక రకాల అభిప్రాయాలు గలవాళ్ళు కూడా ఉన్నారు. అందువల్లనే భగవంతుడు అనేక అభిప్రాయాలు గలవారినీ, వారికి తగినట్టుగా ఉండడానికై అనేకరకాల మత విధానాలను, మత సాంప్రదాయాలను కూడా సృష్టించాడు" అని వివరించారు.

## 168. కర్మను అనుసరించి మాత్రమే ఫలితాలు కలుగుతాయి (నాలుగుచుక్కలకే తూలిపడ్డ తాగుబోతు)

దేవేంద్రనాథ టాగూరు కుటుంబానికి పాఠాలు చెప్పే ఉపాధ్యాయుడు గురుదేవుల్ని, "కొందరికి క్షణంలో సిద్ధి కలుగుతుంది. కొందరికి ఎంత శ్రమపడ్డా కలుగదు. ఇలా ఎందుకు జరుగుతుందో చెప్పండి?" అని గురుదేవుల్ని అడిగాడు.

దానికి గురుదేవులు, "జన్మజన్మలుగా చేసుకున్న పాపపుణ్యాల ఫలంగానే, మన కర్మను అనుసరించి అది సిద్ధిస్తుంది. కానీ అది అకస్మాత్తుగా ఎక్కడనుంచో ఊడిపడిందని మామూలు మనుష్యులు అనుకుంటారు" అని చెప్పారు.

ఆ తర్వాత నవ్వుతూ, "ఒకడు కాస్త కల్లు తాగాడట. దానికే మత్తెక్కి తూలిపడిపోతున్నాడు. అక్కడున్న వాళ్ళు ఆశ్చర్యంతో, 'ఇదేమిటి? నాలుగు చుక్కలు తాగాడో లేదో ఇలా తూలిపడిపోతున్నాడు!' అని ఆశ్చర్యపోయారు. అప్పుడు ఆ పక్కనే ఉన్న వ్యక్తి, 'అది కాదండీ అసలు సంగతి! ఈ మనిషి రాత్రంతా తాగుతూనే ఉన్నాడు!' అని అసలు కారణాన్ని బయట పెట్టాడుట" అని చెప్పారు.

ఇంకా, "హనుమంతుడు బంగారంలాంటి లంకను కాల్చివేశాడు. అక్కడున్నవాళ్ళు ఆశ్చర్యంతో, 'లంక ఎంత శక్తిమంతమైనదో కదా! అయినా ఒక కోతివచ్చి లంకనంతా కాల్చివేసిందే!' అని ఆశ్చర్యంతో అన్నారట. అయితే అసలు విషయం ఏమిటంటే సీతాదేవి నిట్టూర్పుల వలనా, రాముడి కోపం వలనా లంకానగరం దగ్ధమైంది కానీ కేవలం హనుమంతుడి శక్తివల్ల మాత్రమే అలా జరగలేదు" అని చెప్పారు. కనుక మనకు ఈ రోజు కలుగుతున్న కష్టసుఖాలు మన స్వయంకృతాలే. అంతేకాక ఇదే నిజాన్ని దృష్టిలో ఉంచుకుని ఈ క్షణంలో మనం చేస్తున్న, చేయవలసిన పనుల్ని సక్రమంగా చేయడం ద్వారా ఉన్నత స్థితిగతులకు తప్పక చేరుకోవచ్చు.

## 169. ఆనందం మనలోనే ఉంది (తెరచాప కొయ్యమీది పక్షి)

మానవుడు సంసార సుఖాలను కోరుతున్నంతవరకూ కర్మను వదలలేడు. సుఖాసక్తి అతడిలో ఉన్నంతవరకూ కర్మ చేస్తూనే ఉంటాడు. "గంగానదిలో ఉన్న ఒక ఓడ తెరచాప కొయ్య మీద ఒక పక్షి వాలింది. ఆ పడవ లంగరువేసి ఉంది. పక్షి అక్కడే కూర్చొని ఉంది. కొంతసేపైన తరువాత ఆ పడవ లంగరు ఎత్తి, నెమ్మదిగా బయలుదేరి సముద్రంలో చాలాదూరం వెళ్ళిపోయింది. ఈ విషయం పక్షికి తెలియలేదు. దానికి తెలిసేసరికి భూభాగం దూరమైపోయింది. భూభాగానికి పోవాలని ఆ పక్షి ఉత్తరదిక్కుగా ఎగిరి చూచింది. ఎంత దూరం ఎగిరినా తీరం రాలేదు కానీ దాని రెక్కలు మాత్రం అలిసిపోయాయి. ఇక చేసేదేమీ లేక మళ్ళీ వచ్చి అది తెరచాప కొయ్య మీదనే వాలింది. చాలాసేపు అలసట తీర్చుకొని మళ్ళీ బయలుదేరి ఈ మారు తూర్పువైపుకు ఎగిరింది. ఎంత ఎగిరినా ఆ వైపు కూడా తీరం కనిపించలేదు. ఎటువైపు చూచినా అపారమైన సముద్రజలం తప్ప దానికేమీ కనిపించలేదు. బాగా అలసిపోవటంచేత దానికి ఆ తెరచాప కొయ్యయే మళ్ళీ

శరణ్యమైంది. విశ్రాంతి తీసుకొని బలం పుంజుకొని ఆ పక్షి దక్షిణానికి, పడమరకు కూడా ఎగిరి చూచింది. ఏ దిక్కు చూచినా దానికి భూమి ఛాయ కూడా కనిపించలేదు. అది తిరిగివచ్చి ఆ కొయ్య మీదనే స్థిరపడి పోయింది. ఇక ఆ కొయ్యను వదలిపోవాలనే ప్రయత్నం కూడా అది చెయ్యలేదు. ఇప్పుడు దానికి ఎటువంటి ఆందోళనగాని, అశాంతిగాని లేవు. అది మళ్ళీ ఎగిరే ప్రయత్నమే చెయ్యకుండా నిశ్చింతగా ఉండిపోయింది.”

గురుదేవులు ఈ కథను విశ్వనాథ ఉపాధ్యాయ అనే భక్తుడికి చెప్పారు. విశ్వనాథ ఉపాధ్యాయను శ్రీరామకృష్ణులు 'కెప్టెన్' అని పిలిచేవారు. కెప్టెన్ కర్మిష్ఠి. ఆచారంలోను, ఆహారవ్యవహారాలలోను చాలా పట్టుదలగా ఉండేవాడు. ఆయనకు దైవభక్తి, మాతృభక్తి ఎక్కువ. అంతేకాక గురుదేవులమీద అత్యంత భక్తిశ్రద్ధలు కలిగివుండేవాడు. ఈ కథ ముగించిన తరువాత గురుదేవులు కెప్టెనును ఉద్దేశించి, “ప్రాపంచికులు ఆనందం ఎక్కడ దొరుకుతుందా అని (బాహ్య వస్తువుల కోసం) ప్రపంచం నలుమూలలా తిరుగుతారు. బాహ్యప్రపంచంలో ఎక్కడా వారికి ఆనందం లభించదు. ఆ ప్రయత్నంలో వారు అలసిపోతారు. కామినీ కాంచనాల మీద ఉన్న వ్యామోహంతో విపరీతంగా బాధపడిన తరువాత చివరకు వారికి వివేక వైరాగ్యాలు కలుగుతాయి” అని చెప్పారు. ఆనందం అనేది బయట ఎక్కడో కాక మనలోనే ఉందని గురుదేవులు ఈ కథ ద్వారా సూచించారు.

## 170. ఆత్మవిమర్శతో గర్వం అణుగుతుంది (మిణుగురు పురుగులు - సూర్యుడు)

శ్రీరామకృష్ణులు ఒకసారి మణిలాల్‌మల్లిక్ ఇంటికి వచ్చారు. ఆ రోజు సింధూరియాపట్టి బ్రహ్మ సమాజ వార్షికోత్సవం. చాలామంది భక్తులు వివిధప్రాంతాల నుండి శ్రీగురుదేవుల అమృతవాక్కులు వినాలని అక్కడికి చేరారు. కార్యక్రమం కొంత నడచిన తరువాత గురుదేవులు ప్రసంగిస్తూ, వారి మృదుమధుర కంఠంతో కొన్ని భక్తిగీతాలను పాడారు. చివరలో అక్కడకు చేరిన కొందరు బ్రహ్మసమాజభక్తుల వైపు చూస్తూ ఇలా ప్రవచించారు.

“కొంతమంది వారికున్న అధికారాన్ని, సంపదలను, సంఘ గౌరవాన్ని చూసుకొని గర్వపడతారు. కానీ అవన్నీ మూణ్ణాళ్ళముచ్చటలే! చనిపోయిన తరువాత వెంటవచ్చేది ఒక్కటీ లేదు. కాబట్టి సంపదలను చూచుకొని ఎవ్వరూ గర్వపడకూడదు. నీవు ధనికుడవనుకుంటే, నీ కంటే డబ్బుకలవాళ్ళు చాలామంది ఉంటారు. తాడెక్కేవాడుంటే వాడి తలదన్నే వాడింకొకడుంటాడు.”

“ఒక సంగతి చెపుతా వినండి! సూర్యుడు అస్తమించిన తరువాత చీకటి పడుతుంది గదా! అప్పుడు మిణుకుమిణుకుమంటూ మిణుగురు పురుగులు

ఎగురుతాయి. ఈ ప్రపంచానికంతా తామే వెలుగును ప్రసాదిస్తున్నామని గర్వపడతాయి. కాని అవి ఆకాశం వైపు చూస్తే మణులలాంటి నక్షత్రాలు వాటికి కనిపిస్తాయి. దానితో ఆ పురుగుల గర్వం అణిగిపోతుంది. ఇక నక్షత్రాలు తమ తళుకుబెళుకులను చూచుకొని తామే ప్రపంచానికి వెలుగునిస్తున్నామని భావిస్తాయి. ఇంతలో చంద్రోదయమవుతుంది. నక్షత్రాలు ఆ చంద్రకాంతిలో వెలవెలబోయి సిగ్గుతో తలవంచుకుంటాయి. ఇక చంద్రుడు తన ప్రకాశంతోను, శీతలకిరణాలతోను ఈ పుడమినంతా వెలుగునిచ్చి ఆనందపరుస్తున్నానని భావిస్తాడు. అన్నివైపులా తన చంద్రికలతో వెలుగు నింపుతున్నానని గర్విస్తాడు. ఇది ఇలా ఉండగా నెమ్మదిగా తూర్పుదిక్కున అరుణ కాంతులు పొడసూపుతాయి. క్రమక్రమంగా సూర్యభగవానుడు ఉదయిస్తాడు. చందమామ అప్పుడు వెలవెలపోయి, క్రమక్రమంగా కనిపించకుండానే అదృశ్యమౌతాడు."

"అందువల్ల ధనికులమనుకునేవాళ్ళు ఈ విధంగా విమర్శ చేసుకుంటే వారి ధనమదాంధత తొలగిపోతుంది. అదే విధంగా తమ స్వల్పమైన ఆధ్యాత్మిక అనుభవాలతో విర్రవీగేవారు, ఈ విధంగా వివేచన చేస్తే నిజమైన అనుభవం ఎలా ఉంటుందో, అటువంటి సర్వోత్కృష్టమైన స్థితిని పొందిన మహనీయుడు ఎలావుంటాడో తెలిసివస్తుంది" అని గురుదేవులు తన ప్రసంగాన్ని ముగించారు.

## 171. ఎవడు కొట్టాడో వాడే పాలు పోస్తున్నాడు!
## (సాధువు - జమీందారు)

ఒక ఊరిలో సాధువుల మఠం ఒకటి ఉంది. ఆ మఠంలో ఉండే సాధువులంతా భిక్షాటనకు ఊరిలోకి వెళ్ళేవాళ్ళు. ఒకరోజు ఒక సాధువు అలా మధుకరానికి వెళ్ళిన సమయంలో ఒక సంపన్నుని ఇంటి ముందు, ఆ గృహస్థుడు ఒక బిచ్చగాణ్ణి చావమోదుతున్నాడు. ఈ దృశ్యం దయార్ద్రహృదయుడైన ఆ సాధువు కంటపడింది. అతడు బాధపడుతూ ఆ సంపన్నుని దగ్గరకు వెళ్ళి నెమ్మదిగా, 'అయ్యా! ఎందుకు ఈ బిచ్చగాణ్ణి కొడుతున్నారు? ఇక శాంతించండి!' అని చెప్పాడు. ఆ మాటలకు ఉగ్రుడైన ఆ సంపన్నుడు, బిచ్చగాణ్ణి వదలిపెట్టి ఆ సాధువునే బలంగా కొట్టసాగాడు. ఆ దెబ్బలకు సాధువు స్పృహతప్పి నేలపై పడిపోయాడు. ఈ వార్త ఈనోట, ఆనోట సాధువుల మఠానికి చేరింది. తమ సోదరసన్యాసికి కలిగిన విపత్తు తెలిసి ఆ సాధుబృందం హుటాహుటిన అక్కడకు చేరి, ఆ సాధువును మఠానికి చేర్చి పడుకోబెట్టి సేదతీర్చడం ప్రారంభించారు. కాని ఆ సాధువుకు స్పృహ రాలేదు. వారంతా దిగులుతో ఆయన చుట్టూ చేరారు. కొందరు విసనకర్రలతో విసురుతున్నారు. కొందరు ఇతర విధాలుగా సేవచేస్తున్నారు. కాని, ఎన్ని చేసినా సాధువుకు స్పృహ తెప్పించలేకపోయారు. ఇంతలో ఒక సాధువుకు

ఒక ఆలోచన తట్టింది. కొంచెం వేడి పాలు ఇస్తే తేరుకోవచ్చు అనుకున్నాడు. తక్షణమే పాలు తెచ్చి చుక్కచుక్కగా నోటిలో వేయసాగాడు. కొంతసేపటికి ఆ సాధువుకు నెమ్మదిగా స్పృహ వచ్చింది. మెల్లగా కళ్ళు తెరిచి నాలుగువైపుల కలయచూడసాగాడు. అప్పుడు అక్కడవున్న ఒక సాధువు, ఇతడు తమను గుర్తుపట్టే స్థితిలో ఉన్నాడోలేడో తెలుసుకుందామని, ఆయన దగ్గరికి చేరి చెవిలో, 'స్వామీ! మీకు ఇప్పుడు పాలు పోస్తున్నదెవరండీ?' అని అడిగాడు. బలహీనమైన కంఠస్వరంతో ఆ సాధువు, 'సోదరా! నన్ను ఎవరు కొట్టారో, వాడే ఇప్పుడు నా నోటిలో పాలుపోస్తున్నాడు' అని సమాధానం చెప్పాడు."

ఆ సాధువుకు తనను కొట్టిన సంపన్నుడి మీద కోపం కలుగలేదు. తనను కొట్టి గాయపరచిన సంపన్నుణ్ణీ, తన నోటిలో పాలుపోసి తనకు సేదదీర్చి మేలు చేస్తున్న సోదర సన్న్యాసినీ అతడు ఒకలాగే చూశాడు. భగవంతుణ్ణి సాక్షాత్కరించుకున్నవారికి మాత్రమే అటువంటి ఉన్నతస్థితి కలుగుతుంది.

గురుదేవులు ఈ కథను మణిలాల్ మల్లిక్‌కు చెప్పారు. మణిలాల్ తీర్థయాత్రలు చేసి కాశీలో, త్రైలింగ స్వామిని, భాస్కరానంద స్వామిని దర్శించి వచ్చాడు. భాస్కరానంద స్వామి తనకు సదుపదేశం చేస్తూ, "అధర్మమార్గాన చరించవద్దు. ప్రాపంచిక చింతన చేయవద్దు. ధర్మాచరణ గావిస్తూ వుండు" అని చెప్పారని మణిమల్లిక్ గురుదేవునితో అన్నాడు. అప్పుడు గురుదేవులు మణిమల్లిక్‌తో, "సంసారులకు అది కూడా ఒక మార్గమే. కాని భగవంతుణ్ణి దర్శించినవారు, భగవంతుడే కర్త అనీ, మిగిలినవారంతా భగవంతుని చేతిలోని పనిముట్లనీ భావిస్తారు. భగవత్సాక్షాత్కారం కలిగిన మహనీయులకు తప్ప, ఇతరులకు పై కథలోని సాధువుకు కలిగినటువంటి ఆధ్యాత్మిక స్థితి కలుగదు" అని చెప్పారు.

## 172. మెలకువ (జాగ్రదావస్థ) కూడా స్వప్నం వంటిదే (కట్టెలుకొట్టువాడు – కల)

ప్రాణకృష్ణ ముఖర్జీ ఒక సంపన్న గృహస్థుడు. అతడు కలకత్తా ఉత్తర ప్రాంతంలో నివసిస్తూ ఉండేవాడు. ఒక ఆంగ్లేయ వ్యాపార సంస్థలో పెద్ద ఉద్యోగం కూడా చేస్తుండేవాడు. శ్రీరామకృష్ణులను తరచు దర్శిస్తూ, గృహస్థుగా ఉన్నా వేదాంతగ్రంథాలు పఠిస్తూ, ఆనందాన్ని పొందేవాడు. వీలు కలిగినప్పుడు బాడుగ పడవలో దక్షిణేశ్వరం వచ్చి గురుదేవుల దర్శనం చేసుకుంటూ ఉండేవాడు. ఒకరోజు అతడు ఉదయమే వచ్చి గురుదేవులతో సంభాషిస్తున్నాడు. మాటలమధ్యలో గురుదేవులతో, "మానవుడు చనిపోయిన తరువాత ఏమవుతాడు?" అని ప్రశ్నించాడు. అప్పుడు గురుదేవులు అతడితో, "అజ్ఞానమున్నంత వరకూ మానవుడు జన్మలెత్తుతూనే ఉంటాడు. జ్ఞానం కల్గిన

తరువాత ఈ లోకంలో కానీ మరొక లోకంలో కానీ జన్మించడు. జన్మించడమనే ప్రసక్తే అతడికి ఉండదు. గింజ వేయించిన తర్వాత మొలుస్తుందా? పచ్చిగా ఉన్నప్పుడే గదా అది మొలకెత్తేది! అదే విధంగా జ్ఞానతప్తమయిన (అహంకారం నశించిన) జీవుడు మరల జన్మ ఎత్తడు. వేదాంతపరంగా జాగ్రదావస్థ కూడా అనిత్యమే కదా!" అని ఈ క్రింది కథను చెప్పారు.

"ఒక ఊరిలో కట్టెలు కొట్టుకొని జీవించేవాడొకడున్నాడు. వాడొక రోజు హాయిగా నిద్రిస్తూ, కలగంటున్నాడు. ఇంతలో ఎవరో వచ్చి అతణ్ణి నిద్రలేపారు. చాలా చిరాకుతో, విసుగుతో వాడు నిద్రలేస్తూ, 'ఎందుకయ్యా! నా నిద్ర పాడు చేశావు? నేను రాజసింహాసనంపై కూర్చొని రాజ్యమేలుతున్నాను. నాకు ఏడుగురు కొడుకులు. అందరూ విద్యావంతులే. ధనుర్విద్యలో ప్రవీణులు కూడా. ఉపద్రవాలేమీ లేకుండా నేను ప్రజలను పాలిస్తున్నాను. నా ఆనంద సామ్రాజ్యాన్ని ఎందుకు ధ్వంసం చేశావు?' అని విసుక్కున్నాడు. ఆ వచ్చినవాడు, ఆ కట్టెలుకొట్టేవాడితో, 'ఇందుకేనా ఇంత చిరాకుపడుతున్నావు. అది కేవలం కలే కదా?' అన్నాడు. అప్పుడా కట్టెలు కొట్టుకొనేవాడు మరింత విసుగుతో, 'నీవు ఎంత అవివేకివయ్యా! నీకేమీ అర్థమైనట్లు లేదే! నేను కలలో రాజు కావడం ఎంత నిజమో, కట్టెలుకొట్టుకొని జీవించే ఈ జీవితం కూడా అంతే నిజం!' అన్నాడు."

ప్రాణకృష్ణముఖర్జీ వేదాంత విషయాలపై ఆసక్తి కలవాడు కాబట్టి గురుదేవులు అతడికి నిజమైన జ్ఞాని స్థితి ఎటువంటిదో ఈ కథ ద్వారా తెలియచేశారు.

## 173. నిజమైన జ్ఞాని ఎలా ఉంటాడు?
## (జ్ఞానియైన రైతు)

వేదాంతం ప్రకారం ఈ జగత్తు మిథ్య. ఒక కలలాగా అది కూడా అనిత్యం. పరమాత్మ కేవలం సాక్షిగా (ప్రక్కన నిలబడి చూసేవాడిగా) ఉన్నాడు. జాగ్రత్తు (మెలకువ), స్వప్నము (కల), సుషుప్తి (నిద్ర) అనే మూడు స్థితులకు అతడు సాక్షి. కల ఎంత నిజమో, మెలకువ కూడా అంతే నిజం.

"ఒక రైతు ఉన్నాడు. అతడొక నిజమైన జ్ఞాని. వ్యవసాయమే అతడికి జీవనోపాధి. వయస్సు మళ్ళిన తరువాత అతడికి లేకలేక ఒక కొడుకు పుట్టాడు. ఆ పిల్లవాడికి 'హరు' అని ముద్దుగా పేరుపెట్టుకున్నాడు. తల్లిదండ్రులకు హరు అంటే పంచప్రాణాలు. ఎందుకంటే అతడు లేకలేక పుట్టిన వంశాంకురం కదా! అంతేకాక ఈ రైతు తన పారమార్థిక చింతనవల్ల గ్రామస్థులకు అందరకూ ప్రీతిపాత్రుడయ్యాడు."

"ఒకరోజు ఈ రైతు పొలంలో పనిచేస్తున్నాడు. అతడి పొరుగింటివాడు వచ్చి 'హరు'కు కలరా వ్యాధి సోకిందని చెప్పి వెళ్ళిపోయాడు. రైతు వెంటనే ఇంటికి వెళ్ళి

శక్తివంచన లేకుండా చికిత్స చేయించాడు. కాని ఫలితం లేకపోయింది. హరు చనిపోయాడు. ఆ రైతు భార్య, మిగిలిన కుటుంబసభ్యులు దుఃఖసాగరంలో మునిగిపోయారు. ఏడుపులు, పెడబొబ్బలతో ఇల్లు నిండిపోయింది.”

“కాని రైతు ప్రవర్తన దీనికి విరుద్ధంగా ఉంది. ఇంట్లో ఏమీ జరగనట్లే ప్రవర్తించాడు. భార్యను ఓదారుస్తూ, ఏడ్చి ప్రయోజనం లేదని చెప్పి, ఖననసంస్కారమంతా చేసి పొలంలో మిగిలిన పని చెయ్యడానికి వెళ్ళాడు.

సాయంత్రం అతడు యథాప్రకారం ఇంటికి రావడం చూచి భార్య, 'నీది ఎంత రాతిగుండె! పిల్లవాడు చనిపోయిన బాధలో మేమంతా ఇలా గుండెపగిలి ఏడుస్తూ ఉంటే, నీ కంటివెంట ఒక నీటిబొట్టైనా రాలలేదే?' అని ఆక్షేపించింది. దానికి ఆ రైతు తన భార్యను చూచి, 'నాకు ఎందుకు ఏడుపు రావడం లేదో చెప్పమంటావా? గడిచిన రాత్రి నాకొక కల వచ్చింది. నేనొక రాజునైనట్లు, నాకు ఏడుగురు కుమారులున్నట్లు కలగన్నాను. ఆ రాజకుమారులు అందాల మూటలు, సుగుణాల రాసులు, సర్వవిద్యాపారంగతులు, దృఢకాయులు, ఇంతలో అకస్మాత్తుగా మెలకువ వచ్చింది. కల చెదిరిపోయింది. నేనిప్పుడు ఒక చిక్కులో పడ్డాను. కలలో కనిపించి పోయిన ఆ ఏడుగురు పిల్లల కోసం ఏడవనా? లేక ఈ "హరు" ఒక్కడి కోసం ఏడవనా?' అని అడిగాడు."

"ఈ రైతు ఒక నిజమైన జ్ఞాని. స్వప్నము (కల), జాగ్రత్తు (మెలకువ), రెండూ కూడా ఒక రకంగా అనిత్యాలేనని అతడికి తెలుసు. ఉన్న సత్యం ఒక్కటే! అదే ఆత్మ!" ఈ కథను గురుదేవులు మహిమచరణుడికి చెప్పారు. మహిమచరణుడు ఎన్నో వేదాంత గ్రంథాలు, అనేక ఇంగ్లీషు గ్రంథాలు చదివి కొంత పాండిత్యం సంపాదించాడు. పిత్రార్జితమైన ఆస్తి ఉండటంవల్ల ఉద్యోగమేమీ చేయకుండా శాస్త్రపఠనంలో కాలం గడిపాడు. తన భావాలకు అనుగుణంగా ఒక పాఠశాలను కూడా నడిపించాడు. అతడికి పాండిత్య ప్రకర్షణం మీద కొంత అభిలాష వుంది. అతడిది రాజసిక ప్రవృత్తి. ఇది గుర్తించిన గురుదేవులు 'నిజమైన జ్ఞానం' ఎలా ఉంటుందో, నిజమైన జ్ఞాని ఎలా ప్రవర్తిస్తాడో ఈ కథ ద్వారా అతడికి తెలియచేశారు.

## 174. జనన మరణాల ప్రయోజనం (పన్నీరు మొక్క పెంపకంలో మెలకువలు)

"మంచిజాతిగల పన్నీరు మొక్కల్ని పెంచే తోటమాలి మంచు కురవడం మొదలుపెట్టగానే ఆ మొక్కల చుట్టూ తవ్వి వాటి వేళ్ళను బయటకు కనిపించేలా చేస్తాడు. కొన్ని రోజులు మంచు కురిశాక మళ్ళీ ఆ మొక్కను సక్రమంగా నాటి, పాదుచేసి నీరుపెడతాడు. దీనివల్ల ఆ చెట్టుకు పుష్టి కలుగుతుంది. కొత్త చిగుళ్ళతో సకాలంలో నిండుగా పూస్తుంది." ఆరోగ్యం క్షీణిస్తున్న కేశవచంద్ర సేనుతో గురుదేవులు ఈ మాటలు చెప్పి, "అందుకే కాబోలు నీ వేళ్ళను కూడా పెళ్ళగిస్తున్నాడు!" అన్నారు. ఆ మాటలకు కేశవుడు, గురుదేవులు ఇద్దరూ నవ్వారు. ఇంకా "మళ్ళీ తిరిగివచ్చినప్పుడు (మళ్ళీ పుట్టినప్పుడు) మరిన్ని ఘనకార్యాలు చేస్తావు కాబోలు!" అని కూడా కేశవుడితో చెప్పారు.

## 175. మాయ స్వభావం ఎలా ఉంటుంది? (సాధువు - నల్లటి మబ్బు)

“దక్షిణేశ్వర దేవాలయంలోని నహబత్ పైన ఉన్న ఒక గదిలో ఒక సాధువు కొంతకాలం నివసించాడు. అతడు ఎవ్వరితోనూ మాట్లాడేవాడు కాదు. ఎల్లప్పుడూ భగవన్నామస్మరణలో మునిగి ఉండేవాడు. ఒకరోజున, అకస్మాత్తుగా, ఒక నల్లటిమబ్బు ఆకాశాన్ని పూర్తిగా కప్పివేసింది. ఆ వెంటనే ఒక పెద్దగాలి వచ్చి ఆ మబ్బును తొలగించి వేసింది. మళ్ళీ సూర్యుడు ఎప్పటిలాగా ప్రకాశించసాగాడు. ఆ సాధువు అప్పుడు ‘నహబత్’ బయటకు వచ్చి బిగ్గరగా నవ్వుతూ నృత్యం చేయడం మొదలుపెట్టాడు. అప్పుడు నేను (శ్రీరామకృష్ణులు) ఆయన దగ్గరికి వెళ్ళి, ‘అయ్యా! సాధారణంగా గదిలో నుండి బయటకు రాకుండా మీరు కాలం గడుపుతారు కదా, ఈ రోజు బయటకు వచ్చి ఆనందంతో నృత్యం చేస్తున్నారే! ఎందుకు ఈ రోజు ఇంత ఆనందంగా ఉన్నారు?” అని అడిగాను. ఆ సాధువు, ‘మాయ జీవితాన్ని ఎలా కప్పి ఉంచుతుందో ఈ రోజు ఆకాశంలో చూశాను’ అన్నాడు.”

గురుదేవులు మాయస్వభావాన్ని వివరిస్తూ, పై సంఘటనను చెప్పి ఇంకా ఇలా అన్నారు: “మొదట నిర్మలమైన ఆకాశం ఉంది. అకస్మాత్తుగా ఒక మబ్బు దాన్ని కప్పివేసింది. ఆ వెంటనే అది చెదిరిపోయి మళ్ళీ అన్నీ యథాప్రకారంగా అయిపోయాయి. మాయ స్వభావం కూడా ఇదే విధంగా ఉంటుంది.”

## 176. మాయను ఎలా వదిలించుకోవాలి (పులితోలు)

మాయను ఎలా వదిలించుకోవాలో గురుదేవులు ఈ క్రింది కథ ద్వారా వివరించారు.

“తీవ్రవైరాగ్యం అలవడినప్పుడు మనకు భగవత్సాక్షాత్కారం కలుగుతుంది. కామకాంచనాలే మాయ. మనం ఎప్పుడు ఈ విషయాన్ని తెలుసుకుంటామో అప్పుడు మాయ మనల్ని వదిలి పారిపోతుంది. ఒకడు పులితోలు కప్పుకుని మరొకణ్ణి భయపెట్టడానికి ప్రయత్నించాడు. అయితే వాడు బెదరకుండా, ‘ఒరే! హరీ! నువ్వెవరో నాకు తెలుసులేరా! వేషం వేసినంత మాత్రాన నిన్ను కనిపెట్టలేనా?’ అన్నాడు. దానితో ఆ పులితోలు కప్పుకున్నవాడు నవ్వుతూ ఇంకొకణ్ణి బెదిరించడానికి వెళ్ళిపోయాడు” అని మాయను ఎలా వదిలించుకోవాలో గురుదేవులు వివరించారు.

## 177. నిత్యముక్తులు ప్రపంచాన్ని తాకరు
## (హోమపక్షి కథ)

శ్రీరామకృష్ణులు తమ గదిలో కూర్చొని కేదారు, ప్రాణకృష్ణుడు, మహేంద్రనాథ గుప్త, నరేంద్రుడు మొదలయిన చాలామంది భక్తులతో సంభాషిస్తున్నారు. ఆయన నరేంద్రుడి గురించి మాట్లాడసాగారు. “నరేంద్రుడు నిత్యముక్తుల తరగతికి చెందినవాడు. కొద్దిగా వయస్సు రాగానే అటువంటి వారి హృదయాలలో దివ్యచైతన్యం మేలుకుని, వారు నేరుగా దేవునివైపు వెళ్ళిపోతారు. ఇతరులకు బోధించడానికే వాళ్ళు ప్రపంచంలోకి వస్తారు. ఈ ప్రపంచంలో దేనినీ వాళ్ళు పట్టించుకోరు. వాళ్ళకు కామినీకాంచనాలపట్ల ఏ విధమైన ఆసక్తి ఉండదు. ఒక కథ చెపుతాను వినండి!”

“వేదాలలో హోమపక్షి గురించి చెప్పబడివుంది. అది ఆకాశంలో ఎంతో ఎత్తులో ఎగురుతూ జీవిస్తుంది. అక్కడే అది గ్రుడ్డుపెడుతుంది. ఆ గ్రుడ్డు వెంటనే ఆకాశం నుంచి నేలమీదికి పడిపోతూ ఉంటుంది. కానీ, అది నేలమీద పడడానికి చాలారోజులు పడుతుంది. పడుతూ, పడుతూనే అది పగులుతుంది, పిల్ల బయటకు వస్తుంది. దాని కళ్ళు తెరుచుకుంటాయి, రెక్కలు పెరుగుతాయి. కళ్ళు తెరుస్తూనే, తాను భూమి మీద పడిపోతున్నాననీ, పడితే నేలకు కొట్టుకుని చనిపోతాననీ అది తెలుసుకుంటుంది. ఒక్క ఉదుటున ఎగిరి, తిరిగి ఆకాశంలో ఉన్న తన తల్లిపక్షిని చేరుకుంటుంది.”

“నిత్యముక్తులైనవాళ్ళు ప్రాపంచిక బంధాలవలన కలిగే ప్రమాదాన్ని తెలుసుకుంటారు. బాల్యం నుంచే వాళ్ళు ప్రపంచాన్ని చూసి అసహ్యించుకుంటారు (భయపడతారు). వాళ్ళకుండే ఒకేవొక్క ఆలోచన తమ అమ్మను (భగవంతుణ్ణి) చేరుకోవడమే!”

## 178. సమదృష్టి వైరాగ్యానికి చివరిమెట్టు
## (విరాగులయిన భార్య, భర్త)

ఒక భార్య, భర్త ఇద్దరూ సంసారం పట్ల విరక్తి చెందారు. వారిద్దరూ కలిసి తీర్థయాత్రలకు బయలుదేరారు. ఒక త్రోవలో నడిచిపోతున్నారు. భర్త ముందు నడుస్తున్నాడు. భార్య వెనుకగా వస్తున్నది. అప్పుడు అతనికి నేలమీద ఒక వజ్రం కనిపించింది. తన భార్య దానిని చూస్తే, దానిమీద ఆశపడి తన వైరాగ్యాన్ని పోగొట్టుకుంటుందేమోనని అతనికి అనుమానం కలిగింది. వెంటనే అతడు దానిని పూడ్చివేద్దామని నేలను త్రవ్వసాగాడు. ఇంతలో భార్య అక్కడకు వచ్చి, “ఏమి చేస్తున్నారు?” అని అతణ్ణి అడిగింది. భర్త సరియైన సమాధానం చెప్పకుండా

మాట దాటవేయడానికి ప్రయత్నించాడు. అయితే భార్య ఆ వజ్రాన్ని చూసి, అతని మనస్సులోని ఆలోచనను కనిపెట్టింది. ఆమె భర్తతో, "మీకు ఆ వజ్రానికీ, మట్టికీ ఇంకా తేడా కనిపిస్తున్నట్లయితే ఎందుకు సన్యసించారు?" అని ప్రశ్నించింది. వజ్రానికీ, మట్టికీ తేడా తెలియనటువంటి సమదృష్టిని కలిగి ఉండడమే వైరాగ్యానికి పరాకాష్ఠ, చివరిమెట్టు.

## 179. అందరూ సన్న్యసించలేరు
## (యోగి - రాజు)

మామూలు మనిషి ఎంత కోరుకున్నా ప్రపంచాన్ని త్యజించలేడు. ఎందుకంటే పూర్వజన్మలలో చేసిన కర్మలు ఈ జన్మలో వాటి ఫలితాన్ని చూపిస్తాయి. వాటివల్ల మనస్సుపై కొన్నిముద్రలు సంస్కారాల రూపంలో ఏర్పడతాయి. దీనినే ప్రారబ్ధం అంటారు. అవి ఈ జన్మలో మనిషి సన్న్యసించకుండా అడ్డుపడతాయి. ఒకసారి ఒక యోగి, ఒక రాజును తనతోపాటు కూర్చొని దేవుని గురించి ధ్యానం చెయ్యమని అడిగాడు. అప్పుడు రాజు ఇలా సమాధానం చెప్పాడు: "అయ్యా! అది కుదరదు. నేను మీ ప్రక్కన ఉండవచ్చు కానీ, ప్రాపంచిక సుఖాలను అనుభవించాలన్న కోరిక నాతోటే ఉంటుంది. నేను అడవిలో ఉన్నా అక్కడే ఒక రాజ్యం ఏర్పడుతుంది. ఎందుకంటే నాకు ఇంకా ప్రాపంచిక సుఖాలను అనుభవించాలని వ్రాసి ఉన్నది కనుక."

"కొందరు సన్న్యాసులు కూర్చొని తపస్సు చేస్తున్నారు. ఇంతలో ఒక యువతి ఆ త్రోవలో నడిచివెళ్ళింది. వారిలో ఒకడు ఆమెను ఓరకంట చూశాడు. కానీ మిగిలినవారు మాత్రం పూర్తిగా ఆత్మారాములై ధ్యానంలో మునిగి ఉన్నారు. ఆ ఓరకంట చూసినవాడు ముగ్గురు బిడ్డలు కలిగిన తర్వాత సన్న్యసించాడు. వెల్లుల్లిపాయలను ఉంచిన గిన్నెను ఎంత తోమినా దానికి కొంచెం వాసన అంటుకునే ఉంటుంది కదా!" అని గురుదేవులు వివరించారు. అయితే దీనికి పరిష్కారాన్ని సూచిస్తూ, "పెరుగు తోడువేసే కుండను జాగ్రత్తగా తోమి దానిలో పాలు కాచాలి. లేకపోతే పాలు విరిగిపోతాయి" అని చెప్పారు. చిత్తశుద్ధితో కఠోరమైన సాధన చేసి పాత వాసనలన్నింటినీ, సంస్కారాలన్నింటినీ వదిలించుకున్నప్పుడే నిజమైన భగవద్భక్తి అలవడుతుంది.

## 180. నిజమైన విరాగులు దొరకడం కష్టం
## (స్నేహితుణ్ణి కోరుకున్న దయ్యం)

శ్రీరామకృష్ణులు తమ గదిలో ఉన్న యువభక్తులతో మాట్లాడుతున్నారు. మహేంద్రనాథ్ గుప్త ఆయన ప్రక్కన కూర్చున్నాడు. శ్రీరామకృష్ణులు అతనితో

ఇలా చెప్పారు: "నేను కామినీ కాంచనాలను పూర్తిగా విడిచిపెట్టిన వాడి కోసం వెతుకుతున్నాను. ఎవరైనా ఒక యువకుడు కనిపిస్తే, నాతో పాటు ఉంటాడేమోనని అనుకుంటాను. కానీ ప్రతివాళ్ళూ ఏదో ఒక అభ్యంతరం చెపుతూనే ఉంటారు. ఒక కథ చెపుతా విను!"

"ఒక దయ్యం తనకు ఒక స్నేహితుడు ఉంటే బాగుండునని అనుకుంది. ఎవరైనా శనివారం కానీ, మంగళవారం కానీ చనిపోతే దయ్యాలుగా మారతారని అది విన్నది. అప్పటినుండి ఆ రెండు రోజులలో ప్రమాదవశాత్తూ ఎవరైనా ఇంటికప్పు పైనుండి పడినా, లేదా మరో విధంగా తూలిపడినా, వాళ్ళు దయ్యాలుగా మారతారేమోనని అక్కడికి పరిగెత్తి చూచేది. అయితే దాని అదృష్టం బాగుండక వారిలో ప్రతివాడూ బ్రతికేవాడు. పాపం, ఆ దయ్యానికి స్నేహితుడు దొరకలేదు."

"ఈ కథలోని దయ్యంలాగా నేను కూడా ఎవరైనా స్నేహితుడు దొరుకుతాడేమోనని చూస్తున్నాను. కానీ ఎవరూ దొరకడం లేదు," అని గురుదేవులు చమత్కరించారు.

## 181. దివ్యలీలలకు ఉండే ఆకర్షణ
## (నికాషా కథ)

గురుదేవులు బ్రహ్మసమాజ భక్తులతో సంభాషిస్తూ, "దైవసాక్షాత్కారం కలిగిన తరువాత, భక్తుడు ఆయన లీలలను మరింతగా చూడాలని ఉబలాటపడతాడు. ఒక కథ చెపుతా వినండి!" అని ఈ క్రింది కథను చెప్పారు.

"రాముడి చేతిలో రావణుడు చనిపోయాడు. రావణుడి తల్లి 'నికాషా' ప్రాణభయంతో పారిపోసాగింది. అది చూసి లక్ష్మణుడు శ్రీరాముడితో, 'సోదరా! ఈ వింతను నాకు వివరించు! ఈ నికాషా చాలా వృద్ధురాలు. కొడుకులను పోగొట్టుకుని చాలా కష్టాలపాలయింది. అయినా ప్రాణాలమీద తీపితో పరుగెత్తి పారిపోతున్నది. ఇది చాలా వింతగా ఉన్నదే!' అన్నాడు. శ్రీరాముడు ఆమెను ఏమీ చేయనని అభయం ఇచ్చి, దగ్గరకు రమ్మని పిలిచాడు. 'ఎందుకు పారిపోతున్నావు?' అని అడిగాడు. నికాషా, 'ఓ రామచంద్ర ప్రభూ! నేను జీవించి ఉన్నాను కాబట్టే అద్భుతమైన నీ లీలలను చూడగలిగాను. నువ్వు ఈ భూమి మీద చేయబోయే లీలలను మరింతగా చూడాలనే కోరికతోనే ఇంకా ఎక్కువ కాలం జీవించాలని అనుకుంటున్నాను. అందుకే పారిపోతున్నాను' అని సమాధానమిచ్చింది."

## 182. ఆపుకోలేని కోరిక!
## (నెమలి - నల్లమందు)

మహేంద్రనాథ్ గుప్త కొత్తగా శ్రీరామకృష్ణుల దగ్గరకు వస్తున్న రోజులలో జరిగిన సంఘటన ఇది. గురుదేవులు నరేంద్రుడు, భావనాథ్ మొదలైన యువభక్తులతో మాట్లాడుతున్నారు. మహేంద్రనాథ్ గుప్త అప్పుడే గదిలోకి ప్రవేశించాడు. అతనిని చూడగానే గురుదేవులు బిగ్గరగా నవ్వుతూ, “అదుగో! మళ్ళీ వచ్చాడు!” అన్నారు. అందరూ బిగ్గరగా నవ్వారు. ఆ తరువాత ఈ క్రింది కథ ద్వారా గురుదేవులు తన నవ్వుకు కారణం చెప్పారు. “ఒకడు ఒక నెమలికి నల్లమందు మాత్రను సరిగ్గా సాయంత్రం నాలుగు గంటలకు తినిపించాడు. ఆ మరుసటిరోజు సరిగ్గా అదే సమయానికి ఆ నెమలి మళ్ళీ వచ్చింది. ఆ నల్లమందు యొక్క మత్తు ప్రభావం వల్ల, ఆ మందు కావాలనే కోరికను ఆపుకోలేక, మళ్ళీ సరిగ్గా అదే సమయానికి ఇంకొక మోతాదు దొరుకుతుందన్న ఆశతో ఆ నెమలి

వచ్చింది." అదే విధంగా గురుదేవులను కలుసుకునే భాగ్యం కలిగిన భక్తులు ఆయనను మళ్ళీమళ్ళీ కలుసుకోవాలనే కోరికను ఆపుకోలేకపోయేవారు. అవతార మూర్తుల ఆకర్షణ అద్భుతం కదా!

## 183. దేవుణ్ణి వర్ణించలేము
## (కా! కా! కా!)

"ఒక పండితుడు ఉండేవాడు. శుష్కపాండిత్యంతో విర్రవీగేవాడు. దేవుని రూపాల మీద అతనికి నమ్మకం ఉండేది కాదు. అయితే దేవుడి యొక్క విచిత్రమైన పద్ధతుల్ని అర్థం చేసుకోవడం ఎవరికి సాధ్యం? దేవుడు అతనికి కాళీమాత రూపంలో దర్శనమిచ్చాడు. ఆ అనుభూతి వల్ల ఆ పండితుడు చాలాసేపు స్పృహ కోల్పోయాడు. కొద్దిగా స్పృహ తెలిశాక, 'కా! కా! కా!' అని మాత్రమే పలకగలిగాడు. 'కాళీ!' అని పూర్తిగా పలుకలేకపోయాడు."

## 184. దేవుని పద్ధతులు మనకు అర్థం కావు
## (అంపశయ్య మీద ఉన్న భీష్ముడు)

"మనకున్న చిన్న మేధస్సుతో భగవంతుని తీరుతెన్నుల్ని ఎలా అర్థం చేసుకోగలం? కురుక్షేత్రయుద్ధం తరువాత భీష్ముడు అంపశయ్య మీద ఉన్నాడు. పాండవులు, శ్రీకృష్ణుడు ఆయన చుట్టూ నిలబడి ఉన్నారు. మహావీరుడైన భీష్ముడు కన్నీరు కారుస్తున్నాడు. అది చూసి అర్జునుడు శ్రీకృష్ణుడితో, 'మిత్రమా! ఏమి ఆశ్చర్యం! మా తాత భీష్ముడు మహావీరుడు, సత్యసంధుడు, ఆత్మనిగ్రహం కలవాడు, పండితుడు, అష్టవసువులలో ఒకడు. అటువంటి మహానుభావుడు ఇప్పుడు మాయాప్రభావం వలన మరణభయంతో ఏడుస్తున్నాడు,' అన్నాడు."

"అర్జునుడి సందేహం తీర్చమని శ్రీకృష్ణుడు భీష్ముణ్ణి అడిగాడు. భీష్ముడు ఈ విధంగా సమాధానం చెప్పాడు: 'ఓ కృష్ణా! అర్జునుడు చెప్పేది నా దుఃఖానికి కారణం కాదనీ, నేను ప్రాణాలమీద తీపితో ఏడవడం లేదనీ నీకు తెలుసు. భగవంతుడివైన నువ్వే సారథిగా ఉన్నా కూడా పాండవుల కష్టాలకు అంతు లేకుండా ఉంది. నీ లీలల్ని అర్థం చేసుకోవడం ఎంత దుస్సాధ్యం! నీ తీరుతెన్నుల్ని ఏమాత్రం అర్థం చేసుకోలేకపోయానన్న ఆ ఆలోచనే నా మనస్సును కలచివేస్తోంది. అందుకనే ఏడుస్తున్నాను.' "

## 185. సరైన కారణాలు ఎవరు చెప్పగలరు?
## (లక్ష్మణుడు - కుశలవులు)

"ఒక రోగి విషయం చూడండి! వైద్యుడు ఒక మూలికను రోగికి ఇచ్చి, దాని రసం త్రాగమనే సమయానికి అతని రోగం దానంతట అదే దాదాపు నయమైంది.

ఈ మందు తీసుకున్న తరువాత పూర్తిగా నయమైంది. ఇప్పుడు ఆలోచిస్తే, ఆ రోగి వ్యాధి దేనివల్ల నయమైంది? మందు వలనా? లేక దానంతట అదే నయమయిందా? ఎవరు చెప్పగలరు?"

"కుశలవులతో లక్ష్మణుడు ఈ విధంగా చెప్పాడు: 'మీరు పసిపిల్లలు. శ్రీరాముడి శక్తి మీకు తెలియదు. ఆయన పాదాలు తాకగానే రాయిగా ఉన్న అహల్య అందమైన తన మునుపటి స్త్రీ రూపాన్ని పొందింది.' దానికి సమాధానంగా కుశలవులు ఇలా అన్నారు: 'అయ్యా, మాకు ఆ విషయం తెలుసు! మేము ఇంకొక కథ కూడా విన్నాం. అహల్య గౌతమ మహాముని శాపం వల్ల రాయిగా మారింది. ఆ సమయంలోనే గౌతముడు, 'త్రేతాయుగంలో శ్రీరాముడు ఈ ఆశ్రమానికి వస్తాడు. అప్పుడు ఆయన పాదస్పర్శతో మళ్ళీ నువ్వు మానవరూపం ధరిస్తావు' అన్నాడు! ఇది మీకు కూడా తెలుసు కదా!"

"మరి ఇప్పుడు ఈ అద్భుతం గౌతమముని శక్తివల్ల జరిగిందో లేకపోతే శ్రీరాముడి శక్తివల్ల జరిగిందో ఎవరు చెప్పగలరు?"

## 186. దివ్యమధువు
## (తండ్రీ కొడుకుల త్రాగుడు అలవాటు)

ఒక యువకుడు త్రాగుడుకు బానిస అయ్యాడు. అది చూసి సహించలేక అతని తండ్రి ఆ అలవాటును మానమని మరీమరీ చెప్పాడు. అప్పుడు ఆ కొడుకు తండ్రితో, 'నువ్వు ఈ సారాయి కొద్దిగా రుచి చూడు! ఆ తరువాత నన్ను ఈ త్రాగుడు అలవాటును మానివేయమని చెబితే మానేస్తాను,' అన్నాడు. కొడుకు చెప్పినట్టుగానే తండ్రి సారాయి త్రాగాడు. ఆ తరువాత ఆ తండ్రి ఇలా అన్నాడు: 'నాయనా! నువ్వు త్రాగుడు అలవాటు మానివేస్తే, మానివెయ్యి! నాకేమీ అభ్యంతరం లేదు. కానీ నేను మాత్రం దానిని మానబోవట్లేదు!"

"దివ్యానందాన్ని ఒకసారి రుచి చూసిన తరువాత మానవుని పరిస్థితి అలా ఉంటుంది!" అని వివరిస్తూ గురుదేవులు పై కథను చెప్పారు.

## 187. అశాశ్వతమైన శరీరం
## (వితంతువు - బంగారు మురుగులు)

ఒక భక్తురాలు సాంసారికజీవితం గడుపుతూ మంచిగృహిణిగా, భర్తకు సేవలు చేస్తూ ఉండేది. పిల్లలను ప్రేమగా పెంచేది. అదే సమయంలో మనస్సును భగవంతుడి పైన నిలిపేది.

అకస్మాత్తుగా ఆమె భర్త చనిపోయాడు. భర్త శరీరాన్ని దహనం చేశాక ఆమె తన మట్టిగాజుల్ని పగులకొట్టి, వాటికి బదులు ఒక జత బంగారు మురుగులను

ధరించింది. అసహజమైన ఆమె ప్రవర్తన చూసి అందరూ నివ్వెరపోయారు. కానీ వారితో ఆమె ఈ విధంగా చెప్పింది: "ఇంతవరకూ నా భర్త శరీరం మట్టిగాజులలాగా ఏ క్షణంలో అయినా పగిలిపోయే స్వభావం కలిగి ఉండేది. ఆ అశాశ్వతమైన భౌతికశరీరం పోయింది. ఇప్పుడు ఆత్మ రూపంలో ఉన్న ఆయన శరీరం ఎటువంటి మార్పులకు గురికాదు. పరిపూర్ణమైనదిగా మారిపోయింది. ఇప్పుడు దానికి నాశనం లేదు. అందుకనే నేను పగిలిపోయే మట్టిగాజులను వదిలివేసి శాశ్వతంగా ఉండే బంగారు మురుగులను వేసుకున్నాను."

## 188. స్థాయిని బట్టే అంచనా ఉంటుంది (సాధువు - గాఢ సమాధి)

ఒకసారి ఒక ఋషి గాఢమైన సమాధిస్థితిలో ఒక త్రోవ ప్రక్కనపడి ఉన్నాడు. ఒక దొంగ ఆ త్రోవలో వెడుతూ, ఆ ఋషిని చూసి ఇలా ఆలోచించాడు: "వీడు కూడా దొంగ అయి వుంటాడు. నిన్న రాత్రి కొన్ని ఇళ్ళలో దొంగతనాలు చేసి అలసిపోయి ఇక్కడపడి నిద్రపోతున్నాడు. ఈపాటికి పోలీసులు వీడికోసం వెతుకుతూ ఉండి ఉంటారు. వాళ్ళు వచ్చేలోపలే నేను పారిపోవడం మేలు!" అని అనుకుని ఆ దొంగ అక్కడ నుంచి పారిపోయాడు. కాసేపటి తరువాత ఒక త్రాగుబోతు అక్కడికి తూలుకుంటూ వచ్చాడు. ఋషిని చూసి, "ఏరా! త్రాగి పడిపోయావా! నన్ను చూడరా! ఎంత త్రాగినా ఎలా నిలబడి ఉన్నానో!" అన్నాడు. చివరిగా అక్కడికి ఇంకొక సాధువు వచ్చి ఒక గొప్ప ఋషి సమాధిస్థితిలో అక్కడ పడివున్నాడని గ్రహించాడు. ఆ ఋషి ప్రక్కనే కూర్చొని ఆయన పాదాలు వత్తడం ప్రారంభించాడు. ప్రాపంచిక సంస్కారాలు నిజమైన ఆధ్యాత్మికతను, పవిత్రతను గుర్తించకుండా మనిషికి చేస్తాయి. పచ్చకామెర్ల వాడికి లోకమంతా పచ్చగా కనిపించినట్టుగా, ఒక మనిషి ఏ స్థాయిలో ఉంటే ఆ స్థాయిని బట్టే ఎదుటివారిని అంచనా వేస్తాడు.

## 189. అవతారపురుషుల్ని మామూలు మనుష్యులతో పోల్చకూడదు (చైతన్యుడి నాలుకపై చక్కెర)

ఏ దేవుణ్ణి మనం అర్చిస్తే ఆ దేవుడి లక్షణాలు మనకు కలుగుతాయని గురుదేవులు మహేంద్రనాథ గుప్తకు వివరిస్తున్నారు.

"ఎవరు ఏ దేవతలను అర్చిస్తారో వారికి ఆ దేవుడి సత్తా అలవడుతుంది. రామభక్తుడు రాత్రింబవళ్ళూ తాను ఆంజనేయుణ్ణని భావించి అంతటి శక్తిమంతుడవుతాడు. శివపూజ చేసేవాడికి శివుడి సత్తా అలవడుతుంది. శివుని

అంశలో జ్ఞానం, విష్ణువు అంశలో భక్తి ఉన్నాయి. శివుణ్ణి తలచేవాడి స్వభావం జ్ఞానంగానూ, విష్ణువును తలచేవాడి స్వభావం భక్తిగానూ పరిణతమౌతాయి” అని గురుదేవులు చెప్పారు.

అప్పుడు మహేంద్రనాథ గుప్త, “మరి చైతన్య మహాప్రభువు సంగతి ఏమిటి? ఆయనలో జ్ఞానం, భక్తి రెండూ ఉన్నాయని అంటారు కదా!” అన్నాడు.

ఇది విని గురుదేవులు కాస్త విసుగుతో, “మధ్యలో వారి ప్రస్తావన తెచ్చావెందుకు? వారి సంగతి వేరు! ఆయన అవతార పురుషుడు. వారితో పోటీయా? సాధారణ మానవులెక్కడ? ఆయన ఎక్కడ? నక్క ఎక్కడ? నాకలోకమెక్కడ? ఆయన ఎప్పుడూ సమాధిస్థితిలోనే ఉండేవారు. ఆయన ఇంద్రియాలన్నీ నిరంతరం ఆయన వశంలోనే ఉండేవి. ఒకరోజున ఆయనను పరీక్షించేందుకు ప్రతాపరుద్ర సార్వభౌముడు ఆయన నాలుకమీద చక్కెర వేశాడు. ఆ చక్కెర నాలుకకు అంటుకోక పొడిపొడిగా ఉండి గాలికెగిరిపోయింది. చైతన్య మహాప్రభువు అటువంటి జితేంద్రియుడు, సంపూర్ణంగా కామాన్ని జయించినవాడు!” అని మందలించి, మామూలు మనుష్యులతో, అవతారపురుషుల్ని పోల్చకూడదని మనకు స్పష్టం చేశారు.

## 190. నిజమైన పండితుడు గొప్పలు చెప్పడు
## (భాగవత పండితుడు – జ్ఞాని అయిన రాజు)

ఒక పండితుడు ఒక రాజు దగ్గరకు వెళ్ళాడు. రాజుతో ఆ పండితుడు, “ఓ రాజా! నేను శాస్త్ర గ్రంథాలను క్షుణ్ణంగా చదివాను. మీకు భాగవతం బోధించాలనుకుంటున్నాను. అనుమతించండి!” అని అడిగాడు. వారిద్దరిలోకీ ఆ రాజే తెలివిగలవాడు. నిజంగా భాగవతాన్ని చదివినవాడు ఆత్మజ్ఞానాన్ని పొందడానికి ప్రయత్నిస్తాడు కానీ డబ్బు కోసం, పేరుప్రతిష్ఠల కోసం రాజుల చుట్టూ, ఆస్థానాల చుట్టూ తిరగడని ఆయనకు తెలుసు. రాజు ఆ పండితుడితో, “స్వామీ! మిమ్మల్ని నా గురువుగా స్వీకరించడానికి నాకు ఎటువంటి అభ్యంతరం లేదు కానీ చూడబోతే మీరే ఆ గ్రంథాన్ని సరిగ్గా చదివినట్టు లేదు. కాబట్టి ముందు మీరు దానిని బాగా చదువుకొని రండి!” అన్నాడు. ఆ పండితుడు తిరిగి వెళుతూ, “ఈ రాజు ఎంత తెలివితక్కువ వాడు! ఇన్ని ఏళ్ళుగా భాగవతాన్ని మథిస్తున్నాను! అయినా నన్నే ముందు సరిగ్గా చదవమంటున్నాడు!” అనుకున్నాడు. ఆ పండితుడు ఆ గ్రంథాన్ని మరొకసారి శ్రద్ధగా చదివి తిరిగి రాజు దగ్గరికి వెళ్ళాడు. రాజు మళ్ళీ అదే సమాధానం చెప్పి పంపించేశాడు.

ఆ పండితుడికి చాలా విసుగు కలిగింది. కానీ రాజుగారి ప్రవర్తన వెనుక ఏదోవొక గూఢార్థం ఉండి ఉంటుందని అతనికి తోచింది. అతడు ఇంటికి

తిరిగివెళ్ళి తన గది తలుపులు మూసుకొని, లోపల కూర్చుని శ్రద్ధగా భాగవతాన్ని చదవసాగాడు. క్రమక్రమంగా అతనికి ఆ గ్రంథంలో ఇమిడి ఉన్న భావాలు అర్థమయ్యాయి. నీటిబుడగలవంటి సిరిసంపదలు, పేరు ప్రతిష్ఠలు, రాజాస్థానాలు మొదలైన వాటికోసం ప్రాకులాడడం ఎంత నిరర్థకమో అర్థమయింది. అప్పటి నుండి భగవంతుని మీద పరిపూర్ణమైన భక్తి సాధించాలని అనుకున్నాడు. రాజుగారి దగ్గరకు పోవాలన్న ఆలోచనను పూర్తిగా విడిచిపెట్టాడు. కొన్ని సంవత్సరాలు గడిచాయి. రాజు ఆ బ్రాహ్మణుడు ఏం చేస్తున్నాడో చూద్దామని అతడి ఇంటికి వెళ్ళాడు. ఆ పండితుడి ముఖం దివ్యతేజస్సుతో వెలిగిపోతున్నది. రాజు అతని పాదాలకు నమస్కరించి, 'స్వామీ! మీరు ఇప్పుడు శాస్త్రాలలోని సత్యాలను అనుభూతి చెందినట్టు నాకు కనిపిస్తోంది. దయచేసి నన్ను మీ శిష్యునిగా స్వీకరించండి!' అని ప్రార్థించాడు.

## 191. మిగిలినదంతా మిథ్య
## (శివుడు – రావణుడు)

"ఒక ఇంద్రజాలికుడు గాలిలో తన చేతిని ఊపి, 'ఇదిగో మాయ! అదిగో మాయ!' అంటాడు. ఆ తరువాత ప్రేక్షకులతో, "ఈ కుండ మూత తీయండి! దానిలో నుంచి పిట్టలు ఎగిరిపోతాయి చూడండి!" అంటాడు. ఇక్కడ ఇంద్రజాలికుడు ఒకడే నిజం. అతని మాయలు అసత్యం. అసత్యమైనవి ఒక్క క్షణం మాత్రమే ఉండి మాయమైపోతాయి. నిజమేమిటంటే, భగవంతుడొక్కడే సత్యం! మిగిలినదంతా అసత్యం!"

"కైలాస పర్వతంపైన శివుడు కూర్చొని ఉన్నాడు. అతని వాహనమైన నంది పక్కనే ఉన్నాడు. అకస్మాత్తుగా ఒక పెద్ద శబ్దం వినిపించింది. 'స్వామీ, ఆ శబ్దం ఏమిటి?' అని నంది అడిగాడు. 'రావణుడు పుట్టాడు!' అని శివుడు జవాబు చెప్పాడు. కొన్నిక్షణాల తరువాత మరొక పెద్ద శబ్దం వినిపించింది. 'ఈ శబ్దం ఏమిటి?' అని నంది మళ్ళీ అడిగాడు. చిరునవ్వుతో శివుడు, 'రావణుడు చనిపోయాడు!' అని సమాధానం చెప్పాడు."

ఈ కథను గురుదేవులు ఈ విధంగా వివరించారు: "జనన మరణాలు ఇంద్రజాలం వంటివి. ఒక క్షణంసేపు ఇంద్రజాలం కనిపిస్తుంది. మరుక్షణం మాయమవుతుంది. భగవంతుడు ఒక్కడే సత్యం. మిగిలినదంతా అసత్యం. నీరు ఒక్కటే సత్యం. బుడగలు వస్తాయి, పోతాయి. అవి ఏ నీటిలో నుండి పుట్టాయో ఆ నీటిలోనే కలిసిపోతాయి."

# 192. దైవసాక్షాత్కారం పొందినవాడు చిన్నపిల్లవాడి స్వభావాన్ని పొందుతాడు
## (ఆటబొమ్మ – చొక్కా)

"నేను భగవంతుడి దాసుణ్ణి అనే భావము కలిగిన వ్యక్తి ఎలా ఉంటాడు?" అని ఒక భక్తుడు ప్రశ్నించాడు.

"నేను దాసుణ్ణి అనే భావంతో కూడా మనిషి భగవత్సాక్షాత్కారాన్ని పొందవచ్చు. దీనినే దాస్యభక్తి అంటారు. అటువంటి మనిషిలో కామక్రోధాలు పైకి ఆకారంగా మాత్రమే కనపడతాయి. పరుసవేదిని అంటిన ఇనుప కత్తి బంగారంగా మారిపోతుంది. ఆ పైన, అది కత్తిలాగా కనిపించినా కోయలేదు. అదేవిధంగా తాను భగవంతుడి దాసుణ్ణని భావించేవాడు ఇతరుల్ని హింసించలేడు. కొబ్బరిమట్ట ఎండిపోయి రాలిన తర్వాత మాను మీద దాని గుర్తు మాత్రమే మిగిలి ఉంటుంది కదా! అదే విధంగా అటువంటివాడి కామక్రోధాదులు కేవలం గీతలాగా మాత్రమే ఉంటాయి. ఆ వ్యక్తి ఒక చిన్నపిల్లవాడి మనస్తత్త్వాన్ని పొందుతాడు. చిన్నపిల్లలు సత్త్వరజస్తమోగుణాలకు లోనుకారు. ఒక చిన్నపిల్లవాడికి ఒక వస్తువు మీద అనురాగం ఎంత త్వరగా కలుగుతుందో అంత త్వరగా దాని మీద వైరాగ్యం కూడా కలుగుతుంది. 'ఈ చొక్కా నాకు ఇస్తావా?' అంటే 'ఇవ్వనే ఇవ్వను! మా నాన్న కొనిచ్చాడు' అని గట్టిగా పట్టుకుంటాడు. ఆ చొక్కా ఐదు రూపాయల విలువైనదైనా సరే ఒక పైసా విలువగల ఆటబొమ్మను కొని ఇస్తే చాలు, ఆ బొమ్మను తీసుకుని ఆ చొక్కాను విసిరివేస్తాడు. చిన్నాపెద్దా అన్న విచక్షణ కూడా పసిబాలుడికి ఉండదు. శుచి, అంటు మొదలైనవి కూడా తెలియవు. దైవానుభూతిని పొందినవాడు అలా ఉంటాడు" అని గురుదేవులు వివరించారు.

# 193. సర్వం విష్ణుమయం జగత్
## (కుక్కలతో సహభోజనం)

ఉన్నతమైన ఆధ్యాత్మికస్థితులను అందుకున్న సాధుపుంగవుల ప్రవర్తనలను గురించి వివరిస్తూ గురుదేవులు ఈ ఉదంతాలను చెప్పారు.

"ఒకసారి దివ్యపారవశ్యస్థితిలో ఉన్న ఒక సాధువు దక్షిణేశ్వరం వచ్చాడు. ఒకరోజు అతడికి ఆహారం లభించలేదు. ఆకలి వేస్తున్నా ఎవరినీ అడగలేదు. మూల పారవేసిన ఆహారాన్ని ఒక కుక్క తింటుంటే దాని దగ్గరకు వెళ్ళి, 'సోదరా! నాకు పెట్టకుండా నీవు ఒక్కడివే తింటున్నావా?' అని దానితో కూర్చుని తినసాగాడు. ఆ కుక్క కూడా అభ్యంతరపెట్టలేదు. అటువంటి విచిత్రమైన రీతిలో తన భోజనాన్ని ముగించుకుని, కాళికాలయంలోకి ప్రవేశించి అమ్మవారిని స్తోత్రం

చేశాడు. అతడు ఎంత భక్తిపారవశ్యంతో ఆ స్తోత్రం చదివాడంటే కాళికాలయమే కంపించిపోయింది. అతడు అలా స్తోత్రాన్ని ముగించి వెళ్ళబోతున్న తరుణంలో అతనితోపాటు వెళ్ళి అతడు ఏమి చెపుతాడో నాకు చెప్పమని హృదయుణ్ణి పంపాను. హృదయుడు అతణ్ణి అనుసరించి పోసాగాడు. కొంతదూరం పోయాక అతడు వెనక్కి తిరిగి, 'ఎందుకు నన్ను వెంబడిస్తున్నావు?' అని హృదయుణ్ణి అడిగాడు. హృదయుడు, 'స్వామీ! నాకేమైనా బోధించండి!' అని అతణ్ణి కోరాడు. అతడు, 'ఈ మురుగుకాలువలోని నీరు, ఆ గంగానదిలోని నీరు, నీకు ఒకేలా కనపడినప్పుడు; ఈ వేణునాదానికీ, ఆ రణగొణధ్వనికీ నీకు తేడా కనిపించనప్పుడు నీకు నిజమైన జ్ఞానం కలిగిందని తెలుసుకోవచ్చు' అని చెప్పాడు. అలా చెప్పి అక్కడ నుంచి గబగబా వెళ్ళిపోయాడు."

"హృదయుడు వచ్చి వారిద్దరికీ జరిగిన సంభాషణ నాతో చెప్పినప్పుడు, 'అతడు నిజమైన జ్ఞానాన్ని పొందాడు' అని నేను హృదయుడితో చెప్పాను. అటువంటి జ్ఞానులు కొన్నిసార్లు నిష్కపటమైన చిన్నపిల్లలలాగా, కొన్నిసార్లు శవాలను పీక్కుతినే భూతాలలాగానూ, కొన్నిసార్లు పిచ్చివాళ్ళలాగానూ ప్రవర్తిస్తారు." అటువంటి స్థితిని వివరిస్తూ గురుదేవులు ఈ కథను చెప్పారు.

"మరొక సాధువు ఉండేవాడు. అతడు ఎప్పుడూ పారవశ్యస్థితిలో ఉండేవాడు. ఎవరితోనూ మాట్లాడేవాడు కాదు. జనం అతడొక పిచ్చివాడని భావించేవారు. ఒకరోజు గ్రామంలో కొంత ఆహారాన్ని బిచ్చమెత్తుకొని తెచ్చి, ఒక కుక్క ప్రక్కనే కూర్చొని దాని మీదుగా చేయివేసి, దానితో పంచుకుని తినసాగాడు. ఇది ఒక విచిత్రమైన దృశ్యానికి దారితీసింది. ఆ సాధువు ఒక ముద్ద తాను తింటూ, రెండవ ముద్దను ఆ కుక్కకు తినిపించసాగాడు. ఇద్దరు స్నేహితులు ముచ్చటగా కలసి తింటున్నట్టు ఆ కుక్కతో కలిసి తినసాగాడు. అక్కడ చేరిన జనం ఇది చూసి నవ్వసాగారు. అతడు వారితో ఇలా అన్నాడు:

**విష్ణూపరి స్థితో విష్ణుః విష్ణుం ఖాదయతి విష్ణుః ।**
**కథం హససి రే విష్ణో! సర్వం విష్ణుమయం జగత్ ॥**

ఓ విష్ణురూపులారా, మీరు ఎందుకు నవ్వుతున్నారు? ఒక విష్ణువు మరొక విష్ణువుతో కూర్చున్నాడు. ఒక విష్ణువుకు ఇంకొక విష్ణువు తినిపిస్తున్నాడు. సర్వమూ విష్ణుమయమే కదా!" అని ఆ సాధువు వారితో పలికాడు."

"అందరిలోనూ భగవంతుణ్ణి చూడడమనే ఈ అత్యున్నత స్థితి అందరికీ కలిగేది కాదు."

